శ్రీ రామ స్సహాయోస్తు.

శ్రీ మేధా దక్షిణామూర్తిః ప్రసీదతు.

మహాశయులారా!

# పీ ఠి క.

హిందూ దేశముననే గాక యూరోపు మొదలగు దేశాంతరములయందును శ్రీ భగవద్గీత మిక్కిలి ప్రసిద్ధిం గాంచియున్నది. హిందూ దేశమునందుంగల ప్రతి భాషలోనికిని దేశాంతరములం గల ప్రతిభాషలోనికిని బరివర్తనము గావింపం బడినది. వివిధ వివిధములగు రీతులతో వ్యాఖ్యాతింపంబడి సర్వజనులచేతను గౌరవింపంబడుచున్నది. ప్రతియింటను బూజింపంబడుచున్నది. ప్రతిమనుజునకు దీని తెలుంగవలయునను జిజ్ఞాసకలదు. దీనికి జర్మనీదేశమునందు మతత్రయమువారి భాష్యములకంటె మిక్కిలి విపులమగు నొక పద్యవ్యాఖ్యానము వ్రాయంబడినదని వినుచున్నాము. దానివెల ముప్పది రూపాయలంట. దీనికింగల వ్యాప్తి మఱియేగ్రంథమునకులేదు. ప్రతి విమర్శకుండు దీనిని విమర్శింపక విడువలేదు. భారతమునకుం బంచమవేద మనునామమును సార్థకముం జేసినది యీ భగవద్గీతయె.

ఇట్లిన్నివిధమున నిందఱచేత నిట్లు ప్రశంసింపంబడుటకును సన్మానింపం బడుటకును నన్ని గ్రంథములకంటెను నీ గ్రంథమున నేమి మహిమయున్నదా యని విమర్శింపం బూనుకొనుట యనావశ్యకముగాదు. ఆంగ్లభాషయందు దీనికిం బెక్కు విమర్శన గ్రంథములు వెలువడినవిగాని యాంధ్రాది దేశభాషలయందు విపులమగు నొక విమర్శన గ్రంథమేని గానరాకుండుట మిగుల శోచనీయము. ఆంధ్రాది భాషలయందు విపులతమములగు వ్యాఖ్యానములు గలవుగాని విమర్శనమను పేరుతో నాకుం దెలిసినంతవఱకు నొక గ్రంథమైనను గనంబడదు.

ఆ లోపంబు నివారింపంగోరి యనేక దృశ్యప్రబంధకర్తలును నాంధ్రాంగ్ల కర్ణాట పండితులును నగు బ్రహ్మశ్రీ. కోలాచలం-శ్రీనివాసరావుగారు శ్రీభగవద్గీతకుగొప్పవిమర్శ గ్రంథము సమకూర్పనెంచి తొలుత దీనిని నాల్గు సభలలో నుపన్యసించి యాయుపన్యాసముల నన్నిటిని నొకటిగంజేర్చి యొకగ్రంథముగ సంసిద్ధముచేసి యాంధ్రలోకమునకు మిక్కిలి మహోపకారముం గావించిరి. వీరి దృశ్య ప్రబంధములు ననేకములు నీగ్రంథము సహితము ముద్రితమగుటకుం బూర్వమే వీరు కీర్తిశేషులైరి. వారి జ్యేష్ఠపుత్రులు శత్రుఘ్నరావుగారు తండ్రిగారి యుద్దేశమును గ్రహించి యా యుద్దేశమును నెరవేర్చి యాంధ్రలోకమున కుపకరింపం దలంచి తండ్రిగారి గ్రంథములన్నిటితోడ దీనిసహితము ముద్రింపించియాంధ్రుల కృతజ్ఞతకుం బాత్రులయిరి.

ఈ భగవద్గీతపై శ్రీ శ్రీనివాసరావుగారు చేసిన యుపన్యాసములు దాని

యసాధారణ మహిమను ఘంటాఘోషముగఁ జాటుచున్నవి. శ్రీ భగవద్గీత మోక్ష
మునకుఁ గారణ మిష్టాపూర్తాది సత్కర్మములా ఆత్మజ్ఞానమా యుభయమునా
అనుసంగతి స్పష్టము చేయుటకే ప్రవర్తిల్లినది. ఈ విషయమున నుపనిషత్తులు
“ జ్ఞానదేవతు కైవల్యం నాన్యః పంథావిద్యతే యనా” యని జ్ఞానమువలననే మోక్ష
ముగల్గునుగాని మఱిదేనను గల్గదని యొకచోటను, మఱియొకచోట “ నకర్మణాన
ప్రజయాధనేన త్యాగేనైకే నమృతత్వమానశుః ” అని యిష్టాపూర్తాది సత్కర్మ
ములవలన మోక్షము లభింపదు, సమస్త కర్మములనువదలి సన్న్యాసముఁ జేసి
కొనుటచే మోక్షము సిద్ధించుననియు, మఱియొకచోట, “ కుర్వన్నేవేహ కర్మాణి
జిజీవిషేచ్ఛతగుంసమాః ” అని యావజ్జీవము కర్మములఁ జేయుచునే యుండవలయు
ననియు నిట్లు పరస్పరవిరుద్ధముగ వచియించుచుండుటచే నిదమిత్థమ్మని తత్త్వము
నిర్ణయింపరామిని నానిర్ణయమును జేయుటకు శ్రీ వేదవ్యాస మహర్షిచే నీభగవద్గీత
రచింపఁబడినది. కావుననే యీ భగవద్గీతకు నింతమహిమ వచ్చినది.

ఆ నిర్ణయము కడు చమత్కారముగ నీ శ్రీనివాసరావుగారి యుప
న్యాసములయందు వర్ణింపఁబడినవి. మోక్షమునకు జ్ఞానమే కారణము. అయినను
నాజ్ఞానము చిత్తశుద్ధి జనకమగు కర్మమునఁగాని కలుగదనియు, నా కర్మము ముఖ్య
ముగ ననుష్ఠింపదగినదియుఁ, బూర్ణముగ నాత్మజ్ఞానముకలిగి పరిపక్వమగువఱకు
దానిని వదలరాదనియు, నాత్మజ్ఞానము కలిగినను బరిపక్వమయినను నాధికారిక
పురుషుఁడగువాఁడు లోకసంగ్రహము నిమిత్తము ఫలాపేక్షలేక నిరపేక్షబుద్ధితోఁ
గర్మముల ననుష్ఠించుచునే యుండవలయుననియు, నాత్మతత్త్వమెఱిఁగి కేవలము
లోకసంగ్రహము నిమిత్తము ఫలాపేక్షలేక కర్మముల ననుష్ఠించినను నది బంధ
హేతువుగాదనియు, నాత్మజ్ఞానవిహీనుఁడు కర్మ మేమాత్రమును వదలరాదనియు
నివి మొదలగు పెక్కువిషయములు సయుక్తికముగను సహేతుకముగను సప్రమా
ణముగను సదృష్టాంతముగను విపులముగఁ జర్చింపఁబడి తేట తెల్లముగఁ బామ
రులకు సహితము మర్మమగునట్లు సులభశైలిని మృదుమధురమున నిరూపించియు
న్నారు. అందందుఁ ద్రిమతస్థుల భాష్యములను విమర్శించి పర్యాలోచనచేసి యాం
గ్లేయుల యభిప్రాయముల ననువదించి యుక్తికనుకూలింపఁజేసి యనుభవము
రూపించి సాధుత్వాసాధుత్వ విచారముచేసి తత్త్వనిర్ణయము కరతలామల
ముఁగావించి శ్రీ భగవద్గీతార్థము సులభముగ బోధించి గీతామహాత్మ్యమును లోక
కు వెల్లడించి పరమోపకారము గావించిన శ్రీ రావుజీగారిని నెంత కొనియాడి
అదు

లోకమునకు సుబోధమగుటకు నందందు గ్రామ్యభాషా ప్రయోగముల మొనరించిరిగాని యది వారి యభిమతము కాదు. వాస్తవముగ నిట్టియుపన్యాసములు మొదలగు సర్వజనోపకారక గ్రంథముల నుచితరీతిని గ్రామ్యభాష నుపయోగించినను దోషావహము గాదని పండితుల యాశయము. ఈ యుపన్యాస గ్రంథమును జదివిన నెట్టివానికిని గర్మశ్రద్ధయు నాత్మజ్ఞానాభిరతియు యదృచ్ఛాలాభతుష్టియు ఫలాపేక్షరహితమైన పరోపకారపరతయుఁ గలుగకపోదని నాయాశయము. ఒకొక్క శ్లోకమునకుఁ బ్రతిపదార్థ వివరణము చేయక ముఖ్యములను బ్రతిపాద్యార్థనిశ్చాయకములునగు పదములకే ముఖ్యముగ నర్థవివరణము చేయఁబడి మొత్తముపైఁదేలు నిష్కృష్టార్థ మిందుఁ జక్కఁగా నిరూపింపఁబడినది. ప్రకృతకాలమున మొత్తముపై నిష్కృష్టార్థ బోధకములగు గ్రంథములరుదు. ప్రతిశ్లోకమునకుఁ బ్రతిపదార్థము నెఱుంగవచ్చునుగాని మొత్తముపైఁదేలు నర్థవిశేషముఁ దెలిసికొనుట మిక్కిలి కష్టము.

ఈ గ్రంథమునందు నీ యధ్యాయమునం దీవిషయము బోధింపఁబడునని ప్రారంభమున నేఁ జెప్పఁబడి యీ విషయమును బ్రతిపాదించు ముఖ్యములగు శ్లోకములఁ బరిగ్రహించి వానిపై విశేషచర్చ చేయఁబడి యుక్త్యోక్తులచే నిర్ధరింపఁబడి నిర్ధారితవిషయమును నుపక్రమోపసంహారముల నిశ్చయింపఁబడినది. దీనిమూలమున విషయమిదియనియు నడుమనుండునది దానిని స్థాపించుటకుఁ జేయఁబడు చర్చయని యనియు దానివలనం దేలిన ముఖ్యాంశమిదియనియు సులువుగ బోధపడుచున్నది.

మఱియు భారత భగవద్గీతలనుగురించియుఁ దత్కర్తనుగురించియు ననేకాక్షేపణాంశములు ప్రబలియున్నవిగదా: అవియన్నియు నిందున ప్రమాణముగఁ దగిన సమాధానముల సమర్పింపఁబడి గ్రంథకర్తయొక్క విమర్శన చాతుర్యమును వేనోళ్ళఁ జాటుచున్నవి. ఆ చాతుర్యమిందు వర్ణించుట యప్రస్తుతము. గ్రంథము పరిశీలించిన సులువుగ నెఱుకపడఁగలవు. ఈ గ్రంథము ప్రతిమనుజుఁడును బఠింపఁ దగినది.

ఇట్లు,

చింతలపల్లి నరసింహశాస్త్రి,

ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు, మునిసిపల్ హైస్కూలు, బళ్ళారి.

## శ్రీనివాస సుకవి జీవితచరిత్ర.

ఎవ్వాని వదన రాజీవ రంగస్థలంబున నలువరాణి నిచ్చలును నట్టువలు సలుపుచుండునో! ఎవ్వాఁడు కువ్యాఖ్యావిషమూర్ఛితయగు కాళిదాస కవితా సుకన్యకను దనదు సంజీవినిచేఁ దెప్పఱిల్లఁజేసి ఒజ్జలమిన్నయని వన్నెకెక్కెనో! ఏమహామహు దివ్యనామామృతమును వీనులారఁ గ్రోలనియక్షరాస్యుఁ డొక్కఁడైన నీ భువిని గానంబడఁడో! ఏ మహితచారిత్రుని యశఃకుసుమంబుల ధరియించి దివాకర నిశాకరులు పుష్పవంతులను సార్థకనామమును బడసిరో! ఏవిద్వదవతంసుఁడు అనన్యజనసామాన్యమగు మహామహోపాధ్యాయబిరుదమునకు మార్గదర్శియయ్యెనో! అట్టి చులుకీకృత సకల శాస్త్రజలధియగు కోలచల శ్రీ మల్లినాథసూరి వంశమున మహ శ్రీనివాసకవిముక్తామణి విరూపాక్ష క్షేత్రమునకు సమీపముననుండు కామలాపురమను గ్రామమునఁ గ్రీస్తుశకము 1854-3-13 తేదీలకు సరియగు ప్రమాదీచ సంవత్సర ఫాల్గుణాసిత చతుర్దశినాఁడుద్భవించె. ఇతఁడు బాల్యముననే సంస్కృతభాషను జక్కఁగ నభ్యసించి, పిదప నాంగ్లేయభాషయం దసమాన పాండిత్యమును గడించి, కొంతకాలము రాజకీయోద్యోగిగనుండి, తర్వాత న్యాయవాదిపరీక్షలయం దుత్తీర్ణుఁడై బళ్ళారిపురవరమున న్యాయవాదిగ వఱలుచుండె. ఇతనికి నొకకూఁతురును, నలుగురు కుమారులును గలరు. మఱియు నితఁడు 1917 సం॥ ఏప్రెల్ 7 తేదీ దేవాళీపురమున జరిగిన విద్వత్సభ యని ప్రసిద్ధిఁగాంచిన యాంధ్రసాహిత్య పరిషత్సభ కగ్రాసనాధిపుఁడుగ నియమింపఁబడియుండె. ఇట్లుండ నేతత్కవిచంద్రుఁడు రాజవ్రణపీడితుఁడై యాంధ్ర కువలయంబు వసివాడఁ గుకవిచక్రంబు లుల్లసిల్ల 1919 సం॥ జూను 23 తేది యస్తమించె.

ఇట్లు విన్నవించు,

సుజనవిధేయుఁడు,

రాపాడి - వెంకటరామశాస్త్రి,

సంస్కృతపండితుఁడు, మునిసిపల్ హైస్కూలు, బళ్లారి.

శ్రీ

# భారత భగవద్గీతలను గురించిన విమర్శనము.

ఇది

[illegible] వకీలుగానుండి

టి. కే. బ్రహ్మశ్రీ [illegible] శ్రీనివాసరావుగారిచే

[illegible]

కె. రత్నస్వామిచేఁ

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు.

బళ్ళారి.

ఆంధ్రాముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1925.



వెల అ. 0—8—0



# భారత భగవద్గీతలను గురించిన విమర్శనము.

సభ్యులారా!

ఆర్యులభాషాప్రపంచమున భారతమునకంటెను భగవద్గీతకంటెను హెచ్చగు వైరాగ్యనీతిధర్మాధర్మవిమర్శనవిషయములను గుఱించి చక్కఁగ బోధించుగ్రంథము మఱియొకటి లేదని నే దృఢముగఁ బలుకఁగలను. ఆర్యులభాషలో ననేల, పాశ్చాత్యుల భాషలోనైన నింతటియత్యంతోత్కృష్టగ్రంథము లేదని తలఁపనగును. అయినను పాశ్చాత్యభాషాభ్యాసబలమున, నట్టిమహాభారత గ్రంథవిమర్శనమును జేయుచుఁ బండితులు కొందఱా గ్రంథములకర్తృత్వమును గుఱించి, సిద్ధాంతము లనేకములొనర్చినారు. మూఁడువేల సంవత్సరములనుండియు నార్యులతలంపులు, మతపాశములచే బంధింపఁబడియున్నందునఁ దద్విషయవిమర్శనముగ నెవ్వరేమి పలికినను నేమికారణంబులఁ జూపినను నవి విశ్వసనీయములని తోఁపవు. విమర్శనవిషయవిచారంబుఁ జేయనోపరు. విననోపరు. తుదకు సహింపనోపరు. మతము మానసమునకుఁ దృప్తిఁ గలిగించునది కావున, దానినే, కపిముష్టిన్యాయముగఁ బట్టి సంతసించుచుందురు. క్లేశతమమగు కర్కశ తర్కవాదము బుద్ధికి మాత్రము తృప్తిఁగలిగించుట సహజము కావున జనసామాన్యమానసమునకు నట్టి తర్కవాదము రుచింపదు. జనులకుఁ బురాణశ్రవణాసక్తి యుండునట్లు వేదాంతపఠనాసక్తి గలుగదు. పండితులగువారు విషయమునఁ బ్రావీణ్య మందఁ బరిశ్రమించినను ప్రారంభమునుండియు వారిబుద్ధి పురాణగాథావిషయలిప్తమైయున్నందున వారికి బుద్ధివాదముకంటెను మానసమునకు నంటినమతసాంబంధికవిషయమే విశేషముగ ముదం బిచ్చుచుండును. ఆంగ్లేయభాషాప్రావీణ్య మందినహైందవపండితులు కార్యాకార్య హేతువాదములు సలుపుచు పైనఁ బలుకంబడిన విద్వాంసుల తాత్పర్యములకు నించుక భిన్నించి తాత్పర్యం బిచ్చిరేని, నట్టివారిని వేదదూషకులనిన్ని శాస్త్ర్యులనిన్ని నాస్తికులనిన్ని పలువిధముల దూషింతురు. గుణము గ్రహింపరు. విషయ మాలోచింపరు. పూర్వపక్షమొనర్చువారు చూపినప్రమాణములను ఖండించి తామొక సిద్ధాంత మొనర్పరు.

గ్రంథములలో విశేషముగఁ బలుకఁబడినది ఋగ్వేదమునందుఁగాని బ్రాహ్మణముల
లోఁగాని పురాతనోపనిషత్తులందుఁగాని యీ యుద్ధవిషయ మొకటూరినైనను
సూచింపబడలేదు. ఋగ్వేదముయొక్క యేడవమండలములోని 88 సూక్తములో
పురూష్ణినదీతీరమున త్రిత్సులరాజగు సుదాసు, పదుగురు రాజులతో యుద్ధమొనర్చి
వారి నోడించెననియున్నది. ఇదే యుద్ధమును గురించి MIII 88 సూక్తమున్ను
vii. 83 సూక్తమున్ను పలుకుచున్నది. అయితే కురుపాండవులనామ మెందె
చటను లేదు. కావున భారతయుద్ధమునకును ఋగ్వేదమునఁ బలుకఁబడినయుద్ధము
నకున్ను నే సంబంధమున్ను లేదు. "కురుపాంచాలురకు" యుద్ధమయి యుభయు
లున్ను మిక్కురయినట్టు శుక్లయజుర్వేదములలో నున్నదిగాని యది కురుపాండవుల
యుద్ధము కాదు. అందుఁ బాండవుల పేరున్ను లేదు. కఠోపనిషత్తులో "ధృతరాష్ట్రి
విచిత్రవీర్య" యని యున్నదిగాని పాండవుల నామము లేదు. కురుపాంచాలుర
యుద్ధమునుగురించి గ్రంథము లనేకములున్నవి. బౌద్ధయుగమున రచింపఁబడిన
మగధదేశముచరిత్రలో బుద్ధుఁడవతరించుటకు ముప్పదియైదురాజులకు మున్ను
కురుపాంచాలయుద్ధము జరుగఁబడినదని వ్రాయఁబడినది. ఒకరాజు రాజ్యమేలు పరి
మితి యిరువదైదుసంవత్సరము లని యెన్నఁబడినది. బుద్ధునినిర్యాణము క్రీస్తుశకమునకు
నాలుగుశతాబ్దములకు మున్నని తలఁచినను కురుపాంచాలుర యుద్ధము 1800 B. C.
లో జరిగియుండవలెను. ఇఁకఁ గురుపాండవుల యుద్ధమునుగురించి మనమాలో
చింపఁ దగినదిగ నున్నది. ఇంచుక సంస్కృతభాషాపరిచయముఁ గలపండితుఁడు
నిష్పక్షపాతబుద్ధిని నా గ్రంథమును జదివినచో నది బహుజనరచిత మనిన్ని, వేర్వే
రుకాలములందు రచింపఁబడి యసంబద్ధముగఁ గూర్పఁబడినదనిన్ని తెలియకమా
నదని, యనేకులు [illegible]నారు. వ్యాసులు దానిని రచించిరని ప్రసిద్ధి. గ్రంథ
ములో వ్యాసు లెచట నున్నవారో? నైమిశారణ్యములో శౌనకాదిమహామునులు
యజ్ఞ మొనర్చుచుండఁ బౌరాణికుఁ డగు నుగ్రశ్రవుఁ డచటికిఁ బోయెననిన్ని, యచట
శౌనకాదులచే నడుగఁబడి యుగ్రశ్రవుఁడు తాను వైశంపాయనులవలన వినినభారత
కథ నుడివె ననిన్ని మహాభారతకథోపక్రమము. కావున భారత మంతయును నుగ్రశ్ర
వుఁడు [illegible]నని యర్థమగుచున్నది. అయితే, యుగ్రశ్రవునిగురించిన్ని, వ్యాస
వైశంపాయనులనుగురించిన్ని పలుకువాఁడు వేఱొకఁడుండవలెను. వాఁ డెవఁడ
[illegible] తెలియుట మఱియొకవిషయము. జనమేజయునియజ్ఞకాలమున వ్యాసపై

శంపాయనాది ఋషులుండఁగ, వ్యాసులయొద్దనే, వ్యాసులు భారతకథను వారినలుగురిశిష్యులకును శుకునకును బోధించిరనిన్ని వారు వేఱువేఱుగ భారతకథను రచించిరనిన్ని తెలుపఁబడినది. ఆ శిష్యులలో వైశంపాయనులొక్కరు. ఈభారత మెవరురచించినదిన్ని తెలుపలేదు. భారతప్రథమానుక్రమణికను జదివి మిగత పర్వాను క్రమణికలను జక్కఁగ విమర్శించినచో నిప్పటిభారత మెంతగ హెచ్చింపఁబడినదియో తెలియవచ్చును. ఉగ్రశ్రవుని విషయమును వైశంపాయనవ్యాసులవిషయమును దెలిపినవాఁడు వేఱొకఁడని పరిష్కారముగ నూహించుటకు మార్గమున్నది. గాని యటుతెలిపినవాని పేరేమయినదిన్ని తెలియరాదు. వాఁడే మహాభారతమును రచించినవాఁ డనునది స్పష్టమగుచున్నది.

ఇదియునుఁగాక యీ గ్రంథరాజమునకు "భారతసంహిత" యని ప్రసిద్ధి. "సంహిత" యనఁ గలుపఁబడినదని యర్థము. అనఁగ నచటను వాడుకలోనుండిన నీతి వైరాగ్యధర్మసూక్ష్ములను గుఱించిన యితిహాసములనెల్ల సందర్భానుసారముగ నిందులోఁ జేర్పఁబడినవనియర్థమగును. నూతనముగఁ జేర్పఁబడినయితిహాసములను వదలినచో భారతకథయైదువేల గ్రంథముకంటెను హెచ్చుకాదు. ఇతిహాసములను వదలిన "అగస్త్యభారత" మైదువేలగ్రంథముకంటెను హెచ్చులేదు. ఆ గ్రంథమును నేఁజదివి యాదిపర్వమాంధ్రంబునకు భాషాంతరీకరించినాను. వ్యాసు లెనిమిదివేల గ్రంథముగ రచించిన భారతము పిదప నితరులు లక్షయు నెనిమిదివేలగ్రంథమునకు హెచ్చించిరేమో యను సంశయమొకటి కలుగుచున్నది. భారతములో వ్యాసఘట్ట మొకటి యున్నదని ప్రతీతికలదు. ఆ ఘట్ట మీయెనిమిదివేల గ్రంథమేమో? గణేశుఁడు వ్రాసిన దీఘట్టమ్మేయుండును. ఆ ఘట్ట మెద్దియో తెలియకయున్నది.

మఱియొకటి. భారతకథను వినినజనమేజయునకు నేడుతరములక్రిందటఁ బుట్టినవ్యాసులు జనమేజయుని కాలమున నుండెనని పలుకుట యించుక సందేహాస్పదమైనను దపోబలంబున నాయువును హెచ్చించికొను సామర్థ్యము ఋషులకు నుండునను సమాధానము చెప్పనగును. లేదా వ్యాసులనేకులు కావున జనమేజయుని కాలపు వ్యాసులు వేఱొకరని యయినను పలుకనగును. రెండవసమాధానమునుండి బాదరాయణులకు నించుకబాధ కలుగును. గావున దానిని వదలవలయును.

అయినను వ్యాసులు గొప్పవారుగ నుండినందునను విశేషభాగము వారు రచించినం
దునను గథ యింతయును వారు బోధించినందునను వారిపేరే భారతగ్రంథకర్త
గ బ్రసిద్ధికెక్కినదని యూహించుటకు మార్గమైనది.

భారతము సూత్రయుగమునం బుట్టినదన నగును. అంతకుముందుండిన బ్రాహ్మణముల
లోనేమి యుపనిషత్తులలోనేమి, యితిహాసములలోనేమి పురాతనరాజులచరిత్రములు ప
లుకునపుడు "కురుపాంచాలుర" యుద్ధవార్తలు తెలుపబడినవిగాని కురుపాండవుల
యుద్ధము పలుకబడలేదు. కురుపాంచాలయుద్ధవార్తలనుబట్టియే, ప్రారంభభారత
గాథ పుట్టియుండునని కొందఱభిప్రాయపడినారు. ఇక్కాలమున సర్వారాధ్యుడగు
దైవము బ్రహ్మగ నుండెను. బుద్ధుని కాలమువరకు, బ్రహ్మ సర్వోత్కృష్టముగ దైవముగ
భావింపబడుచుండినటుల పాలీభాషలో గ్రంథము లున్నవట. ఈ కారణములనుబట్టి
ప్రారంభ భారతగ్రంథము బౌద్ధుని కాలమునం బుట్టినదని యూహించినారు. అటుపిదప
నిరువదినాలుగువేల శ్లోకములుగల భారతగ్రంథము రచింపబడినది. ఈగ్రంథమునం
దు శివవిష్ణువులు వచ్చి చేరిరి. విష్ణు వవతారమెత్తి కృష్ణనామమునం జేరెను. బ్రహ్మకు
సమానదైవముగ గౌరవింపబడెను. క్రీస్తుశకమునకు 800 సంవత్సరములకు ముందు మె
గాస్తినీసనువాడిండియాకు వచ్చినకాలము నాంటిదేశములో నపుడే శైవవైష్ణవమత
ములేర్పడియుండెననియు వారిలో వైషమ్యములు పుట్టియుండెననియు తెలుపుటయు
గాక బ్రహ్మ దైవమనునది జనులు మఱచియుండిరని యతడు వచించినాడు. కురువం
శజుల చిత్రములు యవనశాక పల్లవు లని యాభారతగ్రంథములోనున్నను హిందువుల
దేవాలయములున్ను బౌద్ధులయాశ్రమములున్ను తెలుపబడినవి. కావున రెండవ
భారతగ్రంథము క్రీస్తుశకమునకు మూడునూఱులసంవత్సరములకుముందు రచింపబడిన
దని యభిప్రాయపడ నగును. ఆరీతిగ చేర్పబడిన నూతనవిషయములలోం దుది
భాగమునం జేర్పబడినది భగవద్గీత యని తత్త్వభూషణంగారు తాత్పర్యపడినారు.

గీతాగ్రంథము వేదవ్యాసులవారు రచించినటుల గలగాథకు మూలాధార
మేమియును లేదు. వారా గ్రంథమును రచించియుండరు. చరిత్రాంశములవానేన
లేని వ్యాఖ్యానకర్తలు గీతాగ్రంథకర్తృత్వము వ్యాసులయం దారోపించిరి. గాని నిజ
ముగ వారే రచించిరనుటకు మార్గములేదు. కురుక్షేత్రయుద్ధకాలమునందును గీతార

షధకాలమునకు బహుశతవత్సరములు పైగ నంతరము గలదు. గీత ధర్మశాస్త్రముల కాలమున వ్రాయఁబడినది. అది క్రీస్తుశకమునకు 200 వందల సంవత్సరములకు ముస్ను ఈవిషయమున రెండువిధముల సాక్ష్యముచే బలపఱచనగును. ప్రపంచంబునందెల్ల ననదృశగ్రంథమని ప్రసిద్ధికెక్కి సర్వులు గౌరవించు నీగ్రంథరాజముయొక్క నామమైనను నంతకు ముందుండిన, మంత్ర, బ్రాహ్మణ, ఉపనిషత్సూత్రగ్రంథములందు గపడదు. గీతాగ్రంథమునందు పైగ్రంథముల సార మంతయు నిమిడి యుండుటయే గాక యాగ్రంథములు గొన్ని కంఠతః వచింపఁబడినవి. గీతాగ్రంథకర్త సకలవేదములును జదివి యందలి సారమును గ్రహించి, యందులోని కామ్యకర్మాంగమవిధుల దిరస్కరించి నిష్కామకర్మాచరణవిధు లాచరింపవలెనని సిద్ధాంతపఱచినది చక్కఁగ నాలోచించినచో నీగ్రంథకర్త సకలశాస్త్రవేత్తయనియును, యోగియనియును తెలియవచ్చుచున్నది.

17-వ అధ్యాయములోని 23 శ్లోక మీరీతిగనున్నది.

“ ఓం తత్సదితినిర్దేశో, బ్రహ్మణ స్త్రివిధ స్స్మృతః ”

“ బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ”

ఈ గ్రంథకర్తకు బ్రాహ్మణములసారము తెలిసియుండినదని స్పష్టమగుచున్నది. ఇఁక నుపనిషత్తులన్నచో భగవద్గీత యెచట్టఁజూచినను దాని సారమేయున్నది కఠ, శ్వేతాశ్వతరోప నిషత్తులలోని శ్లోకము లించుమించుగ,

II. 11. 12. లో నున్నవి. అవి యెవ్వియన

“ అశోచ్యా నన్వశోచ స్త్వం, ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ”

“ గతాసూ నగతాసూంశ్చ, నానుశోచన్తి పండితాః ”

“ నత్వేవాహం జాతు నాసం, నత్వం నేమే జనాధిపాః ”

“ నచైవ నభవిష్యామ స్సర్వే వయమతః పరం ”

మఱల III. 42-వ శ్లోకము.

“ ఇంద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః ”

“ మనసస్తు పరాబుద్ధి ర్యోబుద్ధేః పరతస్తుసః ”

మఱల VIII. 11. “ యదక్షరం వేదవిదోవదన్తి, విశన్తి యద్యతయో వీతరాగాః ”

" యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి, తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే "

మఱల XIII. 13. 14. శ్లోకములు.

13. జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి, యద్జ్ఞాత్వామృతమశ్నుతే ॥
అనాదిమత్పరంబ్రహ్మ, న సత్తన్నాసదుచ్యతే ॥

14. సర్వతఃపాణిపాదంతత్సర్వతోఽక్షిశిరోముఖం ॥
సర్వతశ్శ్రుతిమల్లోకే, సర్వమావృత్యతిష్ఠతి ॥

మఱల XV. 1. శ్లోకము.

ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయం ॥
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥

పైశ్లోకార్థములసారము విశేషభాగ మవే శబ్దములతో పైన నాచే నుదు వంబడినయుపనిషత్తులలో నున్నవి. గీతయొక్క యుపక్రమమే కఠోపనిషత్తు నుండి యెత్తఁబడినట్టు తోఁచుచున్నది. కృష్ణుఁడు పరబ్రహ్మమయి, యాత్మయగు నర్జునుని (రథమును దోలె ననునది కఠోపనిషత్తులోని ప్రథమాధ్యా) యమునకుఁ జేరినమాటవలె ఈగ్రంథములోనిదిఁట.

ఉపనిషత్సారమగు వేదాంతమును పదునైదవ యధ్యాయములోని పదునైదవశ్లోకములో వివరింపఁ బడినది.

XV.15 శ్లోకము. సర్వస్య చాహం హృది సన్నివిష్టో, మత్తస్స్మృతిర్జ్ఞానమపోహనంచ

వేదైశ్చసర్వైరహమేవవేద్యో, వేదాన్తకృద్వేదవిదేవ చాహం॥

బ్రహ్మసూత్రము లీగీతాగ్రంథకర్తకుఁ జక్కఁగఁ దెలిసియుండెనని గీతలో 13-వ అధ్యాయములో నైదవశ్లోకమునుండి తెలియవచ్చుచున్నది.

" ఋషిభి ర్బహుధాగీతం, ఛందోభి ర్వివిధైః పృథక్ "
" బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః "

గీతాగ్రంథకర్తకుఁ దనకంటెను బూర్వమందుండిన సాంఖ్యవేదాంత శాస్త్రములెల్లఁ దెలిసియుండెనని స్పష్టమగుచున్నది. ఈ విషయము గీతలో XVIII. అధ్యాయములోని 13.వ శ్లోకమునుఁ జూడుఁడి.

" పంచైతాని మహాబాహో, కారణాని నిబోధమే "
" సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని, సిద్ధయే సర్వకర్మణాం "

ఈ సాంఖ్యవేదాంతసూత్రములు రచించినవారు కపిలవేదవ్యాసులు. గీతారచనకాలమునకే వారిప్రసిద్ధి దిగ్దేశములు వ్యాపించియుండినది. కావుననే గీతారచనకర్త వారిపైఁ దనకుఁగల గౌరవమును సూచింపఁ బదియవయధ్యాయములో 26-వ శ్లోకమున " సిద్ధానాంకపిలోమునిః " యనియును 37-వ శ్లోకములో " మునీనామప్యహంవ్యాసః " యనియును వ్రాసినాడు. వ్యాసులే దీనిని రచించియుండినచోఁ బరబ్రహ్మము నేనే నని చెప్పి యుండరా? యోచింపుడీ. అటు చెప్పియుండిన నది గర్వోక్తిగ నుండదా! వ్యాసులంతటి మహానుభావునకు గర్వబుద్ధి నారోపించుట కంటెను గ్రంథరచన వ్యాసులది కాదని పలుకుట శ్రేయమని నాకుఁదోఁచుచున్నది.

గీత రచించుకాలమునకే ధర్మశాస్త్ర మున్నటుల గీతలో XVI. వ యధ్యాయము 24-వ శ్లోకములోఁ బలుకంబడినది.

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే, కార్యాకార్యవ్యవస్థితౌ "
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం, కర్మ కర్తు మిహార్హసి "

మంత్రయుగమున జరిగిన దని పలుకంబడుభారతయుద్ధములో గీతాసారము నర్జునునకు నుపదేశించినాఁ డనినశ్రీకృష్ణుఁడు, ధర్మశాస్త్రకాలమునకు నిటీవలయుండినట్టు స్థిరపడుచున్నది. కావున క్రీస్తుశకాదిని రచింపఁబడినగీతాగ్రంథమును భారతములోఁ జేర్పఁబడినదనుట నిస్సందేహ మని కొందఱ అభిప్రాయపడినారు. అక్కాలముననే నవీనోపనిషత్తు లాయా మతములకుఁ దగినరీతిగ విద్వాంసులు వ్రాయ నారంభించినది. ( ***Sectarian Upanishads*** ) శ్రీకృష్ణునిమహిమలు గాథలు పుట్టినవీ కాలమందేను. శ్రీకృష్ణుఁ డవతారపురుషుఁడని దృష్టిలో వచ్చినదీకాలమేను. ఇట్టియభిప్రాయ మక్కాలమునకు మున్నుండిన గ్రంథములో నెచటను లేదు. ఋగ్వేదమునందు నాల్గవమండలములో 26-వ సూక్తమందలి మొదటి ఋక్కున నింద్రుఁడు " అహంమనురభవ - సూర్యశ్చాహం " యని వచించినటుల వామదేవఋషి పలికినాడు. ఇంద్రుఁడు పరమాత్మయనిన్ని మన్వాదులు జీవాత్మలని యన్నఁబడినది. దానినిఁబట్టియే పురాతనోపనిషత్కర్తలు పరమాత్మజీవాత్మలయ భేదతను స్థాపించిరి. అంతయకాని యవతారములవిషయము పూర్వగ్రంథములేమి

యును బలుకవు. కౌషీతకీ యుపనిషత్తులోనేమి బ్రహ్మసూత్రములలోనేమి వచిం పఁబడినది ప్రపంచమెల్ల బ్రహ్మమయమనియు జీవాత్మ యందులోఁ జేరినదనియు యట్టిజ్ఞానము మానవునకుఁ గలిగినపుడు "అహంబ్రహ్మాస్మి" "సోహం" యను భావమువచ్చునవియు యున్నదికాని దైవ మొకమానవుఁడుగ నవతరించినట్టు పురా తనగ్రంథములలో నగపడదు పరబ్రహ్మ మానవుఁడుగ గర్భకళ్మలములోఁబుట్టి శారీరసంబంధసకలేంద్రియవ్యాపారములకు లోఁబడెననుట మన మతవేదాంత ములకే విరుద్ధముగనున్నది. ఇటు మానవశరీర మెత్తి సకలేంద్రియ శక్తులకు లోఁ బడినను, పరమాత్మ తన పరిశుద్ధశక్తి యుంచుకొనుననునది యద్భుతము. ఈ యవ తారకథ యిక్కాలమునఁ బుట్టినదికాన యంతవ ముందెచటను లేదు. ఇఁక మత్స్యా ద్యవతారములను పలికి పూర్వపక్షముసేయ నుద్యమించినచో దానికి సమాధాన మీరీతిగఁ బలుకఁబడును.

మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, రామ, రామావతార ములు ప్రకృతిసహజసృష్టి వివరములు. అది యెటులనః—

ప్రళయానంతరము ప్రపంచము జలమయమయియుండి పునస్సృష్టికాల మున జలాంతర్గతాణువులసంయోగప్రథమఫలము మత్స్యరూపమయినందున మత్స్యావతారమనిరి. అటులనే కూర్మావతారము. ఇవి రెండును కేవల జలచరములు. మూడవసృష్టి వరాహము. ఇది జలమృత్తికసంబంధమగు బురుదనుండునది. నార సింహావతారము భూమిపై నివసించుచు క్రూరకర్మంబులొనర్చునది. పిదప వామ నావతారమున, మృగభాగమును వదలి కేవలమానవరూపముగ జనించినప్రథమ మనుష్యాకారము. కావుననే స్వల్పాకారముగల వాఁడాయెను. పిదప మృగసం బంధసామీప్యవాసననుబట్టి పరశురాముండయ్యెను. పిదపఁ గ్రౌర్యభాగమునంత యును వదలి కేవలనీతిప్రదం బగు రామావతార ముద్భవిల్లెను. ఇది ప్రపంచాభివృద్ధి క్రమము. మఱలఁ బ్రపంచక్షీణకారణము కృష్ణ బౌద్ధ కలికి యవతారము లని చూపఁ బడినవి. అంతయకాని పరబ్రహ్మయ, మత్స్యాద్యవతారము లెత్తె ననుట మతవాద మగును కాని బుద్ధివాదముకాదు. ఈ విషయములఁగల గాథలన్నియును బౌద్ధులు ప్రబలించినపిదప వారిని నధిక్షేపింపనున్న హిందువులమానసములను మతపాశ ములఁ గట్టుటకున్న పన్నినకథలు. ఈ విషయము మఱల ముందు సందర్భానుసార ముగ వ్రాసెదను.

భగవద్గీతలు భారతములో [illegible] చేర్పఁబడినట్లు తోచుచున్నది. వెలయున:--అర్జునునకు యుద్ధసమయమున ఆచార్య బంధుమిత్రాదులనుగురించి విషాదంబుఁ బుట్టుటకుఁ గారణంబులేదు. ఈ యాచార్య బంధుమిత్రాదులెల్లరో, గాక కొందఱో ద్రౌపదీస్వయంవర కాలమునను నుత్తరగోగ్రహణకాలమునందును నుండినవారేను. ఆ కాలమునం జేసినయుద్ధములం దిట్టివిషాదము పుట్టక యిపుడా విషాదంబుఁ బుట్టుటకుఁ గారణమేమి? దుర్యోధనకర్ణాదులను జంపెదనని పలుమారు ప్రతిజ్ఞ చేయుచున్నవాఁడు. యుద్ధమునకు మున్ను దుర్గాస్తుతియొనర్చి జయమిమ్మని ప్రార్థించినాఁడు. అర్జునుఁ డత్యద్భుతముగ స్తుతించి

"స్తుతాసిత్వంమహాదేవి, విశుద్ధేనాంతరాత్మనా"
"జయోభవతుమేనిత్యం, త్వత్ప్రసాదాద్రణాజిరె"

అని భీష్మపర్వమున నిరువదిమూఁడవ యధ్యాయమునను న్నది. దుర్గాదేవి వరమిచ్చినది. ఎట్లనిన

"స్వల్పేనైవతుకాలేన, శత్రూన్ జేష్యసిపాండవ
నరస్త్వమసిదుర్ధర్ష నారాయణసహాయవాన్"

ఈరీతిగ జయముఁగోరి దేవివర మంది యుద్ధసమయమున బంధుమిత్రాదులకై దయఁబూనుట భగవద్గీతోపదేశము భారతమునఁ జేర్చుటకని స్పష్టమగుచున్నది. మఱియొకటి. దుర్గ మొదలగు దేవతారాధనలు పురాణయుగమునకుఁ జేరినవి కాని మంత్రబ్రాహ్మణోపనిషత్తులకాలమునకుఁ జేరినవి కావు. ఈ యిరువదిమూఁడవ యధ్యాయముతోఁగూడ భగవద్గీత యిటీవల భారతములోఁ జేర్పఁబడినది.

పాణినికాలమునందు సైతము కృష్ణార్జునులప్రసక్తి యుండలేదు. "వాసుదేవార్జునాభ్యాం వున్" అను సూత్రము భండార్కరుగారు చూపుచు, నప్పటికి వాసుదేవార్జునులుండిరని నిర్ణయించిన భాగమును విజయచంద్రమజుందారుగారు ప్రామాణికముగ ఖండించినారు. పతంజలికాలమునాటికి సైతము కృష్ణుఁడు దైవమని సంపూర్ణముగ స్థాపింపఁబడి యుండలేదు. పతంజలి భాష్యములో "అసాధుః" [illegible] కృష్ణుని మాతులునకు విశేషముగనున్నదట. మఱియొక స్థలమున నదే గ్రంథములో "కేచిత్ కృష్ణభక్తా భవంతి, కేచిత్ కంసభక్తా భవంతి" యనియున్నది

కృష్ణునిదేవత్వమును ధిక్కరించినవారనేకులు భారతములో నున్నవారు. కృష్ణుఁ
డు పాండవపక్షమూని కురుక్షేత్రయుద్ధ మందుండెనని పతంజలి సైతము వ్రాయఁ
డయ్యెను.

పాండవులు ద్రౌపదినిఁ బెండ్లియాడుసమయమువరకుఁ గృష్ణుఁడు భారత
ములో నగపడడు. కావున మూడునాళ్లవభారతవిభజనలోఁ గృష్ణుఁడు చేర్పఁబడి
నాడు. కృష్ణపాండవు లిరువురను మూఁడవవిభజనక్రిందవచ్చు 84000 వేల గ్రంథ
ములోఁ జేర్పఁబడినారనుటకు సందియము లేదు. కృష్ణుఁ డవు డవతరించినదైవ ము
య్యెను. అర్జునుఁడు యోధవీరుఁడయ్యెను. వారిరువురికి బాంధవ్యము గలిగెను. ప్రా
ణమిత్రులైరి. దుష్టార్థులరాజ్యము క్షీణించి ధర్మస్థాపనం బయ్యెను.

కృష్ణునిగాథలు ఋగ్వేదకాలమువరకు వ్యాపించులాగున గ్రంథము
రచింపఁబడినది. ఋగ్వేదమునందు కృష్ణు లిరువురున్నారు. ఆంగిరసవంశసంభవుఁడగు
కృష్ణుఁ డొకఁడు. ఈ కృష్ణుఁడు ఋషి. ఋగ్వేదములోని యెనిమిదవమండల
ములో 86 సూక్తములు రచించినవాఁడు. అదేమండలములోని 96 సూక్తము
యొక్క 13,14,15 ఋక్కులలో మఱియొక కృష్ణుని నామము తెలుపఁబడినది.
వాఁడనార్యుఁడు. అనార్యసేనను గూర్చుకొని యింద్రునితో బవర మొనర్చి వాఁడు
నైనవాఁడు. అంశుమతీనదీతీరము వీనివాసస్థానము. వీరిరువురిని గూర్చి యొక్క
టిగఁ జేర్చి కృష్ణనామమున దైవముగ నొనర్చినారని పలువురియభిప్రాయము.
వారిరువురిగుణములనెటులఁ జేర్చి పురాణగాథలు పుట్టినవి యిన్ని ముందు నూత్నముగ
నేఁ దెలిపెద. వేదము వదలినవో యుపనిషత్తుల చాంధోగ్యోపనిషత్తు వచ్చునంతవరకుఁ
గృష్ణనామ మెచ్చటను గానరాదు. ఆయుపనిషత్తులో నాంగిరస పుత్రుఁడు కృష్ణుఁడు
మునుల వచ్చినాడు. శతపథబ్రాహ్మణములోఁ గృష్ణునినామము కానరాదు. అయితే
విష్ణునామ మున్నది. ఈ విష్ణువే కృష్ణావతార మెత్తెనని గాథలువచించుచున్నది. విష్ణు
వుయొక్క యత్యాధిక్యయశమును సహింపక యింద్రుఁడు చీమలను బంపించి విష్ణు
ధనుస్సుయొక్క యల్లె త్రాడును ఖండింపఁగఁ జేసి విష్ణుశిరము ద్రెంచెనని [illegible]
యున్నది. ఇంద్రునకు విష్ణువునకు ద్వేషముండినటుల ఋగ్వేదమున నున్నది. [illegible]
ద్వేషమును మూలాధారముగఁ జేసి భాగవతములో [illegible]
[illegible]
[illegible]

ర్యకిరణములు గోవులు. వర్షము వచ్చినపుడు గోవులడగి కొండగుహలలో నుండును. పురు, యదు, దుర్వసు, అను, ద్రుహ్యులు యయాతి కొమారులు. యదువంశ జుండే కృష్ణుండని గ్రంథములు పలుకును. యాదవులు నీచక్షత్రియులని భారతగాథ లు తెలుపుచున్నవి. వీరు ప్రారంభమున ననార్యులుగ నుండి పిదప వేదమతమవలం బించి క్షత్రియులుగ నెన్నంబడినవారు. వీరు క్షత్రియులైనను తమ యనార్యపద్ధతులు గొన్ని వదలి యుండలేదు. యయాతి వృషపర్వుని కూతురును పెండ్లి యాడినదిన్ని ఉపరి చరవసురాజు పర్వతరాజు బిడ్డ గిరికను పెండ్లి యాడినదిన్ని శంతనుండు సత్యవతినిం బెండ్లి యాడినదిన్ని వారి యనార్యత్వము స్థాపించుచున్నది.

ఛాందోగ్యోపనిషత్తులో దేవకీసుతుండు కృష్ణుండు ఘోరాంగిరసుల శిష్యుండయి వారిచే బోధింపంబడి వేదాంతవిదుండయ్యెనని యున్నది. అద్వైతవే దాంతమెల్ల నీయాంగిరసకృష్ణునిచే బోధింపబడుచుండెను. పై విషయము లెల్ల సంగ్ర హించి వాడుకలలో నున్న కథలను జేర్చి కొన్ని నూతన గాథలు కల్పించి యిపుడుం డురీతిగ భారతకథను రచించినారు. అనంగా ఋగ్వేదమునందు వచ్చిన యనార్యుం డగు కృష్ణుని సాహసపరాక్రమములున్ను ఆంగిరసకృష్ణుని వైరాగ్య జ్ఞానసామర్థ్య ములున్ను జేర్చి యితరమహిమాస్పదకథలను గూర్చి బౌద్ధులకాలమునందో తదనంత రమువనో యిపు డుండురీతిగ మహాభారతము రచింపంబడినదని పండితులయభిప్రా యము. కృష్ణుండు దైవమని భావింపంబడినది ప్రారంభమున మధురద్వారకలమధ్య ప్రదేశము. అనార్యులగు పురు యదు దుర్వసులాదిగ గల పంచజనులే ప్రారంభము నం గృష్ణుని దైవముగ నొనర్చి తత్సాధనులై యనేక సాహస కర్మము లొనర్చి కృష్ణుండు దైవము కాదనిన వారిని జంపి, దేశవి[illegible] కృష్ణారాధనమును స్థాపించిరి. కొందరు పండితు లీవిషయమున దాత్పర్యపడినది యేమన, బుద్ధుండు మానవదైవముగ నేర్పడినందున పామరజనులు బౌద్ధమత మవలంబింపసాగిరి. హిందూమతమునకుం జేరిన జను లనేకు లటుపోయినది చూచి కొందరు హైందవ పండితులు చక్కంగ నాలోచించి మానవదైవమును బూజింప జను లపేక్షించు చున్నారని తెలిసి కృష్ణావతారమును గల్పించి కృష్ణునిమహిమలు హెచ్చించిరి అంతకు ముఖ్య మానవదైవప్రసక్తియే యార్యులలో నుండలేదు. మహాభార తములో కృష్ణుండవతారపురుషుండనుటయు నతని మహిమాస్పదము లగుగాథలున్ను [illegible] ననేకు లభిప్రాయపడినారు. కారణములు చూపినారు.

**భగవద్గీతను** రచించినమహాత్ముఁడు బౌద్ధయుగమున నుండిన యెవఁడో **మహాయోగి.** చతుర్వేదసంపన్నుఁడు. పురాతన బ్రాహ్మణోపనిషత్తుల సారము చక్కఁగ నెఱింగినజ్ఞాని. బ్రహ్మసూత్ర, యోగశాస్త్ర, ధర్మశాస్త్రములనెల్లఁ దెలిసిన విద్వాంసుఁడు. ఈ మహాత్ముని కాలమునకుఁ గృష్ణుఁడు దైవముగ నెన్నఁబడి యతనిగాథలు దేశమెల్లెడ వ్యాపించి యుండెను. భారతకథ నైత మెల్లరకుఁ దెలిసియుండెను. జైమినిముని కర్మకాండలోని చిక్కులకు లోఁబడలేక దానిని నిరాకరించి కొందఱు బౌద్ధులై యుండిరి. కొందఱు కర్మకాండను నిరాకరించుచు బాదరాయణమునిచేఁ గల్పింపఁబడిన జ్ఞానకాండవిధులే యుత్తమమని వాని ననుసరించి యుండిరి. జ్ఞానకర్మకాండాచరణముల విషయమయి పండితులలో విపరీతవాదములు జరుగుచుండెను. అపుడు భగవద్గీతలప్పైనఁ బలుకంబడిన మహాయోగి రచించెను. కర్మకాండవాదమును జ్ఞానకాండవాదమును సముచ్చయించి, **( Harmonise )** గీతలు రచించెను. భారతకథ, గీతారచనకు ననుకూలముగ నుండెను. శ్రీకృష్ణుఁడు సారథిగను, అర్జునుఁడు రథికుఁడుగను నుండు సందర్భములు కఠోపనిషత్తులో నీ క్రింద వివరించిన వేదాంతరూపకమగు శ్లోకములకు ననుకూలపడెను. ఆ శ్లోకములెవ్వియనః—

ఆత్మానం రథినంవిద్ధి, శరీరం రథమేవతు,<br>
బుద్ధింతు సారథింవిద్ధి, మనఃప్రగ్రహమేవచ ॥ ౧ ॥<br>
ఇంద్రియాణి హయానాహు ర్విషయాస్తేషుగోచరాన్,<br>
ఆత్మేంద్రియ మనోయుక్తం, భోక్తేత్యాహు ర్మనీషిణః ॥ ౨ ॥<br>
యస్త్వవిజ్ఞానవాన్ భవత్యయుక్తేన మనసాసదా,<br>
తస్యేంద్రియాణ్య వశ్యాని, దుష్టాశ్వా యివసారథేః ॥ ౩ ॥<br>
యస్తువిజ్ఞానవాన్ భవతి, యుక్తేన మనసాసదా,<br>
తస్యేంద్రియాణి వశ్యాని, సదశ్వా యివసారథేః ॥ ౪ ॥<br>
యస్త్వవిజ్ఞానవాన్ భవత్య మనస్కస్సదాశుచిః<br>
నసతత్పదమాప్నోతి సంసారంచాధిగచ్ఛతి ॥ ౫ ॥<br>
యస్తువిజ్ఞానవాన్ భవతి, సమనస్క స్సదాశుచిః<br>
సతుతత్పదమాప్నోతి యస్మాద్భూయో నజాయతే ॥ ౬ ॥

విజ్ఞానం సారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః
సోऽధ్వనః పారమాప్నోతి, తద్విష్ణోః పరమంపదం ॥ ౯ ॥
ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరంమనః
మనసశ్చ పరాబుద్ధి బుద్ధేరాత్మా మహాన్పరః ॥ ౧౦ ॥
మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః ॥
పురుషాన్నపరం కించిత్సాకాష్ఠా సాపరాగతిః ॥ ౧౧ ॥

సభ్యులారా! భగవద్గీతను జదివినవారెల్లరు పైన నాచే వ్రాయఁబడిన కఠోపనిషత్తులోని శ్లోకార్థమును దెలిసిన యెడల భగవద్గీత యే గ్రంథమునుండి యెంతవరకు గ్రహింపఁబడినదిన్ని తెలియనగును. ప్రారంభమునఁ బై శ్లోకముల యర్థమును వ్రాసి మఱల నీ గీతాగ్రంథమును గుఱించి ముచ్చటించెద.

" ఆత్మ రథికుఁడుగఁ దెలియుము. దేహము రథము. బుద్ధి సారథి. మనస్సు కళ్లెము. ఇంద్రియములు హయములు. విషయములు మార్గములు. మానసము యొక్కయు నింద్రియముల యొక్కయు కూడికచే నుండిన యాత్మ యనుభవించుకర్త. మానసనిగ్రహము లేనియవివేకికి నింద్రియములు స్వాధీనపడక చెడు గుఱ్ఱములబలె సారథివశముమీఱి పోవుచుండును. వివేకికి మానసనిగ్రహము గలుగుటవలన నింద్రియములు వశమయి, మంచిగుఱ్ఱములబలె బుద్ధియను సారథికి లోఁబడియుండును. మానసనిగ్రహము లేని యవివేకి యెల్లకాల మశుచిగ నుండు కారణంబున పరమపదమందక, సంసారములోఁ బడియుండును. మానసనిగ్రహము గలిగిన వివేకి, యెల్లకాలము శుచియై, పునర్జన్మము కలుగనట్టి పదవినందును. బుద్ధి సారథ్య మొనర్చుచు మనస్సను పగ్గమును బట్టినవాఁడు, జీవయాత్ర సంపూర్ణముగ సలుపుచుఁ బరబ్రహ్మముండు పరమోన్నతపదవినిఁ జేరును. విషయము లింద్రియములకంటెను శ్రేష్ఠములైనవి. బుద్ధి, మానసముకంటెను శ్రేష్ఠము. బ్రహ్మము బుద్ధికంటెను శ్రేష్ఠము. అవ్యక్తబ్రహ్మము బ్రహ్మముకంటెను శ్రేష్ఠము. పురుషుఁ డవ్యక్త బ్రహ్మముకంటెను శ్రేష్ఠుఁడు. ఆ పురుషుని కంటెను హెచ్చగు వస్తువెద్దియునులేదు. అదియే పరమావధి.

మహాశయులారా! భగవద్గీతా సారమెల్లను పై వచనమున నిమిడి యున్నది. దీనినే విస్తరించి విశేషభాగము గీతలోనిమూడవయధ్యాయములో

బోధింపఁబడినది. కృష్ణుఁడు బుద్ధిరూపమంది సారథియై యర్జునునకు హితముపదే-
శించినాడు. కావున వైరాగ్యబోధనకు భారతయుద్ధప్రసక్తి చక్కఁగఁ గుదిరెను.
కావున గ్రంథకర్త తనబోధన భారతములోఁ జేర్చెను. కఠోపనిషత్తు భగవద్గీత
కంటెను ముందు రచింపఁబడినట్టిది. ఈ కఠోపనిషత్తులోని సారము ఋగ్వేదము
X-వ మండలములోని 185-వ సూక్తములో సూక్ష్మముగఁ దెలుపఁబడినది. యుద్ధ
రంగమునఁజేరి యుద్ధ మారంభసమయమునఁ గృష్ణుఁ డింతటిగ్రంథ మర్జునునకు
బోధించెననుట నమ్మఁదగినదిగనుండదు. సమంజసముగ నుండదు. గీతలో "ధృత-
రాష్ట్ర ఉవాచ; సంజయ ఉవాచ, అర్జున ఉవాచ, భగవానువాచ" యని పలికిన
శ్లోకములు సైతము శ్రీకృష్ణుఁడే తెలిపెనా? లేక కృష్ణుఁడు గ్రంథము వ్రాసెనా?
సందర్భము పొందుటకుఁగాను పరులెవరో యీ శ్లోకములు వ్రాసియుండవలెనని
సమాధాన మియ్యవలెను. వ్యాసులు భగవద్గీత వ్రాయలేదని నే నింతకుమున్న
వచించినాను. సంజయుఁడు వ్రాసినాడనుటకున్ను మార్గములేదు. వ్యాసుఁడు
గాని సంజయుఁడుగాని యుద్ధభూమియందుండినవారు కారు. కావున భగవద్గీత
వ్రాసిన మహాత్ముఁడు మఱియొకఁడని సిద్ధాంతమగుచున్నది. భగద్గీతను వ్రాసిన
జ్ఞాని తానే దైవమని ప్రగల్భములు పలికికొనునా యని పూర్వపక్ష మొనర్పవచ్చును.
ఆ విషయ మించుక చర్చించెద. అటు పూర్వపక్ష మొనర్చుటకుఁ గారణములేదు.
గీతాగ్రంథకర్త తానే కృష్ణుఁడని భావింపఁడు. అర్జునుని సారథిగఁ గృష్ణుఁడుం
డును కృష్ణుఁ డవతారపురుషుఁడని గ్రంథకర్త సైతము మన్నియుండును. అయితే
కృష్ణుఁడు భగవద్గీత యుద్ధకాలమున నర్జునునకు బోధించెననుట గ్రంథకర్తకల్పించి
నాడు. అటు సందర్భము కల్పించి తన భగవద్గీతను నడుమఁ జేర్చినాడు. అయితే
తన మతతాత్పర్యమును దేవుడు పలికెనని యెటువ్రాసెను. అది తప్పుకాదాయని
యాక్షేపింప నగును. కృష్ణుఁడే యర్థమునఁ దాను దేవునియవతారమని తెలిపికొ
నెనో దానివిషయము మనమాలోచింపఁ దగినదిగ నున్నది. అర్జునుఁడు కృష్ణుఁడు
దైవమని యే యర్థమునఁ దెలిసియుండె ననువిషయముఁగూడ విమర్శనీయముగ
నున్నది.

ఇప్పటివారనేకులు తలఁచినరీతిగనే యర్జునుఁడు కృష్ణుని దైవమని
భావించియుండును. కృష్ణుఁడు సైతము తాను దైవమని భావించికొని యుండును.

క్తివి సహజవిరుద్ధ మేమియునుగాదు. ఆకాలమున నెల్లవారు నిట్టివి నమ్ముచుండిరి. ఒక మానవుని పరబ్రహ్మముగ భావించుట గీతలో నొకటియగాదు. అనేకగ్రంథ ములలో నటులున్నది. ఇంద్రునకును ప్రతర్దన రాజునకును జరిగినవాదములో నింద్రుఁడు తాను పరబ్రహ్మరూపమగు ప్రాణమని చెప్పికొని నటుల కౌషీతకి బ్రాహ్మణములోఁ బలుకంబడినది. ఋగ్వేదములోఁ బలుతావులం దింద్రుఁడు తాను బరబ్రహ్మమని పలికినాఁడు. దానినిజమగు నర్థమేమనఁగా: జ్ఞానియగువాఁడు తాను పలుకు వాక్యము పరబ్రహ్మవాక్యమని తెలిసి నమ్మియుండును. కావున నా రీతిగ వాక్యమూలమునఁ దెలుపును. భక్తిబలమున భజించువాఁడును దైవము నొక్కరూపమని భావించి కొనుట సహజము. గీతలో జ్ఞానియగు కృష్ణుఁడు తన భావనా విశేషమునఁ దాను పరబ్రహ్మమని తలంచి యా యావేశమున మాట లాడెనని పలుకుట సహజముగ నుండునుగాని తానే పరబ్రహ్మమని తలఁచె ననుట సహజముగాదు. జననము, అవతారము, ఆవేశము అని మూఁడువిధములు. జనన మందునఁ బరమాత్మాంశము ప్రతిమనుజునందు జీవాత్మరూపముగఁ జేరును. అవతారమునఁ బరమాత్మ తానే మానవుఁడుగఁ బుట్టును. ఆవేశమునఁ బరమాత్మాం శము జ్ఞానియొక్క బుద్ధిని విశేషముగ వికసింపఁ జేయుచు నద్భుత శక్తి నిచ్చి విభూ తి సంపదల నగపడఁజేయును. మొదటిదిన్ని మూఁడవదిన్ని యూహింప నల విగ నుండును కావున సాధ్యమని పలుక నగును. అవతార మట్టిది కాదు. భగవద్గీతలో నాల్గవ యధ్యాయములోని యాఱవశ్లోకార్థమును విచారింతము. అది యవతా రములను స్థాపించునేమో చూతము.

" అజోఽపిసన్నవ్యయాత్మా, భూతానామీశ్వరోఽపిసన్॥
" ప్రకృతిం స్వామధిష్ఠాయ, సంభవామ్యాత్మమాయయా "

అర్థము:— నేనుజన్మరహితుఁడనే యైనను, నక్షయమైనజ్ఞానశక్తిస్వభావ ము కలవాఁడనే నైనను, సర్వభూతములకు నీశ్వరుఁడనే నైనను, నామాయయగు ప్రకృతిని వశీకరించి తన్మాయావశంబున దేహము గలవానియట్లును జన్మము నొంది నట్లును దోఁచుచున్నాను. ఇదియే శంకరభాష్యతాత్పర్యము. దైవము జన్మించెనను టకు నీ శ్లోకమేమి చెప్పునది చూచితిరిగదా? సామాన్యమనుజునిం బలె, విష యేంద్రియవశుఁడుగాకను కాలదేశాదిచిక్కులకుఁ జిక్కకను, ప్రకృతికి మీఁదైన

వాఁడయి యాత్మమాయద్వారా, పుట్టికయున్నను పుట్టినవానింబలె నగపడఁ జేయుచున్నాను. " సంభవామ్యాత్మమాయయా'' యను వాక్యమునకు శ్రీ శంకరాచార్యుల వారీరీతిభాష్యమొనర్చిరి " సంభవామి దేహవానివ, భవామి జాతయివ ఆత్మమాయయా ఆత్మనే మాయయా న పరమార్థతోలోకవత " నేను పుట్టినాననఁగా దేహముధరించిన లాగగపడుచున్నాను. నా మాయవల్ల పుట్టుటక యనిజముగ లోకములోని జనులబలెగాదు. " సంభవామి '' "సృజయామ్యహం" అనువాక్యము లావేశార్థముగాని యవతారార్థమని తోఁచదు. శ్రీమధ్వాచార్యుల వారు మాయయా యనుపదమునకు జ్ఞానముచేయని యర్థముచేసినారు. ఏది ఎటు లైననుండనీ

జన్మమన:— పూర్వదేహముపదలి మాతృగర్భమునఁబడి నూతనదేహంబు ధరించి జననమరణాది క్లేశములకుఁ జిక్కుట.

అవతారమన:— మాతృగర్భమునఁబడి దేహము ధరించి జననమరణాది క్లేశము లనుభవించుట.

ఆవేశమన (***Manifestation or Inspiration***) జ్ఞానాభివృద్ధి నందినమనుజుని బుద్ధిని హెచ్చుగ వికసింపఁజేసి వానిని బ్రాహ్మీభూతునిఁ జే యుట. ఇట్టివారే మహాత్ములు. ముక్తబ్రహ్మలు. దైవసమానులు.

పై మూడుతరగతులలో నెద్ది శ్రేష్ఠతమ మైనదో మీరు చక్కఁగనాలో చింపుఁడి. జననమరణములు లేక యవ్యయుఁడై కర్మానుబంధములకుఁ జిక్కక తేజోరూపంబుననున్న దైవము మనజునిస్థితికిదిగి, మాతృగర్భస్థకశ్మలములోఁ జిక్కిజననమరణాద్యవస్థలకు లోఁబడెననుట మనదైవమును మనమే హైన్యదశకు దించినలా గగును.

పై యర్థమునే నాల్గవయధ్యాయములోని పదియవశ్లోకము పలుకు చున్నది.

" వీతరాగభయక్రోథా ! మన్మయామాముపాశ్రితాః ॥

" బహవోజ్ఞానతపసా! పూతామద్భావమాగతాః॥''

అనురాగభయక్రోధములను ద్యజించి, నాయందు ప్రియ్యమగు చిత్తము గలిగి, నాశరణుఁజొచ్చి, జ్ఞానాగ్నిచేఁ బావనులగువారు బ్రాహ్మీభూతులగు చున్నవారు. ఇట్టిస్థితియ దైవావేశస్థితియని పిలువఁబడును. గీతాగ్రంథకర్త

కృష్ణుఁ డట్టి వాఁడని భావించియుండెననునదిన్ని. యాఱవయధ్యాయములో ధ్యానయోగమునఁ దెలిపినాఁడు. పదియవ యధ్యాయములో 11వ-శ్లోకము పై యర్థమును భద్రపఱచును,

" తేషామేవానుకంపార్థమహమజ్ఞానజంతమః ॥

" నాశయామ్యాత్మభావస్థో, జ్ఞానదీపేనభాస్వతా ॥

అరీతిగ బుద్ధియు నుపాయముగ వారిని ననుగ్రహించుటకునై నేను వారిబుద్ధివృత్తియందున్నవాఁడనగుచుఁ ప్రకాశమాను జ్ఞానమను దీపముచే నజ్ఞానమువలనఁ బుట్టినవారితమస్సును నశింపఁజేయుచుందును. అనగా పరమాత్మ జ్ఞానులబుద్ధియందుఁ బ్రవేశించి బుద్ధినివికసింపఁ జేయువాఁడని యర్థము. ఇవి యన్నియు నాలోచింపఁ గృష్ణుఁడు మహాయోగియని తెలియవచ్చునుగాని యవతారపురుషుఁడని గీతాగ్రంథకర్తతాత్పర్యముగ నుండదు. అర్జునుఁడు సైతము కృష్ణుని యోగియని భావించి యుండెను. కావుననే " కథంవిద్యామహంయోగిన్ " యోగీయని కృష్ణుని సంబోధించినాడు. దైవమని భావించి యుండిన యోగియని పిలుచుచుండలేడు. ఎచటనైనను దైవమని సంబోధించి యుండినను గొప్పవారిని నటు పిలుచుటలోక సహజము. తప్పుగాదు. కృష్ణుఁడవతారపురుషుఁడేయయి యుండినయెడల జ్ఞానశక్త్యైశ్వర్యములు సదాకాలము సంపూర్ణముగనుండును. విస్మృతములగుటకుఁ గారణము లేదు. కురుక్షేత్ర యుద్ధానంతర మర్జునుఁడు కృష్ణునిఁజూచి యుద్ధసమయమున నాకుబోధించిన జ్ఞానమును మఱలనుపదేశింపుమని ప్రార్థింపఁగ నతనికపుడు యోగమహిమ యుండెననిన్ని యా యోగమిపుడు లేనందున మఱచినాననిన్ని కృష్ణుఁడు బదులిడెనని యనుగీతలోఁ బలుకఁబడినది.

సభాసదులారా: నేనువ్రాయవలెనని యెన్నిన యంశములను గుఱించి సూక్ష్మముగఁ గొన్ని విషయములుమాత్రము దెలిపితిని. కురుపాండవయుద్ధము పాశ్చాత్యపండితులు కొందఱిప్పటికి మూఁడువేల వత్సరంబులయినదని యభిప్రాయపడినారు. మఱికొందఱిప్పటికి నైదువేలసంవత్సరములక్రిందటజరిగినదని తాత్పర్యపడినారు. నాలుగువేల యయిదువందలవత్సరముల కిటీవల యాయుద్ధము జరుగలేదని మఱియొకయుపన్యాసంబున నే దెలిపినాను.

(3) ఇప్పటియుండు మహాభారతము వ్యాసులు వ్రాయలేదనిన్ని వారి

వ్రాసినది 8800 శ్లోకములనిన్ని యది యిపు డుండుభారతములో నేభాగముగ నున్నదియో తెలియదనిన్ని రెండవప్రతి భారతములోఁ గురుపాంచాలుర యుద్ధ మగపడుచున్నది గాని కురుపాండవులయుద్ధము తెలుపఁబడలేదనిన్ని పాండవుల ప్రస్తావనుసైతము లేదనిన్ని వ్రాసినాను. మూడవప్రతియగు 84000 వేలగ్రంథ ములోను నాల్గవప్రతియగు లక్షనిరువది వేలగ్రంథములోను కృష్ణపాండ వులు చేరినారనిన్ని వారిగాథలు హెచ్చుగఁ జెప్పఁబడుచు వచ్చెననిన్ని భగవద్గీ త తుదకుఁ జేర్పఁబడినగ్రంథమనిన్ని క్రీస్తుశకానికి నించుకముందు మహాభారత మింతగ నభివృద్ధిఁ జెందెననిన్ని తెలిపితిని.

(3) భగవద్గీత వ్యాసులచే రచింపఁబడినది కాదనిన్ని క్రీస్తుశకమునకు రెండుమూడు శతాబ్దములకు ముందుండిన మహావిద్వాంసుఁడు దానిని రచించి భారతములోఁ జేర్చెనని తెలిపినాను.

[4] క్రీస్తుశకమునకు 3-4 శతాబ్దములకుముందు కృష్ణుఁడు దైవమని భావింపఁబడెననిన్ని బుద్ధునకుఁ బ్రతిగ మానవదైవముండవలెనని యటులొనరించి యతనికి గాథలు కల్పించిరనిన్ని కృష్ణుఁడు దేవునియవతారమనుట సమంజసము కాదనిన్ని తెలిపితిని.

ఇపుడుండు భారతమంతయు వేదవ్యాసులు రచించినది కాదనిన్ని భగవద్గీత వారు రచించినదికాదనిన్ని శ్రీకృష్ణుఁడు రచించినది కాదనిన్ని నేనుబలికితిని. నాపలుకు లిట్టివలఁబుట్టిన గ్రంథప్రమాణములకు విరుద్ధములనిన్ని నాకుఁదెలుసును. వారు రచించిరనుటకు సైతమనేకాధారములున్నవి. అయినను ప్రతిపక్షుల వాదమువిని సిద్ధాంతీకరించిన విషయము సావకాశముగ నుండునని నేనింతగ వ్రాసినాను. మహాభారత భీష్మపర్వములోనే

"అథగావల్గణిర్ధీమాన్, సంగరాదేత్యసంజయః।
ప్రత్యక్షదర్శిసర్వస్య, భూతభవ్య భవిష్యతః।
ధ్యాయతేధృతరాష్ట్రాయ, సముపేత్యైవ మబ్రవీత్ ॥

అని గవల్గణపుత్రుఁడగు సంజయుఁడే చెప్పెననియున్నది.

ఇతి శ్రీ కృష్ణతత్త్వమునకు [illegible] [illegible] [illegible]

నాడని మనమెఱుంగఁ దగినదిగ నున్నది.

గీతాస్సుగీతాఃకర్తవ్యాః । కిమన్యైశ్శాస్త్రవిస్తరైః ।
యాస్స్వయంపద్మనాభస్య, ముఖపద్మాద్వినిస్సృతాః ॥

యనియున్నది. గీతలను జక్కఁగఁ బారాయణము చేయవలెను. ఇతర శాస్త్రములెందుకు? ఏలయనఁగా, గీతలు సాక్షాచ్ఛ్రీకృష్ణుని ముఖకమలము నుండి వెడలినవి. శ్రీకృష్ణుఁడే భగవద్గీతలు పలికినట్లు స్పష్టమగుచున్నది. భగవంతునియుపదేశార్థమును కృష్ణద్వైపాయనులు శ్లోకములుగ రచించిరి. అందుఁగొన్ని తామును నూతనముగఁ జేర్చిరి. గీతామహాత్మ్యమునందీవిషయము పలుకఁబడినదని శ్రీధరస్వామి కృతవ్యాఖ్యానములోఁ దెలుపఁబడినది. నా యుపన్యాస విషయములు ఖండింప నిట్టిసాధనము లనేకము లున్నవి. ముఖ్యము తైత్తరీయోపనిషత్తును జక్కఁగ విమర్శించినచో కృష్ణబలరాములవార్తయర్థమగు నూహ కలుగుచున్నది. మీరుదానిని జూడనగు.

కృష్ణునిబలె పాండవులు ననార్యులనిన్ని టిబెట్టుదేశపద్ధతు లనేకము వారియందుఁ గలవనిన్ని యొకస్త్రీని పురుషులనేకులు పెండ్లియాడుట టిబెట్టుదేశపద్ధతిగ నుండినదనిన్ని యంబిక, యంబాలికలు గర్భముధరించుటయును గుంతి మాద్రులు సుతులను గనుటయు ననార్యుల పద్ధతియనియును పైన వ్రాయుటకు గ్రంథబాహుళ్యభీతిని వదలి యిపుడిచట సూక్ష్మముగ వ్రాసినాను.

భగవద్గీత యిపుడుండునది 18 యధ్యాయములు. ప్రారంభమునఁ బంద్రెండధ్యాయములే యుండెననిన్ని మిగత యారధ్యాయములిటీవలఁ జేర్పబడినవనిన్ని కొందఱందురు. దానికిఁ గారణం బేమనిన, నారవయధ్యాయముయొక్క ముగింపు నేడవయధ్యాయప్రారంభము సంబంధపడినటుల, బన్నెండవ యధ్యాయము యొక్క ముగింపును బదుమూడవయధ్యాయము యొక్క ప్రారంభమును సంబంధపడలేదని వారివాదము. ఈ వాదబలము నే నెఱుఁగఁజాలను. భగవద్గీత పురాణకథకాదు. వేదాంతవిచారము. ఇట్టిదానిలో నధ్యాయసంబంధములుండవు.

కొందఱు భగవద్గీత పందొమ్మిది యధ్యాయములనిన్ని పందొమ్మిదవ యధ్యాయములో నధ్యాత్మ రహస్య మిమిడియున్నదనిన్ని యది హిమాలయములో నుండు నొక మహాత్మునివద్ద నున్నదనిన్ని చెప్పుకొనుచున్నారు. ఆ యధ్యాయ

మును గంటే జూచునటకు దాని యాదార్థ్యమును దెలుపుటకురాదు. వ్యాసులు భారత మఱువదిలక్షల గ్రంథము రచించిరనిన్ని యొకలక్ష గ్రంథమును భూలోకమునసిడి మిగతభాగము స్వర్గలోకమునకుఁ బంపినారనిన్ని ప్రతీతికలదు. దీని యాథార్థ్యమున్ను చదువరులే యూహింపనగును.

ప్రతిపురాతన గ్రంథమునకును బిట్టికథలు పుట్టినట్లు భగవద్గీతలోని కొన్ని శ్లోకములవిషయములకును బిట్టికథలు పుట్టినవి. అవి యవ్వాగారికథలను బోలినవి. కావున వ్రాయక వదలితిని.

భగద్గీత కర్మషట్కమనిన్ని భక్తిషట్కమనిన్ని జ్ఞానషట్కమనిన్ని మూఁడువిధములుగ విభజింపఁబడినదఁట. అది సరికాదనిన్ని జ్ఞాన భక్తి కర్మషట్కములని యుండవలెననిన్ని వాదించుచున్నారు. ఏలయన దైవమొకఁడున్నవాఁడని నిశ్చయజ్ఞానముకలిగినపిదపఁ దా దైవానుగ్రహముండుటకుఁ గర్మము లాచరింపవలెను అని వారు వాదించెదరు. ప్రారంభమున భగవద్గీతను త్రైవిధముగ విభజించిన వారెవరు? ఆవిభజన, గ్రంథమునందు లేనిదే, యావిభజనలవిషయవాదము జనించుటయుక్తము కాదు. పైఁగా బదునెనిమిది యధ్యాయములలోఁ బ్రతియొక యధ్యాయములోను కర్మ భక్తి జ్ఞానవిషయము లున్నవి. విషయ రీతిగవేర్పాటొనరించి విభజింప నసాధ్యము.

ఇఁక భగవద్గీతలోనిగొన్ని శ్లోకములకు బురాతనమహనీయులు తమ తమమతానుసార మర్థమొనర్చుచు భాష్యమును వ్రాసినారు. సంపూర్ణశాస్త్ర వేదాంతపాండిత్య మొకనికి సమకూరునంతవరకు నా భాష్యములు చదివినచో నుపయోగములేదు. వచ్చినజ్ఞానము సైతము పోవును. కావున భగవద్గీత చదువు వారు ప్రారంభమున శ్లోకార్థమును దెలిసికొని తాత్పర్యమును గ్రహించి యది మానసమునకుఁ జక్కఁగనంటిన పిదప నొక్కొకభాష్యమును జదివినచో జ్ఞానాభివృద్ధికి మార్గమగునని నాయభిప్రాయము.

గీతపైనాకుఁ గలగౌరవ బుద్ధినిఁబట్టి నేదానిఁ జక్కఁగఁదెలిసికొన వలెనని తొమ్మిదిభాష్యముల సాహాయ్యమున రెండవ యధ్యాయముఁ జదివితిని. భాష్యములు చదివినకొలఁది చిక్కులు బలమాయెను. తర్కవాదబుద్ధి హెచ్చెను, జ్ఞానముపోయెను. మఱల నావిషమెల్ల మఱచునంత వఱకు గీతనే

ష్టంటనైతిని. ఇటీవల మఱల ప్రారంభించినాను. గురుమూలక మగుశిక్ష కానందున తప్పుభావములు ద్రోక్కియుండును. గురుశిక్షనందువయసు మీఱినది కావున నున్నంతలో దృష్టిపడినాను.

సంస్కృతభాష "రబ్బరు" నుబోలినది. ఈడ్చువాని సామర్థ్యము కొలది పోవుచుండును. ఒక్కొకశబ్దమునకనే కార్థంబులు గల్పించుటకు నను కూలముండును. ఒకవాక్యమునకు నొకయర్థ మొనర్చినచో నదే వాక్యమునుండి దానికి విరుద్ధార్థమును బట్టి యీ ద్వనగును. ఇటుబహ్వార్థములకు గారణంబైనది యీగీతాగ్రంథము. దీనికిదృష్టాంత మొకటియగపఱచెద.

ప్రారంభశ్లోకము:— "ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతాయుయుత్సవః"

"మామకాఃపాండవాశ్చైవ కిమకుర్వత సంజయ"

ఇదిశ్లోకము. దీనిస్పష్టార్థము - సంజయా! ధర్మక్షేత్రమగు కురుక్షేత్ర ములో గూడుకొని యుద్ధము చేయఁదలఁచిన నావారును పాండవులును నేమి చేసిరి? ఈ యర్థముతో దృష్టిపడక పండితులొనరించిన యర్థములు గొన్ని యీ క్రింద వివరించెద.

ధర్మక్షేత్రే; ధర్మమునకు ధర్మబుద్ధికినినభివృద్ధికారణమగు కురుక్షేత్ర మనిభాష్యకారులొకరర్థమును పెచ్చించిరి. ధర్మక్షేత్రే; నివాసము చేయుమాత్ర ముచేతనే ధర్మమును దత్ఫలంబును నిచ్చునదియని వేఱొకరర్థము చేసిరి.
ధర్మక్షేత్రే; లేనిదానికి యుత్పత్తిని నున్నదానికి నభివృద్ధియుఁగలిగించు నట్టిదియని మఱియొక రర్థము చేసిరి.
ధరక్షేత్రే; మృతిఁ బొందినవారికి సద్గతి నిచ్చునట్టియని వేఱొకపండితుఁడర్థముఁ జేసెను.

పై యర్థములు భాష్యకారులొనర్చిరి. ఇటీవలవిపరీతార్థము లనేకము లుద్భవిల్లినవి.

పై శ్లోకమునకుఁ బ్రారంభమున ధృతరాష్ట్ర ఉవాచ యని యున్నది. ధృతరాష్ట్రశబ్దమునకు "నవివేకి" యనియర్థము చేసిరి. ఏలయన ధృతరాష్ట్రుఁ డు పుట్టంధుఁడు. కావున నేవిచారమును లేక కార్యము లొనరించువాఁడు. అజ్ఞాని. అట్టిధృతరాష్ట్రుఁడు, రాగద్వేషాదిదోషములనుఁ జక్కఁగ జయించిన వాఁడగు సంజయునిఁ జూచి యీరీతిగ నడిగెను. ధర్మక్షేత్రే; ధర్మసాధనకు స్థానమగు

కురుక్షేత్రే; దేహమునందు మామకాః అజ్ఞానసంబంధమగు మమకారాదిశక్తులకును పాండవాః; జ్ఞానసంబంధమగుశక్తులకును యుద్ధమును జరుగవల్యెను గదా; అని ఆవి రెండుశక్తులు నేమిచేసెను. ఎటులయ్యెను అని ప్రశ్నించెనని యొకడు పలికెను.

ధృతరాష్ట్రుడు జాత్యంధుడు కావుననే ప్రజ్ఞాచక్షువుగల వివేకియని మఱియొక రర్థము చేసిరి.

ధర్మక్షేత్రే కురుక్షేత్రే; అనియున్నది కావున నా స్థానమున నిలిచినవారికి ధర్మబుద్ధియె పుట్టును. నాకొమారులు దుష్టాత్ములైనను నాస్థానమహిమచే ధర్మబుద్ధి పుట్టి పాండవులకు నర్ధరాజ్యమిచ్చి యుద్ధము మాలించిరా? లేక పాండవులు బంధుమిత్రాదులహింసను జూడనోపక తమ రాజ్యభాగము వదలి యుద్ధము చాలించిరా? ఏమిచేసిరి తెలుపుమని ప్రశ్నించెనని యొక రర్థముం జేసిరి.

ధర్మక్షేత్రే కురుక్షేత్రే; ధర్మరాజునకును కురురాజునకును సమానభోగ్యమగుస్థలమున నని కొందఱర్థము చేసిరి.
మామకాః యనఁగా మేనమామచే ప్రేరితులైరని యొకరర్థము చేసిరి.

ఈరీతిగనే భాష్యకారుడు నర్థము చేయుటకు నేమార్గమును లేదు. యుద్ధము ప్రారంభమైన పదిదినములకు పైన భీష్ముడు శరపంజరగతుడైన పిదప సంజయుడు భీష్మునిగతి ధృతరాష్ట్రునకుఁ దెలుప నతఁడు శోకించి యుద్ధప్రారంభమునుండి యేమేమి విశేషములు జరుగుచు వచ్చినవన్ని సవిస్తరముగాఁ దెలుపుమనియడిగినప్రశ్నయిది. దీనికిన్ని యర్థములేలపుట్టెనో!

పై రీతిగఁ బలువురుపండితులు తమపాండిత్య విశేషమున శబ్దశబ్దమునకును బలువిధముల నర్థములు కల్పించి సామాన్యజనులను చిక్కులలోఁ గలుపుచున్నవారు. కావున, నేనీరీతిగఁ దాత్పర్యమిచ్చితిని. గహనముగనుండు రెండవయధ్యాయమును విశేషార్థములతోఁ జదువవలెనని యత్నించినచో నాయరణ్యములోఁ బడి వెలివడుట కష్టమగును. స్పష్టముగనుండు నర్థముచక్కఁగ గ్రహించినట్టి వారికి భగవద్గీత జ్ఞానాభివృద్ధిగలిగించుననుటకు నే సందియమును లేదు. విశేషార్థమును దెలిసికొనఁగూడదని నాతాత్పర్యము కాదు. సామాన్యులకా ప్రయత్నము తగదు. భూరివ్యసనమునఁజిక్కినవారికి గీతాగ్రంథము కలిగించు నంతటి యూఱట మఱిఏ గ్రంథము కలిగింపదని నాతాత్పర్యము.

మహాశయులారా,

మనగ్రంథములలో ధర్మాధర్మ సూక్ష్మములఁ గొన్ని యెత్తికర్మజిజ్ఞాసమను పేరుతో నొక యుపన్యాసంబు వ్రాయయత్నించుచున్నాను. ముగిసినంతనే దానినిఁ జదివెదను.

పండితవరులారా! పైయుపన్యాసంబును నే వ్రాసిన పిదప బ్ర. శ్రీ. బాలగంగాధర తిలక్కుగారతిప్రౌఢముగ మహారాష్ట్రభాషయం దిటీవల వ్రాసిన గీతారహస్యగ్రంథమును నేఁ జదివితిని. అందుఁ దుదిభాగమున నీవివాదాంశముల నెల్ల విమర్శించి విశేషభాగమువారు ఖండించి కొన్నిభాగములు మాత్రము ఖండింపను సాధనసంపత్తిలేమి వదలినారు. మానససంకల్పములబలెను సముద్రతరంగముల బలెను శంకలునిరంకుశములుగ నుద్భవించి కక్కటితర్కవాదములు తండోపతండములుగ నుబుకునుగావున నిట్టివిషయములు విశేషముగఁ జర్చింపఁ బనిలేదని యభిప్రాయపడినారు. వీరు నిరభిమానాగ్రగణ్యులైనను కేవలపూర్వాచారపరాయణనాయకులు గావున వారిచిత్తవృత్తి యంతయును నా మార్గమునకే యొడ్డుచుండును. వీరు, భగవద్గీత, భారతములో నిటీవల జేర్పఁబడినదికాదని, భారతానుక్రమణికను బట్టిన్ని, భారతగ్రంథములో నచటచట భగవద్గీత నామము వచ్చియుంటఁ బట్టిన్ని, యనుగీతలో గీతానామము తెలిపియుండుటబట్టిన్ని, యుభయగ్రంథముల భాషాశైలినిఁబట్టిన్ని, యుభయగ్రంథములలోనిగొన్ని వాక్యములు సమానార్థము లిచ్చుచున్నవియగుటయు కొన్నిశ్లోకములు శబ్దశః యొక్కటిగనుండుటఁ బట్టిన్ని, ప్రాచీనప్రతీతినిఁ బట్టిన్ని, భగవద్గీత యిటీవలభారతములో చేర్చినారనుట యసమంజసమని వ్రాసినారు. ఈ సాధనలను బాధించు విషయములు కుశంకలని వదలినారు. పరమాత్మ మాయామానుషరూపమై విశ్వరూపమును బ్రదర్శించిన విషయమును స్థాపింపభారతమునుండియే యైదా ఉదాహరణ లిచ్చినారుగాని యితర ప్రాచీనగ్రంథప్రమాణముల నగపఱచలేదు. భగవద్గీత, బ్రహ్మసూత్రములకంటెను బ్రాచీనమని వ్రాయుటను హుంకరించి ధైర్యము చాలకనో మఱియే కారణంబుననో వదలినారు. బ్రహ్మసూత్రగ్రంథకర్తలగు బాదరాయణాచార్యులున్ను వ్యాసులున్ను నొక్కరేనా భిన్నులాయను విషయ మట్లుండె.

శ్రీ

# వ్యవహారకర్మజిజ్ఞాసము.

ఇది

బళ్ళారిలో వకీలుగానుండి

కీ. శే. బ్రహ్మశ్రీ॥ కోలాచలం శ్రీనివాసరావుగారిచే

రచియింపఁబడినది.

కె. శత్రుఘ్నరావుచేఁ

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు.

బళ్ళారి.

ఆంధ్రాముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1925.



వెల అ. 0—8—0



# కర్మజిజ్ఞాసము.

## మొదటి ప్రకరణము.

ధర్మాధర్మ సూక్ష్మములను దెలియుటకు, మన పురాతనార్యు లెంతగనో నాలోచించి కష్టపడి యనేక సూక్ష్మధర్మములను దెలియుటకునై స్మృతులు ధర్మ శాస్త్రములు భారతాది పురాణాంతర్గతేతిహాసములు, వ్రాసియుంచినారు. అయిన వానిలో రాని ధర్మసూక్ష్మముల నిర్ధారణము లేకను గొన్ని తెలియదగినవిగ నున్నవి. అవి యాచరణలలో వచ్చినపుడు నిర్ధరింపదగినవి. మన పురాణేతిహాస ములలో గల యనేకగాథ లిట్టి ధర్మసూక్ష్మములను నిర్ధరించుటకునై బుట్టినవేను. ఈ విషయము లనేకగ్రంథములందుండుటచే పామరజనులెల్లరు వానిని దెలియ జాలక యున్నవారు. కావున నేనిపుడు "కర్మజిజ్ఞాస" మను పేరున గొన్ని ధర్మములను వానికిగల వినహాయింపులును (*Exceptions*) వ్రాయబూనెద. తిలక్కు గారిచేత వ్రాసిన భగవద్గీత పీఠికలో నీ విషయము గొంతవరకు దెలిపి నారు. అది మహారాష్ట్రభాషలో నుండుటచే నాంధ్రులగు మనమెల్లరము దెలి యుట సాధ్యముకాదు. నా మిత్రులగు కడప బాళాజిరావుగారి సాహాయ్యమున నేనా పీఠికను జదివితిని. మనవారు తెలియుటకునై నేను నట్టివిషయమునుగురించి వ్రాయుట జనోపకారంబుగ నుండునని యెంచి యీ ప్రయత్నము బూనితి.

ఇది భగవద్గీతోపన్యాసంబులకు బీఠికగ నుండవలెనను తలంపు నాకు నుద్భవించినది కావున ధర్మసూక్ష్మంబరయుటకు భగవద్గీతనుండియ దృష్టాంతము ప్రారంభమున బుచ్చికొని దానివిమర్శనమొనరించి పిదప నితరగ్రంథముల దృష్టాం తములు దీసికొనియెద.

అర్జునునకు యుద్ధప్రారంభమునకు మున్నే, "యతోధర్మస్తతో కృష్ణః" యను వాక్యము తెలిసియుండెను కావున తా నొనరింపబూనినది ధర్మయుద్ధమని సైత మెఱింగియుండెను. "యతోధర్మ స్తతోజయః" అను వాక్యా ర్థము తెలిసినవాడు కావున తనకు జయము సిద్ధమని యెఱింగియుండెను. దుర్యో

శనాదు లాతతాయినులని తెలిసియుండెను. పిలువఁబడి యొనరించు యుద్ధము క్షత్రియునకు ధర్మమని సైతము తెలుసును. ఇటులుండియు నర్జునుఁడు యుద్ధరంగ మునందుఁ దన్నెదిరింపవచ్చిన తండ్రులను, తాతలను, నన్నదమ్ములను, నాచార్యులను, గురువులను, మిగత బంధుమిత్రాదులనుఁ జూచి కృపార్ద్రితచిత్తుఁడయి శోకమోహాబ్ధిలోమునింగి, కులధర్మంబుమాని శస్త్రసన్యాసంబుఁబూని భైక్ష్య వృత్తిఁగోరెను.

కృష్ణుఁడు వాని మనోవృత్తిని గుర్తెఱిఁగి, లోకసామాన్యమగు ధర్మాధర్మ వాదము ననుసరించెను. ఎటులనః—

కృష్ణుఁడు:—ఏమియర్జునా! ఇటు, లప్రసంగాతి ప్రసంగములకు ప్రారంభించితివి? అనఁగా లక్ష్యమునం, దలక్ష్యబుద్ధియు, నలక్ష్యమునందు లక్ష్య బుద్ధియు నీకేలకలిగెను? ధర్మమునం, దధర్మబుద్ధియు, నధర్మమునందు ధర్మబుద్ధియు నీయందేకారణంబున నుద్భవించెను! కులధర్మంబగు క్షాత్రధర్మంబువదలి కులవిరుద్ధ ధర్మంబగు సన్న్యాసధర్మంబేల యపేక్షించితివి?

అర్జునుఁడు:—కృష్ణా!

“ దృష్ట్వేమంస్వజనం, కృష్ణ, యుయుత్సుంసముపస్థితం ”
సీదన్తిమమగాత్రాణి, ముఖంచ పరిశుష్యతి &c. 28,
నచశ్రేయోనుపశ్యామి, హత్వాస్వజనమాహవే ॥
నకాంక్షేవిజయంకృష్ణ, నచరాజ్యం సుఖానిచ,
కింనోరాజ్యేనగోవింద, కింభోగైర్జీవితేనవా ॥

కృష్ణా! యుద్ధమునందుఁ గూడిన స్వజనమును జూచితిని. స్వజనులగు వీరని నాహవమునఁజంపుటచే నాకేమియు శ్రేయస్సులేదు. స్వజనమునుఁజంపి యార్జించిన విజయము, రాజ్యమునేఁ గోరను. అట్టి దొరతనము చేతనైనను భోగములచేతనైనను, బ్రదుకుచేత నైనను మనకు నేమిప్రయోజనము? ఇదియునుగాక

కథంభీష్మమహంసంఖ్యే ద్రోణంచ మధుసూదన।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హౌ పరిసూదన ॥

కులమాన్యుఁడయినట్టియు చిన్నతనమునుండి మముఁ బెంచినట్టియు

మాకుఁ బితామహుఁడగునట్టియు భీష్ముఁడు, విద్యాగురువగు ద్రోణాచార్యులు మొదలగువారు పూలతోఁ బూజింపఁదగినవారు. అట్టివారిని బాణముల నెటు నొప్పింతును? వలదట్టి క్రూరకర్మము. భైక్ష్యవృత్తియనాకు శ్రేయమని తోఁచినది.

కృష్ణుఁడు:—అర్జునా! ఇది యేమి మూఢమతము? సకలధర్మములు తెలిసినవానిబలె మాటలాడుచున్నావు.

ఆ ధర్మమునుగుఱించియే, నేఁ గొన్ని ధర్మసూక్ష్మములను దెలిపెదను వినుము.

**(a)** విజయ ఫలాపేక్ష నీకులేదని నీవు తెలుపుచున్నావు. నిజము. అది మంచితలంపనుటకు సందియములేదు. అయిన యధర్మమునడఁచి ధర్మంబు విజయమగుట సర్వులు నపేక్షింతురు. అధర్మమే జయమందినచో, ప్రపంచమే మునిఁగి పోవును. దుర్యోధనాదు, లధర్మవృత్తికి లోఁబడినారు కావున దండ్యులు.

**(b)** భీష్మ ద్రోణాదులు వంద్యులు, పూజ్యులనునది నిజము. "అకార్యకార్య శతంకృత్వా, భర్తవ్యామనురబ్రవీత్" అని యున్నది నిజము. పిత్రాదులను బోషించుటకొఱకు నధర్మము లనేకము లాచరించినను దోషములేదనుట సత్యము. అయినను,

"గురోరప్యవలిప్తస్య, కార్యాకార్యమజానతః ।
ఉత్పథం ప్రతిపన్నస్య, పరిత్యాగో విధీయతే ॥

గర్వించినవాఁడును, కార్యాకార్యము తెలియనివాఁడును, నధర్మమార్గ మవలంబించిన వాఁడును నగునెడ గురువునుగూడ విడుచుటధర్మము. ఇదియునుగాక

యావతీర్వై దేవతాస్తాః సర్వా వేదవిది బ్రాహ్మణే సంతి ।
తస్మాద్బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యో దివే దివే నమస్కుర్యాత్ నాశ్లీలం కీర్తయేత్ ॥

ఎందఱు దేవతలుగలరో వారందఱు వేదవిదుఁడగు బ్రాహ్మణునియందు వసించుచున్నారు. అందువలనఁ బ్రతిదినము దాను వారికి నమస్కరింపవలెను. వారిని దూషింపరాదని తైత్తిరీయస్మృతి విధించినది నిజము. అయిన

అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః ।
క్షేత్రదారాపహర్తా చ, షడేతే హ్యాతతాయినః ॥

ఆతతాయినమాయాన్తం హన్యాదేవావిచారయన్ ।
నాతతాయి వధే దోషో, హన్తుర్భవతి కశ్చన ॥

అను ధర్మమున్నది. దుర్యోధనుఁడు మిమ్ముఁ గాల్ప యత్నించెను. విష మిచ్చెను. మిమ్ముఁ జంప యత్నించెను. మీ రాజ్యధనము నపహరించెను. మీ భార్య మానచ్యుతి నొనర్పఁ బ్రయత్నించెను. కావున నాతతాయి యగుచుండె. అట్టి దుర్మార్గుని పక్ష మవలంబించి వచ్చినవారెల్ల నాతతాయులు కావున భీష్మ ద్రోణాదులును, దుర్యోధనుని పరము యుద్ధము చేయ వచ్చినవారు నాతతాయులగుదురు (**Accommpliccs**) కావున వారును హంతవ్యులగుట ధర్మము.

అర్జునుఁడు:—కృష్ణా! ఏది యెట్లున్నను "అహింసాపరమోధర్మః" యని యుత్తమధర్మమున్నది కదా, ఆ ధర్మ మెట్లు నతిక్రమింపనగును?

కృష్ణుఁడు:—అర్జునా! నీవు పలుకునది సామాన్యధర్మము (**General Law**) "జిఘాంసన్తం జిఘాంసీయాత్" యను విశేషధర్మమున్నది. (**Special Law of Self defence**) చంపఁ గోరువానిని జంపఁ గోరవలెనను ధర్మమున్నది కావున దుర్యోధనాదులను నీవు చంపుటయు దోషము కాదు. క్షత్రియ ధర్మ మవలంబింపుము. కులనాశనకరమని శోకింపకు.

అర్జునుఁడు:—కృష్ణా! కులనాశనకరమగు కార్యము నే నొనర్పఁ జాలను. "స ఏవ పాపిష్ఠతమో యః కుర్యాత్కులనాశనం" ఎవఁడు కులనాశన మొనర్చునో, వాఁడే పాపతముఁడని ధర్మమున్నది. ఈ కులనాశన మొనర్చుటలోఁ జెడుగులు చాలగనున్నవి. వర్ణసంకరమగును. కుల స్త్రీలు వ్యభిచారిణులగుదురు. పితృలకుఁ బిండమిచ్చువారుండరు కావున వారు నరకనివాసులగుదురు. కులనాశనమునుండి యిన్నియు నర్థములు కలుగును కావున యుద్ధము నేఁ జేయను.

కృష్ణుఁడు:—అర్జునా! అటులయిన "ఆహూతో న నివర్తేత ద్యూతాదపి రణాదపి విజితం క్షత్రియస్య" యిది క్షత్రియునకు ముఖ్యధర్మము "ద్యూతము

గనుక రణమునకు పిలువఁబడిన క్షత్రియుఁడు దానిని వదలఁగూడ
దనియున్న దియే? దానికేమందువు. ఆ ధర్మమును మఱచెదవా?

అర్జునుఁడు.—కృష్ణా! "ఫలతోపి పరయుక్తాత్మ నానర్థే నానుబధ్యతే,
కేవలప్రీతిహేతుత్వాత్ తద్ధర్మ యితికథ్యతే ॥

ఏ ధర్మము, పరిణామ ఫలమునందు అనర్థముతోఁ గలియదో అట్టిదియే, ధర్మము. మిగతది ధర్మముకాదు. కావున యనర్థఫలముతోఁగూడిన యుద్ధము నేఁ జేయను.

కృష్ణుఁడు:—అర్జునా! అటులయిన దుర్యోధనాదులు నిన్నుఁ జంపుదురు.

అర్జునుఁడు.— చంపుదురుగాక.

" యదిమామప్రతీకార, మశస్త్రం, శస్త్రపాణయః
ధార్తరాష్ట్రారణేహన్యుస్తన్మే క్షేమతరంభవేత్

నేనేమియు మాఱుచేయక, నిరాయుధుఁడనైనవానిని దుర్యోధనాదులు శస్త్రపాణులయి రణమందు నన్ను వధింతురేని నాకదియే మిక్కిలి క్షేమమని పలికెను.

పైరీతిగఁ బలికిన ధర్మముల కెల్ల నపవాదమాపాదించి ధర్మసూక్ష్మములు పలుకుచున్న యర్జునుని మనస్థైర్యమును కృష్ణుఁడు గనిపెట్టి ధర్మవాదములోఁ జిక్కులుచాలుగ నున్నవని తలంచియామార్గమును వదలి త్వం - తత్ - తత్వం యీ రీతిగ భగవద్గీతను మూడుభాగములుగ విభజించి యర్జునునకు నహంకారమమకారములు లేనటుల చిత్తశుద్ధియొనర్చి తనయాజ్ఞాధారకునిగఁ జేసికొని యుద్ధమునకుఁ బురిగొల్పెను.

భగవద్గీతమూలములోఁ పై వాదములు లేకయున్నను భాష్యకారులు పైశంకలు గల్పించి వానికిఁ దాము సమాధానములిచ్చినారు. ఆభాష్యములను జదివి కృష్ణార్జునుల ప్రశ్నోత్తరములిటు లుండునని యూహించి పైరీతిగ నేను వ్రాసినాను.

కొన్నిధర్మసూక్ష్మములు నిర్ధరింప ధర్మరాజు వశమైనను గాదు. అనేకానర్థములకుఁగారణ మగును. కృష్ణునిఁబోలు బంధువు, చెలికాఁడు, గురువు నైన యర్జునుని సరసలేకయున్న నర్జునుని గతియేమగుచుండెనో! ఈరీతిగధర్మసంజే

హాములు మనంబునఁ జొచ్చి, హితములు పలుకువారు సరసలేక పిచ్చిపట్టి చచ్చినవారనేకులున్నవారు. హ్యామిలెట్టను వాఁడు తనతండ్రిని జంపిన పినతండ్రిని జంపవలెనా సేవింపవలెనా లేక తాను చావవలెనా యను సందేహంబు మానసము బాధింపఁ గర్తవ్యమూఢుఁడై పినతండ్రినిఁ జంపి తానుజచ్చి యనేకానర్థములకుఁ గారకుఁడాయెను.

తనతండ్రి యెవఁడని తెలియక యొక సేనాధిపతి యాపాబీయను దానిచేఁ బ్రేరేపింపఁబడి రామరాజును చంపెదనని స్త్రీకి మాట యిచ్చెను. అదేరీతిగ బీజాపూరు సుల్తానులవద్దఁ బ్రమాణ మొనర్చెను. పిదప రామరాజే తన తండ్రియని తెలిసి ప్రమాణభంగ మొనర్పవలెనా లేదా తండ్రినిఁ జంపవలెనా యను సందేహమునఁ జిక్కి యవ్యవస్థితచిత్తుఁడయి తండ్రినిఁ జంపి తాఁ జచ్చెను. హిందూరాజ్యము పాడు చేసెను. కొరాయలేనస్సను వాఁడు రోమకరాజ్యము నుండి తఱుమంబడి వారిశత్రువులఁ దిక్కుఁజేరి యుద్ధసమయమున రోం దేశస్థులకు సేనాసాహాయ్యంబు సేయనని మాటయిచ్చెను. రోం దేశముపై దండెత్తెను. రోముదేశజులోడు సమయము తటస్థించెను. అపుడు కొరాయలేనస్సు భార్యయును తల్లియు వానినిఁ జేరి జననదేశాభిమానము వదలవలదని బతిమాలికొనిరి. కొరాయలేనస్సు ప్రతిజ్ఞాభంగ మొనర్పవలెనా, జననభూమికిఁ గంటకుఁడు కావలయునా యను సందేహమునఁ జిక్కి స్రుక్కెను. ఇట్టి ధర్మసందేహము లనేకములు తటస్థించుచుండును. వానినిదమిత్థమని నిర్ధరించుట కష్టతమముగ నుండును.

1. అహింసయు 2. సత్యము 3. అస్తేయము 4. త్రికరణశుద్ధి 5. ఇంద్రియనిగ్రహములని యైదు ధర్మములు సనాతన సామాన్యధర్మములని మనువు పలికెను. సర్వమతములవారును నీ సామాన్యధర్మము లనుసరింపవలెనని బోధించుచున్నవారు. వానిననుసరింప ననేకులు సర్వవిధములఁ బ్రయత్నించుచున్నారు. అయినఁ గొన్నిసమయములందు పై ధర్మము లనుసరించుట కష్టతమముగనుండును. అట్టికాలమున నా ధర్మములకు విరుద్ధముగ నటింపవలసివచ్చును. అట్టివి విశేష ధర్మములుగ నేర్పడును. విశేషధర్మము లనుసరింపఁదగిన విషయమగునా, కాదా యను విషయముల విచారించుటయు, ధర్మ సూక్ష్మాంశ జిజ్ఞాస. ఈ విమర్శనము కొన్నిసమయములందు కష్టతమముగనుండును. కావున నే ధర్మసూక్ష్మములు తెలియుట ధరరాజునకుసైత మలవికాదని [illegible]

"అహింసా పరమోధర్మః" అను మనువాక్యము భాగవతాది పురాణములన్నియు పలుకుచున్నవి. "న హింస్యాత్" అని ధర్మశాస్త్రము వచించుచున్నది. ఇది ప్రాణములదీయుట కొకటియగాదు. ప్రాణికోటికి నెట్టిబాధయును గలిగింపరాదని ధర్మమేర్పడినది. అయినను, పరుఁడొకరు తన్నుఁజంపుటకైనను, తనభార్యను చెఱపుటకైనను, తనయాస్తిని దొంగలించుటకైనను, తనయింటికి నగ్నిని దవిలింప యత్నించినను "అహింసా పరమోధర్మః" అనువాక్యము ననుసరించి దుర్మార్గుని హింసింపక, ఊరకపడియుండవలెనా? లేదా వానిని జంపవలెనా? చంపవలెను. "జిఘాంసన్తం జిఘాంసీయాత్" జంపవచ్చినవానినిఁ జంపిన దోషములేదని యొక విశేష ధర్మమేర్పరిచెను.

"గురుం వా బాలవృద్ధౌ వా, బ్రాహ్మణం వా బహుశ్రుతం॥
ఆతతాయినమాయాన్తం । హన్యాదేవావిచారయన్॥"

గురువుగాని, బాలుఁడుగాని, వృద్ధుగాని, వేదవిదుఁడగు బ్రాహ్మణుఁడుగాని యాతతాయి సర్గమునను జేయ నుద్యుక్తుఁడయినచో వానినిఁజంపినదోషము లేదని యొక విశేషధర్మమేర్పఱచిరి. దానికిఁగారణమాతతాయితన దోషమువల్ల నేతానుజంపబడును. పరుఁడట్టివానినిఁ జంపుటనునది నిమిత్తమాత్రమని యర్థము చేసి సామాన్యధర్మమునకు వచ్చినయపవాదమును దొలఁగించిరి. ఇదియాత్మరక్షణధర్మములోఁ జేర్చిరి. (***Right of private defence of person and property.***) అయినప్రపంచమునందంతయును పిపీలికాది సూక్ష్మ జంతువులు కోట్లకొలఁదిగనున్నవి. వానినిమనము దినదినముహింసించుచున్నాము కావునధర్మవిరుద్ధము చేయుచున్నామను శంకపుట్టనగును. దానికిసమాధానము ఆసూక్ష్మజంతువు లెట్టివియన

"సూక్ష్మయోనీని భూతాని, తర్కగమ్యాని కానిచిత్॥
పక్ష్మణోపినిపాతేన, యేషాం స్యాత్ స్కంధపర్యయః॥"

కంటిఱెప్పవ్రేగురు మాత్రాన హతమగునట్టివియుఁ గంటికిఁగనఁబడనట్టివియునగు సూక్ష్మజంతువులయునికి తెలియక వానికిహానిఁగలిగించినచో నది హింసకాదని స్థాపించినారు. బుద్ధిపూర్వకముగఁ జేసినదికాదు కావునధర్మవిరుద్ధ

ము కాదననిర్ధరించిరి. మఱియు శిశుహింస సర్వధర్మవిరుద్ధమని యేర్పఱచిరి. అయితే ప్రసవకాలమున గర్భములో శిశువు వెలికి రానటుల యంతరాయము కలిగినపుడు తల్లినిరక్షించుటకయి శిశుహత్యయొనర్ప వలసివచ్చును. ఇదిధర్మ విరుద్ధముకాదు. విరుద్ధమనితలఁచిన యెడల రెండు ప్రాణములును పోవును. ఇట్టిసమయమున శిశు హింస ధర్మము. గొప్పధర్మమొకటి రక్షింపనల్పధర్మవిరుద్ధ మొనర్చుటన్యాయ మనిస్థాపించిరి.

అనేకములగు ధర్మములాచరించు వారు హింసాచరణము జీవయాత్ర సలుపుటకయి చేయుచుండిన యెడల వారొనరించుగొప్ప ధర్మములలో నీ హింసాచరణ దోషమడఁగి పోవునని విశేషధర్మమొకటి కల్పించిభారత వనపర్వ ములో నితిహాసమొకటి వ్రాసినారు.

“ ఒకబ్రాహ్మణుఁడు తనముసలి తలిదండ్రులను విడనాడి సర్వసంగపరి త్యాగియై సన్న్యాసమును దీసికొని తపంబొనర్పసాగెను. కొన్నిదినంబు లటుతపం బొనర్చి తనకుఁ దపస్సిద్ధియయినదో లేదోయని తానుండు చెట్టుపైఁ గూర్చుండిన పిచ్చుకలను రూక్షేక్షణములఁ జూచెను. అవి కాలిభస్మమాయెను. అపుడా బ్రాహ్మ ణుఁడు సంతసించి యొకగృహమునకు భిక్షమునకుఁ బోయి “ భవతిభిక్షాందేహి ” యనియఱచెను. గృహిణి, సన్న్యాసినిఁ జూచియును దనభర్తకు సపర్యలొన ర్చుచుఁ గొంతకాలము విళంబమొనర్చి భిక్షఁదెచ్చెను. సన్న్యాసి విళంబమును సైఁపనోపక క్రోధపరవశుఁడయి యాగ్రహమునఁ గనులెఱ్ఱఁజేసికొని యాపతివ్ర తను నెగాదిగఁ జూచెను. ఆసతీమణి సన్న్యాసి విషయమును మనమునగ్ర హించి “ ఓరీ పిచ్చిసన్న్యాసీ: నన్నేల యటుచూచెదవు. నేనేమిచెట్టుమీదిపి చ్చుకగాను వీకనుమంటలకు గాలిపోవుటకు, నేనుపతివ్రత ననిపలికెను ” సన్న్యాసివిస్మ యావహచిత్తుఁడయి తల్లీనేఁదెలియక తప్పొనర్చితి. నావార్తనీకె ట్లుదెలిసెనని ప్రశ్నించెను. అయ్యాకాశిలో ధర్మ వ్యాధుఁడను కటికవాఁడున్న వాఁడు. వానిఁ జేరి ప్రశ్నించినచో నీమహిమ లేధర్మమవలంబించినఁ బోవచ్చు నని తెలుపునని వాక్రుచ్చెను. అపుడుసన్న్యాసి ధర్మవ్యాధునివద్దకుఁ బోయెను. వాఁడనేకములగు ప్రాణిహింస యొనర్చుచు మాంసమమ్ముచుండెను. సన్న్యాసి వానివృత్తినేవగించినను వానిని సమీపింపగనె వ్యాధుఁడు సన్న్యాసికి నమస్కరిం

చి, అయ్యా ధర్మసూక్ష్మములు దెలియ నొకపతివ్రతనిన్ను నాసరసకుఁ బంపె నుగదా యనియడిగెను. సన్న్యాసి మఱులవిస్మయమందెను. ధర్మవ్యాధుఁడు సన్న్యాసిని బహుదినములు తనయింట నుంచుకొనెను. ప్రతిదినమును శుశ్రూషసలి తలిదండ్రులను బూజించి వారికి నాహారాదులిడి వారియాజ్ఞఁగైకొని జీవయాత్రసలుప హింసాది కర్మములొనర్చుచుండెను. ఒకదినమున సన్న్యాసిధర్మోపదేశంబుఁ దెలుపుమనికోర మానవులకుఁ బ్రథమధర్మము మాతాపితృల సేవయనియును స్త్రీకిప్రథమధర్మము భర్తసేవయనియును జీవయాత్ర సలుపుహింసకుల ధర్మన్యాయమునుబట్టి హింసకాదనిన్ని యిట్టిధర్మ సూక్ష్మములనేకములు దెలిపెను. సన్న్యాసి మాతాపితృలయెడ తానొనరించిన యుదాసీనభావంబునకు సిగ్గుపడి మఱలిపోయెను. కావున యితర ధర్మములనేకము లొనర్చుచు జీవయాత్ర సలుపగల ధర్మమురీతిగ నొనర్పఁబడు హింస హింస కాదనియొకవిశేషవిధి యేర్పడెను. జీవోజీవస్యజీవన మనురీతిగ జనులనేకులు తమజీవనము జీవహింసలచే నొనర్చుచున్నారు. హింసవదలినచో క్షత్రియ ధర్మము నడువదు. రాజ్యమరాజకమగును. అనేకానర్థములు సంభవిల్లును. " అహింసాపరమోధర్మ " యనుసామాన్యధర్మము సైతము తలఁచువారుండరు. కావునకొన్ని సమయములందు హింససైతము ధర్మమయి రాజిల్లును. ఎట్టివిషయమున హింసధర్మమనునది మనబుద్ధిచే నిర్ధరింపవలెను. ఈ యహింసాధర్మముల కనుగుణ్యములగు నవియ క్షమశాంతిదయాగుణములు.

సదాక్షమాగుణమున్ను సదాతేజస్సున్ను గూడదని ధర్మమేర్పడినది " నశ్శ్రేయః సతతం తేజో" " ననిత్యంశ్రేయసీక్షమా " యనియున్నది. జ్ఞానులకు మాత్రము సదాకాలము క్షమాగుణము భూషణముగ నుండవలెను. తేజంబెప్పుడునుండ రాదు. అయితేయట్టివారు సైతమీధర్మమునకు విరుద్ధములుసలుపు సమయములు కలవు. ఇతరములగు గొప్పధర్మములు రక్షింప క్షమాధర్మవిరుద్ధం బాచరించినను దోషములేదు.

సత్యమురక్షింప వలెనని సర్వమతములవారు దానిని ముఖ్యధర్మముగ స్థాపించినారు. " నాస్తిసత్యా త్పరోధర్మః " యని భారతములోనున్నది. "సత్యం వద ధర్మంచర" యని బ్రాహ్మణములోఁ బలుకంబడినది, మఱియు

" అశ్వమేధ సహస్రంచ, సత్యంచతుల యాధృతం॥
" అశ్వమేధ సహస్రాద్ధి సత్యమేవ విశిష్యతే॥

అశ్వమేధ సహస్రములనుండి వచ్చిన పుణ్యముకంటెను సత్యవచనములన గలుగు పుణ్యముహెచ్చని నిర్ధరించినారు " సత్యేషు యతితవ్యంవః, సత్యంహిపర మంబలం " యని భీష్ముఁడుపలికెను. ప్రతియొక గ్రంథమున్ను సత్యమును గుఱించి పలుకుచున్నవి. ప్రపంచము సత్యముపైన నిలిచినదని వేదములు ఘోషించుచున్నవి. ఇవియన్నియును నిజము. అయిన నిట్టిపరమధర్మమునను నైతమువిరుద్ధ మాచరించు సమయము లోకానుసారవేళ తటస్థించును. అట్టివేళలం దనృతమైనను సత్యానృతమైనను పలుకవలసివచ్చును. కొందఱీయుభయమార్గములునువదలి పిచ్చితనము వహింతురు. కొందఱు మౌనమూనుదురు. అదియెటులనిన, కొందఱు కష్టపడిధనమార్జించికొని యరణ్యమార్గముగఁ బోవుచుండ దొంగలు వారినిదోచుటకై వెంబడింతురు. బాటసారులు పఱుగిడి దాఁచికొందురు. అటువారు దాఁచికొనినది యొకఋషిచూచును. దొంగలు శస్త్రపాణులయి వచ్చికత్తిదూసినిలిచి బాటసారులెటు డాగిరని ఋషినిఁబ్రశ్నింతురు. అపుడుఋషియేమి బదులిడవలెను? డాగినస్థళము చూపినచో సత్యముపలికినటులగు చున్నది నిజము. అయిన నిరపరాధులు శిక్షింపఁబడి కష్టార్జిత ద్రవ్యమును గోలుపోదురు. నేబాటసారులను జూడలేదనిన నదియనృతమగును. ఏమిసేయవలెను? పిచ్చి వానిగనటింప వలెను. " జానన్నపిహిమేధావీ, జడవల్లోక ఆచరేత్ " అనిభారతములో నున్నది. అయిన యీమార్గము ధర్మవిరుద్ధ మార్గము గాదాయనిశంకింప, భీష్ముఁడుపలికిన విధమేమనిన

" అకూజనే నచేన్మోక్షో నావకూజేత్కథంచన॥
" అవశ్యంకూజితవ్యేవా, శంకేరన్వాప్యకూజనాత్॥
" శ్రేయస్తత్రానృతంవక్తుం సత్యాదితి విచారితం॥

మౌనమున బాధతొలఁగునని యెంచినచో మౌనమూనుము. మాటలాడక తీరదను బలవద్బాధకము వచ్చినచో నట్టి మాటలచే నితరులకు బాధ కలుగునెడల నన్యతవనాడుము. దానినుండి నీకు శ్రేయస్సు కలుగునుగాని నో

షము రాదు. కారణ మేమనిన నట్టియుక్కట్టుసమయమున నీవాడిన యనృత
ము కేవల శబ్దోచ్చారణముగాని మానసికముగాదు. దానినుండి పలువురకుమేల
గును. ఇదిధర్మము. దీనిఫలితార్థ మేమనిన, పలువురకు క్షేమ మొనఁగూడు
నను సందర్భమున నొకయబద్ధమాడినను దోషమురాదని కొందఱు శాస్త్రజ్ఞు
లు నిర్ధరించినారు.

" సత్యస్యంవచనంశ్రేయః సత్యాదపి హితంవదేత్॥
" యద్భూతహితమత్యన్తం యేతత్సత్యం మతంమమ॥

ఈరీతిశాంతి పర్వములోఁ బలుకఁబడినది. మఱియొకచోట

" యద్భూత హితమత్యన్తం, తత్సత్యమితి ధారణా " యనిభారత
ములోఁ బలుమారు వచ్చుచున్నది.

సత్యసంధుఁడగు ధర్మరాజు కృష్ణప్రేరితుఁడయి.

" అశ్వత్థామా హతయితి, శబ్దముచ్చైశ్చకారహ॥
" అవ్యక్తమబ్రవీద్రాజన్ హతఃకుంజరఇత్యుత॥

ఈ రీతిసత్యోనృతమాడెను. ఇదిధర్మవిరుద్ధమేను. ఎట్టిసమయము
నందాడెను! ద్రోణుఁడు విజృంభించి పాండవ సేనను దఱిమి-మఁ జక్కాడు
చుండెను కావుననే యనేకుల ప్రాణరక్షణార్థము శ్రీకృష్ణప్రేరితుఁడయి యా యనృ
తం బాడెను కావుననే పిదప నరకమును జూడనయ్యె కావునఁనిది గౌణపక్షమని
మనవారు భావించినారు. శ్రీకృష్ణుఁడు యుధిష్ఠిరునకునసత్యమాడు మని బోధించు
నపుడు మఱియొక విశేష ధర్మమును స్థాపించెను. అదియెద్దియన.

" కామినీషువివాహేషుగవాంభక్తేతథైవచ॥
" బ్రాహ్మణాభ్యుపపత్తౌచ, అనృతేనాస్తిపాతకం॥

ఇదేయర్థము నే తెనుఁగునందు

గీ॥ " వారిజాక్షులందు వైవాహికములందుఁ
ప్రాణవిత్తమానభంగమందుఁ
జకితగోకులాగ్రజన్మరక్షణమందు
బొంకవచ్చునఘము పొందదధిప॥"

ఈ ధర్మమును విని పాశ్చాత్యులు హిందువులకసత్యమేధర్మమని నిందించుచున్నవారు. ఇట్టిసూక్ష్మధర్మములు పాశ్చాత్యులందు లేవా? అనేకము లున్నవి.

నేనసత్యమాడుటవలన క్రీస్తుమతాభివృద్ధియగుచుండ నాకన్యత దోష మేలకలుగును? అని యొకక్రిస్టియన్ పండితుఁడు వ్రాసినాఁడు. అనేకులకత్యంత సుఖమును గలిగించుపలుకుసత్యమని సిడ్జ్విక్కనువాఁడు వ్రాసినాడు. పరుని క్షేమముఁదలంచి పలుకునబద్ధము దోషరహితమని పలుకుచుఁగొన్ని సమయము లందు, బాలురకుఁ బిచ్చివాండ్రకు వ్యాధిగ్రస్తులకు నిజము చెప్పినచో నపాయ మగును. కానయబద్ధమాడవలెననిన్ని యదిదోషముకాదనిన్ని వాక్రుచ్చినాడు. శాత్రవులకును చోరులకును నన్యాయముగఁ బ్రశ్నించువానికిని నబద్ధములు చెప్పినను దోషములేదనినాఁడు. వకీల్లుతమవ్యవహారములం దబద్ధమాడినను దోష ములేదనినిర్ధరించినాఁడు. మఱియు రాజకీయరహస్య విషయములలోను, వ్యాపా రములందును నిజమేపలుకవలెనని నామతము కాదని సిడ్జ్విక్కనువాఁడు (**Methods of Ethies.**) అనుగ్రంథములోఁ బలికినాడు. తువకొకనీతి శాస్త్రజ్ఞుడు, సత్యాసత్యములయొక్క సూక్ష్మములు నిర్ధరింపనలవికాదు. ఎద్దిపలి కినఁబదుగురికి క్షేమమగునో యదియే సత్యమని నేనమ్మెదనని వ్రాసినాఁడు. హిందూ నీతిశాస్త్రజ్ఞు లట్టిధర్మములొప్పరు. కొన్ని సామాన్య ధర్మములను వ్యతిక్రమించి విశేషధర్మములు పుట్టియుండినను నవి గౌణములని వానికిఁబ్రాయశ్చిత్తములు విధించినారు. ధర్మరాజసత్యమాడినందుకు నిమిషమైనను నరకమునఁ బడెను. అర్జునుఁడు శిఖండినియెదుటనుంచుకొని క్షత్రియధర్మవిరుద్ధముగ భీష్మునిఁజంపిన దోషఫలముగఁ దనసుతుఁడగు బభ్రువాహనునిచే నవమానింపఁబడెను. కావున సామాన్యధర్మమునకు నపవాదమును గల్పించి విశేషధర్మమును నిర్ధరించునది గౌణపక్షము. దీనిని దిరస్కరించి శంకరుఁడు పార్వతికినుపదేశించిన దేమన,

"ఆత్మహేతోః పరార్థేవా, నర్మహాస్యాశ్రయాత్తథా,
యేమృషానవదన్తీహ, తేనరాః స్వర్గగామినః

స్వార్థప్రయోజనమునకుగాని, పరహితార్థమునకుఁగాని నర్మగర్భిత హాస్యమునకుఁగాని, యేనరుఁడసత్యము వచింపఁడో వాఁడేస్వర్గము నందునని

తాత్పర్యము. కావున సకలురు సామాన్యధర్మము పై దృష్టియుంచవలెను. విశేషధర్మ
ములు గౌణములుగావున నట్టివి యొనరించినపుడు పశ్చాత్తప్తులుగావలయును.
ఇట్టియధర్మములు తెలివిమాలి యొనరింతునని యెన్ని యే,

కాయేనవాచామనసేంద్రియైర్వా॥

అని ప్రతిదినము దైవమును హిందువులు ప్రార్థించుచుందురు.

" తేజస్వినస్సుఖమసూనపిసంత్యజన్తి॥

సత్యవ్రతవ్యసని నోనపునః ప్రతిజ్ఞా॥

పరాక్రమవంతులు సుఖముగః బ్రాణములనైనవిడుతురు గానితమసత్య
ధర్మమును వదలరు. ఇట్టివారే హరిశ్చంద్ర రుక్మాంగదాదులు హరిశ్చంద్రుఁడు
విశ్వామిత్రునకుఁ దానిడిన ప్రతిజ్ఞనుగాపాడ నామునికి రాజ్యమిచ్చెను. దారసుతుల
దాస్యవృత్తికనిలిపెను చాండాలుని సేవకుఁ దన్నుఁదానమ్ముకొనెను. తుదకు దార
శిరము ఖండించుటకు ఉద్యుక్తుఁడయ్యెను. రుక్మాంగదుఁడు మోహినికిఁదానిడిన వా
గ్దానము రక్షింపఁదనసుతుని గొంతుఁగోయ సిద్ధుఁడాయెను. దశరథుఁడు కైకకు
నిచ్చినవచనము రక్షింప శ్రీరాములు సిద్ధపడినరాజ్యమునువదలి ఘోరాటవులు
చేరి కష్టపడెను. అర్జునుఁడు గయునకు నిచ్చిన యభయ ప్రధానమునుఁ గాపాడ
శ్రీకృష్ణునితో యుద్ధమొనర్చెను. ధర్మరాజు తనవచనము గాపాడికొనుటకు
నై ద్వాదశవర్షంబు లరణ్యవాసంబు నొకవత్సర మజ్ఞాతవాసంబొనర్చెను. సత్పు
రుషు లెల్లరుసత్యధర్మమునుగాపాడిరనుటకు దృష్టాంతములు సహస్రాధికముగ మన
పురాణములనుండి వెలియిడనగును. విశేషధర్మములు విశేషముగ శ్రీకృష్ణునిగాథల
నుండివచ్చినవి. మఱియొకయుదాహరణమిచ్చెద.అర్జునుఁడుతనచేతనుండుగాండివము
వేఱుక్రిందఁబడఁద్రోయుమని వచించునో వానితలను ద్రెంచెదనని శపథము చేసియుం
డెను. ధర్మరాజుయుద్ధమునఁ గొట్టంబడి యొడలి నొప్పులబాధపడుచుండ నర్జునుఁడు
వచ్చెను. ధర్మరాజర్జునుని దూషించి గాండివ మేలనికేలునను౦చి కొనినావు?
అదినిష్ప్రయోజనము దానినిఁ బాఱవేయుమని పలికెను. అర్జునుఁడు తనప్రతిజ్ఞ
చొప్పున ధర్మరాజుతల దీయుసమకట్టెను. కృష్ణుఁడడ్డపడి బుద్ధిచెప్పి ప్రతిజ్ఞ
రక్షించుటకునై ధర్మరాజును దూషింపుమనిపలికెను. కారణమేమన మాన్యవంతు
లకు నవమానమే మరణమనివాక్రుచ్చెను. ఈవిశేష ధర్మమనుసరించుటచే నర్జును

నను రెండు పాపములలోనం గూడెను. ప్రతిజ్ఞా భంగమొకటి అగ్రజాని ద్రూషించిన దోషమొకటి. ఇటుచేయకున్న ననేకానర్థములు గలుగుచుండెననుటసత్యము. ఇది ప్రాయశ్చిత్తార్హదోషము.

మూడవసామాన్య ధర్మమస్తేయము.

ఒకఁడు కష్టపడిన్యాయముగ నార్జించినధనము పరుఁడు చౌర్యముననో దౌర్జన్యముననో గొనిపోయినచో నెల్లరకును నష్టమగుననుటనిర్వివాదాంశము. ఇట్టిసామాన్యధర్మమునకు నైతమపవాదము సంఘటిల్లి విశేషధర్మములు పుట్టినవి. దేశమెల్లెడలక్షామము వ్యాపించి, క్రయమునకైనను, సేవకావృత్తికినైనను ధర్మమునకునైనను నన్నము దొరకక దేవులాడునట్టివిపత్తుసంభవించి నపుడు జనులేమి సేయవలెను? దొంగతనమొనరించి బ్రదుకవలెనుగదా? అటుదొంగలించు నపుడు యజమానుఁడు తనవస్తురక్షణమునకయి దొంగనెదిరింపవలెనా? వలదా? దీనిని నిర్ధరించుట కష్టము. ద్వాదశవర్షక్షామమున విశ్వామిత్రునంతటివాఁడు శ్వపచుని యింటఁ గుక్కకుఁబెట్టిన మాంసమును దొంగలించి దానితోఁజరుయుకరము నించుకొన యత్నింప శ్వపచుఁడు దానినిఁగని “ పంచపంచనఖాభక్ష్యాః ” యను మొదలగు ధర్మములు దెలిపెను. అభక్ష్యభక్షణము పాపమని యుపదేశించెను. విశ్వామిత్రుఁడామాటలునరకుసేయక

“ పిబన్త్యేవోదకంగావో మండూకేషురుదత్స్వపి॥
నతేధికారోధర్మేస్తి, మాభూరాత్మప్రశంసక॥

ఓ ఆత్మప్రశంసకుఁడా; ధర్మాధర్మముల నిర్ధరించువాఁడవు నీవు కావు. అఱవకు. కప్పలఱచుచున్నవని యావులు నీరుఁద్రావుటమానవు. నీవఱచెదవని నే నీ మాంసభక్షణము మానను, “ జీవితంమరణాత్ శ్రేయో, జీవన్ధర్మమవాప్నుయాత్.” బ్రదికియుండిన ధర్మములు సాధింపనగును గావున మరణమునకంటె బ్రదుకుట శ్రేయము. జీవంభద్రాణిపశ్యతి యనువచనమున్నది. కావున జీవమును గాపాడుటకు మాంసచౌర్యము దోషముకాదని విశేషధర్మమొకటి విశ్వామిత్రుఁడు స్థాపించెను. ఈవిశేషధర్మమెంతవరకు న్యాయసమ్మతమోమనకుఁగల పురాణేతిహాసములయాధారముపైన నిర్ధరింపఁదగినదిగనున్నది.

పరులకపకృతి యొనర్చియయినను బ్రదుకవలెనా? పదుష్టకృత్యమునకు

వచ్చుటయేలా? యనునది విమర్శనీయ ముగనున్నది. "పరోపకారార్థమిదంశరీరం" యనుధర్మమును బట్టి తమ శరీరత్యాగంబొనర్చినవారున్నవారు.

(a) వసిష్ఠుని ధేనువును సింహము పట్టినపుడు, దిలీపమహారాజు సింహమునుంజూచి పాంచభౌతికమగు శరీరమునకంటెను యశశ్శరీరమందుట శ్రేష్ఠతరమని యెంచి వసిష్ఠునిగోవునకుం జావుందప్పింపందనశరీరమివ్వం బోయెనని రఘువంశమునం బలుకంబడినది.

[b] గరుత్మంతుండు తనకుం బాములపైనంగల వైరమును సాధింప సర్పములనెల్ల భక్షించుసమయమున జీమూతవాహనుండను రాజు సర్పహింస సహింపనోపకవానికిమారుగం దనశరీరమునాగరుత్మంతునకు బలిగనిచ్చెనని నాగానందనాటకములోను కథాసరిత్సాగరమునను బలుకంబడినది.

[c] మృచ్ఛకటికయను నాటకములో చారుదత్తుండీరీతిగ దుఃఖించినాడు.

" నభీతో మరణాదస్మి కేవలందూషితంయశః॥

" విశుద్ధస్యహిమేమృత్యుః పుత్రజన్మసమఃకిల॥

నేనుమరణమునకు భీతిల్లువాండనుగాను. కీర్తికింగళంకము కలిగెనే యని దుఃఖించుచున్నాను. కీర్తిశుద్ధముగానుండినచో మరణమనునది నాకుంబుత్రోత్సముగనుండునని నేనెన్నదనని వ్రాకుచ్చినాడు.

[d] ఒకపావురమును భక్షింపందలంచి డేగపావురమును దఱుమనురాంగా నది శిబిచక్రవర్తి పాదములపైం బడెను. శిబిదానికినభయమిచ్చెను. డేగపావురము నిమ్మనిరాజునడిగెను. రాజునిరాకరించెను. నాకునర్హమగు నాహారమును దీసిన పాపమునకుంబోయెదవాయని డేగయడిగెను. రాజునకపుడు ధర్మసందేహము కలిగెను. పావురమిచ్చినచో దనకంటియెదుటనె జీవహింసయగుట యొకటియు గాకతానిడిన యభయదానమునకు భంగమునైతము కలుగును. పావురమిడనిచో డేగకున్నర్హ మగునాహారము దీసినపాపమొనంగూడును. ఈ ధర్మసందేహము మానసము బాధింపండేగకుండానే యాహారముగనిలిచినచో నన్నిసందేహములు నివర్తియగునని తలంచితనమాంసమును దిన్నుమని యప్పగించెను. పరోపకారము కైశరీరముత్సర్జింపంబూనెను.

[e] సూర్యుఁడు కర్ణునకిచ్చినకవచకుండలములను ఇంద్రుఁడుమాయా బ్రాహ్మణవేషంబున యాచించి హరించునను విషయమును సూర్యుడెఱింగి తన పుత్రునిపైదయఁబూని కర్ణునిజేరి పుత్రా ఇంద్రుఁడుమాయా బ్రాహ్మణుఁడయి నీకవచకుండలములను యాచించి పుచ్చుకొని నిన్ను దుర్బలునిఁ జేయుయత్నించినాఁడు. నీవువానినివ్వకుమని హితముపదేశించెను. ఆమాటలువిని కర్ణుఁడు, "నాయనా! చచ్చిన పిదప నీకవచకుండలములు నాయందు స్థిరముగనిలుచునా? నిలువవు. నిలుచునది కీర్తియొక్కటేను," అనిబదులిడెను. అపుడు సూర్యుడు "మృతస్య కీర్త్యాకింకార్యం" అనియడిగెను. చచ్చినవానికిఁ గీర్తితోనేమికార్యమున్నది? కర్ణుఁడామాటవిని "జీవితేనాపిమేరక్ష్యా, కీర్తిస్తద్విద్ధిమేమతం," జీవముబోయిననుసరే కీర్తినిఁగాపాడుకొనుటయె నామతమని కర్ణుఁడుబదులిడెను.

[f] ఇట్టిదియబలిచక్రవర్తివర్తనము.

[g] వృత్రుని బాధహెచ్చినపుడు, దేవతలందఱు దధీచినిఁ జేరి,

"శరీరత్యాగం లోకహితార్థంభవాన్ కర్తుమర్హతి" యని వేఁడఁగ నేదధీచి వజ్రాయుధమునకంటెను పరుషమగు తనవెన్నెముకనుగోసి దేవతలకిచ్చెను.

వైరితిగఁబరోపకారార్థముగను, యశమార్జించుటకును జీవము ద్యజించుమహానుభావులుండ, జీవము నిలుపుకొనుటకు శ్వపచునిమాంసచౌర్యమొనర్చుచున్నది యధర్మమని సాధించిన విశ్వామిత్రుని కార్యమతి సాహసము. పాశ్చాత్యుల నీతిధర్మము విశ్వామిత్రుని ధర్మమును బోలినదేను. ఘోరక్షామమున నన్నమే విధముగను దొరకనిచో నట్టివాఁడు దొంగతనముఁజేయఁదగును. అట్టివానిని క్షమింపవలెనని హాబ్స్యను నాంగ్లేయగ్రంథకారుఁడు వ్రాసినాడు. అట్టిఘోరక్షామమున దొంగతనమొనర్చుటైనను ప్రాణమును రక్షించికొనుట కర్తవ్యమని మిల్లువ్రాసినాఁడు.

పెద్దలపూజ మాతృ, పితృ, గురుపూజ సలుపుట సామాన్యధర్మమని సకలధర్మశాస్త్రపురాణేతిహాసములు పలుకుచున్నవి. గురువుల శుశ్రూషయొనరించి విద్యనేర్చి శిష్యుఁడు తనయింటికిఁ బోవునపుడు గురు వుపదేశించువాక్యము తెలివియన "సత్యంవద ధర్మంచర" యనిన్ని. "మాతృదేవోభవ పితృదేవోభవ

"ఆచార్యదేవోభవ" యీ వాక్యములుపదేశించును. వీరిలోనే గౌరవతారతమ్యములు గని పెట్టి మను వీరీతిఁబలికెను.

"ఉపాధ్యాయాన్దశాచార్యః ఆచార్యాణాం శతంపితా॥

"సహస్రంతుపితౄన్మాతా గౌరవేణాతిరిచ్యతే॥

పదుగురుపాధ్యాయులకంటె నాచార్యుఁడు హెచ్చు. నూరుగురాచార్యులకంటెను తండ్రిహెచ్చు. వెయ్యితండ్రులకంటెను తల్లి గౌరవమునందాధిక్య మని మనువు చెప్పెను.

విషయమిట్లుండినను తల్లిగౌరవమంతగ శాస్త్రములుగా పాడియుండి నను జమదగ్నియానతి రీతిని కొమారుఁడు పరశురాముఁడు తనతల్లి శిరమును ఛేదించెను. మరలబ్రదికించెను.

భారతశాంతి పర్వము 265 యధ్యాయములో చిరకారియను మేధావి తనతండ్రియాజ్ఞచొప్పున తల్లినిఁ జంపను బయలుదేరిపోయి దీర్ఘకాలమాలో చించి తండ్రిహెచ్చా తల్లిహెచ్చా యను ధర్మసూక్ష్మములవిమర్శించి తల్లి హెచ్చని నిర్ధరించెను. తల్లినిజంపఁడాయెను.

ఒకానొకసమయమున సుతుఁడు తండ్రిని దండింపఁదగిన సమయము తటస్థించును. అపుడెట్టుల వర్తింపవలసిన విషయములో నొకధర్మమేర్పడినది.

"పితాచార్యః సుహృన్మాతా, భార్యాపుత్రః పురోహితః ।

"నాదండ్యోనామరాజ్ఞోస్తి యఃస్వధర్మేనతిష్ఠతి ।

తలిదండ్రులు, నాచార్యులు, మిత్రుఁడు, దారపుత్రులు, పురోహితుఁడు ఎవరైనను ధర్మవ్యతిరిక్తముగ వర్తించినచో రాజువారిని దండింపనగునని యున్నది.

వృద్ధులను గౌరవింపవలెనని యొకధర్మమున్నది. జ్ఞానవృద్ధులా వయో వృద్ధులా పూజింపఁదగినవారని ప్రశ్నవచ్చినపుడు భారతాదిగ్రంథములున్ను మనుస్మృతియు నీరీతిగ నిర్ధరించినారు

"న తేన వృద్ధో భవతి, యేనాస్య పలితంశిరః॥"

"యోవైయువాప్యధీయానస్తం దేవాః స్థవిరంవిదుః"

తలవెంట్రుకలు తెల్లనైనంతమాత్రమున మనుజుఁడు వృద్ధుఁ కాఁడు. వసి వాఁడయినను నెవ్వఁడు జ్ఞానవంతుఁడో వానిని దే తలుసవా వృద్ధుఁగా భావింతురు.

గురుపూజ ధర్మము అయిన

« సమయత్యాగినోలుబ్ధా గురూనపిచ కేశవ

« నిహన్తిసమరేపాపాన్, క్షత్రియస్సహిధర్మవిత్.

మర్యాద, నీతులులేక యాచారముఁగాదని లోభియు పాపియు నగు మనుజుని, వాఁడుగురువుగనుండినను క్షత్రియుఁడు యుద్ధమునందు వానిని జంపనగును.

తైత్తరీయోపనిషత్తులో « ఆచార్యదేవోభవ " యనిపలికి వెంటనె మనకేకర్తలుబాగుగనుండునో వానిని మాత్రమవలంబింపవలెను, మిగతవివదల నగునని « యాన్యస్మాకం సుచరితాని, తానిత్వయోపాస్యాని, నోయితరాణి, " యనిపలుకంబడినది. కావునగురువులాచార్యులు పెద్దలునీతిగఁ బ్రవర్తించుచుండినచో వారిమార్గమనుసరింపుము కాదేని వారిమార్గమవలంబింపకుమని ధర్మమేర్పడినది.

పైనపలుకఁబడిన ధర్మములుగాక మనుజున కింద్రియనిగ్రహముండ వలెననుట సామాన్య ధర్మము.

ఇదినిజమగుధర్మము. ఇంద్రియనిగ్రహములేని మనుజులు కామక్రోధలోభాద్యరిషడ్వర్గములకుఁ జిక్కుదురు.

« త్రివిధంనరక స్యేదం, ద్వారంనాశనమాత్మనః

« కామక్రోధస్తథాలోభ స్తస్మాదేతత్రయంత్యజేత్.

కామక్రోధలోభములను వదలవలెనని విదురనీతి. ఈరీతి యే భగవద్గీతలోఁ బలుకబడినది. ధర్మవిరుద్ధమగుకామము వదలవలెనని యర్థము. దీని ననుసరించి యే మనువు

« పరిత్యజేదర్థ కామౌ, యాస్యాతాంధర్మ వర్జితౌ "

ధర్మమునకు విరుద్ధమైన యర్థకామములను విడువవలె ననుటయు సామాన్యధర్మము వీనివిషయములోను విశేషధర్మములనేకలుండునుగాని యవియు ధర్మవిరుద్ధములుగాక యుండవలెను.

నేను ప్రారంభమునఁ బలికిన సనాతనధర్మపంచకములోఁ గల సూక్ష్మ ధర్మముల నాల్గిటిని గుఱించి సూక్ష్మముగ నేఁ దెలిపితిని. ఇఁక నాచారమొక సనాతన ధర్మముగ నేర్పఱచినారు. సకలు రాయాచారనామమున వ్యవహరించు చున్నారు. అయిననొక దేశమునఁగల యాచారము వేఱొకదేశమున లేదు. ఒకకాలమునఁగల యాచారము వేఱొక కాలమున లేదు. ఏదిసదాచారము? ఏదిదురాచారము? ఆచారమునకు ననేకరూపములుగలవా? అదిస్థిరమైనది కాదా? ఒకరికినాచారముగ నుండునది వేఱొకరికి దురాచారముగ నగపడునుగాదా? సనాతనధర్మములని నేను ప్రారంభమునఁ బలికిన " అహింసా సత్యమస్తేయం శౌచమింద్రియనిగ్రహః " యను శౌచ శబ్దార్థము, శుచిత్వమునకు నన్వయించునా? గాక, మాచారమునకు నన్వయించునా? గాక రెంటికి నన్వయించునా? ఇవి రెండునుగాక సాంప్రదాయమున కన్వయించునా?

అన్నిటికిని సంబంధించునని యర్థముఁ జేసికొని వానిని గుఱించి వాదింతము.

" అన్యేకృతయుగేధర్మా స్త్రేతాయాం ద్వాపరేపరే॥

" అన్యేకలియుగేనౄణాం, యుగమానాను రూపతః॥

కృత, త్రేత, ద్వాపర, కలియుగములందు ధర్మములు యుగములరీతి మారుచున్నవియని మనువుపలికెను. ఇదేరీతి నిదేశ్లోక మే యించుక భేదము తో వ్యాసులు పలికినారు.

" మహాజనాహ్యా పావృత్తా రాజధర్మం సమాశ్రితాః॥

" నహిసర్వహితః కశ్చిదాచార స్సంప్రవర్తతే॥

" తేనైవాన్యః ప్రభవతి సోపరం బాధతేపునః॥

అందఱికి నెల్లప్పుడు నొకవిధమగు ధర్మముదొరుకుట దుర్లభము. ఒకరియాచారము మఱియొకరి యాచారమునకు విరుద్ధముగనుండును. రెంటి నివదలిన యాచారము మూఁడవ యాచారమునకు విరుద్ధముగ నుండును.

రాజులన్యమతమువారుగా నుండునందున వారియాచారము మనకు నుపయుక్తముకాదు.

ఈయాచార విషయమున నియమము లేకయున్నది. ఒకరు స్నాన
త్పూర్వముల కొలందినీటిలో వేయక, యుదుకక యుండిన ధావళికట్టుకొని భోజ
నము సేయుట యాచారమని యాచరించును. మఱియొకఁడు శుచిగనుతికి
బట్టకట్టుకొని భుజించుట యాచారమని తలంచును. ఈరీతిగనే ప్రతిమనుజుని
యాచారమున్ను భిన్నించుచుండును. కావుననిది సనాతన ధర్మవర్గమునఁ జేరి
నదికాదు. శౌచమనఁగా పరిశుభ్రతయని యొకటే యర్థమునినేనెన్నెద. దీనిక
యే యర్థమున్ను సరిపడదు. ప్రతిమనుజుఁడును దేహముశుభ్రముగ నుంచు
కొనవలె ననునది సనాతనధర్మము. కాయశుద్ధి వాక్శుద్ధి చిత్తశుద్ధిగల వారు
జ్ఞానమార్జింపఁదగిన వారని యిది యొకధర్మముగఁ బెద్దలేర్పఱచినారు. ఈధర్మ
మునకు విశేషధర్మ మెచటనుండదు.

మహాశయులారా:—

(1) అహింసయును ఆత్మరక్షణమునకున్ను

(2) సత్యమునకును సర్వభూత హితమునకున్ను

(3) దేహరక్షణకును యశమునకును

పరస్పర విరోధములు సంభవిల్లుకాలము తటస్థించునని లోకానుభ
వముఁగల మనమెఱుంగుదుము. అయినను జీవయాత్ర జరుపుమనము సామా
న్యధర్మములు వదలివిశేష ధర్మములనుసరించినపుడాపత్తిగౌణ పక్షమని
మనముఁదెలిసికొని త్రికరణ శుద్ధిగఁబశ్చాత్తప్తులయినఁ జాలును. విశేషధర్మమాచ
రింపఁ దగినది యవశ్యకవిధులని మాత్రము తెలియరాదు. ఆకస్మికముగఁ
గొన్ని విపత్తులు మనుజులకుఁ దటస్థించినపుడు యత్నములేక యాపద్ధర్మములు
విరుద్ధధర్మములయినను మన మనుసరించుట విధిగనుండును. దీనికిదృష్టాంత
ములనేకములున్నవి.

" సూక్ష్మాగతిర్హి ధర్మస్య " యనిధర్మ శాస్త్రములు రచించిన
వారేవలికినారు. ధర్మసూక్ష్మములు దెలియుట కష్టము.

సమస్తధర్మాధర్మములు తెలిసినపాండవు లొకస్త్రీని ద్రౌపదిని నెటు
పెండ్లియాడిరి? ఈధర్మసూక్ష్మమును నిర్ధరింపఁ జాలకదీనిని న్యాయీకరింప
దైవికములగు గాథలల్లిరి.

సమస్తనీతి ధర్మములెఱింగి లోకములెల్ల జయింపశక్తిగల భీష్మద్రోణులు సభామధ్యమున నుండియు ద్రౌపదివస్త్రముఁదీసి విగతవస్త్రనుఁజేయ యత్నించిన దుర్యోధనాదుల దుష్కృత్యము లోర్చిరేల? ధర్మాత్ములగు పాండవులపై యుద్ధమొనరించిరేల? సేవాశ్వవృత్తి రాఖ్యాతా? సేవావృత్తి కుక్కవృత్తియని వారికిఁ దెలియదా? ఈవిషయమున భీష్ముఁడు ధర్మరాజునకు నొకవిధముగ సమాధానము చెప్పెను.

" అర్థస్యపురుషోదాసః, దాసస్త్వర్థోన కస్యచిత్ " అర్థమునకుఁ బురుషుఁడు దాసుఁడు. అర్థమెవరికిని దాస్యముచేయదని పలికెను. అర్థమునకుఁగాను భీష్మునంతటిజ్ఞాని దుష్కర్మము లొనరింప లోఁబడియుండునా? అటులుండదు. మున్ను దాశరాజునకుఁదా నిచ్చిన వాగ్దానవిషయమునకునై ధృతరాష్ట్రుని రాజ్యము స్థిరపఱుప నటులొనరించి యుండును. ఇఁక ద్రౌపదీమానచ్యుతి ప్రయత్నమెటు లోర్చె ననెడియాక్షేపణకు సమాధానం బేమనిన భీష్ముఁడు దివ్యజ్ఞానము గలవాఁడు కావున యాపతివ్రతకుఁ గృష్ణసాహాయ్యముండిన కారణంబున మానచ్యుతి కాదని దృఢముగనమ్మి దుష్టదుర్యోధనాదులకు ముఖభంగము కావలయునని మిన్నకయుండియుండనగును. అయినను నిందువిశేష ధర్మసూక్ష్మ మొకటియున్నది. ఆసూక్ష్మ ధర్మమునే భీష్ములవలంబించి యుండురు. ధృతరాష్ట్రుఁడు రాజు అతఁడు గ్రుడ్డివాఁడయినందున దుర్యోధనుఁడు రాజుగనుండెను. భీష్ముఁ డెంతటివయోవృద్ధయినను జ్ఞానియైనను రాజశాసనమునకు లోఁబడినవాఁడుగ నుండెను. దుర్యోధనుఁడొనరించు కార్యమన్యాయమైనను దానిని వదలుమని సభలోఁ బలుకుటకు నిష్టపడఁడయ్యెనో హితము పదేశించినను దుర్యోధనుఁడు వినువాఁడు కాఁడని యూరకయుండెనో తెలియకయున్నది. భీష్ముఁడుపదేశించినను దుర్యోధనుఁ డాహితము వినఁడయ్యెనేని భీష్ముఁలకాగ్రహము వచ్చుచుండెను. ఆగ్రహము వచ్చినపుడు దుర్యోధనునకుఁ దిరుగ బాటొనరింపవలసిన యావశ్యకత గలుగుచుండెను. రాజునకుఁదిరుగు బాటొనరించునది ధర్మవిరుద్ధము. సకలురకును ధర్మాచరణములందు మార్గదర్శిగనుండు భీష్ముఁడే రాజధర్మవిరుద్ధమొనర్చెనేని నితరులు భీష్మునిమార్గమునే యవలంబించుచుండిరి. రాజ్యమపుడే యరాజకమగుచుండెను. ఈధర్మసూక్ష్మమును దెలిసియే కాఁబోలు, పాండవులొనరించునది ధర్మయుద్ధమనినిన్ని దుర్యోధనుఁ

డొనరించునది యధర్మయుద్ధమనిన్ని భీష్మునకుఁ దెలిసియుండినను దుర్యోధనుని పరమయి పాండవులపై యుద్ధమొనర్చెను. యోధుఁడు యుద్ధమున భృత్యధర్మ మవలంబింపవలెనుగాని, న్యాయాన్యాయ విమర్శనముఁ జేయనర్హుఁడు కాఁడు. ప్రతియొక యోధుఁడు న్యాయాన్యాయములు విచారించినచో యుద్ధమునకు దారియేగలుగదు. రాజశాసనమునిలుపదు. దేశముసుఖపడదు. ఎవనికివాఁడే న్యాయాధికారియగును. ధర్మముచెడును. ఇన్నిధర్మ సూక్ష్మములు భీష్ములుదెలిసవారుకావుననే యక్కాలమున ద్రౌపదిమానచ్యుతి ప్రయత్నమునకు నోర్చిరని తెలియవలెను.

# కర్మజిజ్ఞాస
## రెండవ ప్రకరణము.

కర్మజిజ్ఞాస—విషయానుక్రమణిక.

కర్తవ్యమూఢత్వముయొక్క యాంగ్లేయ భాషలోని రెండుదాహరణములు "మహాభారతమందలి యిందులమహాత్మ్యము" అహింసాధర్మము, దానియపవాదము "క్షమ. దానియపవాదము" మనశాస్త్రములందలి సత్యాన్కృతవివేకము "ఆంగ్లేయనీతిశాస్త్రమందలి వివేకమునున్నూ. వీటినన్నింటూంచిజూచుట" మనశాస్త్రకారుల అభిప్రాయ శ్రేష్ఠత్వము, మహాత్వము "ప్రతిజ్ఞాపాలనయున్నూ దానిమర్యాదయున్నూ" ఆస్తేయము. దానియపవాదము "చచ్చుటకంటె బ్రతికియుండుట శ్రేయస్కరము" యనుదీనియపవాదము "ఆత్మసంరక్షణ" మాత, పిత, గురువుమొదలైన పూజ్యపురుషులయొక్క కర్తవ్యము. దానియపవాదము "కామ, క్రోధ, లోభములనిగ్రహతారతమ్యము" ధైర్యాదిగుణములప్రసంగములు మరియు దేశకాలాదిమర్యాదయు ఆచారములతారతమ్యము "ధర్మాధర్మముల తారతమ్యము. గీతయొక్క అపూర్వత"

# కర్మజిజ్ఞాస
## రెండవప్రకరణము.

కింకర్మ కిమకర్మేతి కవయో ప్యత్రమోహితాః । ( గీ. 4-16 )

భగవద్గీతారంభమునం బరస్పరవిరుద్ధములగు రెండుధర్మములకత్తెరలో చిక్కియుండుటచే నర్జునునకు కర్తవ్యమూఢుడై యుండవలసివచ్చినయవస్థ యొంతమాత్రమున్ను అపూర్వమైనదిగాదు. సన్యాసము పూని, జగమునుద్యజించి అడవి చేరినవారియొక్కయు, చేతకానితనమున జగములోని యనేకాన్యాయములను నోరుమూసుకొని సహించునట్టి యశక్తులున్ను, నుదరంభరులును అగుజనులయొక్కయు విషయములు వేరు, అయితే సమాజమునందేయుండి,

యిట్టిగొప్పవారును కార్యముచేయతెగినవారును నగు పురుషులకు సంసారము లోని తమకర్తవ్య ధర్మముతోను నీతితోను వర్తింపవలసియుంటున్నదో అట్టివారికి యిట్టిసందర్భములు అనేకవేళలయందు ఘటించుచుండును. అర్జునునకు కర్తవ్య జిజ్ఞాసయున్నూ మోహమున్నూ యుద్ధారంభమున గలిగినను, అట్టిమోహ మేముందు యుద్ధమందు జచ్చినయనేకాప్తుల శ్రాద్ధములు చేయుకాలము ప్రాప్తిల్లి నప్పుడు యుధిష్ఠిరునకును గలిగినందువల్ల దాని నుపశమించుటకై ( శాంతిచేయుట కై ) " శాంతిపర్వము " చెప్పబడినది. అనేకవేళలయందు కర్మాకర్మసంశయము యొక్క యిట్టిసందర్భముల వెదికి తీసియో లేకకల్పించియో వాటిపైన గొప్పగొప్ప కవులు సురసకావ్యములను నుత్తమనాటకములను రచియించియున్నారు. ఇందు లకుదాహరణముగా ప్రసిద్ధఆంగ్లేయనాటకకారుడగు షేక్స్పియర్ యొక్క " హ్యామలెట్ " అనునాటకముం జూడుడి. డెన్మార్కు దేశపుప్రాచీనరాజపు త్రుడగు హ్యామలెట్ యొక్క పినతండ్రి రాజ్యమేలుచుండిన తనఅన్నను " అన గా హ్యామలెట్ యొక్క తండ్రిని " జంపి, హ్యామలెట్ యొక్కతల్లిని పెం డ్లియాడి, రాజ్యమును అపహరించి యుండెను. అట్టిసమయమున యిటువంటి పాపి యైన పినతండ్రిని జంపి పితృఋణమునుండి పుత్రధర్మానుసారముగ ముక్తుడగుటయు నా, లేదా, కేవలము పినతండ్రియు, మారుతండ్రియు, రాజ్యమేలుచుండినవాడునగు నతని సేవచేయవలయునా, అనునిట్టిమోహమందు జిక్కినవాడు మునసిక్కుపడు చిన్ని హ్యామలెట్ యొక్క స్థితి యేమైననిన్ని శ్రీకృష్ణునివంటి యోగ్యమార్గదర్శకుడైన స్నేహితుడెవ్వడును నుండనందున పిచ్చిపట్టి తునకు "మనుదునా "లేక" చత్తునా" యనుయోచనయందు మునిగినఅప్పుమిరువి గతియేమైనదని, యను దీనిచిత్ర ము యీనాటకమునందు నుత్కృష్టరీతిగా వర్ణించబెట్టియున్నాడు. " కిరా యలేనస్ " అనుయింకొక నాటకమందునహా యిటువంటి దేయగుయింకొక సం దర్భమును షేక్స్పియరు వర్ణించియున్నాడు. కిరాయలేనాసయను శూరుడొక డు రోమన్అధికారిని రోమ్పట్టణపుజనులు పురిపైట వేసినందుకు ఆరోమక్ ప్రజలశత్రువులయొద్దకు బోయివారితో జేరుకొనెను. చేరివారికి " మీకునేనెప్ప డును చెడుగు చేయువాడనుగానని " వాగ్దానమిచ్చెను. తర్వాతకొంతకాలమున డు నీ శత్రువులసహాయముచె రోమన్ ప్రజపైదండెత్తిపోయి దేశమును జయించుచున్నా జయించుచూ తుదకు స్వతః రోముపట్టణపు వాకిటియెదట తన

సైన్యముతో విహారము చేయవలసివచ్చెను. అప్పుడురోంనగరపుస్త్రీలు కొరి యలోనసు యొక్క భార్యను తల్లిని ముందుంచుకొని మాతృభూమివిషయము లో యతనికర్తవ్య మేమైనదిన్ని యతనికియుపదేశించుటయేగాక రోమక్ప్రజల శత్రువుల కితడిచ్చిన వాగ్దానమును నిరాకరించుట కతనిని ప్రోత్సాహపెట్టిరి. కర్తవ్యాకర్తవ్యముయొక్క మోహమునందు జిక్కినవారియొక్క యిటువంటి యితరోదాహరణములు అనేకములు ప్రపంచమందలి ప్రాచీనాధునికేతి హాసములయందున్నవి. అయితే మన మింతదూరము యోచింప గారణములేదు. మనమహాభారతగ్రంథమే యిటువంటి సందర్భపుయొకకథ యని మన మనినా యనవచ్చును. గ్రంథారంభమందు [ఆ.2] భారతముయొక్క వర్ణన చేయుటలో వ్యాసుడు " సూక్ష్మార్థన్యాయయుక్తం " అనేకసమయాన్వితం " యనియీ రీతిగా దానికి విశేషణముల నిచ్చి " దానియందు సంపూర్ణముగా ధర్మశా స్త్రము అర్థశాస్త్రము మోక్షశాస్త్రము చెప్పబడినవనునంతమాత్రము చెప్పు టయేగాక దానినియీసందర్భమున " యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్ " [ ఆ 62. 53] " దీనియందున్నది అదేయితర స్థలములయం దున్నది. యిందులోలేనియది వేరెంకెక్కడనులేదు, అనికూడా దానిమహాత్మ్య మును బొగడియున్నాడు. ఎచ్చుతక్కువగా సంసారములోని యనేకకష్టముల సందర్భమున గొప్పగొప్పప్రాచీనపురుషు లేరీతిగా వర్తించిరి అనుదానిని సులభ మైనశైలితో సామాన్యజనులకు బోధించుట కొరకే మహాభారతము పుట్టి నది. పట్టుమీద పట్టిభారతీయయుద్ధమునుగాని " జయ " నామకయితి హాసమును గానిమాత్రము వర్ణించుటకు పదునెనిమిది పర్వములు చెప్పుట కే లాటియవసర ముండలేదు.

శ్రీకృష్ణార్జునులవిషయమట్లుండని; మీకు మాపు నింతటిలో త్రైన సీర్ణ లోమునగుట కేమవశ్యకమున్నది? మన్వాదిస్మృతికారులు తమతమగ్రంథములలో మానవులు సంసారమందేరీతిగా వర్తింపవలెనను విషయములో స్పష్టనియమ ముల యేర్పాటు చేసియుండుటలేదా? ఎవ్వానినైనను హింసపెట్టుట [illegible] గా జంపుటయోగాని చేయకుడి, నీతితోవర్తింపుడి, నిజము బలుకుడి, పెద్దలను గురువు లను సన్మానింపుడి. దొంగతనము, వ్యభిచారము చేయకుడి, [illegible]

ధర్మములనుండి అందరికిని ఏర్పాటు చేసియిచ్చిన మర్యాదను మీరు రక్షించుకొన్నచో మీకు యీకలతయందుఁ జిక్కుటకేమి కారణముండును? అని కొందఱడిగెదరు. అయితే దానికి వ్యతిరేకముగా, జగమందు చెడ్డవారెంతవరకు యీసద్వర్తనతో వర్తింపక యుంటున్నారో అంతవరకు, యీ దుర్మార్గుల కిచ్చనుండి తమ సద్వర్తనలచే సజ్జనులు మన్నులను దప్పింపవలెనా, లేదా వాటి ప్రతీకారార్థము యెవనంతకు వాడేయయి తనరక్షణ జేసుకోవలెనా? యిదిగాక యీసామాన్యనియమమొకవేళ, నిత్యమనియు, ప్రమాణమనియు దలంచినప్పటికిన్ని కార్యము చేయు (కర్తృ) పురుషులకు అనేకవేళలయందు యిట్టిసందర్భములు ఘటించుచున్న అట్టి సందర్భములయందు యీ సామాన్యనియమములలో రెండు లేదా వాటికంటె నెక్కువనియమములు యేకసమయావచ్ఛేదమును బట్టి ప్రాప్తమగుచున్నవి; తరువాత "యిది చేతునా లేక అది చేతునా" అనునిట్టి చింతయందు మునిగిన మనుజుడు పిచ్చివాడవుచున్నాడు. అర్జునునకు గలిగిన సందర్భమిట్టిదే; అయితే అర్జునునకేగాక యితర మహాపురుషులకు సహా యిట్టి ఆపద లేరీతిగా ప్రాప్తమౌచున్నవను విషయముయొక్క మార్మికవివేచనము మహాభారత మందనేకచోట్లఁ జేయబడినది. ఉపహారణార్థము, మనువు "అహింసా (మను 10-68) సత్యమస్తేయం శౌచమింద్రియనిగ్రహః" [మను 10-686] అహింస, సత్యము, అస్తేయము, కాయవాచామనస్సులశుద్ధత, యింద్రియనిగ్రహము యివన్నియు అన్నివర్ణములకు సమానధర్మములని చెప్పిన అయిదు సనాతననీతిధర్మములలో, అహింసయొక్క విషయము చూతుము. "అహింసాపరమోధర్మః" [మహాభా. ఆ. 11-13] యను నీతితత్వము వైదికధర్మమందేగాదు, యితరసమస్తధర్మములయందు సహా ముఖ్యమైనదిగా గణించియున్నారు. బౌద్ధమతస్థులయొక్కయు క్రీస్తుమతస్థులయొక్కయు ధర్మగ్రంథములయందుఁ జెప్పబడియుండు యాజ్ఞలలో, ఉత్తజీవము తీయుటయేగాదు, యితరప్రాణుల మనమునుగాని, శరీరమునుగాని బాధపెట్టుట సరిగాదని సహా చెప్పబడినది. పితృవధ, మాతృవధ, మనుష్యవధ యీ హింసలే ఘోరమని యెన్నుటయేగాక ప్రపంచమందలి సర్వమతస్థులు అహింసాధర్మము అన్ని ధర్మములకంటే శ్రేష్ఠమని యొప్పియున్నారు. అయితే యీ సందర్భము యోచింపుడి, ఒకవేళ తన్నుఁ జంపుటకో, లేదా తనభార్యను లేక బిడ్డను బలాత్కరించుటకో, లేదా తనయింటికి అగ్గిపెట్టుటకో లేదా తనసర్వైశ్వర్యమున్ను స్థిరస్థావరములనున్ను హరిం

మాటకో దుష్టమనుజుఁడొకఁడు శస్త్రపాణియై సిద్ధముగవచ్చినచో, దగ్గర తన్ను రక్షిం-
చువా డితరు డెవ్వడులేక పోయినయెడ, యిట్టి "ఆతతాయి" యగు మనుజుని తా-
ను "అహింసాపరమోధర్మః" అని కన్నుగొట్టి యుపేక్షించవలెనా, లేదా యా
దుష్టుని వాడు మంచి మాటలు వినకయుండనిచో యథాశక్తి శిక్షింపవలెనా? మ-
నువు చెప్పినప్రకారము.

గురుంవా బాలవృద్ధౌవా బ్రాహ్మణంవా బహుశ్రుతం।
ఆతతాయిన మాయాన్తం హన్యాదేవావిచారయన్॥

"యిట్టి ఆతతాయి అనగా దుష్టమనుజుని, వాడు గురువు లేదా వృద్ధు-
డు లేదా బాలుడు, లేదా విద్వాన్ బ్రాహ్మణుడు అనియిట్టి సందర్భమును యెన్నక
అవశ్యము చంపవలయును." యేలమనగా యిట్టి సమయమునఁ జంపుటయొక్క
దోషము చంపువారికి నంటక, ఆతతాయి తన అధర్మమువల్లనే చంపఁబడుచున్నాడని
యీరీతిగా శాస్త్రకర్తలు వక్కాణించుచున్నారు. (మను. 8-350) మనువుమాత్ర-
మేగాదు, యిప్పటి ఫౌజుదారీ (పీనల్) చట్టములలో సహా ఆత్మసంరక్షణయొక్క
యీహక్కును కొంతమట్టుకు మర్యాదయుంచి యొప్పియున్నారు. ఇట్టి సందర్భ-
మున అహింసకంటె ఆత్మసంరక్షణముయొక్క యోగ్యత యెక్కువగా యెంచు-
చున్నారు. భ్రూణహత్య యనగా పసిబాలుని జంపుట అన్నిటికంటె చెడ్డదని యెన్న-
బడినది. అయితే ప్రసవకాలమందు అడ్డమువచ్చినచో కోసి తీయవలయునా లేదా?
యజ్ఞములోని పశువధ వేదములయందే ప్రశస్తముగా యొప్పఁబడియున్నది. [మను
5 31] అయితే పిష్టపశువునుజేసి, దానిని సహా కొన్ని వేళలయందే చంపవచ్చునని సహా
చెప్పబడినది. [ మహాభా. శా 0-337; అను 115-56 ] ఆయినను గాలియందు, నీటి-
యందు, ఫలమునందు, మరియు నిత్యాని అన్ని చోట్లను నిండియుండు లెక్కలేని
యత్యల్పజీవముల హత్య యేరీతిగ నాపనగును? మహాభారతమందు [ శాం15-26 ]
అర్జునుడు చెప్పుచున్నాడుగదా.

సూక్ష్మయోనీని భూతాని తర్కగమ్యాని కానిచిత్।
పక్ష్మణోపి నిపాతేన యేషాంస్యాత్ స్కన్ధపర్యయః॥

"కంటికిఁగనబడకయుండినా తర్కముచే యే జంతువుల అస్తిత్వము
తెలియనగునో అట్టి సూక్ష్మజంతువులు జగములో నెంతవరకు నిండియున్నవన్న

తాను తనకంటె పాపము జూడించిన మాత్రాన వీటి శాస్త్ర చేతులు పెరుగుచు తున్నవి! '' యిట్లుండిన్ని, హింసఁజేయకుడి, హింసఁజేయకుడి, యని నోటితోఁ జెప్పుటవల్ల నేమి ప్రయోజనము? యిదేసాంసారమును చక్కఁగఁ బరిశీలించి మృగయ అనగా వేట అనుశాసనికపర్వమందు ( అను 116 ) సమర్థింపఁబడినది. వనపర్వమం దొకకథ చెప్పఁబడిన దదేదన క్రోధమున యొక పతివ్రతాస్త్రీని భస్మము చేయుటకుద్యుక్తుఁడైన యొక బ్రాహ్మణుని ప్రయత్నము యెప్పుడు సఫలము గాకపోయెనో అప్పు డతఁడా స్త్రీని శరణుజొచ్చెను; తరువాత ధర్మము యొక్క నిజమైన రహస్యమును తెలుసుకొనుటకు ఆస్త్రీ ఆ బ్రాహ్మణుని నొక వ్యాధునియొద్దకుఁ బంపెను. ఆవ్యాధుడు మాంసము విక్రయించువాఁడుగా, పరమమాతాపితృభక్తుడుగ నుండెను. వ్యాధుని యిట్టి యవస్థనుచూచి బ్రాహ్మణున కత్యంత విస్మయమున్ను ఖేదమున్ను గలిగెను. అప్పుడు వ్యాధుడు అహింసయొక్క నిజతత్వ మతనికిఁజెప్పి అతని సంశయముదీర్చెను ప్రపంచమునందెవ్వడు యెవ్వానిని తినకయున్నాడు? " జీవోజీవస్య జీవనం '' ( భాగ 1-13.46 ) అను వ్యవహార మెల్లప్పుడు జరుగుచుండును. ఆపత్కాలమందైతేనూ " ప్రాణస్యాన్నమిదంసర్వం '' యని స్మృతి కారులేగాక ( మను 5.28; మభా, శాం 15.21 ) యుపనిషత్తులు కూడా స్పష్టముగాఁ జెప్పియున్నవి ( వేసూ 3-4.28 ఛాం 5.2-1; బృ 6.1-14 ) అందరు హింస విడిచిపెట్టినచో తరువాత క్షత్రియధర్మమెట్లు నిలుచును! క్షత్రియధర్మము పోయినచో ప్రజలకు త్రాతలేక, యిష్టమువచ్చినవారు యిష్టమువచ్చినవారిని తినునంతటిసందర్భము గలుగును. సారాంశమేమన, నీతియొక్క సాధారణ నియమములతో నెల్లప్పుడు పనులు జరుగకుండుటచే, నీతిశాస్త్రములలోని ముఖ్యముగా అహింసయొక్క నియమములో సహా కర్తవ్యాకర్తవ్యముయొక్క తారతమ్యవిమర్శము చేయక తప్పదు.

అంహింసాధర్మము ననుసరించియే, క్షమ, శాంతి, దయ, యను గుణముల శాస్త్రమందుఁ జెప్పియున్నారు. అయితే అన్ని వేళలయందు యీ శాంతి పూని వర్తించు టెట్లు! యెల్లప్పుడు శాంతుడుగా నుండుమనుష్యుని భార్యాపుత్రులేగాక యితరజనులు సహా బహిరంగముగా పరిహసింపక మానరు. అనునిట్టి కారణమును మొదటఁజూపి ముందు మహాభారతములో ప్రహ్లాదుడు తన మనుమని యనగా బలినిజూచి యిట్లు చెప్పుచున్నాడు:—

న శ్రేయః సతతం తేజో న నిత్యం శ్రేయసీ క్షమా।
తస్మాన్నిత్యం క్షమా తాత పండితైరపవాదితా ॥

"సదా క్షమతోను సదా తేజస్సుతోను వర్తించుట శ్రేయస్కరము గాదు. ఇందువల్లనె తండ్రీ! జ్ఞానులు క్షమకు యపవాదము చెప్పియున్నారు." (వన 28 6.8) తరువాత క్షమకు యోగ్యమైన కొన్ని సందర్భముల ప్రస్తావము వచించియున్నాడు. అయితే యీ సందర్భముల నెట్లు గుర్తింపవలయునను తత్వము ప్రస్తావము వచియింపడు. అయితె సంధర్భమును గుర్తింపకనె యెవ్వరైతె యీ యపవాదమును యుపయోగింతురో వారు దుర్వర్తనులౌదురు. కావుననే యీ సంధర్భ మెట్లు గుర్తింపవలయునో దాని తత్వమెరుగుట మిగుల శ్రేష్టతరమయినది. ప్రపంచములోని యన్ని దేశములయందును, యన్ని ధర్మముల యందును ఆ బాల వృద్ధ స్త్రీ పురుషుల కన్నిటికంటెను శ్రేష్టమైనదియు ప్రమాణ భూతమైనదియు నగు నొక తత్వము "సత్య" ముగానుంటున్నది. సత్యము యొక్క గొప్పతనము నెంతని వర్ణింపగలము? సృష్టియంతయు నుత్పన్నమౌటకు ముందు "ఋతం" లేక "సత్యం" ఉత్పన్నమైయుండె యీ సత్యమువల్లనే యాకాశము, పృథ్వి, వాయువు యిత్యాది పంచమహాభూతములు ప్రపంచమందు వ్యాపించి చుట్టుకొని యాంటున్నవని వేదములయందు సత్యముయొక్క మహిమ వర్ణింపబడియున్నది. "ఋతంచ సత్యం చాభీద్ధాత్తపసోధ్య జాయత (ఋ 10.190,) సత్యేనోత్తభితా భూమిః (ఋ 10.85.1) అను యిత్యాది మంత్రములు జూడుడి. "సత్య" యను శబ్దముయొక్క ధాత్వర్థము "ఉండునది" అనగా "యెప్పటికైనను లేకుండునట్టుగానిది" లేదా "త్రికాలము బాధలేక యుండునది" యన్నియున్నది, కావుననే "సత్యముకంటె శ్రేష్టమైన వేరొండు ధర్మము లేదు; సత్యమే పరబ్రహ్మ" యని సత్యముయొక్క యథార్థ మహాత్వమును వర్ణించియున్నారు. "నాస్తి సత్యాత్పరో ధర్మః" (శాం 162.24) అను వచనము మహాభారత మందనేకచోట్లఁ జెప్పబడియుండుటయేగాక యీరీతిగా నహా చెప్పబడియుంటున్నది.

అశ్వమేధ సహస్రంచ సత్యంచ తులయా ధృతం।
అశ్వమేధసహస్రాద్ధి సత్యమేవ విశిష్యతే ॥

"వెయ్యి అశ్వమేధములనున్నూ సత్యమునున్నూ త్రాసులో

తూఁచి చూచినయెడల సత్యమే యెక్కువ తూఁగుచున్నది!" ( ఆ 74.102 ) సామాన్య సత్యసంబంధవర్ణన యింతమట్టుకాయెను. సత్యముఁ బలుకువిషయములో మనువు ( 4.256 ) యింకను యెక్కువగా యీరీతిగాఁ జెప్పుచున్నాడు.

వాచ్యర్థా నియతాః సర్వేవాంగ్మూలావాగ్వినిస్సృతాః।
తాం తుయః స్తేనయే ద్వాచం స సర్వస్తేయకృన్నరః॥

"మనుష్యమాత్రుల సర్వవ్యవహారములు వాక్కువల్లనే జరిపియుంటున్నారు. వారివారి యభిప్రాయము లితరులకు దెలుపుటకు శబ్దములవంటి యితర సాధన మెద్దియుఁలేదు. ఈ సమస్త వ్యవహారములకు ఆశ్రయీభూతమగు యీ వాణియొక్క యీలప్రవాహము నెవడైతే గనిపెట్టుచున్నాడో అనగా వాణిని యెవ్వడు సాధించుచున్నాడో ఆ మనుష్యుడు సమస్త మైశ్వర్యము నొకటేసారి దొంగలించువాడుగా నుంటున్నాడు, కావుననే "సత్యపూతాం వదేద్వాచం" ( మను 6.46 ) యేదైనా చెప్పవలసియుండినచో సత్యముతో పవిత్రమైనదానినే చెప్పుచుండుము, యని మనువు చెప్పియున్నాడు. ఉపనిషత్తులయందు గూడా "సత్యంవద। ధర్మంచర" ( తై 1-11-1 ) అని యితరధర్మములకంటే సత్యమునకే ముఖ్యస్థానమును నిచ్చియుంటున్నారు. శరపంజరముపై పరుండియుండిన భీష్ముడు శాంత్యనుశాసనిక పర్వములయందు యుధిష్టరునకు సర్వధర్మముల నుపదేశించిన పిదప ప్రాణము విడుచుటకుముందు "సత్యేషు యతితవ్యం వః సత్యంహిపరమంబలం" యని సకలధర్మములకు సారభూతమైనది గావున, నందరును తుదకు సత్యముక్కదానినె గాపాడునట్లుగాఁ జెప్పియున్నాడు. ( మా. శా. అను 167.50 ) బౌద్ధ, క్రైస్తు ధర్మములయందు సహ యీదేనియమముయొక్క అనువాదముఁ జేసియున్నారనుట తెల్లముగనున్నది.

ఈ రీతిగా సర్వత్రపరి శుద్ధమైనదియు, చిరకాలము దృఢముగ నిలుచునదియునగు సత్యమునకు యేమైనను యపవాదములు యుండవచ్చునని యెవరికైనను స్వప్నమందైన వాటిల్లునా? అయితే దుష్టజనావృతమైన యీజగములోని వ్యవహారము కొనను చూచి-పుడు! ఎవ్వరో కొందరు మనుష్యులు చోరులనుండి తప్పించుకొని మీరు చూస్తుండగనే వనమునందు డాగియుండ తరువాత కరవా [illegible] నిన. [illegible] [illegible] [illegible] [illegible] జేసియున్నారని

యడిగినచో మీరేము త్తరమిచ్చెదరు? నిజముపలికెదరా, లేదా నిరపరాధులగు ఆ ప్రాణులజీవము రక్షించెదరా! ఏలయన నిరపరాధుల ప్రాణహింస నాపుట యనునది సత్యమంతటి శ్రేష్ఠధర్మముగ నుంటున్నది. మనువుచెప్పుచున్నాడుగదా, "నాపృష్టః కస్యచిద్బ్రూయాన్న చాన్యాయేనపృచ్ఛతః". (మను 2-110; మహా. భా. శాం. 288 34) అడగనిదె యెవ్వరితోను మాట్లాడకూడదు; అన్యాయముగా వకవేళ యెవ్వరైనా ప్రశ్న చేస్తూయుండిన యెడల అడిగినతనువారికి కూడా బదులుచెప్ప కూడదు; తెలిసియుండినను పిచ్చివానివలె హూం హూం యని కాలహరణము చేయవలయును, "జానన్నపి హి మేధావీ జడవల్లోక ఆచరేత్" యని టీక అయితే హూం హూం యని చెప్పుట పర్యాయముగా యబద్ధముః చెప్పుట యేగదా? "నవ్యాజేన చరేద్ధర్మం" ధర్మమును విడిచిపెట్టి మనస్సునకుఁ తోఁచినట్టు వర్తించకు ధర్మము మోసపోదు; మీరుమాత్రము మోసపోదురు, యని భారతమునందనేక చోట్లఁ చెప్పబడియున్నది. (మహా. భా. 215.34) అయితే హూం హూం యని చెప్పి కాలయాపనచేయునట్టి సంధర్భములేకపోతె నేమిచేయవలయు? దొంగ చేతి యందు కత్తిబట్టుకొని యెదపైఁ గూర్చుండి ద్రవ్యమెక్కడయున్నదని అడుగు చున్నాడు. బదులు చెప్పకపోతె ప్రాణముబోతున్నది. అట్టి సందర్భము ఘటించినచో నేమిచేయవలయు? సకలధర్మముల రహస్యము నెఱిగిన శ్రీ కృష్ణభగవానులు పై చెప్పినచోరుని విషయ ముదాహరణముగ చెప్పి కర్ణపర్వమునందర్జునునకున్ను (క, 61.69) తరువాత శాంతిపర్వమందు సత్యానృతాధ్యాయమందు (శాం 109.15-16) భీష్ముడు యుధిష్టరునకున్ను, యీ రీతిగాఁ చెప్పుచున్నారు.

అకూజనే నచేన్మోక్షో నావకూజేత్కథంచన ।
అవశ్యంకూజితవ్యేవా శంకేరన్వాప్యకూజనాత్ ।
శ్రేయస్తత్రానృతం వక్తుం సత్యాదితి విచారితం ॥

"మాట్లాడకుండినచో మోక్షములేక విడుదల గలుగునట్టున్న" యేమైనా నసరే మాట్లాడవద్దు; అయితే మాట్లాడుట అవశ్యకముగా యుండినచో లేదా మాట్లాడకయుండుటవల్ల (యితరులకు) సంకటమువాటిల్లు సందర్భము సంభవించినచో యట్టి సమయమున నిజముకంటే యబద్ధముబలుకుట యధికప్రశస్తము.

అని యోచింపగా నిర్ధారమయినది! '' ఏలయన, సత్యధర్మము కేవల శబ్దోచ్చారణ కుగాను మాత్రము బుట్టినదిగాదు. గావున నేరీతిగ వర్తించుటవల్ల నందరికిని మేలు గలుగునో యా వర్తన కేవల శబ్దోచ్చారణకు నిజముగానిదిగ నుంటున్నదనే కారణముమాత్రమే త్యజింపవలసినదిగా నెన్న గూడదు. దేనివల్ల అందరికిని నష్టము గలుగుచున్నదో యది సత్యమున్ను గాదు, అహింసయున్ను గాదు.

సత్యస్య వచనం శ్రేయః సత్యాదపి హితం వదేత్ ॥
యద్భూతహితమత్యన్తం ఏతత్సత్యం మతం మమ ॥

" సత్యము బలుకుట ప్రశస్తమైనది; అయితే సత్యముకంటె సర్వభూతములకు దేనియందిష్టముంటున్నదో దానిని బలుకవలయు. ఏలయన సర్వభూతములకు దేనియందత్యంతహితమో అదే నామత ప్రకారము నిజమైన సత్యముగాయుంటున్నది. ఈరీతిగా శాంతిపర్వమునందు [శాం. 329. 13, 287. 19] సనత్కుమారుని యాధారమువల్లనే నారదుడు శుకునకుఁ జెప్పియున్నాడు. " యద్భూతహితం'' యను నీపదమునుజూచి ఆధునిక ఆంగ్లేయ భాషోపయుక్తతను వాడించువారు జ్ఞప్తికివచ్చుటచే కొందరికి యీ వచనము ప్రక్షిప్తముగా దోఁచునేమో యని యిట్లు వచించుచున్నాను. ఈ వచనము మహాభారతమందు వనపర్వములో బ్రాహ్మణవ్యాధ సంవాదమందు రెండుమూడు తడవలు చెప్పబడియుంది దానిలో నొకచోట " అహింసాసత్యవచనం సర్వభూతహితంపరం ' (వన. 206. 73.) మరియింకొకచోట " యద్భూత హితమత్యంతం తత్సత్యమితి ధారణా '' (వన 208, 4 ) యిట్లుసహా కొంత పాఠభేదము జేసి యున్నారు, సత్యప్రతిజ్ఞుడగు యుధిష్టిరుడు ద్రోణునకు " నరో వా కుంజరో వా '' యని యుత్తరమిచ్చి వ్యామోహపడినందుకు వేరే యేకారణము లేమింజేసి తత్సదృశ్యేతర సంధర్భములయందు సహా యిదే న్యాయమన్వయించు చున్నది. ఖూని (నరహత్య) కేసుమనుజుని ప్రాణమును యబద్ధము పలికి రక్షింపవలయునని మనశాస్త్రములు చెప్పవు. ఏలయన శాస్త్రములయందే ఖూనిచేసిన మనుష్యునకు దేహాంత ప్రాయశ్చిత్తము లేక వధదండనను విధించి యుండుటచే అట్టి మనుష్యుడు వధ్యుడౌచున్నాడు. ఈ లేక యిట్టి యితర సందర్భములయందు యబద్ధపు సాక్ష్యము చెప్పు మనుజుని యొక్క యేడు లేక యింక నెక్కువ తలలపూర్వీకులున్ను వాడు స్వతహాగానున్ను నరకమున్ను జేరుచున్నారని యీరీతిగా సమస్త శాస్త్రకారులున్ను జెప్పియుంటున్నారు

(మను 8. 89—99) (మహా. ఆ 7. 3) అయితే కర్ణపర్వములోనిదగు [illegible]
చెప్పిన దోవనొట్టు దొంగయొక్క విషయమువలె మనమునిజము బల్కిన యెడల
నిష్కారణముగా నిరపరాధులగు జనులప్రాణములు పోవునట్టిసందర్భము ఘటించి
నచో యేమిజేయగలము? గ్రీన్ అను పేరుగల యొక ఆంగ్లేయగ్రంథకారుడు తన
" నీతిశాస్త్రములకు నుపోద్ఘాతము " యను పేరుగల గ్రంథమందు యిట్టిసంధర్భ
ములయందు నీతిశాస్త్రములు యేమియుం జెప్పక యుంటున్నవని వ్రాసియుంటున్నా
డు. మను యాజ్ఞవల్కులు యిట్టిసంధర్భములను సత్యాపవాదమందు లెక్కపెట్టు
చున్నారు; నిజమే; అయితే అటుజేయుటనహా వారి యభిప్రాయరీత్యాసాధారణము
గా గౌణముగనే నుండుటచే వారు "తత్పావనాయ నిర్వాప్యశ్చరుః సారస్వతోద్వి
జైః" యనుటకు యీరీతిగా వానికిప్రాయశ్చిత్తము చెప్పియున్నారు. (యాజ్ఞ. 2. 88;
మను (8—104—106.)

అహింస యొక్క యపవాదము యెవ్వరికి యాశ్చర్యముగా గనబడదో
యట్టిగొందరు గొప్ప ఆంగ్లేయులుసత్యము యొక్క విషయములో మనశాస్త్రకారు
లకు దోషమారోపింప యత్నించి యున్నారు; కావున ప్రమాణభూతములయిన
క్రైస్తుధర్మోపదేశకులు మరియు నీతిశాస్త్రసంబంధములగు ఆంగ్లేయగ్రంథకారులు
యీ విషయమున నేమి చెప్పుచున్నారనునది యిక్కడ చెప్పుచున్నాను. "నేను
యబద్ధము చెప్పుటవల్ల ప్రభుపు యొక్క సత్యపుమహిమ యొకవేళ యభివృద్ధి బెందిన
చో (అనగా క్రీస్తుధర్మము యొక్కవ్యాప్తి అధికమైనచో దానివల్ల నేను పాపియని
యెట్లునిర్ధమగును? " (రోమ 3. 7.) అని క్రైస్తుశిష్యుడగు పాల్ వచించిన నీతి
బయిబిల్ యొక్క కొత్తకరారుయందు వ్రాయబడియుండి, ప్రాచీన క్రైస్తుధర్మోప
దేశకులు కొన్నివేళలయందిదేరీతిగా యొనరించినారని క్రీస్తుధర్మము యొక్క యితి
హాసకారుడగు మిల్మన్ యనునతడు జెప్పియున్నాడు. ఎవనినైనను బెదరించి
యో, మోసగించియో యొప్పించుట యనునది యిప్పటి పశ్చిమాత్య నీతిశాస్త్ర
జ్ఞులు బహుశా న్యాయమైనదని యొప్పువారుగారు. అయినను సత్యధర్మము నిరప
వాద మైనదని గూడా జెప్పరు. ఉదాహరణార్థము: శిడ్జ్విక్ యను పండితుని
నీతిశాస్త్రములపైని యేగ్రంథముల మనబడులయందు నేర్పుచున్నారో దానివిష
యమేజూడుడి. సిడ్జ్విక్ అను నతడు యీకర్మాకర్మ సంశయస్థలమందు "అనే
కులకత్యంత సుఖ" మనునీతతత్వము యొక్కయాధారమువలన నీతివిరుద్ధము

జేసియున్నాడు. మరియు నదేతత్వము నుపయోగించి తనకు యిట్లునిర్ణయించి నాడు. ఇట్టిసందర్భమున " చిన్నపిల్లవాండ్లకున్ను, పిచ్చివాండ్లకున్ను, వ్యాధిగ్ర స్థులకున్ను (నిజము జెప్పినచో తమ దేహస్థితికియపాయముగలుగు నట్టున్న చో తన శత్రువులకున్ను, చోరులకును, మాటలాడకయున్నచో (పొద్దుపోనందుకు) తన్ను యన్యాయముగా నెవరైనను ప్రశ్నజేసినచో నట్టివానికి ప్రత్యుత్తరమిచ్చుట యందును, లేదా వకీళ్లుతమ వ్యవహారమునందును, అబద్ధము పలుకుటవల్ల దోష ములేదు. ***Sidgwicks " Methods of Ethics " Book III Chap· XI § 6. Page 355 [ 7 th. Ed. ) Also see pages 315--317 ( Same Edn. )*** మిల్ యొక్క నీతిశాస్త్ర సంబంధ గ్రంథములో యిదేయపవాదము యొక్కసమావేశము చేయబడియున్నది, ***Mill's utilitananism Chap II pp 33--34 (15th. Edn. Long man's 1907. )*** ఈ యపవాద విషయము సిడ్జ్విక్ తన గ్రంథమందు యింకను నిట్లువ్రాయుచున్నాడు. "అందరు సత్యముజెప్పుచూనే ప్రవర్తింప వలయునని నేను జెప్పినను యే రాజకీయ పురుషులకు తాము చేయుపనులు రహస్యముగా నుంచవలసి యుంటున్నదో నట్టివారు యితరులకును వ్యాపారులు తమ సద్వ వ్యాపారము జే యను వచ్చినవారికిని యెల్లప్పుడున్ను, నిజమేపలుకవలయునని నేను జెప్పను. ***Sidgwicks "Methods of Ethics " Book VI Chap III § 7 Page 454 (7th. edn.) and: Book II Chap. V § 3 page 169.*** మూడవచోట ఇదేరీతిగాపాత్రి భటులకున్ను శిపాయీలకున్ను నసత్యము జెప్పవచ్చునని యతని యభిప్రాయము. అపభౌతిక దృష్టితో నీతిశా స్త్రముల విమర్శించువాడగు లెస్లీస్టీపన్ యను యింకొక యాంగ్లేయగ్రంథకారుడు యిట్టివైయగు యితరోదాహరణములు జెప్పి తనకు యిట్లువ్రాసియున్నాడు. నామతప్రకారము నేకృత్యము యొక్క గాని పరిణామము యేమౌచున్నదనుట యందు లక్ష్యబెట్టియే దానినీతి స్వభావమును నిర్ధరింప వలయును. అబద్ధము జెప్పు ట వల్లనే సమస్తకార్యములయందును అధికమైన మేలుకలుగునను నమ్మకము నాకు గలిగినచో నేను సత్యము బలుకుటకుద్యుక్తుడుగాను; మరియు యీనమ్మకము యిట్టిదిగాయుండ శక్యమైనచో నట్టి సంధర్భమున యబద్ధముజెప్పుట యేకర్తవ్యమని నేనుతలచెదను, **Leslie Stephen's " Science of Ethics " Ch.IX § 29 Page 369 ( 2nd. *Edn* ) " And the Certainty**

**may be of such a kind as to make me think it a duty to lie.**

నీతి శాస్త్రము నధ్యాత్మదృష్టితో విమర్శించువాడగు గ్రీను దొరవారు **Green's " Prolegomena to Ethics " § 315 P 379 5th. (cheaper edn.)**

యిట్టి సందర్భములవిషయ మువన్యసించి: యిట్టిసందర్భమున నీతిశాస్త్రములు జనులసంశయమును నివృత్తిచేయజాలవని స్పష్టముగా జెప్పియున్నారు. మరియు తనను యిట్లు సిద్ధాంతీకరించుచున్నారు " యేసామాన్యనియమమునైనను కేవల నియమమని మాత్రమే యెల్లప్పుడు గాపాడుట యందు మహత్వమున్నదని యెంచక "సామాన్యత" దానిగాపాడుటయందు మనకు శ్రేయస్సు గలుగునని యింతమాత్రము నీతిశాస్త్రములు జెప్పుచున్నవి " యేలయన యిట్టిసందర్భమున మనము కేవలనీతికొరకు మన లోభమూలకమైన నీచమనోవృత్తిని త్యజించుటకు నేర్పుచుంటున్నాము. " నీతిశాస్త్రములపైని గ్రంథములు వ్రాసిన బేన్, హ్యూవెల్ మొదలైన యితర ఆంగ్లేయపండితుల మతము కూడా యిదేరీతిగా నుంటున్నది. **Bain's " Mental and moral science " P 445 (Edn 1875) and Whewell's elements of morality Book II Chapters XIII & XIV. (4th. Edn 1854.)**

పైజెప్పిన యాంగ్లేయగ్రంథకారుల మతమునున్నూ మనధర్మశాస్త్రకారులు నియమించిననియమములనున్నూ తూచినచో సత్యము బలుకు విషయములో యెవరు యెక్కువయభిమానులనుట తెల్లమగుచున్నది.

ననర్మ యుక్తం వచనం హినాస్తి న స్త్రీషు రాజన్న వివాహకాలే
ప్రాణాత్యయే సర్వధనాపహారే పంచానృతాన్యాహురపాతకాని।

" హాస్యము జేయుటయందును, భార్యవద్దను, ప్రాణమునకు సంకటము వాటిల్లినప్పుడును, యార్జితసర్వధనమును రక్షించుటకొఱకున్నూ యిట్లైదుసమయములయందుయబద్ధము జెప్పినచో పాతకములేదు" (మభా. ఆ. 82-16: ఆదిపర్వాదిగా) (శాం 109: మను 8. 110 జూడుడి) యని మనశాస్త్రములయందు జెప్పబడియున్నది. నిజమే. అయితేదాని యర్థము స్త్రీలతో నెల్లప్పుడు అబద్ధమాడవచ్చునని చెప్పుట కాదు గాని, సిడ్జ్విక్ దొర యేయర్థమున " పసిబాలురు " పిచ్చివాళ్ళు, వ్యాధి

వర్ణింపబడియున్నది ( మ. భా. అశ్వ. 81. 10) దీనింబట్టి ప్రసంగవిశేషమున చెప్పిన నైయపవాదము ముఖ్యమైనదికాదు ప్రమాణభూతమైనదియుగాదు. గాదంటిమేని శంకరుడు పార్వతికి చెప్పినప్రకారము:—

« అస్మ హేతోః పరార్థేవా నర్మహాః స్యశ్రియాత్తథా॥
« యే మృషానవదన్తిహి తేనరాః స్వర్గగామినః॥

« స్వార్థమునకేగాని పరహితార్థమునకేగాని, హాస్యమునకైనేగాని యే పురుషులు యీ ప్రపంచమందెన్నటికిని యబద్ధము పలుకరో వారికే స్వర్గప్రాప్తి గలుగును. ( మ. భా. అను. 144 19 ) అని యీ తిథిగామన శాస్త్రకారుల తుది సిద్ధాంతమని స్పష్టమగుచున్నది.

తనవచనము లేక ప్రతిజ్ఞను తాను నడిపించుకొనవలయుననుట సత్యమందే సమావేశముగానున్నది. « హిమాచలము స్థానము వీడినను (యిక్కడికక్కడికి చోటుమార్చినను) అగ్ని చల్లదనమును వహించినను మనమాట యన్యథా యగ్గేదిగాదు « అని శ్రీకృష్ణుడును, భీష్మార్జునులు చెప్పియున్నారు. ( మ. భా. ఆ. 103 వ్ర. 31. 48. ) భర్తృహరి సహా.

« తేజస్వినః సుఖమసూనపి సంత్యజన్తి ।
సత్యవ్రతవ్యసనినో నపునః ప్రతిజ్ఞాం॥

« తేజస్వులైన యనగా పరాక్రమవంతులైన పురుషులు యానందముతో ప్రాణములైనా విడుతురు గాని తమప్రతిజ్ఞను యెన్నటికిని విడువరు « అని సత్పురుషులవర్ణనచేసి యుంటున్నాడు. ( నీతి శ-110 ) అదేప్రకారము « ద్విశ్శరం నాభిసంధత్తే రామోద్విర్నాభిభాషతే " ( సుభాషిత ) అని దశరథరామచంద్రుని యేకపత్నీవ్రతమునకు సమానముగా యతని యేకబాణము యొక్కయు, యేకవచనము యొక్కయు వ్రతము సహా ఖ్యాతిజెందియున్నది; మరియు హరిశ్చంద్రుడు స్వప్నమందిచ్చిన వచనమును నిజము చేయుటకై డోంబరవాని యింట యందు-నీళ్లుసహా మోసియున్నాడని పురాణములయందు కథలున్నవి. అదియునుగాక యింద్రులకు వ్యతిరేకపక్షమున, యింద్రాది దేవతలుసహా వృత్రాసురునితో చేసుకొన్న కరారును తిరుగబడి, అతడే నోడిపోవుట కేవలమొక ఉపాయమునుపన్ని, చూ వృత్రుని జంపిరని వేదములయందు వర్ణనయున్నది, దానిని యనుసరించి హిరణ్య

కశిపుని వధయొక్క విషయము పురాణములయందు వర్ణింపబడినది. ఇదిగాక వ్యవహారమందలి కొన్ని యొడంబడికలు లేక కరారులు సహా న్యాయస్థలముల యందవి న్యాయశాస్త్ర విరుద్ధములుగను లేదా నడుచుట కయోగ్యములుగ నుండునట్లున్నూ యెన్నబడినవి. అర్జునుని యిట్టి విషయమొక్కటి మహాభారతము నందు వర్ణింపబడియున్నది. అర్జునుడిట్టి ప్రతిజ్ఞను జేసియుండెనుగదా. ఎవ్వడు నాకు "నీవు నీచేతిలోని గాండీవధనస్సును యింకొకనికిమ్ము" యని జెప్పునో వానిశిరము వెంటనే ఛేదించెదను. తరువాత కర్ణుడు యుద్ధమునందు యుధిష్ఠరుని యోడించినపిదప యుధిష్ఠరుని నోటినుండి "నీ గాండీవము మాకేమి యుపయోగము! దానిని నీ చేతినుండి పారవేయుము." అని నర్జును నుద్దేశించి యెవ్వడైతె నిరాశచే సహజమైన మొకరై టపడెనో అప్పు డర్జునుడు జేతియందు కత్తిబూని యుధిష్ఠరుని జంపుటకు సిద్ధుడాయెను! అయితె శ్రీకృష్ణు డప్పుడు దగ్గరయుండుటచేః సత్యధర్మమననేమి, యని దాని తత్వజ్ఞాన దృష్ట్యా మార్మిక వివేచనముజేసి "నీవు మూర్ఖుడవు. నీకు సూక్ష్మధర్మ మింకను తెలియకయున్నది, దానిని వృద్ధులనుండి నేర్వవలసినదిగాయున్నది;" "నవృద్ధాః సేవితాస్త్వయా" నీవు వృద్ధులసేవ జేయలేదు, నీ ప్రతిజ్ఞను నీవు గాపాడుకొనవలసి యుండినచో యుధిష్ఠరుని అవమానింపుము తిరస్కారము (నిర్భర్త్సనా) జేయుము, యేల యన సంభావిత పురుషునకు యవమానము చావువంటిదిగా నుంటున్నది," యని యిత్యాది విధముల యర్జునునకు ఇతడు బోధించెను; యంతియగాక విచారము తో తనచేతితో గలుగుచున్న జేష్ఠభ్రాతృవధయొక్క పాపమునుండి తొలగించెనని యీరీతిగా కర్ణపర్వమునందు కథయున్నది. ( మభా కర్ణ 69 ). శ్రీకృష్ణు డిచ్చేటజెప్పిన సత్యానృతవివేకమే ముందు శాంతిపర్వమందు సత్యానృతాధ్యాయములో భీష్ముడు యుధిష్ఠరునకు యుపదేశించియున్నాడు. (శాం.09); వ్యవహారమందది యందరున్నూ లక్ష్యమందుంచుకొనవలయును. అయితే యిట్టి సూక్ష్మసందర్భములనెట్లు గుర్తింపవలయుననునది జెప్పుట కష్టముగా నుంటున్నది. ఏలయన భ్రాతృధర్మము సత్యముకంటే యిచ్చోట శ్రేష్ఠమైనను, గీతమందలి సందర్భము దీనికి వ్యతిరేకముగాయుండి అచ్చట భ్రాతృప్రేమకంటె క్షత్రియధర్మము శ్రేష్ఠమని నిర్ధరింపబడినదని యందరికిని విదితము.

అహింస మరియు సత్యము వీటివిషయములోనే యంతవాదమున

కష్టము కల్గినప్పుడు, మూడవ సామాన్య తత్వముగా ఆ క్షత్రియునకు సైత యీ న్యాయ మన్వయించినయెడల ఆశ్చర్యమేమి? ఒకడు యథాన్యాయముగా గూడబెట్టిన ద్రవ్యమును నితరులు దొంగలించుటలో లేక బలాత్కారముతో తీసుకొనిపోవుటలో వీలు దొరికినయెడల ద్రవ్యసంచయము చేయుట నిరర్థకమై అందరికిని నష్టము గలుగుటయేగాక జనసంఘము చెదరిపోయి యరాజకమై దుర వస్థపాటిల్లుననుట నిర్వివాదముగా నున్నది. అయితే యీనియమమునకు గూడా యపవాదములున్నవి. నలుదిక్కుల క్షామము వ్యాపించియుండి, క్రయమున కైనను, కూలికైనను, లేదా ధర్మార్థమునకైనను యన్నము దొరకనట్టి యాపత్తు సంభ వించినప్పుడు, దొంగలించుటచే యాత్మసంరక్షణ చేసుకొనవలసినను యత్నించినయెడల, నట్టివానిని మనము పాపిగా నెంచవలెనా? పన్నెండేండ్లు కరువుపడిన విశ్వామిత్రునకిట్టి దుస్తరప్రసంగము వాటిల్లినప్పుడు శ్వపచునియింటి కుక్క తెచ్చిన మాంసపు అన్నముకు దొంగిలించి, యాయన్నమున తన్ను రక్షించుకొనుటకు నుద్యుక్తుడాయనని మహాభారతమందొక కథయున్నది. ( శాం 141 ) శ్వపచుడు విశ్వామిత్రునకు " పంచపంచ నఖాభక్ష్యాః " ( మను 5 18 ) అను యిత్యాదిగా యనేక శాస్త్రార్థములఁజెప్పి యభక్ష్యభక్షణము నదియు దొంగలించి చేయగూడ దను విషయము శాస్త్రాధారములఁజెప్పి విశేషముగా నుపదేశించెను; అయితే:—

పిబన్త్యేవోదకం గావో మండూకేషు రువత్స్వపి ।
న తేధికారో ధర్మేస్తి మాభూరాత్మప్రశంసకః ॥

" ఓరీ! కప్పలరచినను గోవులు నీళ్లు త్రాగుట మానవు; చాలు చాలు! నాకు ధర్మజ్ఞానము చెప్పుటకు నీ వెంతవాడవు. ఊరక నీ పౌరుషముఁ జెప్పకొనకుము " అనిచెప్పి విశ్వామిత్రుడతని తుచ్ఛకరిచి యున్నాడు. " జీవితం మరణాచ్ఛ్రేయో జీవన్ధర్మ మవాప్నుయాత్ " బ్రదికియున్న ధర్మమును బడయ వచ్చునని ధర్మదృష్ట్యాసహా చచ్చుటకంటె బ్రదికియుండుట శ్రేయస్కరమని విశ్వామిత్రుడు యీ సందర్భమున చెప్పియున్నాడు. విశ్వామిత్రుని వాక్యమే గాదు- ఇట్టి సంకష్టములయందు, అజీగర్త, వామదేవాది యితర యనేక ఋషులు [illegible]గా వర్తించిన యుదాహరణము లనేకములు మనుస్మృతి చెప్పబడియున్నవి ( మను 10-105-108 ) హాబ్సను యను యాంగ్లేయగ్రంథకారుడు [illegible]

గ్రంథమునందిట్లు వ్రాసియున్నారు. “ఒకవేళ ఘోరక్షామమునందు క్రయమూల్యము లేదా ధర్మార్థముగా నన్నము దొరకనట్లైన పొట్టకొరకేవ్వరైనా దొంగతనము లేదా సాహసమో చేసినయెడ నట్టివానియాయపరాధము క్షమింపదగినదిగా యున్నది” మిల్ యిట్టి సంధర్భమున దొంగతనముచేసి మనుష్యుడు తనప్రాణమును రక్షించుకొనుట అవశ్యకము కర్తవ్యముగా నున్నదని వ్రాసియున్నారు.

“చచ్చుటకంటె మనుట శ్రేయస్కరము” అను నీవిశ్వామిత్రుని తత్త్వము యెల్లప్పుడు నిరపవాదమూ యేమి? మనుట యనునదే యీ ప్రపంచమందలి పురుషార్థముగాదు. కాకబలిని భక్షించి కాకులుసహా పెక్కేండ్లు బ్రదుకుచున్నవి. కావున నే వీరపత్నియగు విదుల తన పుత్రునకు పసుపుమీదపడి కుళ్లుచూ లేక యింటియందు నూరేండ్లూరక తిరుగుచూ పడియుండుటకంటె క్షణమాత్రమైనా పరాక్రమజ్యోతిని ప్రకాశింపజేసి చచ్చుట కడుమేలని చెప్పియున్నది. “ముహూర్తం జ్వలితం శ్రేయో నచధూమాయితం చిరం” ( మభా ఉ 132.15) నేడుదప్పిన రేపు, లేదా నూరేండ్లకయినా మృత్యువందరికిని రాకమానదు. ( భాగ 10.1.38; గీ 2.27 ) అట్టుండ దానికిగాను భీతిలేక యాక్రోశము, భయములేక యేడ్పుతో నేమిప్రయోజనము? అధ్యాత్మ శాస్త్రరీత్యా మొదటిది యాత్మ నిత్యమైనది గావున దానికెన్నటికిని చావురాదు. కావుననే మరణవిషయము యోచించునపుడు ప్రారబ్ధకర్మానుసారము ప్రాప్తమైన యీ శరీరమునకు సంబంధించిన ప్రశ్నయే యోచింపవలని యుంటున్నది. ఈ శరీరము, మాటలాడినను తిరుగులాడినను నాశవంతమైనది; అయితే యాత్మకు మేలుగలుగజేయుటకై యీ జగమునందేమి చేయవలసియుంటున్నదో దానికి నాశవంతమైన మనుష్యదేహము అంతియగాక యొకసాధనముగా నున్నదిగావున “ఆత్మానం సతతం రక్షేత్ దారైరపి ధనైరపి” ఆలుబిడ్డలు సంపత్తులకంటే తనంతటతాను మొదట రక్షించుకొనవలెనని ( మను 7.213 ) మనువు చెప్పియున్నాడు. అయినను నీ దుర్లభమైనట్టియు, నాశవంతమయినట్టియు మానవశరీరమును లక్ష్యపెట్టక, దీనికంటెను అధికశాశ్వతమైన నొకవస్తువును యొకవేళ నార్జించుకొనవలసి యుండినతో నట్టివేళ సదాచారమార్గము, దేశమునకుగాను, ధర్మమునకుగాను, సత్యమునకుగాను, తనమాట, వ్రతము, లేక ఖ్యాతిని రక్షించుకొనుటకుగాను, మర్యాదకుగాను, యశమునకుగాను, లేదా సర్వభూతహితార్థము, అనేక

మహాత్ము లనేకసంవత్సరములయందు దీర్ఘప్రవర్తవ్యాప్తియందు దర్శనా-
దముతో తమప్రాణములను నాహుతి యిచ్చియున్నారు! వసిష్ఠుని ధేను-
వును సింహపువాతనుండి రక్షించుటకై సింహమునకు తనదేహమును బలియిచ్చు-
టకు సిద్ధపడియుండిన దిలీపుడు తనవంటిపురుషులు " పాంచభౌతికశరీరసంబంధ-
మున నిర్విణ్ణులై యున్నారు కావున నీవు నా జడశరీరముకంటె యశశ్శ-
రీరముపైపున దృష్టి నిగిడింపుము " అని యీరీతిగా సింహమును ప్రార్థించినది
రఘువంశమునందుఁ జెప్పబడినది; మరియు పాముయొక్క ప్రాణమును రక్షిం-
చుటకై జీమూతవాహనుడు గరుత్మంతునకు తనదేహమును సమర్పించిన కథ
కథాసరిత్సాగరమునందును, నాగానంద నాటకమునందును వర్ణింపబడి యుం-
న్నది మృచ్ఛకటిక నాటకమునందు చారుదత్తు డీరీతిగా పలికియున్నాడు:-

న భీతో మరణాదస్మి కేవలం దూషితం యశః ।
విశుద్ధస్య హి మే మృత్యుః పుత్రజన్మసమః కిల ॥

" నేను మరణమునకు భయపడువాడను కాను; కీర్తికి కుందు గలిగెనని
మాత్రము నాకు దుఃఖమౌచున్నది. కీర్తి శుద్ధముగనుండి మృత్యువు ప్రాప్తమైన
చో నయ్యది నాకు నిజముగా పుత్రోత్సవమువలె నున్నది. " ఇదే తత్త్వము
ననుసరించి శిబిచక్రవర్తి తన్ను శరణుజొచ్చిన కపోతమును రక్షించుటకై, శ్యేన
పక్షిరూపమునుధరించి యక్కపోతము వెంటనంటిన యమధర్మునకు తన స్వంతశరీ-
రముయొక్క మాంసమును కోసి తీసియిచ్చెను. మరియు దేవవైరియైన వృత్రా-
సురుని జయించుటకై దధీచిఋషియొక్క యెముకలతో చేయబడిన వజ్రాయుధము
గావలసియుండినదున, దేవతలందరు నా ఋషియొద్దకుపోయి " శరీరత్యాగం
లోకహితార్థం భవాన్ కర్తుమర్హతి " స్వామీ! సర్వజనులకు మేలుగలుగుటకై
మీరు దేహత్యాగము చేయవలయును, అని యతనిని వేడుకొన దధీచిఋషి
అత్యానందమున ప్రాణంబువిడిచి తన శరీరపు యెముకను దేవతలకిచ్చెను; అని
యిట్టి కథలు క్రమముగా భారతములోని వనపర్వమునందును, శాంతిపర్వము
నందును చెప్పబడినవి. ( వన 100, 131; శాం 342 ) కర్ణునితో బుట్టిన యతని
సహజ కవచకుండలముల హరించుటకై యింద్రుడు బ్రాహ్మణవేషముతో దానశూరు-
డగు కర్ణుని యొద్దకు రాబోవుచున్నాడని తెలిసినపిదప, యా కవచకుండలములు నీవ
ఎవరికి దానమివ్వకుండుమని సూర్యుడతని కుండగనె హెచ్చరించినదేగాక, నీవు

దానశూరుడవను కీర్తియుండినా కవచకుండలములు దానమిచ్చుటచే నీ ప్రాణమునకు హానిగలుగును గావున నీవు వాటిని ఎవరికిని నివ్వవలదు. ఏలయన చచ్చినపిదప కీర్తితో నేముపయోగము? "మృతస్య కీర్త్యా కిం కార్యం" అని సవా చెప్పెను. సూర్యునియివ్వచనములవిని "జీవితేనాపి మే రక్ష్యా కీర్తి స్తద్విద్ధి మే మతం" జీవముపోయినను సరే, అయితే కీర్తినిగాపాడుకొనుటయే నావ్రతము" అని కర్ణుడు ప్రత్యుత్తరమిచ్చియున్నాడు. ( మభా వన 229-38 ) ఒక వేళ చచ్చినయెడల స్వర్గమునకు బోదువు. గెలిచితివో పృథ్వి ననుభవించెదవు అను నిత్యాది క్షత్రియధర్మములున్ను లేదా "స్వధర్మే నిధనం శ్రేయః" (గీత 3-35) యను సిద్ధాంతమున్ను ఇదే తత్వము నవలంబించి యున్నవి; మరియు దాని ననుసరించియే "కీర్తిని జాడబోతే సుఖములేదు; సుఖమునుజూచిన కీర్తిలేదు" ( దాస 12-10-19; 19-10-25 ) కావుననే "దేహము త్యజించిన పిదప కీర్తి మిగులవలయునని యెంచి సజ్జనులిదేక్రియ నాచరించవలెను" అని శ్రీరామదాసస్వాములవారుపదేశించి యున్నారు. అయితే పరోపకారము వల్ల కీర్తి ప్రాప్తమౌచున్నదనునది నిజముగానే యుండినయెడల చచ్చినపిదప కీర్తితోనేమి ప్రయోజనము? లేదా సంభావితపురుషులకు దుష్కీర్తికంటే మరణమున్ను ( గీ 2-34 ) లేదా బ్రదుకుకంటే పరోపకారమున్ను, ఏల యధిక శ్రేయములైనవిగా దోచుచున్నవి? ఈ ప్రశ్నకు తగినట్టి ప్రత్యుత్తరమిచ్చుటకు ఆత్మానాత్మవిచారమందు ప్రవీణతనొందవలసినదేగాని వేరొకమార్గములేదు. మరియు ప్రత్యుత్తరమిచ్చినను, యెట్టి సందర్భమునందు జీవమును రక్షించుకొనుట యోగ్యము, యెట్టిసందర్భమున నయోగ్యమని తెలుసుకొనుటకు, కర్మాకర్మ శాస్త్రముయొక్క విచారము, దానిననుసరించియే విచారించవలసివచ్చును. లేకపోతే మూర్ఖతనమువల్ల నాత్మహత్య చేసుకొన్నంతటి పాపము మాత్రము ఘటించుటకు వీలుండును.

తల్లి, తండ్రి, గురువు ఇత్యాది వంద్యులును, పూజ్యులును నగు వారిని దేవతలవలె పూజించుటయు, శుశ్రూషచేయుటయు, సామాన్యమైనట్టియు సర్వమాన్యమైనట్టియు ధర్మములలో నొకప్రధానధర్మముగా నెన్నబడినది. ఏలయన యట్లుగానిచో కుటుంబముయొక్కయు, గురుకులముయొక్కయు, లేదా యావత్సమాజముయొక్కయు మేలైన వ్యవస్థ యెన్నటికి [illegible]

పితాచార్యః సుహృన్మాతా భార్యాపుత్రః పురోహితః॥
నాదండ్యో నామ రాజ్ఞోస్తి యస్స్వధర్మేన తిష్ఠతి॥

" తండ్రి, ఆచార్యుడు, మిత్రుడు, తల్లి, భార్య, కొడుకు, పురోహితుడు వీరిలో నెవ్వరైనా సరే, ఒకవేళ వారు తమతమ ధర్మానుసరణి వర్తింపనిచో రాజునకు వారు అదండ్యులుగారు. అనగా రాజువారికి తగినశిక్ష విధింపనే వలయును. ( మను. 8. 345; మభా. శాం. 121. 60) ఏలయన నిట్టి సందర్భమున పుత్రధర్మముకంటే రాజధర్మ మధికయోగ్యమైనది. ఇదేన్యాయానుసరణి మహాపరాక్రమశాలియగు సూర్యవంశపు సగరచక్రవర్తి తనపుత్రు డసమంజస దుర్వర్తనుడై ప్రజలను బాధపెట్టుచుండుట నెరిగి వానిని రాష్ట్రమునుండి వెడలగొట్టెనని భారతరామాయణగ్రంథములయందును వర్ణింపబడియున్నది (మభా. వన 107; రామా 1, 38). మనుస్మృతియందు, నంగీరసుడను నొక ఋషి కల్పవయస్సునందే యుత్తమజ్ఞానప్రాప్తిగల్గుటచే నతని పినతండ్రులు, మామలు మొదలైన పెద్దలు నతనివద్ద నధ్యయనము చేయనారంభించిరి; అప్పుడు పాఠము జరుగుచుండగా శిష్యులకు గురువు సాధారణముగా జెప్పిన రీతిగా నొక సందర్భమున నంగీరసుని ముఖమునుండి వారినుద్దేశించి " పుత్రకులారా " యను శబ్దము వెలువడెను. " పుత్రకాఇతి హోవాచ జ్ఞానేన పరిగృహ్య తాన్ " అనిన మాత్రాననింకేమి చెప్పవలయు? వృద్ధులందరు అంగుష్టమునుండి శిరస్సువరకు కోపాగ్నిచే మండిపడి " ఓరా! బాలుడా నీకింతపొగరా! " యని చెప్పి అతనికి తగునైన శిక్షవిధింపవలెనని భగవంతునియొద్ద మొఱపెట్టుకొనిరి. భగవంతుడును దేవతలును వారు చెప్పినదంతయు విని తుదకు " అంగీరసుడు మీకు చెప్పినదే న్యాయమని తీర్మానమిచ్చెను " ! ఏలయనః—

న తేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిరః॥
యో వై యువాప్యధీయాన స్తం దేవాః స్థవిరం విదుః॥

తలలోని వెంట్రుకలు తెల్లనైనంతమాత్రాన మనుష్యుడు వృద్ధుడుగాడు. పసివాడయినను నెవ్వడు జ్ఞానవంతుడో వానిని దేవతలు సహా మునలివానిగా భావింతురు (మను 2. 158, మహా. భా. వన. 133. 11; శల్య 51 47) తమపునకును వ్యాసునకును మాత్రమేగాక బుద్ధునకు కూడా యీతత్వము, హితముగానుండెను. ఏమియన మనుస్మృతి యందలి యీ శ్లోకముయొక్క యీ

పతి చరణము అక్షరముల పూర్ణసహా లేకుండా "ధమ్మపద" మను పా-
లిభాషయందలి ప్రసిద్ధ నీతి గ్రంథము నందు చెప్పబడియున్నది (ధమ్మపద, 260)
ఇదియునుగాక మున్ముందు కేవలవయస్సుమాత్రమున ఎవ్వాడు పరిపక్వబుద్ధియై యు-
న్నాడో వానిబ్రతుకు వ్యర్థము, నిజముగా ధర్మిష్ఠుడును వృద్ధుడు ననబడుటకు
సత్యము, అహింస యిత్యాది సద్గుణము లవశ్యముగా నుండవలయునని చెప్ప-
బడినది. మరియు "చుల్లవగ్గ" మను యింకొక గ్రంథమందు ధర్మనిరూపణ
చేయుభిక్షు శ్రోత్రవాదియనను తా నున్న ఆసనము పై గూర్చుండి పాత
వారిని అనగా తనకుముందు దీక్ష తీసుకొనినవారి నగా వయోవృద్ధులై
న భిక్షులకు సహా ధర్మోపదేశము చేయవలయు. వయోవృద్ధులైన భిక్షులకు సహా
ధర్మోపదేశముం జేయవలయునని బుద్ధుడే సమ్మతించి యున్నాడు. (చుల్లవగ్గ.
6. 13, 1 జూడుడి) ప్రహ్లాదుడు తనతండ్రియాజ్ఞ నుల్లంఘించి భగవద్భక్తిగ
లిగించు కొన్నకథ సర్వప్రసిద్ధము. దీనింబట్టి పిన్నపెద్దలవిషయమున మాత్రమే
గాదు, అయితే పితాపుత్రుల సర్వమాన్యులగు మనుములుసహా కొన్నికొన్ని యిత
రయిట్టి సందర్భముల యందు చిక్కి తత్కాలమునకు పేరేమియుం జేయునది లేక
పుణ్యమాత్రమైనను తమబాంధవ్యమును మరవవలసి వచ్చునని తోచును. అయితే
యిట్టిప్రసంగ మెప్పుడును ప్రాప్తముగాక యుండినా యిదేన్యాయము నన్వయించి
దుర్మార్గుడగు పిల్లవాడు తనతండ్రిని తిట్ట నారంభించినచో మీరాపిల్లవానిని పశువుల
యందుగణించక యుందురా? "గురుర్గరీయాన్ పితృతో మాతృతశ్చేతి మే మతిః"
(శాం. 108. 17) తలిదండ్రులకంటె గురువు శ్రేష్ఠుడు, అని భీష్ముడు యుధిష్ఠి-
రునకుం జెప్పియున్నాడు. మహాభారతము నందీశ్లోకము నాలుగు చోట్ల జెప్పబడియు-
న్నది (మభా ఆ. 142. 52, 53; వ 179; 24; శా. 57-7, 140. 48). వీటిలో మొ-
దటిచోటపాఠము పైజెప్పినరీత్యాయుండియితరచోట్లనాలుగవచరణమునకు బదులుగా
"దండో భవతి శాశ్వతః" లేక "పరిత్యాగో విధీయతే" యని పాఠాంతరము
లున్నవి. అయితే వాల్మీకిరామాయణమున నెచ్చోట (2, 21. 18 రామా)
యీ శ్లోకము చెప్పబడియున్నదో యచ్చోట మాత్రమే యనగా పైన చెప్పినరీతి
గా పాఠము చెప్పబడియుండుటచే నేనుదానినే యీ గ్రంథమునందు స్వీకరించి
యున్నాను. భీష్ముడు పరశురామునితోను అర్జునుడు ద్రోణునితోను యుద్ధము
చేసినందున [illegible] స్థానమున

సామాన్యధర్మములయందు గణితింపబడుచున్నవి. ( మను 10-63 ) కామ, క్రోధ, లోభములు మానవునకు శత్రువులుగ నుండుటచే విటిని పూర్తిగా జయించితేనే గాని మానవునకును, సమాజమునకును మేలుగలుగదని యిట్టియుపదేశము సర్వ శాస్త్రములయందుఁ జెప్పియుండుటయేగాక, విదుర నీతియందును భగవద్గీతయందును:—

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।
కామః క్రోధస్తథాలోభ స్తస్మాదేతత్ త్రయంత్యజేత్ ॥

" కామ, క్రోధ, లోభము లను నీమూడు నరకమునకు ద్వారము లుగానుండి తన్ను నాశనము జేయునవిగానుండుటచే వాటిని త్యజింపవలెను " యని చెప్పఁబడినది ( గీ.16 21; మభా. వు-32-70 ) అయితే గీతయందే భగవంతుడు " ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ " హే అర్జునా! ప్రాణి మాత్రములయందు ధర్మము ననుసరించి యే కామముంటున్నదో అదే నేను ( గీత-7.11 ) యని తనస్వరూపమును వర్ణించియున్నాడు. అనగా ధర్మమునకు విరుద్ధమైన కామమే నరకద్వారముగా నుంటున్నది. అది తప్ప యితరయేవిధమైన కామమున్నూ భగవంతునకు సమ్మతమైనదిగాదని యిందువలన స్పష్టము; మరియు మనువుగూడా " పరిత్యజే దర్థకామౌ యౌస్యాతాం ధర్మవర్జితౌ " ధర్మమునకు విరుద్ధమైనంతటి అర్థమునున్నూ, కామమునున్నూ, విడవవలయును యని చెప్పి యున్నాడు ( మను 4-106 ) సర్వజనులును రేపటినిన మొకవేళ కామదేవునికి పూర్ణసెలవిచ్చి యామరణబ్రహ్మచర్యపర్య వ్రతమును పాలింప నిర్ధారము చేసు కొన్నయెడల, సర్వసజీవసృష్టియే యంతమై, యెక్కడిదక్కడ చల్లాచదరై పోవును మరియు యేసృష్టి యుత్పన్నముగాగూడదని పదేపదే భగవంతు డవతారము ధరించు చున్నాడో అయ్యదియే కొంతకాలములోనే యుచ్ఛేదనమైపోవును. కామమున్నూ క్రోధమున్నూ శత్రువులునిజము, అయితే యెప్పుడు? అనవరతము యుండనిచ్చి నతో సృష్టిక్రమము నడుచుచుండుటకు యోగ్యమైన మర్యాదతోగూడా వాటి యవశ్యకత మత్యంతముగా నుంటున్నది, యను నీమాట మన్వాదిశాస్త్రకారులకు సహా సమ్మతము. ( మను 5.56 )

లోకే వ్యవాయామిషమద్యసేవా నిత్యాస్తు జంతోర్న హి తత్ర చోదనా ।
వ్యవస్థితిస్తేషు వివాహయజ్ఞసురాగ్రహైరాసు నివృత్తిరిష్టా ॥

" ఈ జగమందు, మైథునము, మద్యము, మాంసము యనువాటిసేవన చేయుమని యెవరికిని చెప్పనక్కరలేదు; అవ్వియవి మనుష్యులయందు స్వాభావిక ముగా యిమిడియున్నవి. ఈ మూటియొక్క యేదైనాయొక వ్యవస్థ జేయ వలయునని, యనగా వాటియందు మర్యాదయుంచి వ్యవస్థితరూప మియ్యవలయు నను కారణముతో, వివాహము, సోమయాగము, సౌత్రామణీయజ్ఞ మునని శాస్త్ర కారులు యథాక్రమమున యేర్పరచి యుంటున్నారు. అయినా వాటియందుకూడా నివృత్తియే యనగా నిష్కామాచరణమే మంచిదిగా చెప్పబడియున్నదని, " భాగవతమునందు జెప్పబడియున్నది. ( భా 11 5-11 ) నివృత్తి యనుశబ్దము పంచ మాంతశబ్దముతో సంబంధపడియుండుటచే " యిటువంటి దానినుండి నివృత్తిని యనగా యిటువంటి కర్మను, సర్వథా త్యజించవలెను " అని యీరీతిగా యర్థ మిచ్చినయెడల కర్మయోగమందు " నివృత్తి " యను విశేషణము కర్మకే జంటిం చబడినదిగా యుండుటచే " నివృత్తికర్మ " మనగా నిష్కామబుద్ధితో చేయదగిన కర్మమని యీ పదముయొక్క యర్థముగా నున్నది యను దీని యిచ్చోట లక్ష్యమందుంచవలెను; మరియు యిట్టి యర్థము మనుస్మృతియందును భాగవత పురాణమందును స్పష్టముగాం జెప్పబడియున్నది ( మను 12-89; భాగ 11-10-1 7-15-47 జూడుడి ) క్రోధవిషయముం జెప్పుచూ కిరాతకావ్యమందు ( 1-33 ) భారవియిట్లు జెప్పుచున్నాడు:—

అమర్షశూన్యేన జనస్య జంతునా న జాతహార్దేన నవిద్విషాదరః ॥

" తన కవమానము గల్గెనని యేమనుజునికి కోపమురాదో యా పురు షునకు స్నేహద్వేషములు సమములు; క్షత్రియ ధర్మమునుబట్టి చూచిన:—

ఏతావానేవ పురుషో యదమర్షీ యదక్షమీ ॥
క్షమావాన్నిరమర్షశ్చ నైవ స్త్రీ నపునః పుమాన్ ॥

" ఏ పురుషునకు ( అన్యాయమైన ) కోపమువచ్చునో మరియు యెవ్వాడు ( అవమర్యాదను ) సహింపడో, వానినే పురుషునిగా గణింపవలెను. పురుషునకు ఏ కోపమురాదో యతడున్నూ, నపుంసకుడున్ను సమానులే "

యని విదురుడు పర్కొంచియున్నాడు ( మభా, ఉ, 132.33 ) ప్రపంచమందలి వ్యవహారములు నడుచుటకు సదా క్రోధవంతులగనో తేజోవంతులగనో యుండుట నిష్ప్రయోజనము, మరియు యెల్లప్పుడు క్షమగూడా పనికిరానిదని యుధిష్ఠిర లోనే పైనఁ జెప్పబడినది. లోభమునకు సహ యిదేన్యాయ మన్వయించుచున్నది; యేలయన సన్యాసియయినను యతనికి మోక్షకాంక్షయే యుంటున్నది.

శౌర్యము, ధైర్యము, దయ, శీలము, మైత్రి, సమతా యని యిత్యాది సమస్తసద్గుణములకు పరస్పర విరోధముండినా దేశకాలాదిమర్యాద ననుసరించి యుంటున్నవని వ్యాసుడు మహాభారతమందనేకచోట్ల వేరువేరు కథలయందు ప్రతిపాదించి యున్నాడు. సద్గుణములైనను, అయ్యవి సర్వసంభవములైనను, సరిపోవుచున్నవనిగాదు భర్తృహరి:—

“ విపది ధైర్యమథాభ్యుదయే క్షమా సదసి వాక్పటుతా యుధి విక్రమః ॥

“ సంకటమునందు ధైర్యము, ఉత్కర్షయందు ( అనగా తన పరాక్రమ. కీర్తిని స్థాపించుసామర్థ్యము తనశరీరమందుండునపుడు ) క్షమ, సభయందు వాక్పటుత్వము, యుద్ధమందు శౌర్యము మంచిగుణములని ” చెప్పియున్నాడు ( నీతి 63 ) చల్లనికాలమందు ( యుద్ధము లేనప్పుడు ) ఉత్తరునివలె పౌరుషములుబల్కు పురుషులు మెండు. అయితే యింటియందు భార్యయొక్క ముకురమునుండి బాణప్రయోగముఁ జేయు శూరవర్యులనేకులుండినను, వారిలో రణరంగంబున ధనుర్ధరుడను పేరుబడయ యోగ్యుడొకడు దొరకుట పరమదుర్లభము సుమీ! ధైర్యాదిగుణములు పైనఁజెప్పిన వేళలయందే శోభిల్లు ననుసంతేయు గాదన్నచో, యిట్టిప్రసంగములయందు తప్ప వాటి నింకెప్పుడున్నూ పరీక్షించుట సాధ్యముగాదు. పాఠశాలయందలి స్నేహితులేమో యనేకులు; అయితే “ నికషగ్రావాతు తేషాం విపత్ ” సంకటకాలమే వాటిని పరీక్షించుటకు మంచిసందర్భము. “ ప్రసంగ ” మను శబ్దమునందే దేశకాలమేగాక పాత్రాపాత్రులవిషయము సహ సమావేశముగా నుంటున్నది. సమతకంటె వేరొండుగుణము శ్రేష్ఠము గాదు, “ సమః సర్వేషు భూతేషు ” యిది సిద్ధపురుషలక్షణమని భగవద్గీతయందు స్పష్టముగాఁ జెప్పబడియున్నది. అయితే సమత యననేమి? ఒకవేళ యొకడు యోగ్యతలఁజూడక అందరికిని సమానముగా దానమిచ్చినచో వానిని [illegible]

వానిగా నెన్నవలయునా లేక పిచ్చివానిగా గణింపవలయునా? భగవద్గీతయందే " దేశేకాలేచ పాత్రేచ తద్దానం సాత్వికంవిదుః " దేశమును, కాలమును, పాత్రతను గనుగొని యిచ్చినదానమే సాత్వికదానము. ( గీత 17-20 ) అని యీ రీతిగా యీ ప్రశ్నకు ప్రత్యుత్తరము నిర్ణయింపబడినది. కాలముయొక్క మర్యాద కేవల వర్తమానకాల మంతటమాత్రమే యుంటున్నదనికాదు. కాల మెట్లెట్లు మారుచున్నదో అట్లట్లే వ్యవహారికధర్మమందును భేదములుగలుగుచుండి, దానివల్ల యొకవేళ ప్రాచీనకాలపు విషయముల యొక్క యోగ్యతాయోగ్యతలు నిర్ణయించవలసి యుండినయెడల ఆకాలపు ధర్మాధర్మ పరిజ్ఞానముయొక్క విమర్శ కూడా యవశ్యము చేయవలసివచ్చును.

" అన్యేకృతయుగే ధర్మాత్రేతాయాం ద్వాపరే సవే
" అన్యేకలియుగే నృణాంయుగ హ్రాసానురూపతః॥

యుగమానుముల రీత్యాకృత ( భిన్నభిన్న ) త్రేతద్వాపర, కలి, యుగములయందలి ధర్మములుసహా వేరువేరుగా నుంటున్నవని మనువున్నూ (1.85) వ్యాసుడున్నూ ( మభా. శాం. 259.8 ) చెప్పుచున్నారు; మరియు పూర్వకాలమందు స్త్రీలకువివాహము చేసుకొనవలయునను విధియుండక ఆ యా విషయములయందు వారు స్వతంత్రలుగను, అనావృత్తలు గనునుండిరి; అయితే తరువాత యీ యాచారముయొక్క దుష్పరిణామము కంటికగబడినప్పుడు శ్వేతకేతువు వివాహముల విధిగా నియమించెను. ( మాభా. ఆ. 122. ) సురాపానము యొక్కనిషేధమును తొలుత శుక్రాచార్యులు నిర్ణయించిరని యిట్టికథ మహాభారత మందువర్ణింపబడియున్నది. ( మాభా. ఆ. 76 ) అర్థమేమన యీనిర్బంధములెవ్వేళవాడుకలో యుండలేదో యకాలపు ధర్మాధర్మ ములయొక్కయు అటు తర్వాత బుట్టిన ధర్మాధర్మముల యొక్కయు నిర్ణయము వేరువేరు విధములుగా జేయవలసి యుంటున్నది; అదేరీతిగా వర్తమాన కాలమందుండిన ధర్మములు ముందొక వేళమార్పుజెందినయెడల దానికి సరిగా భవిష్యత్కాలముయొక్క ధర్మాధర్మముల వివేచనసహా వేరురీతిగాఁ జేయబడును. కాలమానమునుసరించి, దేశాచారములు, కులాచారములు లేదా జ్ఞాతిధర్మములు సహా యీ తరగతియందే గణింపఁ బడుచున్నవి; యేలయన యాచారము సర్వధర్మములకుమూలముగ నుంటున్నది. అయినను యాచారాచరములలోను మోసనుండక

"నహిసర్వహితః కశ్చిదాచారః సంప్రవర్తతే
"తేనైవాన్యః ప్రభవతి సోఽపరం బాధతే పునః॥

"అందరికిని, ఎల్లప్పుడున్ను నొకేవిధముగా హితకరమగు [illegible] చారము దొరుకుట దుస్తరము. ఒకయాచారమున వలంబించినయెడల మరొకటి దానికి విరుద్ధముగా నుంటున్నది. ఈ రెండవయాచారమును విడచినయెడల యితరమైన [illegible] నాచారమునకు విరుద్ధముగా నుంటున్నది. ( శాం. 259. 17, 18 ) అనియీరీతిగా [illegible] యాచారభేదముల వర్ణనచేసి ఆచారాచారములయందును తారతమ్యమును జూడ వలసి యున్నదని భీష్ముడు చెప్పియున్నాడు.

ఉండనిండు. కర్మాకర్మముల లేకధర్మాధర్మముల సంశయము లొక్క సర్వవిషయములు యీరీతిగా విడదీయుచు గూర్చున్నయెడల రెండవ మహాభార తమే వ్రాయవలసివచ్చును. గీతారంభమున క్షాత్రధర్మమునున్ను బంధుప్రేమ నున్ను విడనాడుట కిష్టములేక అర్జునునకు ప్రాప్తమైన సంధర్భము లోకవిలక్షణమై నది గాదుగాని యిట్టిసంధర్భములు సంసారమునం దనేకవేళలయందు కర్తలున్ను గొప్పవారున్ను యగుపురుషులకు దెట్లునటించుచుండును? కొన్నివేళలయంద హింసకున్నూ యాత్మసంరక్షణకున్నూ, నొకప్పుడు సత్యమునకున్నూ సర్వభూతహిత మునకున్నూ, మరొకప్పుడు దేహసంరక్షణకున్నూ యశమునకున్నూ, కొన్నివేళల యందు వేరువేరు కారణములనే యుపస్థితములగు కర్తవ్యములకున్నూ, ( వీటిలో, కొట్లాటపడి శాస్త్రోక్తముగా సామాన్యమున్ను సర్వమాన్యమున్నూ యయిన నీతినియమములచే కార్యములు జరగక వాటికి యనేకయపవాదములెట్లు గలుగు చున్నవి? మరియు సాధారణ మనుష్యులకేగాక, గొప్పగొప్ప పండితులకు సహా యిట్టి సమయములందు కార్యాకార్య విమర్శచేయుటకు యథగా కర్తవ్యాకర్తవ్య ధర్మ మును నిర్ణయించుటకు యేమైనా స్థిరములైన యుపాయములున్నవా లేవాయని కనుగొను నిచ్ఛ స్వభావికముగా నెట్లు కలుగుచున్నది యను విషయమును చదువరులకు బాగుగ తెలియపరచుటకై పై వివేచనము చేయబడినది. మహాభారత ములయందువలె గలుగు సంకటములయందు "ఆపద్ధర్మ" ములని శాస్త్రముల యందు కొన్నినీతులు చెప్పబడినవి నిజమే. [illegible] బ్రాహ్మణుడు యెచ్చోటనైనా అన్నగ్రహణము చేసినను వానికి [illegible] స్మృతికారులు చెప్పియుండుటయేగాక, [illegible]

క్రమముగా యుదేరీతిగా వర్తించిన కథ కూడఁ జెప్పఁబడియున్నది. ( యుద్ధ 9-41; శాం 1-10 ) అయితే వాటియందును, పైఁ జెప్పిన ప్రసంగమందును ననేక మర్మము లున్నవి. దుష్కాలమువంటి ప్రసంగమందు శాస్త్రధర్మములకును, ఆకలి, దప్పి మొదలైన యింద్రియవృత్తులకును కొట్లాటబడి యింద్రియము లొకవంకను, శాస్త్రములు వేరొకవంకను యిగ్గుచుండును. అయితే పైనజెప్పిన ప్రసంగములలో ననేకచోట్ల యింద్రియవృత్తులకును, శాస్త్రములకును విరోధముండక శాస్త్రములకే విహితమైన యిట్టి రెండుధర్మములకు పరస్పర విరోధముగాగ యిది చేయవలయునా లేక యది చేయవలయునా యనుదాని సూక్ష్మమును విచారించుట ఆవశ్యకముగా యున్నది. మరియు వీటిలో కొన్ని విషయముల నిర్ణయము పూర్వపు సత్పురుషులట్టి సంధర్భమందుఁ జేసిన వర్తనబట్టి సామాన్య మనుష్యులు తన బుద్ధివల్లనే యొకవేళ జేయుటకు సాధ్యముగనుండినను, యితరసందర్భములయందు బుద్ధిమంతులమనస్సుగూడా తత్తరబడుచున్నది. ఏలయన యెంతెంత అధికముగా విమర్శజేసెదరో యంతంత నెక్కువగా కోటిలు ఉపపత్తులు నిష్పన్నములై కడపటినిర్ణయము చేయుట దుర్ఘటమాచున్నది. మరియు యోగ్యమైన నిర్ణయము గలుగని యెడ మనచేతినుండి యధర్మమో లేక తప్పో కలుగుట కవకాశముగలుగును. ఇవ్విధమున పరీక్షించిన యెడల ధర్మాధర్మముల లేదా కర్మాకర్మముల వివేచనమనునదే యొక స్వతంత్రము శాస్త్రముగ నేర్పడి న్యాయ వ్యాకరణములకంటే యయ్యదియే విశదముగ నున్నట్లగపడును. "నీతిశాస్త్ర"మను శబ్దము పాతసంస్కృతగ్రంథములయందు విశేషముగా రాజనీతిశాస్త్రమునకే యన్వయించుచుండుటచే కర్తవ్యాకర్తవ్య శాస్త్రమునకు "ధర్మశాస్త్ర"మని పిలుచుట ప్రాచీనపద్ధతిగానున్నది. అయితే "నీతి" యను శబ్దమందే కర్తవ్యము లేదా సద్వర్తనముకూడా జేరియుంటచే మన యిప్పటి పద్ధతిప్రకారము ధర్మాధర్మము యొక్క లేదా కర్మాకర్మము యొక్క వివేచనమునకే "నీతిశాస్త్రమని" యీ గ్రంథమందు ప్రయోగించియున్నాము. నీతి యొక్క, కర్మాకర్మముల యొక్క, లేదా ధర్మాధర్మముల యొక్క వివేచనముగల యీ శాస్త్రము గహనమైనదని తెల్పుటకై "సూక్ష్మా గతిర్హి ధర్మస్య" ధర్మముల యొక్క యనగా వ్యావహారిక నీతిధర్మముల యొక్క స్వరూపము సూక్ష్మమైనది. యని మహాభారతమందనేకచోట్ల చెప్పబడినది. పంచపాండవులొక్క ద్రౌపదిని [illegible] పెండ్లాడిరి? ద్రౌ

మఱి వస్త్రాపహరణ కాలమందు భీష్మద్రోణాదులు పాండవపక్షపాతులై యుద్ధమేల జేయ
గూర్చొనిరి? లేదా దుష్టదుర్యోధనునివైపున యుద్ధముచేయునప్పుడు భీష్మద్రోణులు
స్వసమర్థనార్థము చెప్పిన " అర్థస్య పురుషో దాసః దాసస్త్వర్థో నకస్యచిత్ " పురు
షుడనువాడు అర్థమునకు దాసుడు; అర్థమెవ్వనికి దాస్యము చేయదు ( మభా భీ
43.35 ) అను నీ తత్వము సరిగానున్నదా లేదా తప్పా? ఎప్పుడైనను " సేవా
శ్వవృత్తిరాఖ్యాతా " (మను 4.6) సేవాధర్మము కుక్కవృత్తివలె హేయమని
త్యజింపవలసియుండినచో, అర్థదాసులగుటకంటెను భీష్మద్రోణాదులు దుర్యోధనుని
సేవయేల విడువరైరి! యను యిత్యాదిప్రశ్నలకు యోగ్యమైన నిర్ణయము చేయుట
మిగులకష్టము ఏలయన యిట్టి సంధర్భములయందు వేరువేరు జనులు ప్రసంగాను
సారము వేరువేరు అనుమానములను లేక నిర్ణయములను చేయుచున్నారు.
" సూక్ష్మాగతిర్హి ధర్మస్య " ( మ భా అను 10 70 ) ధర్మముల తత్వము సూక్ష్మ
ము, యను టింతయు గాదు, అయితే ముందు " బహుశాఖాహ్యనంతికా " దాని
నుండి యనేక కొమ్మలు పుట్టనులేర్పడి ఏలి దానియందుత్పన్నమగు అనుమాన
ములుసహా వేరువేరుగా నుంటున్నవి. యని మహాభారతమందే చెప్పబడినది. ( మ
భా శాం 20-8.2 ) తులాధార జాజలి సంవాదమందు; తులాధారుడుకూడా ధర్మ
మునుగురించి వివేచనము చేయునప్పుడు " సూక్ష్మత్వాన్న సవిజ్ఞాతుం శక్యతే
బహునిహ్నవః " ధర్మము సూక్ష్మముగానుండుటచే యనేకవేళలయందు దానిని
తెలుసుకొనుట కష్టముగా నున్నదని జెప్పియున్నాడు. ( శాం 261.37 )
మహాభారతకారునకి సూక్ష్మప్రసంగములు సంపూర్ణముగా యవగతమై యుండినం
దున యిట్టి ప్రసంగములయందు ప్రాచీన మహాపురుషు లేమిజేసిరను విషయము
చెప్పుకారణమునకే మహాభారతమందు వేరువేరు కథల సంగ్రహము జేసి యు
న్నాడు. అయితే సర్వవిషయములను శాస్త్రీయరీత్యా విమర్శజేసి వాటియందలి
సామాన్య మర్మమును భారతమువంటి ధర్మగ్రంథ మందెచ్చటైనను జెప్పవలసిన
యావశ్యకముండెను. ఈ మర్మము నర్జునుని కర్తవ్యమోహమందు వేయుటకు
గాను శ్రీకృష్ణుడు పూర్వమందే యుపదేశముచేసెనో దానిని యనుసరించి
వ్యాసుడు భగవద్గీతయందు ప్రతిపాదించియున్నాడు; దానివల్ల గీతయనునది మహా
భారతముయొక్క రహస్యోపనిషత్తుగను శిరోభూషణముగను యుండుటయేగాక,
మహాభారతమనునది గీతయందు జెప్పబడినమూలభూత కర్మతత్వములకు సుదా

[illegible] కూడిన విస్తృత వ్యాఖ్యానముగా నున్నది. గీతాగ్రంథము మహాభారతమందు ( మహాభారతము వ్రాసినపిదప ) తరువాత చేర్చబడియున్నదను శంకగలవారు యీ విషయము నావశ్యకముగా లక్ష్యముంచవలెనని నా సూచన. తర్యోల గీతాగ్రంథమున కైనను యపూర్వతా లేక విశేషత్వ మొకవేళ యుండి నచో నదియ్యది యిదియు. ఏలయన. కేవల మోక్షశాస్త్రమును యనగా వేదాంతమును ప్రతిపాదించు నుపనిషదాది, అహింసాది సదాచరణములయొక్క పట్టినియమముల స్మృత్యాది గ్రంథము లనేకములుగా నుండినను, వేదాంతమందలి గహన తత్వజ్ఞానముయొక్క యాధారముతో కార్యాకార్య వ్యవస్థను చేయు గీతవంటి మరొక ప్రాచీనగ్రంథము యిప్పటివరకు సంస్కృత వాంఙ్మయమునందేదియు నగబడదు. “ కార్యాకార్య వ్యవస్థితి ” యను యీవాక్యము నా స్వకపోల కల్పితము గాదు, గీతయందే చెప్పబడియున్నది. ( గీత 16,24 ) యను విషయమిది గీతాభక్తులకు చెప్పుట యనావశ్యకము. భగవద్గీతవలె యోగవాసిష్ఠయందునూ జ్ఞానమూలక ప్రవృత్తిమార్గమునే వసిష్ఠుడు రామున కుపదేశించియున్నాడు. అయితే గీతకు తరువాత బుట్టినవియూ గీతనే యనుకరణ చేయునటువంటివియూ నగు యిట్టిగ్రంథములచే, గీతయొక్క పైచెప్పబడిన యపూర్వతకు యేలాటి బాధకములు లేక కొరత గలుగదు.

శ్రీ

# భగవద్గీత ప్రథమాధ్యాయము.

## అర్జునవిషాదయోగము.



ఇది

బళ్ళారిలో వకీలుగానుండిన

కీ. శే. బ్రహ్మశ్రీ॥ కోలాచలం శ్రీనివాసరావుగారిచే

రచియింపఁబడినది.

కె. శత్రుఘ్నరావుచేఁ

ప్రకటింపఁబడియె.



మొదటికూర్పు.




బళ్ళారి.

ఆంధ్రముద్రాక్షరశాలయందు

ముద్రితము.

**1925.**





వెల అ. 0—8—0

శ్రీ

# భగవద్గీత ప్రథమాధ్యాయము

## అర్జునవిషాదయోగము

---

"హరి - ఓం"

ఆర్యులలో జరిగిన గొప్పయుద్ధములలో భారతయుద్ధము మిగుల గొప్పది. ఈ యుద్ధమార్యులు పంజాబుఁజేరిన పెక్కువత్సరములకు జరిగినది. అక్కాలమునకు మున్నే వర్ణాశ్రమ ధర్మములు జాతికట్టుబాట్లు మతవిధులు గల స్మృతు లేర్పడియుండెను. జాతికలహములు, మతవిరోధములు, రాజ్యాధికారవైషమ్యములు, పెచ్చుపెరిఁగియుండెను. ఋగ్వేదమునాటి యార్యుల నైకమత్యమునకు నన్నివిధముల భంగముకలిగియుండెను. జనుల నైతిక ప్రవర్తనములు చెడియుండెను. ధర్మ మడుగంటుచుండెను. దుష్టచేష్టలు దురాశలు బలమయియుండెను. జనులు విశేషముగ సప్తవ్యసనములకు లోఁబడియుండిరి. అనేకు లాస్తికత్వమునందు దృఢవిశ్వాసములేక నాస్తికవాదములు సలుపుచుండిరి. ఏకచ్ఛత్రాధిపత్యముచెడి స్వతంత్రరాజ్యములు పెక్కులయియుండెను ఒకరాజ్యమును మఱియొకరాజాక్రమింప నువ్విళ్లూరుచుండెను. రాజులు ధర్మవిధులుమాని యధర్మవిధు లనేకములాచరించుచుండిరి. బ్రాహ్మణులు స్వధర్మములుమాని రాజసేవకులుగ మనుచుండిరి. అయినను ప్రాచీనాచారపరులును, ధర్మనిష్ఠైకచిత్తులును, సత్యవాక్యపరిపాలకులును గొందఱచట నచట నుండిరి. ముఖ్యము ద్వాపరధర్మములు మాసిపోయి కలియుగధర్మములు వాసికెక్కుచుండెను. ఇట్టికాలమునందు భారతయుద్ధము సంభవిల్లెను. ఈ యుద్ధమునకు మూలకారణములు భారతమునుఁ జదివినట్టిన్ని విన్నట్టిన్ని హిందువులగు మనకెల్లరకుఁ జక్కఁగఁ దెలిసియుండునని నే నమ్మినాను. అప్పటిలోనుండిన రాజ్యములలో గొప్పరాజ్యము హాస్తినావతి. ఆ రాజ్యమును శంతనవంశజుఁడయిన ధృతరాష్ట్రుఁ డేలుచుండెను. ఆ ధృతరాష్ట్రుఁడు పుట్టంధుఁడయినందున యతనికొమారుఁడు దుర్యోధనుఁడు రాజప్రతినిధిగ రాజ్యమేలుచుండెను. రాజనియును రాజ రాజనియును గ్రంథములలోనెల్ల దుర్యోధనుని సంబోధించిరి. రాజునకుఁగల స్వా

తంత్ర్యములెల్లను దుర్యోధనునకునుండెను. ఆబాల్యముగ దుర్యోధనుఁడు తన పినతం
డ్రికొమారులగు పాండవులపైఁ బగఁజాటుచుండెను. అందున భీముని నాజన్మద్వే
షిగఁ జూచుచు ననేకవిధములగు కష్టములకు గుఱిఁజేసెను. దుర్యోధనుని దుష్కృ
త్యములనుబట్టి భారతయుద్ధము సంభవిల్లెను. ఈ యుద్ధముజరిగినస్థలము కురుక్షే
త్రము. ఇది ఋగ్వేదకాలమునుండి పుణ్యక్షేత్రమని ప్రసిద్ధికెక్కినస్థలము. అనేక
పుణ్యపురుషులు తపస్సుచేసిన ధర్మక్షేత్రంబిది. ఈ క్షేత్రము యమునాసరస్వతీ
నదుల మధ్యనున్నది. దీనినే యార్యావర్తమని మనవారు పిలుచునది. దీనినే బ్రహ్మ
ర్షి దేశమనిన్ని సకలదేశజనులు సమస్తాచార విచారములు నిందుండు బ్రాహ్మణుల
యాచారములరీతిగ నుండవలెననిన్ని మనుస్మృతిలోఁ బలుకఁబడినది. ఇదియే కురుక్షే
త్రమని పిలువఁబడుచున్నది. కురువనువాఁడు భరతవంశములో గొప్పరాజు. హస్తినా
వతికే ఢిల్లియని యిప్పటినామము. ఈ పురిపురోముఖముననుండు గొప్పబయలు
స్థళమే భారతయుద్ధభూమి. ఈ స్థళమునందే పరశురాముఁడు పృథ్విని నిక్షత్రమొన
రించి పితృతర్పణమొనరించినది. కావుననే యది క్షేత్రస్థానమైనది. గొప్పయుద్ధము
లెల్ల నాస్థళమునందే యయినవి. ఇట్టిస్థళమునందుఁ బదునెనిమిది యక్షోహిణీసేనఁ
గూడి పదునెనిమిదిదినములు భయంకరయుద్ధముజరిగెను. పదునెనిమిది యక్షో
హిణీ సేనలోఁ బదునొకండక్షోహిణీసేన దుర్యోధనునిదిక్కున నుండినది. మిగత
యేఁడక్షోహిణీసేన పాండవులదిక్కున నుండినది. అక్షోహిణీయనఁగా 21870 రథ
ములును, 21870 ఏనుఁగులును, 65610 గుఱ్ఱములును 109350 కాల్బలమునుగల
సేన. ఈరీతిగానుండెడి నిరువదిలక్షలసేన పదునెనిమిదినములు ఘోరసంగ్రామమొ
నర్చి మడసెను. హతశేషులుగ నిలిచినవారు పాండవులైదుగురును కృష్ణసాత్యకు లిరు
వురును పాండవులదిక్కునను నశ్వత్థామ కృప కృతవర్మలను మువ్వురు దుర్యోధ
నునిదిక్కునను నిలిచిరి. ఈ భారతయుద్ధవివరము వ్యాసులచేఁ వర్ణింపఁబడినది. ఈ
గ్రంథములో ననేకములగు నుపకథ లితరులిటీవల చేర్చినారని విద్యావంతులు
కొందఱు తాత్పర్యపడినారు. ఆ విషయమింతకుమున్ను నాచే వ్రాయబడిన “భారత
భగవద్గీతలవిమర్శన” మను నుపన్యాసములోఁ బలికినాను. మరల నిచట నా
విషయమే వ్రాయుట పునరుక్తమగును. యుద్ధప్రారంభమునకుమున్ను మహర్షి
వేదవ్యాసులు ధృతరాష్ట్రునిఁజేరి “ధృతరాష్ట్రా! నీవు యుద్ధము చూడఁగోరితి
వేని నీకుఁగన్నులిచ్చెద” నని నుడివెను. అపుడు ధృతరాష్ట్రుఁడు “స్వామీ! రణ

రంగమున స్వజననాశన మనుఘోరకర్మము నేఁ గన్నులఁ జూడఁజాలనుగావున నే దానిఁ జూడకయే యచ్చటజరుగుసకలసంగతులు నాకుఁదెలియులాగొనర్చు" మని వేఁడికొనెను. అప్పుడు సంజయుఁ డనుధృతరాష్ట్రునియాప్తునకు వ్యాసులు దివ్యచక్షువులిచ్చిరి. ఆ మహిమచే సంజయుఁడు రణరంగముఁజేరి శస్త్రాస్త్రములకు లక్ష్యభూతుఁడుగాక తిరోధానుఁడుగనుండి యెచటనెచట నేమేమి, రహస్యముగఁ గాని బాహ్యముగఁగాని జరుగుసంగతుల నెఱిఁగి ధృతరాష్ట్రునకుఁ దెలుపుచుండెను. ఆరీతిగ సంజయునివలనఁ బలుకఁబడిన విషయములలోఁ బ్రారంభముఖ్యవిషయ మీ గీతాంశము. ఈ యంశమునే వేదవ్యాసులు తమకవిత్వరచనాకౌశల్యమును నగపరచుచు "భారతనామమున రచించినగ్రంథములోని భీష్మపర్వములో వివరించిరి" యుద్ధప్రారంభ దినాంతమున సంజయుని ధృతరాష్ట్రుఁడుచూచి యీ క్రింద పలికినరీతిగఁ బ్రశ్నించెనఁట.

" ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।
" మామకాః పాండవాశ్చైవ కిమకుర్వతసంజయ ॥

సంజయా! యుద్ధముఁజేయఁదలంచి ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమునందుఁ గూడిన నావారును పాండవులును నేమిచేసిరి?

ఈ శ్లోకమునకుఁ బండితమ్మన్యులొనరించిన యనేక విపరీతార్థములు నేనిదివరలోవ్రాసినాను. కావున మరల వానినే వ్రాయుట యనావశ్యకంబని వదలితిని. ఆ కురుక్షేత్రము ధర్మక్షేత్రమయినందున నచ్చట నేపని యొనర్చినను ధర్మమే జయించుననియు నధర్మమడుగంటుననియును నార్యులతాత్పర్యము. ధృతరాష్ట్రునిచే నారీతిగఁ బ్రశ్నింపఁబడి సంజయుఁడీరీతిగఁ బలుకుచున్నాఁడు.

2 " దృష్ట్వాతుపాండవానీకం వ్యూఢందుర్యోధనస్తదా ।
ఆచార్యముపసంగమ్య రాజావచనమబ్రవీత్ ॥

3 " పశ్యైతాంపాండుపుత్రాణా మాచార్యమహతీంచమూం ।
వ్యూఢాంద్రుపదపుత్రేణ తవశిష్యేణధీమతా ॥

4 అత్రశూరా మహేష్వాసా భీమార్జునసమాయుధి ।
యుయుధానోవిరాటశ్చ ద్రుపదశ్చమహారథః ॥

5 ధృష్టకేతుశ్చేకితానః కాశిరాజశ్చవీర్యవాన్ ।

పురుజిత్కుంతిభోజశ్చ శైబ్యశ్చనరపుంగవః ॥

6 యుధామన్యుశ్చవిక్రాంత, ఉత్తమౌజాశ్చవీర్యవాన్ ।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వఏవమహారథాః ॥

7 అస్మాకంతువిశిష్టాయే తాన్నిబోధద్విజోత్తమ ।
నాయకా మమసైన్యస్య సంజ్ఞార్థంతాన్‌బ్రవీమితే ॥

8 భవాన్‌భీష్మశ్చకర్ణశ్చ కృపశ్చసమితింజయః ।
అశ్వత్థామావికర్ణశ్చ సౌమదత్తిస్తథైవచ ॥

9 అన్యేచబహవశ్శూరా, మదర్థేత్యక్తజీవితాః ।
నానాశస్త్రప్రహరణా, స్సర్వేయుద్ధవిశారదాః ॥

10 అపర్యాప్తంతదస్మాకం బలంభీష్మాభిరక్షితం ॥
పర్యాప్తంత్విదమేతేషాం బలంభీమాభిరక్షితం॥

11 అయనేషుచసర్వేషు యథాభాగమవస్థితాః ।
భీష్మమేవాభిరక్షంతు భవంతస్సర్వఏవహి ॥

ధృతరాష్ట్రా! వ్యూహాకారముగఁ బన్నినపాండవసేనను దుర్యోధనుఁడు చూచి ద్రోణాచార్యులసరసకుఁజని యిట్లనియెను. ఆచార్యులవారూ! ద్రుపదుని కొమారుఁడును దమశిష్యుఁడును, బుద్ధిమంతుఁడును నగుధృష్టద్యుమ్నునిచే వ్యూహాముగ నియమింపఁబడిన గొప్పదియగు సేనను జూడుఁడు. ఆ సేనలో శూరులును ధనుర్ధరులును యుద్ధములో భీమార్జునులతో సమానులును నగు వారినిఁ జూడుడి. వారెవరనఁగా యుయుధానుఁడు, విరాటుఁడు మహారథుఁడగు ద్రుపదుఁడు, ధృష్టకేతుఁడు, చేకితానుఁడు వీర్యవంతుఁడగు కాశీరాజు; పురుజిత్తు, కుంతిభోజుఁడు నరశ్రేష్ఠుఁడగు శైబ్యుఁడు, పరాక్రమముఁగల యుధామన్యుఁడు బలముఁగల యుత్తమౌజుఁడు, అభిమన్యుఁడు, ద్రౌపది కొడుకులునున్నవారు వీరందఱును మహారథులు. బ్రాహ్మణోత్తమా! ఇఁక నాసేనకు నాయకులును మనలో గొప్పవారునునగు వారినిఁ దెలియఁజెప్పెదను వినుఁడు. మీరును భీష్ముఁడు, కర్ణుఁడు, యుద్ధములో జయమునుబొందు కృపాచార్యులును, నశ్వత్థామ, వికర్ణుఁడు, భూరిశ్రవుఁడును వీరుగాక యింక ననేకశూరులున్నగలరు, నాకొఱకుఁ దమ జీవితముల వదలుకొందురు. అనేకవిధములగు శస్త్రములను ధరించినవారు, అందఱు యుద్ధములో నేర్పుగల

వారు. భీష్ముని చే రక్షింపఁబడిన మనబలము చాలదు భీముని చే రక్షింపఁబడు బలము చాలును. కావున మీరందఱును నాయామార్గములలో వంతులప్రకారము నిలువఁబడి భీష్ముని రక్షించుచుండవలెను.

ఈ శ్లోకములందు దుర్యోధనుఁ డుభయబలముల బలాబలముల నిర్ణయించుచు, సేనాధిపతియగు భీష్ముని నెల్లరే మఱక రక్షించుచుండవలెనని ద్రోణాచార్యులను నడిగి కొనుచున్నాడు. దుర్యోధనుఁడు రాజుగ నభిషిక్తుఁడుగాకయున్నను [illegible] ధృతరాష్ట్రుం డంధుఁడయినందునను దుర్యోధనుఁడే జ్యేష్ఠపుత్రుఁడయి యువరాజాగను. ఈ కారణమున బహుకాలమునుండియు దుర్యోధనుఁడే రాజుగ నెన్నఁబడియుండెను. కావున దుర్యోధనునిది యధర్మయుద్ధముగ నున్నదని తెలిసియున్నను భీష్మద్రోణాదులు తమ రాజునానతిరీతి ధర్మాత్ములగు పాండవులపైన రణమొనర్ప సమకట్టిరి. అన్యాయము దుర్యోధనునిది యని తెలిసియున్నను ధర్మాత్ములును జ్ఞానులును, వయోవృద్ధులును నగు భీష్మ ద్రోణాదులు దుర్యోధనుని పరముగ తమ వీరశూరత్వములు ధర్మస్వరూపులగు పాండవుల పైనఁ బ్రసరింపఁ జేసినది మనకుఁ జిత్రముగఁ గనఁబడుచున్నది గదా; ఈ విషయమున భీష్ముఁడు పలికిన సమాధానమును నేను మతియొకయుపన్యాసములో వ్రాసియున్నాను. తాను దుర్యోధనుని కొలువున నున్న కారణంబున వానిపరము యుద్ధమాడితినని భీష్ముఁడు పలికెను. అది మనకు విస్మయావహముగ నుండును. అయితే భారతకాలమున నుండిన రాజనీతులును క్షత్రియధర్మములును, యుద్ధనిబంధనలును, యోధుల కట్టుబాట్లును మన మెఱింగినచో భీష్మాదుల ననుసరించినది ధర్మమార్గమే యని మనకుఁ దోఁపకమానదు. రాజు యొక్క పోష్యవర్గములోఁ జేరినవాఁడెవఁడును రాజునానతిరీతిగఁ దానొనర్పఁ బోవుపని ధర్మమా యధర్మమా యని విచారించునది యనవశ్యకము. ఇది స్వామి భృత్యన్యాయము ననుసరించినది. రాజే భూలోకదైవమని యార్యుల దృఢాభిప్రాయము. కావున రాజాజ్ఞాభంగము దైవవిరోధమని జను లెన్నుచుండిరి. అటుకాక దేశము సుభిక్షముగ నుండు కాలమున రాజమర్యాద లందుచు యుద్ధసమయమున భటులు తమ యిష్టానుసారము ధర్మాధర్మవివేచన మొనర్చి రాజసేవ మానినచో రాజ్యనిబంధన లెవ్వియును నిలువవు. ప్రతిరాజ్యము నరాజకమగును. జనుల ధనధాన్యాభివృద్ధికిగాని క్షేమమునకుఁ గాని నిలుకడయుండదు. సాంఘికబలమునకుఁగాని నీతికిఁగాని ప్రోత్సాహముండదు. కొన్ని సమయములందీ కట్టుబాట్లకులోఁబడుట చే నధర్మప్రవృత్తి ననుసరించిన

వారయినను దీనినుండి కలుగు చెడు గంతగనుండదు. వైదికలౌకికవ్యవహారములును సాంఘికనిబంధనలును, ధర్మాధర్మవిచారములును వర్ణాశ్రమధర్మములును జాతికట్టు బాట్లును రాజశాసనములకు లోనయి యభివృద్ధి చెందుచుండెను. కావునరాజశాసనధిక్కారక మెట్టికాలమునన్నైనను జేయఁగూడదనియును నటులొనరించినచో రాజదండనయేగాక రౌరవాది నరకప్రాప్తి యనుభీతి యప్పటివారికినుండెను. ఇక్కారణంబుననె భీష్మద్రోణాదులు దుర్యోధనుని శాసనమును మీరలేరైరి. ఇఁక నుభయసేనల బలాబలనిరూపణము భీష్మకర్ణాదులయెదుటఁ జేయక ద్రోణాచార్యులయెదుటఁ జేయనేలయని ప్రశ్నింపనగును.

ద్రోణాచార్యులు తనకు శస్త్రాస్త్రగురువయినందున తనశిష్యుని జయముకొరకై శౌర్యమెల్ల వినియోగింపవలెనను తలంపున్నైన నుండనగును. కాదేని ద్రోణాచార్యులకు ద్రుపదునిపైఁగల పగను సాధింపఁజాలివచ్చెనని తెలియఁజేయుచు ద్రుపదుఁడు శత్రుసేనను జేరి యుద్ధమునకు వచ్చినాడనియును ద్రుపదుని కొమారుఁడును ద్రోణాచార్యులను జంపుటకై పుట్టినవాఁడునునగు ధృష్టద్యుమ్నుఁడు, శాత్రవసేనాధిపతిగ నున్నవాఁడనియును దెలిపి ద్రోణాచార్యులక్రోధము హెచ్చింపఁదలంచి యయిన నుండనగును. ధృష్టద్యుమ్నుఁడు ద్రోణాచార్యులవద్ద శస్త్రాస్త్రవిద్యనేర్చినవాఁడు. కావుననే యోధాగ్రగణ్యుఁడయ్యెనని యాచార్యులను శ్లాఘించుచు ధృష్టద్యుమ్నుఁ డుపకారముతలంపక విద్యాగురువులకు నపకారమొనర్ప వారిపైననే యుద్ధమొనర్పవచ్చినాడను క్రోధము నింపఁదలంచియుండుననని తోఁచెడు. దుర్యోధనునిచేఁ జెప్పఁబడిన యోధులలోఁగొన్ని నామములు విశేషముగ. వాడుకలోలేనివియు యుధామన్యుఁడన సాత్యకి, ధృష్టకేతుఁడనచేది రాజు. ద్రౌపదేయులన 1. ప్రతివింధ్యుఁడు 2. సుతసోమ 3. శ్రుతకీర్తి 4. శతానీక 5. శ్రుతసేన; వీరైదుగురు క్రమముగ ధర్మ భీమార్జున నకుల సహదేవులకు ద్రౌపదియందుద్భవించిన కొమారులు, పై శ్లోకములో యోధులు మహారథులని పొగడఁబడినారు. మహారథుఁడనఁగా రథమునందుండి 10000వేల ధనుర్ధారులగు యోధులతో యుద్ధమొనర్చువాఁడు. ఒకరథమునందుండి తనకుసమానుఁడగు మఱియొక మహారథునితో యుద్ధమొనర్చువాఁడు సమరథుఁడు. అనేక సమరథులతో యుద్ధమొనర్చువాఁడతిరథుఁడు, పైరీతిగ శాత్రవయోధులను వివరించి యిఁకఁ దనసేనలోనున్న యోధవీరుల నిరూపించుచు వారినెల్లరిని [illegible] వారియందు మీరు

సంప్రాప్తే లక్ష్యమగుచుండగా తెలిపెదనని వాక్రుచ్చెను. సోమదత్తియనువాఁడు బాహ్లీకరాజగు సోమదత్తుని కొమారుఁడు. ఇందఱు యోధులు మనదిక్కునసుండియు భీష్మునిచే రక్షింపఁబడినట్టిదియు నైనను మనబలము చాలినంతగ్గాలేదు. భీమాభిరక్షితమగు శాత్రవసేన తగినంతయున్నదని దుర్యోధనుఁడు వచించినది విచిత్రముగనున్నది. ఏలయన దుర్యోధనుని బలము పదునొకండక్షౌహిణులు, పాండవసేన యేడక్షౌహిణులు. అయినను తనబలము తక్కువయని పలుకుటఁజూడ జయము కలుగునో కలుగదోయను సందేహమునైన నుండనగును. కాదా భీష్ముఁడు ముదుసలియేగాక పాండవ పక్షపాతియయిన కారణముచేతఁ దనబలము హెచ్చుగనుండినను తక్కువేయనియును జయోత్సకుఁడగు భీమునిచే రక్షింపఁబడు సేన తక్కువగానున్నను హెచ్చుబలము కలదగుననియును దుర్యోధనుని యభిప్రాయముండవలయును. భీష్ముఁడు పాండవపక్షపాతియాయెను. భీముఁడో కోలుపోయిన సర్వస్వమును సాధించికొనుటకుఁ జట్టుపట్టినవాఁడగుటయేగాక దుర్యోధన దుశ్శాసనాదులను రణరంగమునఁ జంపెదనని ప్రతిజ్ఞపలికినవాఁడు కావున జయముకలుగునో కలుగదోయను సంశయాకులమానసుఁడయి దుర్యోధనుఁడు తనబలమెంతయు హెచ్చుగనుండినను దక్కువయనియే తలంచెను. అయినను సేనాధిపతియగు భీష్ముని నన్ని విధముల నన్నిదిక్కుల రక్షింపవలెనని పలికెను. కారణమేమనిన సేనాధిపతి పడిపోయినచో సేనయంతయును దిక్కుదిక్కునకుఁ జెదిరిపోయి యపజయము సిద్ధించును. ధృష్టద్యుమ్నుఁడు సేనాధిపతిగనుండఁగ "బలంభీమాభిరక్షితం" యనఁ గారణంబేమనిన ఆదినమున వజ్రనామక వ్యూహమునురచించి దానిని రక్షింప భీముని నియమించియుండిరి.

"భీష్మమేవాభిరక్షంతు" యని హెచ్చరించుటకు రెండవకారణంబేమనిన, శిఖండిపైఁ దాను బాణములు వేయనని భీష్ముని ప్రతిజ్ఞ కావున శిఖండిదిక్కునుండివచ్చు బాణములచే భీష్ముడు నొచ్చునేమోయను సందేహము. వైరిరీతిగఁ బలికిన పలుకులువిని దుర్యోధనునకు ధైర్యమిచ్చుటకుఁగాను.

12 "తస్య సంజనయ న్హర్షం కురువృద్ధః పితామహః ।
"సింహనాదం వినద్యోచ్చైః శ్శంఖం దధ్మౌప్రతాపవాన్ ,

13 తత శ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః,
సహాసైవా భ్యహన్యన్త స శబ్ద స్తుములో భవత్.

14 తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ,
మాధవః పాణ్డవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః.

15 పాఞ్చజన్యం హృషీకేశో దేవదత్తం ధనఞ్జయః,
పౌణ్డ్రం దధ్మౌ మహాశఙ్ఖం భీమకర్మా వృకోదరః.

16 అనన్తవిజయం రాజా కున్తీపుత్రో యుధిష్ఠిరః,
నకులః సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ.

17 కాశ్యశ్చ పరమేష్వాసః శిఖణ్డీ చ మహారథః,
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చా పరాజితః.

18 ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే,
సౌభద్రశ్చ మహాబాహుః శఙ్ఖాన్దధ్ముః పృథక్పృథక్.

19 స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్,
నభశ్చ పృథివీఞ్చైవ తుములో వ్యనునాదయన్.

20 అథ వ్యవస్థితాన్దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,
ప్రవృత్తే శస్త్రసమ్పాతే ధనురుద్యమ్య పాణ్డవః.

భీష్ముఁడు పెద్ద సింహనాదమొనర్చి గట్టిగ శంఖమునూదెను. పిమ్మట పక్కనవారును శంఖములు, భేరులు, పణవములు, ఆనకములు, గోముఖములు, మొదలగువానిని వెంటనేవాయించిరి. ఆ చప్పుడు దిక్కులంతటను సంకులముగ వ్యాపించినది. తరువాత తెల్లనిగుఱ్ఱములుగట్టిన గొప్పరథము మీదఁగూర్చుండి శ్రీ కృష్ణుఁడు పాంచజన్యమును, నర్జునుఁడు దేవదత్తమను శంఖమును, భయంకరవ్యాపారముగల భీముఁడు పౌండ్రమను శంఖమును, ధర్మరాజనంతవిజయమను శంఖమును, నకులుఁడు సుఘోషమను శంఖమును, సహదేవుండు మణిపుష్పకమను శంఖమును నూదిరి. ధనుర్ధరుఁడగు కాశిరాజు, మహారథుఁడగు శిఖండి, ధృష్టద్యుమ్నుఁడు విరాటుఁడు, అపజయములేని సాత్యకి, ద్రుపదుఁడు, ద్రౌపదేయులు మహాబాహుండగు నభిమన్యుఁడు వీరందఱును దమతమ శంఖములను వేఱువేఱుగ నూదిరి. ఆ చప్పుడు సంకులమై భూమ్యంతరిక్షములు నిండునట్లు ప్రతిధ్వనియిచ్చుచు దుర్యో

యస్త్రరహస్యములను దనకుఁ దెలిపిన విద్యాగురువులగు ద్రోణాచార్యులు, తన పినతండ్రికొడుకులు, స్వజనులు బంధువులు మిత్రులు వీరినిఁజూచి వీరందఱు చనిపోయెదరేయని జాలిఁజెందుట యాశ్చర్యము కాదు. అయినను శ్రీ కృష్ణుఁడీ యస్త సుని విషాదము ధర్మవిరుద్ధమని భగవద్గీతలోఁ బలుమారుపదేశించినారు. కావున శ్రీ కృష్ణులయుపదేశము సధర్మమా యధర్మమాయని విమర్శింపఁదగినదిగనున్నది. పరహింసనింద్యము. అట్టిన స్వజనహింస యంతకంటెనింద్యము. ఈ యర్థము గీతలోనే యచ్చటచ్చటఁ జక్కఁగ బోధింపఁబడినది. అయినను యుద్ధమునల్పి శాత్రవులఁ జంపుమని భగవంతుఁడర్జునునకు నుపదేశించును. ధర్మస్థాపనము కృష్ణుని ముఖ్యోద్దేశము. యుద్ధము ధర్మస్థాపనమునకు మూలకారణము. యుద్ధమునందు ధర్మమేజయమగునని విశ్వాసము. కౌరవులొనరించునది యధర్మయుద్ధమని శ్రీ కృష్ణుని కొకనికననేల, పాండవులకును నితరులకును దెలియును. అంతయగాక యుద్ధమొనరించునది క్షత్రియధర్మము. దానిని వదలునది యధర్మము. మంచికాలమునందు స్వజనులననేల యెందఱిపైనను బ్రేమఁజూపుట నీతియుతము. పుణ్యావహము. శ్రేయోదాయకము. తన్నుఁ జంపవచ్చిన శత్రువులపై జాలిఁజూపుట యనర్థదాయకము. అంతటిపైనను నంతటి నిష్కళంకమగు ప్రేమనుజూపునంతటి కృతయుగము కాదు. భారతకాలము, ఒకచెంపపైఁగొట్టినచో మఱియొకచెంపనుసైతము కొట్టుమని యిచ్చునంతటి యోగులకాలంబున నందఱునుండలేదు. ఆరీతిగఁ గొట్టించికొనినవానిని జేతకానివాఁడని జనులు నిందింతురు. వాని శాంతిగుణము నెవ్వరును మెచ్చుకొనరు. ఈ విషయంబున నొకచిన్నకథ నిందు బొందుపఱచెదను. ఒకానొక యరణ్యంబున నొకసన్యాసి యొకమఠముఁ గట్టుకొని యందు నివసించుచుండెనఁట. భక్తులనేకులా మహాపురుషునకు బంగారు వెండి పాత్రము లనేకము లిచ్చుచుండిరి. సన్యాసి యావస్తువులనెల్ల మఠములోనేవదలి యోగసాధనమునకుగా నొకగదిలోనికిఁబోయి తలుపులు బిగించికొని లోన సమాధియోగములో దినదినముఁ గూర్చునుచుండును. ఆ సమీపమునందలి యడవిలోనే యొకదొంగయుండి సన్యాసియొక్క స్థితిగతులు చక్కఁగఁగనిపెట్టి యొకదినంబున సన్యాసి సమాధియోగంబుననుండుతఱి మఠములోఁ బ్రవేశించి యందున్న పాత్రలుకొన్ని దొంగలించి మూటఁగట్టుచుండ సన్యాసి యాదినము సమాధియోగము వేగమునముగించి వెలికివచ్చు శబ్దమయ్యెను. ఆ శబ్దమును వినఁగనే దొంగ మూటనెత్తినిడికొని పఱు

గిడసాగెను. సన్న్యాసి వానినిఁజూచి "అయ్యో! ఆ మానవునకు నెంతదారిద్ర్య మున్నదియో యింతటిపనికి నొడఁబడెను. ఇఁకను నిచటఁ గొన్ని వెలగల వస్తువులు వదలిపోయినాఁడు వీనినిన్ని వానికొనిచ్చెద వానికష్టము దీరునని తలంచి యావస్తువులనెల్లఁ దీసికొని, పరుగిడెను. సన్న్యాసి తన్నుఁ బట్టుకొనవచ్చెడునని దొంగ తలంచి ముందుకన్న వేగముగఁ బరువిడసాగెను. ప్రాణాయామ సాధన సంపదనందినవాఁడు సన్న్యాసి కావున కొంతదూరములోనే దొంగను సమీపించి దొంగనుఁజూచి" ఓరీ! యీ వస్తువులేల వదలివచ్చితివి. దీనినిన్ని గొనిపోయి నీ దారిద్ర్యమును దీర్చికొనుమని యిచ్చెను. సన్న్యాసియొక్క నిజమగు విరక్తిమార్గమునకు దొంగ యచ్చెరువంది బుద్ధితెచ్చుకొని జ్ఞానవంతుఁడయి సన్న్యాసికి శిష్యుఁడయ్యెను. అందఱు నిట్టివారుందురా? ఇప్పటిలో నెవఁడయిన నొక మహానుభావుఁడటు లొనర్చినచో సర్వజనులనేల దొంగనైన మట్టివానిని బుద్ధిలేని పిచ్చివాఁడని నిందించుచుందురు. ఇట్టి ధర్మమునే యాంగ్లేయభాషలో ***"Non-resistance of Evil Virtue"*** యని పిలిచెదరు. ఈ సర్వత్యాగగుణము హిందువులకుఁ గలదనిన్ని వీరు వేదాంతము జనులను సన్న్యాసులను బిచ్చగాండ్రను జేయుననిన్ని కొందఱభిప్రాయపడినారు. ఇట్టిగుణము శ్లాఘ్యమని యెన్నఁదగునుగాని యది ప్రాపంచికవిషయములకు సర్వులు విముఖులయియుండిన కృత త్రేతాయుగ ధర్మమగునుగాని భారతయుద్ధకాలపు ధర్మముగాదు కావుననే కృష్ణభగవానులు చెఱుపఁదలంచినవానినిఁ జెఱచుట ధర్మమునిన్ని శాత్రవసంహారము క్షత్రియునకుఁ గ[illegible]యనిన్ని యర్జునునకు బోధించి దయాగుణమును వదలి యుద్ధమొనర్పుమని ముందుఁ బలుకఁబోవుచున్నారు. అర్జునుఁడు ఘోరమగు యుద్ధకర్మ మొనర్పఁజాలక యీవిధముగఁ బలుకుచున్నాఁడు.

29 " దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్,
సీదన్తి మమ గాత్రాణి ముఖంచపరిశుష్యతి,
వేపథుశ్చశరీరేమే రోమహర్షశ్చజాయతే.

30 " గాణ్డీవం స్రంసతే హస్తా. త్త్వక్చైవ పరిదహ్యతే.
నచ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవచ మే మనః

31 " నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ,
నచ శ్రేయోనుపశ్యామి హత్వా స్వజన మాహవే.

32 “ న కాంక్షే విజయం కృష్ణ నచ రాజ్యం సుఖానిచ,
కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగై ర్జీవితేనవా॥

33 “ యేషా మర్థే కాంక్షితం నో రాజ్యభోగాస్సుఖానిచ,
తఇమేవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ.॥

కృష్ణా! యుద్ధముచేయుటకై వచ్చియున్న యీబంధువులను జూడఁగా నా సాయవయవములు శిథిలములగుచున్నవి. నోరెండిపోవుచున్నది. ఒడలు వడకుచున్నది. గగుర్పాటుగలుగుచున్నది. చేతినుండి గాండీవము జారిపోవుచున్నది. చర్మముకాలిపోవుచున్నది. నామనస్సు చంచలమగుచున్నది. కావున నేనిచ్చటనుండఁ జాలను. అపశకునములు కనఁబడుచున్నవి, యుద్ధములో బంధువులను జంపినందున నాకేమియు శ్రేయస్సు కనఁబడలేదు. నాకు జయమక్కఱలేదు. రాజ్యమక్కఱలేదు. సుఖములక్కఱలేదు. బంధువులు చచ్చినపిదప రాజ్యమెందుకు? భోగములెందులకు? తనకు బ్రదుకెందులకు? ఎవరికొఱకై రాజ్యమును భోగములును సుఖములును గోరుచుంటినో వారే ప్రాణములను ధనములను విడిచియుద్ధమునకు వచ్చియున్నారు.

పై శ్లోకార్థములనుండి యేర్పడు ఫలితార్థమేమనిన మనుజుఁడెంతటి స్వార్థపరుఁడయి రాజ్యధనాదు లార్జించినను దా నొక్కఁడే యనుభవింపఁ జాలఁడు. తనకు బలగ తనదార పుత్రబంధుమిత్రస్వజనాదులు లేరేని యట్టి యనుభవము రుచింపదు. అట్టివారితోఁగూడి యనుభవించినది యనుభవము! అదియే సుఖము? అటుకాదేని ప్రపంచమునఁగుటుంబ సుఖముండదు. ప్రాపంచికానుభవమునపేక్షించు నెట్టిమానవుఁడుగాని తానార్జించినధనమునుఁ దానే యనుభవింపశక్తుఁడుకాడు. తాను, తనకుటుంబము, తనబంధుమిత్రాదులు, తన సంఘము మొదలగువారితోఁ గూడి యనుభవించుటయేమనుజు. సహజగుణము తనకు నెట్టియు వలదని వివాహాదులుమాని యేకాకిగనుండు వానికిఁగష్టములు హెచ్చుగనుండవనుట నిజమగునుగాని యట్టివాఁడు ప్రపంచములో ననుభవింపదగినసుఖములకు దూరుఁడుగనుండును. అట్టివానికి ప్రపంచసుఖము లెట్టివోయును దెలియవు, కావున నే నరుఁడు జనసంఘములో నొక్కఁడయిసర్వసుఖానుభవములందవలెను. పైవిషయము లెల్లయుభయులుసంతాపింపఁబడెను [illegible] భగవంతునిఁ జూచి కృష్ణా! యుద్ధమునకుండున్న వారెవరనఁగా; ఆచార్యులు, తండ్రులు, కొడుకులు,

తాతలు, మేనమామలు, మామలు, మనుమలు, బావమరదులు, బంధువులుగదా! వీరిని నేఁ జంపనిచ్ఛయింపను.

35 " ఏతాన్న హన్తుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన,
అపి త్రైలోక్య రాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే॥

మధుసూదనా; వారునన్నుఁజంపినను మేలే; మూఁడులోకముల రాజ్యము వచ్చినను సరియే వారినిఁజంప, నేఁదలంపను. ఇఁక భూమికొఱకు నేనెట్లుచేసినిఁ జంపను. ఇచట త్రిలోకమున " భూర్భువస్సువ " యనెడురీతి స్వర్గము భూమి యంతరిక్షములని యర్థము చేయుచున్నారు. స్వర్గమర్త్యపాతాళములని నాకుఁదోఁచుచున్నది. ఈ మూఁడులోకములందు మిన్న యనిపిలువఁబడునదైననియే మహా నపుని సంపూర్ణాభిలాష. ఇట్టి త్రైలోక్య పదవి సైతము తనకువలదని యర్జునుఁడు మఱియొక కారణమును దెలుపుచున్నాడు.

36 " నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యాజ్జనార్దన,
పాపమేవా శ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః

జనార్దనా; ఈ దుర్యోధనాదులను జంపుటచేమనకేమి సంతోషమున్నది. ఆతతాయినులైనను వారినిఁజంపుటచే మనకుపాపమే చుట్టుకొనును. ఆతతాయినులనఁగా జనులనుజంపయత్నించువారని యర్థము. గృహదాహకులు, విషమిడువారు, నిశ్శాతకముగ శస్త్రపాణులై జనులను జంపువారు, పరుల భూములను, ధనమునుదారలను నపహరించువారు, నాతతాయినులనిరూఢి. కావున నర్జునుఁడు కౌరవులాతతాయినులని నిజముగ నిందిచెను. అయినను నట్టి యాతతాయినులఁ జంపుట సైతము పాపకారణమని పలికినదిమాత్రము చిత్రముగనున్నది. ఇట్టిదానినే " ***Non-resistance of Evil Doctrine*** " అని నేనివి రలో వ్రాసినాను. చెడుగొనఁగూడి నపుడు దానికిలొంగుట మేలుగాని దాని నెదిరింపరాదని కొందఱి మతము. ప్రపంచములోని జనులలో ననేకులు సాత్విక గుణసంపూర్ణులయి యుండినచో వైరీతిగఁ జెడుగును నెదిరింపక సహించుటచే నితరజనులకు శాంతిగుణపాఠము బోధించినవారగుదురు. అటుగాకున్న సామాన్య ము కేవలతామస గుణానురక్తులై యుండునపుడు సాత్వికస్వభావముపయుక్తపడదు. అట్టిసాత్విక గుణమునుండి ప్రపంచమునలో చెడుగుహెచ్చి జనులకు సుఖభంగము

కలుగును. కావుననే " దండనీతి " సృష్టింపఁ బడినది. బహుకాలమునకుఁ బూర్వ్వ
జనుల క్షేమమునకుఁగాను దైవము దండమనెడియొకశక్తిని సృష్టించి యధర్మ్మవర్త్త
నులను శిక్షించి చక్కఁబెట్టుటకునై యా శక్తినిరాజుల వశపఱచెను. దేశక్షేమము
కొఱకై దండనీతియుండవలెననునది దైవసంకల్పము. యుద్ధముసైతమీదండ నీతిలోఁ
జేరినది. ప్రవృత్తిమార్గములో నున్నప్రతి మానవుఁడును నివృత్తిమార్గ సోపానము
లెక్కి ధన్యుఁడగు నంతవఱకు సర్వసంగపరిత్యాగియై సంపూర్ణ శాంతమూర్త్తి
యగుట సాధ్యముకాదు. అంతవఱకు దండనీతినిత్యజించుట సైతము సాధ్యము
గాదు. అర్జునుఁడంతటి సర్వసంగ పరిత్యాగియునుగాఁడు. అంతటి శాంతస్వభావుఁడు
నుగాడు. ప్రాణములు దీయుట పాపకర్మమను తలంపొకటియే వానిని బాధించినది
గాని యితర ధర్మాధర్మ విషయములఁ దాలోచింపఁడాయెను. దండము విషమని
తెలిసెను గాని యది దుర్మార్గరోగమును మాన్పునమృతమని తెలియఁడాయెను.
దండమది దుర్మార్గులను జక్కఁబఱచును. ఇతరులను దుర్మార్గప్రవృత్తికిఁ బోరనివ్వదు.
ఒకనృశంసుని తలఁగొట్టినచో జన్మాంతరమునవాఁడు సన్మార్గుఁడగునని దండనీతి
ధర్మము. ఎటులయినా జన్మమునననుభవించిన ఫలసంస్కార వాసనపునర్జన్మమున
నంటి వచ్చునను విషయవిమర్శన మిచటననవశ్యకము కావున వదలితిని. దీనిని
శాస్త్రరీతిగఁ దెలిపి యిదియొసత్యమని స్థాపింప సర్వులకు సాధ్యముకాదు. పరిపక్వ
యోగసాధనచే సిద్ధులగు వారీవిషయముఁ దెలుపసమర్థులుగ నుందురు. దండోప
యోగమనునది దానికి మార్గములేనటుల జేయుటకు. యుద్ధమొనరించునది, ముందు
యుద్ధము లేనటుల చేయుటకు, ఈ రెండువిధములగు దండనలును దేశక్షేమము
నకును ధర్మస్థాపనమునకును పుట్టినట్టివి. ఒకఁడు నృశంసుఁడై వరుని ప్రాణముదీ
యును. రాజునృశంసుని ప్రాణముదీయును. నీతిశాస్త్రమురీతిగ వారిరువురు పాపా
త్ములగుదురు. అయితేరాజు దేశక్షేమమునకుగాను దండధర్మమవలంబించును
కావున నెద్ది దేశక్షేమోద్దేశమాచరింపఁబడునో యదిదుష్టకార్యమై నను పాపకార
ణంబు గాదు. కేవల స్వలాభమునకుఁ గాను నాచరింపఁబడిన దుష్టకార్యము పాప
హేతువగునుగాని దుర్మార్గ ప్రవర్తన నడుగంటఁ జేయుటకై యొనరించిన కార్యము
నుండి పాపము రాదనియర్జునుఁడు తెలియఁడాయెను. కావుననే కృష్ణునితో మఱి
లనిమాటలాడెను.

**37 " తస్మాన్నార్హావయం హన్తుం ధార్తరాష్ట్రాన్ స్వబాన్ధవాన్॥**
**స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ॥**

మాధవా! బంధువులతోఁగూడిన దుర్యోధనాదులను జంపుటకు మనము పూనికొనఁ గూడదు. ఇదిగాక మనవారిని మనము చంపినందువలన నేమి సుఖమున్నది? కృష్ణా, మనము వీరినిజంపఁదగదు. వారినిఁజంపి యార్జించిన విభవమును మనము వారులేనిచేయనుభవింపఁజాలము. వారు మనకొనరించిన దుష్కర్మములనుబట్టివారినివధించినచో పాపమునన్నంటిబాధించును. నాకుసుఖానుభవములేదు. పాపమువచ్చును కావున యుద్ధమొనర్చి నేనువీరిని జంపలేను. అర్జునుఁడు తనసుఖమును దనయన్నదమ్ములను మనమునసుంచికొని పైవిధముగ మాటలాడెనుగాని దేశక్షేమార్థమునకు యుద్ధము ముఖ్యధర్మమని తెలియఁజాలెను. కావుననే మరల సిరితిగఁగృష్ణునిఁ గుఱించి మాటలాడెను.

38 « యద్యప్యేతే న పశ్యన్తి లోభోపహత చేతసః,
కులక్షయకృతం దోషం మిత్ర ద్రోహే చ పాతకమ్.

39 « కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్,
కుల క్షయ కృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన.

కృష్ణా! ఈ దుర్యోధనాదులు లోభితనముచే మతిఁదప్పి కులక్షయమువలనఁగలుగు దోషమునున్ను మిత్రద్రోహమువలనఁగలిగిన మహాపాతకమును జూచువారుకారు. కులక్షయమువలనఁగలుగు దోషమును దెలిసిన మనము నిట్టి పాపములొనరింపక దానినుండి మరలుటకు నేల ప్రయత్నింపరాదు?

పైన పలుకఁబడిన రెండుకారణములుగాక యర్జునుఁడు తాను యుద్ధమువదలుటకు మూఁడవకారణంబు పలికినదేమన యుద్ధమునుండి కులక్షయ మొనరించిన దోషమున్ను మిత్రద్రోహ మొనర్చిన పాపమున్ను ఘటిల్లును. కృష్ణా! దుర్యోధనులు దురాశా పిశాచావేశులై యిట్టి ఘోరకర్మమునకుఁబూనిరి. అన్నియుఁదెలిసిన మనమట్టిపని చేసినచో నధికపాపాత్ము లగుదుముకాదాయనిపలికెను. ఇందుఁదెలియక చేసిన దుష్టకార్యము కర్తకు దోషమంతగ నంటదనిన్ని, తెలిసిచేసిన తప్పువలనఁ బాపము హెచ్చుననిన్ని వాదించెను. ఈ విషయమును గొంతదెలుపవలసినదిగ నున్నది. ఒకవిషయమున సంపూర్ణజ్ఞానముకలవాఁడు తెలిసినవాఁడగునుగాని, సంపూర్ణజ్ఞానములేక సర్వము తెలిసినవాఁడనని గర్వించిన

వానికంటెను తెలియనివాఁడధికుఁడు. అర్జునుని జ్ఞానము సంపూర్ణము గాదు. సంపూర్ణజ్ఞానములేనిదే తెలిసినవానిఁబోలె శ్రీకృష్ణుల యెదుట పలికినదియొప్పు. దానిని సాధించుటకు కృష్ణుఁడు మఱల నీరీతిఁ బలుకుచున్నాఁడు.

40 “ కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాః సనాతనాః,
“ ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత .

కృష్ణా! కులము క్షీణించినఁ గలుగు దోషమును తెలిసిన మనమిట్టి పాపమునుండి మరలుటకు నేల ప్రయత్నింపరాదని యింతకుమున్ను వ్రాయఁబడిన శ్లోకములోఁ బలికి కులము క్షీణించినతోడనే యనాదినవచ్చుచున్న కులధర్మములు నశించును. ధర్మము నశించినతోడనే కులమంతయు నధర్మముతో నిండును. పూర్వకాలమున నార్యులకుటుంబమే యొకసంఘముగ నుండెను. అనాదిగఁ గొన్ని ధర్మములు ప్రతికుటుంబమువారును తమప్రాణములకంటెను హెచ్చుగ రక్షించుకొనుచుండిరి. ఆరీతి ధర్మములను రక్షించుచుండుటచేఁ గుటుంబక్షేమమును కుటుంబనాగరకతయు వన్నెవాసిగనుచుండెను. ఆ ధర్మాచరణములలో నెట్టిదేని లోపమయినచో కుటుంబనైతిక ప్రవర్తనమునకు భంగమని తలంచియుండిరి. ధర్మమనఁగా నైహికపారలౌకిక సుఖానుభవమునకై యనాదినుండి యేర్పడిన దైవశాసనము. ఈశాసనములో “ మతము, నీతి, సత్యము, విధ్యుక్తకర్మము ” యివియన్నియుఁ గూడినవి. ప్రతికుటుంబమువారును కులధర్మమనుసరించుటచేతనే ప్రపంచాభివృద్ధి యగునునియును, నటులాచరింపనిచో ప్రపంచము చెడి క్షీణించుననియు నార్యుల నమ్మకము, కావుననే యర్జునుఁడు సనాతనకులధర్మము చెడునని భీతినందెను. సనాతనకులధర్మమెట్లు చెడుననినఁ గృష్ణుఁడిటు పలుకుచున్నాఁడు.

41 “ అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః,
“ స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసఙ్కరః .

కృష్ణా! అధర్మము హెచ్చుటవలనఁ గులస్త్రీలు చెడిపోవుదురు. స్త్రీలు చెడినతోడనె వర్ణసంకరమగును. ఈ శ్లోకమున “ వర్ణసంకర ” మనుపద ముపయుక్తమైనది. వర్ణసంకరమనఁగా వేఱువేఱు ఛాయలుగూడుట. ఆర్యులు బంగారు ఛాయతోఁ గూడిన తెలుపువర్ణములుగలవారు. నీగ్రోలు నల్లనివారు. [illegible] రెఱ్ఱనివారు. ఈ వర్ణముల మిశ్రమము సంభవిల్లును. ఎటులనఁగా యుద్ధములో

మగవారున్నను బహుసంతానవతులగు స్త్రీలు స్వేచ్ఛావిహారులయి యన్యవర్ణములవారితోఁ గూడుదురు. అటు కూడుటచే వర్ణసంకరమగుట యొకటియగాక, కులధర్మములు చెడును, నీతులు చెడును నడవడికలు చెడును. బుద్ధి చెడును. నాగరికత చెడును. మతము చెడును. గృహగౌరవమునకై దృష్టియుండదు. దేశక్షోభ జనక్షోభల కాస్పదమగును. వర్ణైకమత్యము చెడి జనులు బలహీనులగుదురు, వర్ణసంకరమునుండి యిన్ని యనర్థములు కలుగును. వర్ణమను శబ్దమిపుడు జాతికిసైతమర్థమగుచున్నది. పూర్వకాలంబున వర్ణసంకరమనఁగా ఛాయలమిశ్రమని యొకటే యర్థమగుచుండెను. పిదప నార్యులలో జాతులని యేర్పడినపిదప నట్టి జాతిసంకరముసైతము వర్ణసంకరమని పిలువఁబడసాగెను. అనఁగా నొకజాతియార్యులు మఱియొకజాతి యార్యులతో సంబంధము గల్పించుకొనుట సైతము వర్ణసంకరమయ్యెను. పిదప నొకజాతిగ నేర్పడిన యార్యులలోనే యుపశాఖలుద్భవిల్లెను. అనంతరమొక యుపశాఖజాతి మఱియొక యుపశాఖజాతితోఁ గూడుట వర్ణసంకరమయ్యెను. ఇటులనే శాఖలు లక్షలకొలఁదిఁ బెఱిఁగి యెవరికివారేయయి యార్యుల యైకమత్యము చెడెను. భారతయుద్ధకాలమున వర్ణసంకరభీతి కలిగెననప్పటికిఁ బంజాబులో నీగ్రోలు, ఈజిప్ష్యనులు, ట్యురేనియనులు మొదలగు ననార్యులు హెచ్చుగఁ జేరియుండిరని యర్థమగుచున్నది. ఈ వర్ణసంకరభీతి యనేకదేశములలోఁ గలదు. మన భరతఖండమునందా భీతి హెచ్చుగనున్నది. ఈ జాతియేర్పాటు లెటువచ్చెననువిషయమునుగుఱించి నాచే వ్రాయఁబడిన ఋగ్వేదోపన్యాసమునందు వివరించినాను. జాతికట్టుబాట్లకాలమున బ్రాహ్మణులు విద్యాభివృద్ధికిని మతాచారవిధులకును, నీతివిధులకును నుత్తరవాదులైరి. క్షత్రియులు దేశక్షేమమునకును సాంఘికసుఖస్థితికిన్ని యుత్తరవాదులయిరి. ఇట్టి గొప్పకార్యము లొనరించుటకుఁగాను వారికిఁగొన్ని స్వాతంత్ర్యములును మర్యాదలును నితరులకంటెను హెచ్చుగనుండెను. అయితే యా స్వతంత్ర్యములు వారు స్వప్రయోజనమునకై వినియోగింపఁగూడదను నిబంధనలుండెను. బ్రాహ్మణుఁడు వేదశిక్షముతోఁ దృప్తిపడి నిష్కల్మషుఁడుగ నుండవలెనుగాని ధనార్జనమునకుఁగాని సుఖానుభవమునకుఁగాని యత్నింపరాదు. క్షత్రియుఁడుసైతము రాజ్యక్షేమమునకుఁ దన సర్వస్వము వినియోగించుచుండవలెనుగాని రాజభోగానుసక్తుఁడు కాఁగూడదు. తన సాహసపరాక్రమములచే దుష్టప్రవర్తనలనాపి ధర్మరక్షణమునందే దృష్టియుంచవలెను. ఇది

బ్రహ్మ క్షత్రియ ధర్మముగనుండినది భారతయుద్ధకాలముననే యీ ధర్మము విశేష భాగము నామావశిష్టమైయుండినది. ఈ కట్టుబాట్లకు భంగముకలిగినపుడే వర్ణసంకరమునకును జాతిసంకరమునకును గారణమయ్యెను. అయినను ననేకములగు గొప్ప కుటుంబములవారు వర్ణసంకరమీరీతిగఁగానటుల సర్వవిధములఁ బ్రయత్నించుచుండిరి. వివాహవిధులలో ననేకములగు నిర్బంధము లిట్టివారే పెట్టినది. వారొనరించిన నిర్బంధములిటీవల పెక్కుచిక్కులలోఁ దగులుకొనెనుగాని పూర్వకాలపువారి వివాహశాసనములు సకారణములుగను నీతిదాయకములుగను విద్యారోగ్య బలాభివృద్ధికి సహాయకములుగనునుండెను. అదియెటులనిన విద్యాబుద్ధి నాగరికతలును గుణావగుణములును వంశానుగతముగ విశేషభాగమా కుటుంబోద్భవులయందు సంప్రాప్తించియుండునను విషయము శాస్త్రపరిజ్ఞానముగల విశేషజనులు సమ్మతించినవిషయమేను. తలిదండ్రులనుండి పుట్టినబాలుని రక్తములో వారిపుసితాచార సాంబంధికరుధిరమున్ను, దురాచార సాంబంధికరక్తమున్ను జాలుచుండునని జ్ఞానులు నిర్ధరించినారు. ఈ యంశము నిజమైనచోఁ దలిదండ్రులిరువురును దమరక్తము నెట్టి సంకరసంబంధ కళంకముతోఁ గూడనటులఁ గాపాడవలెను. అపుడే జనుల గుణాభివృద్ధియును దత్కారణంబున బుద్ధి విద్యారోగ్యాభివృద్ధియును గలిగి దేశము క్షేమపడును. కాదేని జనులెల్ల రాటవికులంబోలుదురు. జనుల గుణావగుణములు వంశక్రమముగ వారిమూలపురుషుల ననుసరించియుండును. ఈ విషయమును పల్లులు చక్కఁగ గమనింపవలెను. వారేబాలుర సహజగుణావగుణములకు విశేష భాగము కారణము. కావున వారన్ని విధములఁ బునీతలయి యుండవలెను. ఇక్కారణముననే స్త్రీ పాతివ్రత్యమునుగుఱించి మనవారు విశేషముగ గ్రంథములు వ్రాసినారు. దీనివలఁబట్టి పురుషుఁడెటులుండినను నుండనగునని తాత్పర్యముకాదు. స్త్రీపురుషసంయోగఫలమే శారీరసత్త్వము. శారీరసత్త్వమే ప్రకృతిస్వరూపము. ఈ శారీరసత్త్వనైర్మల్యమే యాత్మప్రకాశకారణమని భగవద్గీతలోఁ బలుకఁబడినది. శరీరాంగములును, మాంసరక్తాదులయందలి ద్రవ్యవిశేషములు నందఱియందు నొక్కవిధముగానే యుండును. అయినను పలువురియందుఁ బలువిధములగు గుణములగపడుటకు కారణముండవలె సత్త్వ రజస్తమోగుణముల ప్రాధాన్యతఁగాని వేఱొండుకాదు. ఆ గుణములు ప్రకృతిసహజములు. శారీరసత్త్వము ప్రకృతిఫలము. సాత్త్విక ప్రకృతి జనించుటకు స్త్రీపురుషుల సాత్త్వికవృత్తియే కారణము. కావున

తలిదండ్రులిరువురు సాత్త్వికగుణానురక్తులై యుండవలెను. అటుగుణభేదము రక్త భేదముగల స్త్రీ పురుషసంయోగము వర్ణసంకరమునకుఁ గారణమయి జనక్షయ మగుననుటకు సందియములేదు కావున యుద్ధమువలదని పట్టుఁబట్టెను. ప్రతిజాతి వారును తమతమ సత్త్వముచేతనే తామభివృద్ధిఁజెంది బంధవిముక్తులు కావలెనని మనయార్యుల యభిప్రాయముగాని యొకవర్ణమువారు వేఱొక వర్ణమువారితో నన్నివిధముల సంబంధించిన మాత్రాన వారియభివృద్ధికిఁ గారణమగునని తలంచి యుండలేదు.

అర్జునుఁడు వర్ణసంకరభీతి యొకటియెగాక మఱియొక గొప్పకారణము నైతము తెలుపుచున్నాఁడు.

42. " సఙ్కరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ,
" పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః.

అట్టి వర్ణసంకరము, కులమును బాడుచేయును. కులము పాడుచేసిన వాఁడును నట్టికులమును నరకము జేరును. వారి పితృదేవతలు పిండోదకములులేని వారయి యధోలోకముఁ జేరుదురుగదా? పితృదేవతలకుఁ బిండోదకము లివ్వనివాఁ డట్టివంశీకుఁడు నరకముపాల్వాడునని స్మృతులుపలుకును. వారివంశము వారినెల్లఁ జంపిన కారణంబున నప్పాపము కులఘ్నునినంటి వానిని నరకముఁజేర్చును గదా యని యుద్ధమువదలుటకు నర్జునుఁడు వేఱొకకారణంబుఁజూపెను. వర్ణసంకరమయి నపుడు కులమున న్యాయమగు పుత్రుఁడు పుట్టడు. అట్టిపుత్రుఁడు లేనపుడు పితృదేవతారాధనముండదు. వారి పేరే నశించును. ఇట్టి గొప్పవానికులమునఁ బుట్టిన వాఁడను నేననుకుల గౌరవముసైత మేరికినినుండదు. కావున

43. " దోషైరేతైః కులఘ్నానాం వర్ణసఙ్కరకారకైః,
" ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః.

44. " ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన,
" నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ ॥

వర్ణసంకరముచేయు కులనాశకుల దోషములచేఁ జిరకాలమునుండి వచ్చుచున్న జాతిధర్మములును కులధర్మములును దప్పనశించును. కులధర్మములు నశించినవారు తప్పకనరకములో నుందురని వినుచున్నాముగదా! ధర్మా

భివృద్ధికిఁ గారణులగు జనులకు నరకప్రాప్తియొకటి స్మృతులకాలములో. [illegible]గింపఁబడినవి. జనులేమఱక కులధర్మము లాచరింపవలెననియు నీతిమార్గానుచరులయి యుండవలెననియు నిట్టి నరకప్రాప్తిని గల్పించినారు. స్వధర్మము లాచరించుచు భగవద్ధ్యాన పశ్చాత్తాపాది సుగుణములుగలవారికి ముక్తికరతలామలకమైయుండును. అట్టిగుణములు మానివైచ్చల సాధింపక యిచ్ఛానుసారము ప్రవర్తించు వానికిఁ బతనమే ఘోరనరకమై బాధలిడుచుండును. ఈకారణము లన్నియును దెలుపుచు నర్జునుఁడు భగవంతునితో మఱల నీరీతిగఁ బలికెను.

45 "అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్,
యద్రాజ్య సుఖ లోభేన హన్తుం స్వజన ముద్యతాః.

46 "యది మా మప్రతీకార మశస్త్రం శస్త్ర పాణయః,
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్.

ఆకటకటా; ఎంతకష్టము:— మనము గొప్పపాపమును జేయుటకు సిద్ధులమైయున్నాము. ఏమనఁగా రాజ్యసుఖమునందలి యాశచేమనవారినిఁ జంపుటకు నుద్యుక్తులమైతిమి. శస్త్రములు పూనినవారయి దుర్యోధనాదు, లాయుధములు పట్టక ప్రతిక్రియచేయనినన్ను యుద్ధములోఁ జంపుదురుగాక. అది నాకు మిక్కిలి క్షేమమేయగును. ఈరీతిగఁ బలుకుచు నర్జునుఁడు తాను యుద్ధమొనర్ప ననునిర్ధారణము శ్రీకృష్ణునితోఁ దెలిపి యూరక కూర్చునవాఁడాయెనని సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ దెలిపెను. అదియెట్టులనిన.

47 "ఏవ ముక్త్వార్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్,
విసృజ్య సశరం చాపం శోక సంవిగ్న మానసః.

ధృతరాష్ట్రమహీపాలా! అర్జునుఁడీవిధముగాఁ జెప్పిదుఃఖముచేఁ జలించినమనస్సుగల వాఁడై ధనుర్బాణములవిడిచి యుద్ధభూమిలో రథముపైఁగూర్చుండెను.

అర్జునుని విషాద మీయధ్యాయములోఁ బలుకఁబడినది కావున నీ యధ్యాయమునకు విషాదయోగమని పేరువచ్చెను. విషాదాతిరేకమున యుద్ధము కష్టకర్మము కావున నర్జునుఁడు తానుదానిలోఁ బ్రవేశింపనని నిర్ధరించెను. మానవుఁడు సంసారపు జిక్కులలోఁబడియుండి దుఃఖకరమని తలంచి సంసారమువదలి

సన్యాసినై యేకాంగిగనటవీస్థలములుచేరుటకుఁ బ్రయత్నించెను. అటువిధ్యుక్త
ధర్మకర్మమునుండి తప్పించుకొనుట శ్రేయస్కరముకాదనియు సంసారకములో
నుండియే నాచిక్కులలోఁ జిక్కికొనక, సంసారయుక్తను జరుపుచుండవలెనని
రెండవయధ్యాయమున భగవంతుఁడు బోధింపఁబోవు చున్నాఁడు. హిందువుల
మతము సర్వులను సన్యాసులను జేయునని పలుప్రకి పలుకుట యజ్ఞానమనుట
నిస్సందేహము. అటులయిన హిందువుల మతము సన్యాసాశ్రమును వహింపవలె
ననిబోధించుననుటకు గారణమేమనిన నామతము రెండుమార్గములు మానవుని
ముక్తికిఁగానేర్ప డినవి, మొదటిది ప్రవృత్తి మార్గము రెండవది నివృత్తిమార్గము
మొదటిది సంసారములో నుండి యానుఖదుఃఖములను భవించుచు నందులో
మునిఁగిపోవక యీదిదరి జేరుటకు నేర్పడిన మార్గము. రెండవది మనుజుఁడు సర్వ
సంగపరిత్యాగియై సర్వవిషయసుఖానుభవమును మానుకొని సర్వకర్మములను వదలి
యాత్మను సంధానవృత్తినినే కాంతస్థలమునఁ జేరియుంట రెండవమార్గము.
అయితే యీ రెండుమార్గములవలంబించుటకు నవస్థాభేదము లేర్పఁబడినవి.
ఈ యేర్పాటే వర్ణాశ్రమ ధర్మమని మనవారిచేఁబలుకంబడినది. బ్రహ్మచర్యము,
గార్హస్థ్యము వానప్రస్తము. సన్యాసము ఈ నాలుగాశ్రమములు బ్రాహ్మణునకు
నేర్పడెను. సన్యాసము తప్పమిగత యాశ్రమములు క్షత్రియునకు నేర్పడెను. వైశ్యు
నకు మొదటి రెండాశ్రమములే యేర్పడెను. శూద్రునకు గృహస్థాశ్రమ మొక్కటియే
యేర్పడెను. ఈ భేదమునకుఁ గారణంబేమనిన; బ్రాహ్మణులు శస్త్రప్రహారులయి
యుద్ధమొనర్చుట కేవలమరుదుగనుండి ఆ బాల్యముగ వారు విద్యాభివృద్ధికిని
మతాభివృద్ధికినిఁ బాటుపడువారుగనుండిరికాని దేహబల మార్జించి యుద్ధము లొన
ర్చుటకుఁ లేదయ్యెను కావున బ్రాహ్మణుల వృత్తికి సన్న్యాసాశ్రమము సహకారిగ
నుండెను. క్షత్రియునకు సన్న్యాసాశ్రమము వలదనుటకుఁ గారణము వాఁడె
ప్పుడును శత్రువులఁ దెగటార్చి దేశక్షేమమొనర్చు వాఁడుగనుండును, అట్టి
వాఁడు సన్న్యాసియయినచో దేశముకాపాడ వాఁడెవఁడు నుండఁడు. దుర్మా
ర్గులను శిక్షించువాఁడెవఁడు నుండఁడు ధర్మముల రక్షించు వాఁడెవఁడు నుండఁడు
వైశ్యుఁడు కృషివ్యాపార వృత్తిని సర్వజనులకు నా హారవస్తువులనుర్చి పోషించు
వాఁడయినందున వానికి వానప్రస్థసన్న్యాసములు వలదనిరి. ఇక్కారణములను బట్టి
యేవర్ణాశ్రమ ధర్మములేర్పడినవి, ఇవియధికార తారతమ్యమున జనక్షేమార్థమనాది

నుండి వచ్చిననిబంధనలు. ఈ యాశ్రమములలోనే యవస్థాభేదములను బ్రహ్మక్షత్రియులకుఁ గల్పింపఁబడినవి బ్రహ్మచర్యాశ్రమమునఁ గొంతకాలముపఠకునుండి, వేదాధ్యయనమొనర్చి పిదపఁ బెండ్లియాడి గృహస్థ ధర్మములాచరించి యనంతరము. సన్న్యాసాశ్రమమును వానప్రస్థాశ్రమము నవలంబింప వలెనను విధులున్న వే గాని మనుజుఁడు సన్న్యాసికావలెనను విధిహిందూమతము బోధింపదు. అయితే సంసారప్రతిములో వేసరిల్లి, దానిని వదలి సన్న్యాసులయిన జ్ఞానులు పనిషదాది గ్రంథములందు సన్న్యాసాశ్రమము శ్రేయస్కరమనియు సుఖమనియు వ్రాసియుండుటచే. హిందూమతము సర్వులను సన్న్యాసులను జేయునని సంపూర్ణజ్ఞానములేనివారు పలుకుచున్నారు. సంసారముగట్టికొని యందునగలసుఖములనుభవించి, దుఃఖములనుండి కడతేరిన పిదప నిష్టపడువాఁడాత్మవిచారపరుఁడయి సంసారలంపటులు మానవగునని యాశ్రమధర్మమేర్పడినదిగాని సన్న్యాసాశ్రమమే ముక్తికిముఖ్యసాధనమని యేర్పడలేదు. ఆంగ్లేయులు సైతము వార్ధక్యము వచ్చునంతవఱకు నధికారములో నర్పుచు జీవయాత్రజరిపి పిదప "**Retired life**" యని జనసమ్మర్దము హెచ్చుగలేని ప్రదేశముచేరి యందు దైవారాధనపరులయి యాత్మవిచారముఁజే యుచుందురు. ప్రవృత్తిమార్గమునకును నివృత్తిమార్గమునకును విరుద్ధము విశేషముగనున్నదని తొట్టివానికిని దోషకపూనదు. అట్టి విరుద్ధమేమాత్రము లేదని భగవంతుఁడు గీతలో బోధించుచున్నాడు. తామరాకు పైనీటిబొట్టువలె సంసారములోనుండియు నుండనటుల యుండవలెనని శ్రీకృష్ణులబోధన, ఇదిసాధ్యమా; సాధ్యమనియే. భగవంతుఁడు బోధించుచున్నాడు. కావునగీతయాబాలవృద్ధులు పఠింపఁదగినదిగనున్నది.

శ్రీ

# భగవద్గీత. రెండవ అధ్యాయము.

## సాంఖ్యయోగము

ఇది

బళ్లారిలో వకీలుగానుండి

[illegible] బ్రహ్మశ్రీ కోలాచలం శ్రీనివాసరావుగారిచే

రచియింపఁబడినది.

కె. శత్రుఘ్నరావుచేఁ

ప్రకటింపఁబడినది.

మొదటికూర్పు.

బళ్ళారి.

ఆంధ్రముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1925.



వెల రు. 0—12—0



# భగవద్గీత. రెండవ అధ్యాయము.

## సాంఖ్యయోగము.

---

మొదటియధ్యాయములో నర్జునునకుఁగలిగిన విషాదమున్ను విషాద కారణములున్ను తెలియపఱుపఁబడియున్నవి. అర్జునుఁడు దుఃఖించినవిషయము ధర్మ సమ్మతముగ నుండలేదని తెలుపుచు నట్టిదుఃఖము దేశక్షేమ భంగమనుటకుఁ దగిన కారణములు నైజము వివరింపఁబడినవి. ఈ రెండవయధ్యాయములో భగవంతుఁ డర్జునుని విషాదము పనికిమాలినదనిన్ని యది యజ్ఞాన జనితఫలమనిన్ని తెలుపుచు మనుజుఁడొనరింపతగిన విధ్యుక్తకర్మముల విషయమున్ను, ప్రపంచమునఁ బుట్టిన ప్రతియొకమనుజుఁడు వహింపఁదగిన భారమెట్టు దించికొనఁదగిన విషయమునుగూర్చిన్ని హెచ్చుగ బోధించుచున్నాడు. విధ్యుక్తధర్మమును బోధించుటలో భగవంతుఁడు ప్రారంభముననే, వేదాంతమునందుఁ దెలిసికొనుటకుఁ గష్టతమమగు సాంఖ్యయోగమును బోధించుచున్నవాఁడు. దేహ మశాశ్వతమనిన్ని దేహి నిత్యుఁడనిన్ని దేహికి పునర్జన్మము కలదనిన్ని దుర్విజ్ఞేయవిషయములు బోధించినాఁడు. అర్జునుఁడు దుఃఖించుచు మనమెంతే కలఁతఁ జెందియుండినకాలమున భగవంతుఁడిట్టి దుష్కర వేదాంతవిషయమును బోధించుట చిత్రముగనున్నదని కొందఱు తలఁతురుగాఁబోలు. ఇందుఁ జిత్రమేమియును లేదు. స్వజనహింసకు నర్జునుఁడు భయపడెనుగదా? హింసాకర్మమం దేమియును లేదనిన్ని యెవరును చావరనిన్ని చచ్చునది మాంసమయ శరీరమగునుగాని యాత్మకాదనిన్ని యది యన్నటికిన్నిఁ [illegible] యట్టిభీతి నందతగదనిన్ని బోధించుట యత్యావశ్యకమయ్యెను గావున నిదియేమి యొకవిచిత్రముకాదు. ఈరీతిగఁ బ్రాణహింస, యొకహింసకాదని భగవంతుఁడొనరించిన బోధననుండి జను లొకరినొకరు చంపుటనుండి పాతకములేదనితలంచి హింసాకర్మము స్వేచ్ఛగ నొనరింతురని యాక్షేపణము కలుగును. ఆ యాక్షేపణము వచ్చుటకు మార్గములేదు. ధర్మవిధ్యుక్తకర్మమొకటి ప్రాముఖ్యమైయుండ యట్టి కర్మమొనరించుటయందుఁ గలుగుహింస పాపహేతువు కాదని బోధింపఁబడినది. గనుక గీతలో భగవంతుఁడు బోధించినవిషయము ప్రసంశ

నీయముగ నున్నది. ఈయధ్యాయమున భగవంతుఁడు "తత్త్వమసీ" యను వాక్య ములోని "తత్ - త్వం - అసి," యను శబ్దార్థము విమిడించి త్వం పదార్థవివేచన 2లా 6 వఱకు విస్తరించి చెప్పినాడనిన్ని తత్ పదార్థవిచారము 7-లా 13 యధ్యాయములలో విస్తరించినాడనిన్ని అసి, పదార్థవిచారము 13-లా18-వ యధ్యాయములలో విస్తరింపఁబడినదనిన్ని మధుసూదన సరస్వతులవారు తమభాష్యము లోవ్రాసినారు. ఇది కేవలకాల్పికము. ఇందుజ్ఞానమూలక భక్తిప్రధాన కర్మయోగమె కృతియేముఖ్యముగఁ దెలుపఁబడినది. కావుననే ప్రారంభమున జ్ఞానవిషయము సూక్ష్మముగ సాంఖ్యయోగ నామమునఁ దెలుపఁబడినవి. ఈ యంశములు జ్ఞప్తిలో నుంచికొని మనమీ రెండవయధ్యాయమును గుఱించి ముచ్చటింతము. సంజయుఁడు ప్రథమాధ్యాయమునందలి వార్త ధృతరాష్ట్రునకుఁ దెలిపినపిదప ధృతరాష్ట్రుఁడు ముందేమిజరిగెనని సంజయునిఁ బ్రశ్నించెను. సంజయుఁడు ముందు జరిగినవార్త తెలుపుచున్నాడు.

1 " తంతథా కృపయా విష్ట మశ్రు పూర్ణాకు లేక్షణమ్,
" విషీద న్త మిదం వాక్య మువాచ మధుసూదనః.

అట్లు దయతోఁగూడిన వాఁడయి కన్నీటితోనిండి వ్యాకులములగు కన్ను లుగలవాఁడయి దుఃఖించుచున్న యా యర్జునునితో శ్రీకృష్ణభగవంతుఁడిట్లనియె.

2 " కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్,
" అనార్య జుష్ట మస్వర్గ్య మకీర్తి కర మర్జున.

3 " క్లైబ్యం మాస్మ గమః పార్థ నై తత్త్వ య్యుప పద్యతే,
" క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప.

అర్జునా! ఇట్టి విషమమగు సమయములో సజ్జనులకుఁ గలుగనట్టిదియు, స్వర్గమునకు దూరమగునదియు, నపకీర్తి హేతువగునదియు నగు నట్టి మోహము నీ కెట్లువచ్చినది? భయపడకుము. తగదిభీతి. నీచమగు హృదయ దౌర్బల్యమును విడిచి యుద్ధమొనరింపలెమ్మని. భగవంతుని పై వచనములకు నర్జునుఁడు సమాధాన పడక యీ రీతిగఁ బలికెను.

4 " కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణంచ మధు సూదన,
" ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన.

మధుసూదనా! పూజార్హులగు భీష్మాచార్యులును, ద్రోణాచార్యులును యుద్ధమొనరించునపుడు నేనెటు వారిని బాణములతోఁ గొట్టుదును? ఈ శ్లోకార్థమును జక్కఁగఁ గమనింపుడి. ప్రథమాధ్యాయమున నర్జునుఁడు తాను యుద్ధము వదలుటకు గారణము (1) బంధునాశనానంతరము తాననుభవింపఁదగిన వైషయిక సుఖము లెవ్వియు నుండవనిన్ని (2) స్వజన సంహారము చేఁదగని పాతకమగు ననిన్ని [3] జనసంహారమునఁ గుల క్షయమగుననిన్ని [4] కులక్షయమున వర్ణసంకర మగుననిన్ని తెలిపెను. పై కారణములువిని భగవంతుఁడా కారణములు హృదయదౌర్బల్యమునుండి కలుగు పిచ్చికారణములని నిందించినవిని యర్జునుఁడు వేఱొక కారణము శ్లోకమునఁ జూపినాడు. అది యెట్టిదన, భీష్మద్రోణులు గొప్ప వారు. పూజార్హులు. గౌరవింపఁదగినవారు. చిన్నతనమునుండి తన్నుఁ బెంచి పెద్ద చేసినవారు. విద్యాగురువులు. తనకు నీరీతిగ నుపకృతి యొనర్చినవారికి నపకృతిఁ దలంచి యగౌరవబుద్ధిచే నెదిరించి బాణములతోఁ గొట్టుట ధర్మ మెటులగునని ప్రశ్నించి మఱల నీరీతిగఁ బలుకుచున్నాడు.

5. గురూనహత్వాహిమహానుభావాన్। శ్రేయోభోక్తుం భైక్షమపీహలోకే
హత్వార్థకామాంస్తు గురూనిహైవ భుఞ్జీయభోగాన్రుధిర ప్రదిగ్ధాన్ ॥

6. నచైతద్విద్మః కతరన్నోగరీయో యద్వాజయేమ యదివా నో జయేయుః।
యా నేవహత్వా నజిజీ విషామస్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥

7. కార్పణ్యదోషోపహత స్వభావః।పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢ చేతాః
యచ్ఛ్రేయ స్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేఽహం శాధి మాంత్వాం
ప్రపన్నమ్॥

8. నహిప్రపశ్యామిమమాపనుద్యా ద్యచ్ఛోకముచ్ఛోషణ మిన్ద్రియాణా
మ్ । అవాప్యభూమా వసపత్నమృద్ధం । రాజ్యంసురాణామపిచాధి
పత్యం ॥

మహానుభావులయిన గురువులను జంపుటకంటె నీలోకమందు భిక్ష మెత్తికొని భుజించుటయైనను మేలుగదా? అట్లుగాక ధనకామములకుగాను గురువులను జంపి నెత్తురుతోఁ దడిసిన భోగముల ననుభవింపఁగలనా? ఇంతేగాక యుద్ధము చేయుచుండుఁగని వారిని మనము జయింతుమో, వారు మనలఁ జయింతురో?

ఇంకేదిమంచిదనియూ తెలిసికొనజాలను. ఎవరినిఁజంపి బ్రతుకజాలమో యట్టి దుర్యోధనాదులు నా యెదుటవచ్చి నిలిచినారు. కృపణత్వదోషముచే నా స్వభావమంతయును మారిపోయినది. ధర్మసమ్మూఢచిత్తుఁడనై నిన్నడుగుచున్నాను. వీరినిఁజంపుట మంచిదియా? మానుట మంచిదియా? ఇందేది మేలో నిశ్చయముగాఁ జెప్పుము. నేను నీకు శిష్యుఁడను. నిన్ను శరణుఁజొచ్చిన నన్ను శిక్షింపుము. ఈ భూలోకములో శత్రువులులేకుండ సమృద్ధియగు రాజ్యమును, దేవలోకాధిపత్యమును బొందినను నా యింద్రియములను శోషింపఁజేయు దుఃఖమును బోఁగొట్టు వస్తువు నా కేదియు నగపడలేదు. పై నాలుగుశ్లోకముల యర్థమును యోజింప నర్జునుఁడు గురువులనుజంపి రాజ్యముసాధించి యా రక్తసిక్త రాజ్యానుభవమును దానుభవింపఁజాలనని తెలుపుటయగాక తాను సన్న్యాసియై బిచ్చమెత్తుకొని తినుట సుఖమను ధర్మవిరుద్ధపుమాట పలికెను. ఇంతయుగాక జయాపజయముల నిర్ధారణసైతము తెలియక డోలాయమాన చిత్తుఁడయ్యెను. అర్జునుఁడు మనమునఁ జీకాకుపడి ధర్మసమ్మూఢ చేతస్కుఁడయి కర్తవ్యంబుదోపక, కృష్ణా! నీకు శిష్యుఁడను నీ శరణుఁ జొచ్చితిని. నా మనమేమో దేవేంద్రపదవినిసైత మాశింపదు. నన్నేరీతి నీ కష్టమునుండి రక్షించెదవో నీ భారమని వేఁడికొనెను. ఇచట నర్జునుఁడు గురుశిష్యన్యాయమనుసరించినను తన మనమునంటిన యభిప్రాయము వెల్లడించుచువచ్చెను. ఈ విషయముఁ గీతలోఁ జక్కఁగ నగపడును. గురుశిష్యన్యాయము మనవారనుకొనురీతిగను సంతకఠినముగను నిందులేదు. గురువులవారేమి బోధించినను దానికి మాఱుపలుకక యంగీకరింపవలెనను విధిలేదు. ఏమనిన శిష్యుఁడగువాఁడు గర్వించి గురువును ధిక్కరింపఁబూని పనికిమాలిన ప్రశ్నలు వేయఁగూడదని తాత్పర్యము. గీతలో నర్జునుఁడు కృష్ణునిఁ బ్రశ్నించిన దానికంటెను హెచ్చుగ వాసిష్ఠరామాయణమున శ్రీ రాములు వసిష్ఠునిఁ బ్రశ్నించినారు. బోధపడనివిషయము శిష్యుఁడు మఱల మఱలఁ బ్రశ్నించి గురువులతో సమాధానముందవలెననియే పూర్వాచారము.

౯ “ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతప,
“న యోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవ హ.

ధృతరాష్ట్ర మహారాజా! అర్జునుఁడీరీతి కృష్ణునితోఁ బలికి యుద్ధము చేయలేనని మౌనముపూని యూరకుండెనని సంజయుఁడు తెలిపెను. ముందేమి

తత్పదార్థము సాత్త్వికమాయాశబలిత బ్రహ్మము. త్వంపదార్థము తామసికావి ద్యా సంకలితమగుజీవి. ఈజీవికే స్థూల శరీరమాశ్రయస్థానము.

ఈ రెండవయధ్యాయమంతయు సాంఖ్యము కాదు 11. వ శ్లోకము నుండి "స్వధర్మమపిచావేక్ష్య" యను 31 వ శ్లోకము వఱకు గల శ్లోకార్థము లేసాంఖ్యోపదేశములు గలవి. మిగత శ్లోకములు సాంఖ్యమునకు సాధనములగు కర్మోపదేశములు. తత్త్వనిరూపణమేమి భగవంతునిచేఁ జేయఁబడినదో యది సాంఖ్యము; తద్విషయమయినబుద్ధి యనఁగా నాత్మ, యకర్త యనుబుద్ధి సాంఖ్యబుద్ధి. అది యే జ్ఞానులకుచిత మగునో వారు సాంఖ్యులు. సంఖ్యయనఁగా వేదప్రోక్త మైన సమ్యగ్జ్ఞానము. దానిచే దెలుపఁబడినది, యే తత్త్వమో యది సాంఖ్యము. ఆత్మ కూటస్థుఁడు. షడ్వికారములాతనకు లేనివాఁడని యెన్నుబుద్ధి సాంఖ్యబుద్ధి. ఆబుద్ధియందాసక్తులగు వారుసాంఖ్యులు. ఈ యర్థము సామాన్యముగ సన్న్యాసు లకే వర్తించునని కొందఱర్థము చేయుదురు. సాంఖ్యబుద్ధి సంపూర్ణముగఁ గుదిరిన వారియందు యోగబుద్ధి సంభవింపదు. యోగబుద్ధ్యాశ్రయమైనది కర్మనిష్ఠ. యోగబుద్ధిని నివర్తించునది సంపూర్ణతమమైనసాంఖ్యబుద్ధి. కావున నట్టి బుద్ధి ప్రాప్తిం గలిగింపక మునుపే, ఆత్మ దేహాదివ్యతిరిక్తుఁడను విశ్వాసముతో ధర్మాధర్మములను వివేచించి యీశ్వరారాధనరూపమగు కర్మముచే పురుషుఁడాత్మను సంధానము గావించు యుక్తితో యోగ్యుఁడగుచున్నాఁడని యోగశబ్దము కొన్ని సమయము లందు ప్రయుక్తపడినది. అనగా మోక్షసిద్ధికొఱకు శాస్త్రోక్తధర్మములనుష్ఠించుట యోగమని యర్థము. ఈ యోగశబ్దము గీతలోఁ బ్రతియొకయధ్యాయ విషయము నకు జంటింపఁబడినది ప్రస్తుతోపన్యాసమునకు జ్ఞానకర్మ యోగములేమన్నఁ గావలసి నవి. జ్ఞానయోగమనఁగా? జ్ఞానమే యోగము. ఈజ్ఞానయోగమున సాంఖ్యులు బ్రహ్మముతోఁ దాదాత్మ్యతను బొందుచున్నారు. దీనినే "జ్ఞానయోగేన సాంఖ్యానాం" యని భగవంతుఁడు నిరూపించినాఁడు. ఇఁక యోగబుద్ధ్యాశ్రయముకర్మనిష్ఠ. కర్మయో గమనఁగా, కర్మమే యోగము. కర్మమనునది యే యోగము. ఈకర్మముచేఁ జిత్తశుద్ధియ గుటద్వారా మోక్షహేతు వగు జ్ఞానమునకుఁ బురుషుఁడు యుక్తుఁడై యోగ్యుఁడగు చున్నాఁడు కావుననే "కర్మయోగేన యోగినాం" భగవంతుఁడు నిరూపించి యున్నాఁడు. జ్ఞానబుద్ధి కర్మబుద్ధియని విభజింపఁబడినవి. జ్ఞానబుద్ధి కలవాఁడాత్మకు నైష్కర్మ్యము నకర్తృత్వము నభోక్తృత్వము నాపాదించును. కర్మబుద్ధికలవాఁ

డాత్మకునసేకత్వమును గర్తృత్వ భోక్తృత్వముల నాపాదించును. కావునని
రెండు బుద్ధులు మనుజునందేకకాలమున సంభవింపవు. భిన్నావస్థలందు సం
భవింపనగునని యనేకులమతము. మఱియొక చోట నీ సాంఖ్యశబ్దవిచారము చేయఁ
బడినది. "బ్రహ్మవిదులగు ఋషులచే సమ్యక్ ఖ్యాయతే" చక్కఁగాఁ బఠింపఁ
బడినది సాంఖ్యము. సంఖ్యయనఁగాఁ "బరవిద్య" ఆ సంఖ్యచే నిర్విశేషపరబ్రహ్మ
మును దెలియువారు సాంఖ్యులు. ఈ సాంఖ్యమారూఢునకు నాశ్రయణీయముఁగాని
యారురుక్షువులకుఁగాదు. నీవారురుక్షువు కావుననీ కా సాంఖ్యబుద్ధికుదరదు, అని
మఱియొకస్థలమునఁ జెప్పఁబడినది. శ్రీమధ్వాచార్యులవారు సాంఖ్యార్థ మీరీతిగ
వచించిరి. "శుద్ధాత్మతత్త్వ విజ్ఞానం సాంఖ్యమిత్యభిధీయతే" యనినారు యోగ
మనఁగా నుపాయము. శుద్ధాత్మతత్త్వవిజ్ఞానమునందెడి నుపాయము సాంఖ్యయోగ
ము. ఆయుపాయమే కర్మయోగము. దీనినుండి మనమూహింపఁదగినదియేమనఁ
బ్రతిమనుజునందును మోక్షాపేక్షయనునది సామాన్యము. ఆమోక్షమార్జించుటకు
సాంఖ్యులకు జ్ఞానమే సాధనము. యోగులకు జ్ఞానయుక్త గర్మాచరణము సాధనము.
యోగులు కర్మాచరణములాచరించి చిత్తశుద్ధిఁగాంచిన పిదపనే సాంఖ్యబుద్ధి వారికిఁ
గుదురునది. కర్మాచరణము లాచరింపకనే సాంఖ్యబుద్ధికలుగుట కడుదుర్లభము. సనక
సనందన సనత్కుమార సనత్సుజాత శుకాదులకుఁ బ్రారంభమునసే సాంఖ్యబుద్ధి కలు
గుట దైవమహిమయుండును. మరీచ్యాది బ్రహ్మలకు సైతము గర్మాచరణమే మోక్ష
మందఁ బ్రథమసోపానము. సర్వకర్మ సన్యాసమనునది సాంఖ్యబుద్ధి చక్కఁగఁగుదిరి
స్థితప్రజ్ఞులయి తితిక్షుత్వము సాధించినవారికి సాధ్యమగునుగాని యితరులకు నసా
ధ్యము. ఇఁక యోగులకుఁ గర్మాచరణమే ప్రాముఖ్యములయనఁ గర్మాచరణము చేఁ
జిత్తశుద్ధిగలుగును. ఎటులనినః—సకల సంకల్ప వికల్పములకు మానసము మూల
స్థానమయినది. ధర్మార్థ కామ మోక్షాపేక్ష లుద్భవించునది మానసక్షేత్రము
నందేను. కామ క్రోధ లోభ మోహ మదమత్సరాదులను శత్రుషడ్వర్గము బుట్టు
నది యాస్థలమేను. అనఁగా సద్భావనలకును దుష్టభావనలకును స్థానముగ మాన
సక్షేత్ర మేర్పడినది. సద్విషయ దుర్విషయము లింద్రియప్రేరితములయి సుఖదుఃఖ
ములు కలిగించుచుండు కారణంబున బుద్ధికిఁ జాంచల్యమునఁగూడును. అటువంటు
వనుడు కర్మాచరణము లెటుల చిత్తస్థైర్యములకుఁ గారణములగునని [illegible]

గాను, మనుష్యలోకములోని సుఖములను గాని స్వర్గసుఖములను గాని పొందనెంచక స్థిరసంకల్పుఁడయి కర్మాచరణము లొనర్చునపుడు మానసమును, సదా పరమాత్మ విషయమునందే యుంచి, బిగఁబట్టి, యితరవిషయములదారిఁ ద్రొక్కనివ్వఁడు. ఇదియే దీక్షయని మనము వాడికొనునది. స్థిరసంకల్పుఁడయి కర్మాచరణము లాచరించినచో నరిషడ్వర్గముల ప్రాబల్యము తగ్గును. అటులనే కొంతకాల మలవాటయినపిదపఁ గామక్రోధలోభాదుల శక్తి తగ్గి మఱికొంతకాలమునకు నగపడకపోవును. అపుడు మానసము పవిత్రతఁగాంచి ధర్మక్షేత్రమగును. బుద్ధి నిలుచును. సాంఖ్యబుద్ధియను బీజంబు స్థాపింపఁదగినదియగును. జయమార్గమున నేను స్థిరసంకల్పుఁడనై యొక్క కార్య మొనర్పఁబూనినపుడు మానస మక్కార్యమునందే లీనమయి బాహ్యప్రపంచమే మఱచిపోవును. మఱియేవిషయము దన్నంటనీయదు. నాస్వానుభవవిషయ మొకటి దృష్టాంతముగఁ జూపెద. నే నొకానొకకాలమున జదరంగ మాడునపుడు నా మానసమంతయు నా యాటయందే లీనమయి సమస్త ప్రపంచమును మఱచుచుండెను. ఆకాలమున నా కొమారు లెవరయిన నువచ్చి నా నడుమున జెక్కుకొనిన నైవేద్యమును గుంజి తీసికొనినను నాకు హెచ్చరిక కలుగుచుండలేదు. కావున మానసము మనుజుఁడు ధర్మకర్మాచరణములందు లీనమగునట్లొనర్చుచుండినచో నది మానవునివశమయి కామక్రోధాదులకు లొగ్గదు. అరిషడ్వర్గము బలహీనతఁ జిక్కి నశించును. ఇది కలుగుటకుఁగూడ నించుక యాత్మజ్ఞానముండవలెను.

గీతలో నిష్కామ కర్మానుష్ఠానము విశేషముగఁ బలుకఁబడినది. ప్రారంభమున నట్టి కర్మాచరణ మసాధ్యము. “ప్రయోజనమనుద్దిశ్య నమందోపి ప్రవర్తతే.” ప్రయోజనము నుద్దేశింపక మూఢుఁడుగూడ ప్రవర్తింపఁడు. కావున సామాన్యమనుజుఁడు ఫలమునపేక్షించియయినను ధర్మబుద్ధినిఁ గర్మాచరణములొనర్చి ఫలసంపూర్ణుఁడయినపిదప ఫలాపేక్షలేక ధర్మకర్మము లాచరింపవలెననియే, భగవంతుని యుద్దేశ్యముండనగును. ఇదియ నిష్కామకర్మము. ఇట్టికర్మ మొనర్చుట చిత్తశుద్ధికల వారికి సాధ్యముకాని సామాన్యులకు సాధ్యముకాదు. కడుపునిండ భుజించి తృప్తులగువారు భోజనమునం దుదాసీనభావము చూపినటులఁ గామ్యకర్మఫలములఁ దృప్తులగువారు, ముముక్షువులయి నిష్కామ కర్మములొనర్ప సాధ్యమగును. ఏది యెటులయినను మనకీ “ఆత్మస్థితి” యందు నిశ్చయజ్ఞానముకలుగుట ముఖ్యము కావున భగవంతుఁడు సాంఖ్యయోగ ముపదేశించుచున్నాఁడు. అర్జునుఁడు తన్నెదిరింపఁ

బూని యిట్లనియెను.

" కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణంచ మధుసూదన,
" ఇషుభిః ప్రతియోత్స్యామి, పూజార్హా వరిసూదన "

మధుసూదనా! పూజచేయఁదగిన భీష్మాచార్య ద్రోణాచార్యాదు లను యుద్ధములో నే నెటు బాణముల నొప్పింతును!

గురూనహత్వాహిమహానుభావాన్ । శ్రేయోభోక్తుం భైక్షమపీహలోకే॥
హత్వార్థకామాంస్తు గురూనిహైవ భుఞ్జీయ భోగాన్రుధిరప్రదిగ్ధాన్ ॥

మహానుభావులైన గురువులను జంపకుండ నీ లోకమందు బిచ్చమెత్తి కొని భుజించుట మేలుగాదా? గురువులనువధించి నెత్తురుతగిలిన యర్థకామరూపు భోగముల, నీ లోకమున ననుభవింప నగును గాని స్వర్గమునఁ బనికిరావు.

పై రీతిగఁ బలికిన యర్జునునిఁజూచి " తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత " భగవంతుఁ డర్జునుని బరిహాసము చేయువానింబలెఁ బలికెను.

అర్జునా! నీవు మూఢుఁడవు; సంసార బీజ భూతములైన శోకమోహ ములఁ జిక్కితివి; కావున నీ వివేకము మాసిపోయినది. దీనులు సనాథులను జంపు విషయమునఁ గలుగనగు విషాదము దురాత్ములగు శత్రువులయందుఁ బ్రసరింపఁజేసి తివి. ధర్మమును నందధర్మబుద్ధియు నధర్మమునందు ధర్మబుద్ధియు నుంచితివి. కులధర్మ మునల; దీనత్వభావముంచితివి. నేను జంపువాఁడనను నహంకారబుద్ధియు, వారను భేదబుద్ధియును నావారను మమకారబుద్ధియు నీయందు గలిగినవి. ధీరుఁడవును శూ రుఁడును నైన నీవు భీరుఁడవైతివి. నీకు మఱల క్లీబత్వము వచ్చెను. ఇన్ని దుర్గుణ ములు నీకుఁగలిగియుండినను బండితునివలె ధర్మాధర్మ సూక్ష్మములనుగుఱించి మాటలాడితివి. నీకుధర్మంబు కానట్టి సన్న్యాసంబు గోరితివి. భైక్ష్యవృత్తిని జీవింప నిశ్చయించితివి. ఔరా నీ సాహసమని యర్జునునకు లజ్జగలుగునట్లుగను బరిహసించి యీరీతిఁ బలికెను.

11 " అశోచ్యానన్వశోచ స్త్వం, ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
" గతాసూనగతాసూంశ్చ, నానుశోచన్తి పణ్డితాః,

అర్జునా! నీవు దుఃఖింపఁదగనివారికై గాను దుఃఖించుచున్నావు. ప్రాజ్ఞులు చెప్పవలసిన ప్రజ్ఞావాదములు పలుకుచున్నావు. పండితులగువారు చచ్చినవారికొఱ

కుడు జావనివారికొఱకును దుఃఖింపరని పలికెను.

అర్జునా! నీకు శోకమునిండినది కావుననే మోహముకలిగినది. అందుల ఫలముగ వివేకముచెడినది. పండితునిబలె నటించుచు భాషించెదవు. నిజముగ నీవు పండితుఁడవుకావు. పండితుఁడవయి యుండినయెడల శోకింపఁదగనివారియందు శోకముపుట్టుచుండలేదు. పండితుఁడవయి యుండినచో శోకమోహాదులు సుఖదుఃఖబాధితమగు సంసారమునకు బీజభూతములయిన దోషములని తెలిసికొనుచుంటివి. దానినుండి యహంకార మమకారములు బుట్టునని యెఱుంగుచుంటివి; “ సత్త్వశుద్ధయే కర్మకుర్వంతి ” చిత్తశుద్ధికొఱకు కర్మముచేయుచున్నారను శాస్త్రవచనముఁ దెలియుచుంటివి. ‘ పండితాః ’ యను శబ్దార్థమైనను గ్రహించుచుంటివి. “ పండ ” యనఁగా ఆత్మవిషయమయిన జ్ఞానము. అది యెవరికిఁగలదో వారుగదా పండితులు. ఎవనికి నజ్ఞానముకలదో వానికి భ్రాంతికలుగును. ఎవనికి భ్రాంతికలదో వానికి “ త్వం ” పదార్థవిచారముండదు. ఎవనికి “ త్వం ” పదార్థవిచారములేదో వాఁడు పండితుఁడు కానేరఁడు. కావున అర్జునా! నీవు పండితుఁడవుగమ్మ. నీవు చింతించునది భీష్మాదుల నామములు పోవుననియా? వారిదేహములు పోవుననియా? వారియాత్మ పోవుననియా? ఈ ప్రశ్నలకు బదులిడుము. నామములు వ్యవహారవాచకములు, చచ్చునవికావు, ధ్వనియుండునంతవఱకు నుండునవి. శరీరముపోవునని చింతించెదవా? పుట్టుకగలవానికి గిట్టుటతప్పదు. “ మఘవన్ మర్త్యంవా ఇదంశరీరం మాత్తంమృత్యునా ” ఇంద్రుఁడా! ఈ శరీరము మర్త్యము. మృత్యువుచేతఁ బొందఁబడినది యనియును “ దుర్లభో మనుషోదేహో దేహినాం క్షణభంగురః ” ప్రాణులకు మనుష్యదేహము దుర్లభము క్షణములో నశించుననియును, శ్రుత్యాదుల ప్రమాణముల బలముచేతను లోకానుభవముచేతను శరీరములు నిత్యములుకావు. ఎపుడయినను నొకతూరి పోవునట్టివియనునది స్థిరపడును కావున శరీరము లనిత్యములయ్యెను. వానికిఁ జింతింప నవసరములేదు. ఇఁక యాత్మయంటివో; ఆత్మ జన్మము లేనివాఁడు, కావునఁ బుట్టఁడు, పుట్టుక లేనివాఁడగుటవలనఁ జావఁడు. చావులేని వాఁడగుటవలన నిత్యుఁడు, “ అజోనిత్యః శాశ్వతః నిత్యోనిత్యానాం ” అని శ్రుతులున్నవి. నిత్యుఁడుగనుండు వానియందు దుఃఖమేల? బ్రదికినవారినిఁజూచి, చచ్చితివేయని యేడ్చు పిచ్చివారేవయినను గలరాయని తెలిపెను, సకలప్రాణులకు దుఃఖరూప సంసారము గలిగించు

కాబట్టి శోకమోహాదిరూపదోషములకుఁ గారణమయినది యహంకారమనియు, నా యహంకారమునకుఁ గారణమైనదియ విద్యయనియును తెలియును. అర్జునుఁడు యుద్ధమధ్యమున స్వజనులనందఱినిఁ జూచి "నేను వీరివాఁడను, వీరునావారు" అను భ్రమచేతఁ గలిగిన స్నేహము, తద్వియోగము, తన్నాశము, దానినుండి కలుగు పాపము, దానినుండివచ్చు లోకనింద, యీ మొదలగువానికి నిమిత్తములైన శోకమోహములు తనకునున్నటులఁగనే పలికెను. అర్జునుఁడెంత వివేక జ్ఞానము గలవాఁడైనను నవి యిపుడు వానికిఁగలిగిన శోక మోహములచే వశీంపఁబడి స్వధర్మమైన యుద్ధమును వదలెదననిన్ని బ్రాహ్మణ ధర్మమైన భిక్షా జీవనమును బూనెదననిన్ని, సర్వకర్మములు విడిచెదననిన్ని పలికెను. ప్రసిద్ధమహిమగల యర్జునుఁడేయీరీతి స్వధర్మమును విడువఁదలఁచి యన్యధర్మమవలంబింప నుద్యుక్తుఁడైయుండఁగా, సామాన్యజనులు నటులనేయొనరింతురనిన్ని యపుడుసాంఘిక శాసనములోక కట్టులోనిలువవనిన్ని, యటుసాంఘిక, శాసనములు, నియతముగ నిలువనియెడల జనులుతమకు నిష్టమువచ్చినరీతినిఁ జేయుచు సాంఘిక శాసనము, సాంఘికనీతి, సాంఘికాభివృద్ధి, జెరుతురని భగవంతుఁడాలోచించి యర్జునునకు స్వధర్మయుద్ధమునందు గలిగినయుదాసీన బుద్ధినిఁదొలఁచివేయఁ బ్రయత్నపడెను. అటులొనరింపఁ బ్రారంభమున నర్జునునకు శోకమోహాదులు సంసార బీజ భూతములుగనుండు కారణంబున వానినిఁదొలఁచి వేయు నుపాయము సాంఖ్యశాస్త్రజ్ఞానమని తలంచి సాంఖ్యయోగ ముపదేశింపనారంభించెను. సంసార బీజభూతములాత్మ జ్ఞానమువలననే నివర్తించునుగాని మఱిదేనివలననివర్తింపదు. అర్జునుఁడు యుద్ధమునువదలి వైరాగ్యము పూనెదనని నెను. స్వజననాశనమగునే యనిదుఃఖించెను. భగవంతుఁడు వానిదుఃఖముమాన్పి యుద్ధమునకుఁ ప్రేరేపవలసివచ్చెను. దుఃఖముమాన్పుటకునై యాత్మానాత్మ వివేకమును గలుగఁజేయు సాంఖ్యమును బోధించి సాంఖ్యమునందు శాస్త్రజన్య జ్ఞానమునుఁగలిగించెను. పిదపదాని నాచరణమునకుఁ దెచ్చుటకునై కర్మయోగమవశ్యాను ష్ఠేయంబని యుపదేశించెను. బ్రాహ్మణులకు శ్రౌతకర్మము బలెక్షత్రియులకు యుద్ధమానర్పుట శాస్త్రకర్మమని బోధించి, చిత్తశుద్ధికలుగని వానికినిజమగు నాత్మానాత్మ వివేకజ్ఞానము కలుగదనిన్ని, చిత్తశుద్ధికలుగుటకు నిష్కామకర్మాచరణ మవశ్యకమనిన్ని బోధించెను. ఆత్మానాత్మనుగుఱించిన సాంఖ్యవిచారము భగవంతుఁ డర్జునునకు బో

ధింప కుండినచో ప్రశ్నకునకు స్వజనసంహారమును గూర్చించుటకుఁ శోకమోహ పొరపు లుపదలు నుండ లేదు. కావుననే సాంఖ్యబోధన మిచటనవశ్యకమయ్యెను. ఇంకనర్జు నుఁడు వైరాగ్యము సర్వకర్మము సన్న్యసించెదనని పట్టినపట్టుదల విడిపించుటకున్నై అర్జునా: నీవింకను సర్వకర్మములు త్యజించునంతటి జ్ఞానవంతుఁడవు కావనిన్ని యట్టిజ్ఞాన మార్జించుటకుఁ జిత్తశుద్ధి యవశ్యకమనిన్ని, చిత్తశుద్ధికలుగుటకు ని ష్కామకర్మాచరణ మవశ్యకమనిన్ని తెలియఁజేసెను. నిష్కామకర్మము లాచరిం చుట ద్వారా చిత్తశుద్ధికలిగినపిదప నాత్మజ్ఞానము కలుగుననిన్ని, యాత్మజ్ఞానము కలిగినవానికి ముక్తికలుగును. కావున, అర్జునా! నీవుముక్తిఁగోరితివేని నాత్మజ్ఞా నమార్జింపుము. అదిచిత్తశుద్ధి ద్వారానీకుఁ గలుగును. చిత్తశుద్ధి నిష్కామకర్మము లాచరించుటచేఁ గలుగును.

అర్జునా! ఎవనికిఁ నజ్ఞానముండునో వానికిభ్రమయుండును. ఎవనికిభ్రమయుం డునో వానికిపదార్థ పరిశోధన పూర్వకమగు జ్ఞానముండదు. కావున నీవజ్ఞానాధి కారివగుటచేఁ బదార్థపరిశోధన పూర్వకమగు జ్ఞానమార్జింపుము. భీష్మాదిపదార్థ ములను యథార్థమేమో యదినీవు తెలిసితివేని నీకునాత్మ స్వరూపమిట్టిదని తెలియును. ఆత్మస్వరూపము నీవుతెలిసితివేని నీకుఁగలిగినశోకమోహాదులునివర్తించును. కావున నాత్మస్వరూప విషయమీ శ్లోకార్థమును నీవుచక్కఁగ నాలోచించితివేని నీకుఁ దెలియును.

కొందఱాత్మ సర్వాంతర్యామియనిన్ని నిత్యుఁడనిన్ని తెలియకయతఁడు శరీరమును వదలినపుడు తమయజ్ఞానముచేత, దారపుత్రత్వాది సంబంధములు గల్పించుకొని వారుచచ్చిరేయని దుఃఖించుచున్నారుగాని శవముగనున్న దేహ మునుగూర్చికాదు. అటు దేహమునుఁ గూర్చియేదుఃఖించునది నిజమైనచో నాదేహ మునింటఁ బెట్టికొని రక్షింపరేల? దానినేలకాల్చు చున్నారు? ఈకారణమునుఁ బట్టియాత్మను గూర్చియే జనులు దుఃఖించుచున్నారని తెలియవలెను. అటుదుఃఖిం చుట యుక్తముకాదు. అదిజననమరణములు లేనివస్తువు. నిత్యమైనది.

ఆక్షేపణ:—కుందేటి కొమ్ములుగూడ జననమరణములు లేనివగుటచేత నవిగూడ నాత్మవలె నిత్యమగును గదా? కాదు, ఏలయన

సమాధానము:—“ఆత్మ”యున్నవాఁడయి జననమరణములు లేనివాఁడు, కుందే టికొమ్ములట్టివి కావు. అభావరూపములైనవి, ఆత్మరూపభావము,

కాశ్రుతినే “ అవినాశీ వా అరేఽయమాత్మా ” యనియున్నది.

అజ్ఞానదశయందుండు వారాత్మను అనాత్మనుగా భావించి శోకమోహా దులను బొందుచున్నారు. జ్ఞానదశయందుండువారు ఆత్మ నాత్మగనే తెలిసికొని శోకమోహాదులను బొందరు. ఈ శ్లోకములో నాత్మ నిత్యుఁడు కావున దుఃఖింపఁ దగినవాఁడు కాడని బోధించి మఱల లోకులెల్లరు నెప్పటికిని నుండువారనుటకుఁ గారణములు దెలియఁజేయుచున్నాఁడు. ఆనాత్మయనఁగా శరీరము.

12. న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।
న చైవ న భవిష్యామః సర్వే వయ మతః పరమ్ ॥

అర్జునా! సర్వేశ్వరుఁడగు నేనొకప్పుడును లేనివాఁడను గాను. అనఁగా సర్వకాలములందుండు వాఁడను. నావలెనే యీ భీష్మాదులును స్థిరముగ నుండు వారలేకాని యేకాలమందును లేనివారలు గారు. కావున మనమందఱమును మూఁడు కాలములయందును నుండువారమేయని తాత్పర్యము.

భీష్మాదిశబ్దములకు లక్ష్యార్థమైన జీవి నిత్యముగ నుండువాఁడుగాని నశిం చువాడుగాడు. నిత్యుఁడని తెలిసినపిమ్మట వ్యసనమును బొందనక్కఱ లేదుగదా? కావున వ్యసనమును బొందకుమనియును, నిత్యత్వబుద్ధి వ్యసనమును బొందకుండుట కుఁ గారణమనియును భగవంతు డీ వాక్యముచేతఁ దెలియఁజేయుచున్నాఁడు. నిత్య త్వమునకుఁ బ్రమాణము లేదుగనుక యది సంభవింపదని తెలియఁగూడదు. మూఁడు కాలములందును లేక కుండేటికొమ్ము పుట్టినట్లు మూఁడుకాలములందు నుండునట్టి యాత్మపుట్టఁడు. ఆత్మ మునుపు లేక యిప్పుడుకలిగెనేని పుట్టునని చెప్పవచ్చునుగాని మూఁడుకాలములయందుండునది పుట్టునని చెప్పఁగూడదు. మూఁడుకాలములందుండు వాఁడయినట్టి తత్పదార్థవాచ్యుఁడ నయినట్టి నేనిదివఱకుఁ గలిగి నశించిన శరీర ములయందు, ఘటములందాకాశముండిన విధముగ నిత్యుఁడనై సర్వకాలములందు నుంటిని. నావలె త్వం పదార్థమునకు లక్ష్యార్థమైన నీవుంటివి. ఈ భీష్మాదులు నుండిరి. కావున దేహజనన మరణాదులతో నాత్మ జనన మరణాదులు గలుగునని తలంపఁగూడదు. జనన మరణాదులు కలుగునది దేహములకుఁగాని దేహికిఁగాదు. జీవి ప్రళయమందును, జనన మరణము లందదనుటకు “ నాత్మాశ్రుతేః ” యను ప్రమాణమున్నది. నేను నీవు భీష్మాదులని దేహాభేదము లనుసరించి చెప్పితినిగాని

త్రయాత్మభేదములతోఁ జెప్పినవాఁడనుకాను. సకల శరీరోపాధులయందును నుండు నట్టి యాత్మయొక్కఁడేయని గ్రహింపుము. సర్వులయందును నాత్మయొక్కఁడే యని యెడి యద్వైతవాదమును పలుమతములవారొప్పక యున్నవారు. ఆత్మలకు భేదములేదని చెప్పుట సరికాదనియును, నాత్మతత్త్వము విచారించినయెడల ప్రత్యక్ష అనుమాన, ఉపమాన, శబ్ద, అర్థాపత్తి, అనుపలబ్ధి, సంభవ, ఐతిహ్యాది ప్రమాణము లకు విరుద్ధమగుననియున్ని వారివాదము, అయితే యావాదములు విమర్శింపవలయున్న్ని ప్రమాణములెట్టివియును విషయ మించుక వ్రాసెద.

1 ప్రత్యక్షప్రమాణము:—తాను స్వయముగాఁగాని, ఒకఁడుచూపినఁగాని చూచి యిది యిట్టిపదార్థమని తెలిసికొనుట.

2 అనుమానప్రమాణము:-ఒకవస్తువుతో సంబంధించిన మఱియొక వస్తువునుఁజూచి యట్టిపదార్థముగూడ నచ్చటనుండునని యూహించి తెలిసికొనుట. అగ్నితో సంబంధముఁగలపొగనింటిమీదఁ జూచి యింటిలో నిప్పున్నదని యూహించుట.

3 ఉపమానప్రమాణము:-ఒకవస్తువున్బోలు మఱియొకవస్తువునుఁజూచి యావస్తువుకూడ నిట్లేయుండునని తెలిసికొనుట. చంద్రునివలె ముఖమున్నదనివిని, చంద్రునిఁజూచి యిటులనేముఖము నాహ్లాదకరముగ నుండునని తెలిసికొనుట.

4 శబ్దప్రమాణము:— మఱియొకప్రమాణమువలనఁ దెలియఁబడుటకు వీలులేని వస్తువిట్టిదని తెలియఁజేయు ప్రాజ్ఞుని వాక్యమునుఁబట్టి యట్టివస్తువును దెలిసికొనుట. ఇతర ప్రమాణా గోచర మగు బ్రహ్మవస్తుస్వరూపమును బ్రహ్మసాక్షాత్కారముఁ గల ఋషుల వాక్యమునుఁ బట్టియు, వేదవచనములఁ బట్టియును దెలిసికొనుట.

5 అర్థాపత్తిప్రమాణము:-పై లక్షణములఁబట్టి యీ యంశమిట్లుండవచ్చునని నిర్ణయించి తెలిసికొనుట. ఒకఁడు పగలన్నముఁ దినఁడుగాని బలిసియున్నాఁడు. ఈ వాక్యలక్షణమునుఁబట్టి యన్నముఁ దినని యెడ బలియుట తటస్థింపదు. కావున వీఁడు రాత్రిని దినుచుండవలెనని నిర్ణయించుట.

6. అనుపలబ్ధిప్రమాణము:— ఒకపదార్థ యొక్కచోట లేనందున నది లేదని తెలిసి కొనుట. భూమియందుఁ గుండ లేనందున, లేదని తెలిసి కొనుట.

7. సంభవప్రమాణము:— నూటిలోఁ బదులున్నట్లును, వేయింటిలో నూరులున్న ట్లును, గ్రహించుట.

8. ఐతిహ్యప్రమాణము:— ఒకచెట్టునందు బ్రహ్మరాక్షసున్నాడని యొక్కఁడే కాలము నందో చెప్పియుండఁగా నామాటను నానాటి కందఱు నువిని యాచోటునకు వచ్చినపుడామాట జ్ఞప్తికిఁ దెచ్చి కొని భయపడుట.

ఇవియును నింకను నన్వయవ్యతిరేకాది యితరప్రమాణములు సమవాదములలో వేదాంతులుపయోగించుచుందురు. ప్రయోగకులుమాత్రము మొదటి నాలుగుప్రమాణములనే వాడుచున్నారు. ఆత్మభేదములను గురించిన వాదప్రతివాదము లీరీతిగ నున్నవి.

ఆక్షేపణ:— ఆత్మలకు భేదములేదనుట సరికాదు. ఆత్మతత్త్వమును విచారించిన యెడల ప్రత్యక్షానుమాన శబ్దాది ప్రమాణములనుబట్టి భేదమే యగపడు చున్నది. అది యెటులనిన:— ప్రతిదేహమునందలి జీవుఁడును నేను నేనని వేఱువేఱుగాఁ జెప్పుచున్నాఁడు. మఱియును నేను వీఁడు, వాఁడని ప్రతిమానవుఁడును దలఁచుచున్నాఁడు. మఱియును, తనకును నితరులకును సుఖదుఃఖములందు భేదము కలిగియుండుటను దెలిసికొ నుచున్నాఁడు, కావున నాత్మలకు భేదముకలదని ప్రత్యక్ష ప్రమాణముల చేతఁ గనపడుచున్నది. ఆత్మలకు భేదములేని యెడల, నీవు, నేను, వీఁడు, వాఁడను భేదమే సిద్ధింపదు. గనుక నర్థాపత్తి ప్రమాణముచే తఁగూడ నాత్మలకు భేదమున్నదని తెలియవలెను. మఱియును గోవులు మొదలగు పశువులకుంబలె శరీరములన్నియును వేఱువేఱుగా నుండుట చేత, నాత్మలుగూడ వేఱువేఱుగానున్నవి. ఘటాదులంబలె ప్రతి శరీరమును వేఱువేఱుగా నుండుటవల్లను, నేను నీవను జ్ఞానము

వేఱువేఱుగా నుండుటవలనను నాత్మలు వేఱువేఱని యనుమాన
ప్రమాణముచేతఁగూడ నిర్ధరింపనగును. దేవతలు, దానవులు, గంధ
ర్వులు, యక్షులు, రాక్షసులని శ్రుతిస్మృతులయందు వేఱువేఱుగఁ
జెప్పఁబడుటవలన శబ్ద ప్రమాణముచేతఁగూడ నాత్మలు భిన్నములని
గ్రహింపవలెను. ప్రమాణములేగాక యుక్తిచేతనైన నాత్మలకు భేదము
కనఁబడుచున్నది. ఆత్మలకు భేదములేనియెడల నొకమానవుఁడు దుఃఖ
ముపొందుచున్నపుడు, లోకులెల్లరును దుఃఖమును పొందవలెనుగదా?
ఒకఁడు సంతోషించినపుడు లోకులెల్లరు సంతసింపవలెనుగదా? దేవ
శరీరములయందలి యాత్మలకును మానవశరీరములందలి యాత్మలకును
భేదములేనియెడల నందఱును సర్వజ్ఞులు కావలసివచ్చునుగదా? అట్ల
య్యెనేని విధి నిషేధశాస్త్రములు వ్యర్థమై పోవునుగదా? ఒక్కఁడు
మోక్షమందెనేని సకలజనులు ముక్తులు కావలసివచ్చునుగదా? ఒక్కఁడు
బద్ధుఁడైనచో నందఱును బద్ధులు గావలసివచ్చునుగదా? ఇట్టివి తటస్థిం
చుట యసంభవముకావున నాత్మలకు భేదముండియే తీరవలెను. లేద
నుట సరికాదు.

సమాధానము:— బాల్యకౌమార జరాద్యవస్థల యందవస్థలు భిన్నించినను నహంప్ర
త్యయము భిన్నింపదు. నేను పసివాఁడుగనుంటిని నేను వయసు
వాఁడుగనుంటిని ఇపుడు నేను ముసలివాఁడుగనున్నానని పలికిన
నేనునే. నహంప్రత్యయమునందే భేదమునులేదు. అవస్థలుమాత్రము
భిన్నములయినవి. నేను నేనని తలఁచినంతమాత్రముననే యాత్మ
లకు భేదమున్నదను ప్రత్యక్షప్రమాణము సరికాదు.

అవస్థలకు భేదముకలుగుటవలన నవస్థలుగలవానికిఁగూడ భేదముకలుగు
నని చెప్పినయెడల నట్టిభేదము బాల్యాద్యవస్థలయందు నభిమానముఁగల యహంకా
రమునందే పర్యవసించునుగాని నిత్యమగు నాత్మయందుఁ బర్యవసింపదు. అదికాదని
యాభేదము నిత్యమగు నాత్మయందే పర్యవసించునని చెప్పినయెడల వేఱొకఁడు
చేసినకార్యము వేఱొకనికి జ్ఞప్తికిరానట్లు నేను బాల్యమున బంతులాడితిని చదివితిని
ననునట్టి సంగతులు జ్ఞప్తికి రాఁగూడదుగదా? అట్లుగాక బాల్యమునందుఁ జేసిన
చేతలు ముసలితనమునందుఁ దలంచుచున్నాఁడు. కావున నేను నేనని తలంచిన

మాత్రముచేతనే యాత్మలకు భేదముకలదని యనుట సరికాదు.

శరీరములకు భేదముండుటచేత నాత్మలకుఁగూడ భేదముగలదని యను మానప్రమాణముచేతఁ జెప్పుటకూడ సరికాదు. ఎటులనిన; స్థూలసూక్ష్మ కారణ దేహములకును, జాగ్రత్స్వప్న దేహములకును, భేదమున్నను నాత్మకుమాత్రము భేదములేదు. ఈ యన్ని దేహములందును దేహావస్థలు భేదమగుచుండినను ననుమానప్రమాణముచేత నాత్మలకు భేదముకల్పించుట న్యాయముకాదు.

శబ్దప్రమాణముచేత నాత్మలకు భేదమున్నదని చెప్పినవాదముఁగూడ సరియైనది కాదు. సర్వదేహములందుండునట్టి చైతన్య మొక్కవిధమైన రూపమే గలది. కావున దేవమనుష్య గంధర్వాది దేహములన్నియును జాగ్రత్స్వప్న దేహములంబలె నాత్మకు నుపాధులగుటవలన దేవతలు, దానవులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, మానవులు, అని శ్రుతిస్మృతులలోఁ జెప్పినమాట దేహభేదములకు నన్వయించునుగాని యాత్మలు భిన్నములని సాధింపనేరవు. మఱియు దేహధర్మములందు రూపము, తేజస్సు, స్వభావము భిన్నించినను నాభేదము దేహములకు నన్వయించునుగాని యాత్మకు నన్వయింపదు. నేనను జ్ఞానము సర్వులకును సామాన్యము కాఁబట్టి శ్రుతిస్మృతులు దేహభేదమును మాత్రమే చెప్పుచున్నవని గ్రహింపవలెను.

ఆత్మకు భేదమేలేదని చెప్పినెడల నేను, నీవు వీఁడు, వాఁడు, అను భేదము సిద్ధింపదు. కావున నాత్మకు భేదముకలదని యర్థాపత్తి ప్రమాణముచేతఁ జెప్పిన వాదమున్ను సరికాదు; ఏలయన:—ఒక్క దేహమునందే శిరస్సు, చేయి, కాలు, మొదలగు నవయవములనుబట్టి వేఱుగా వ్యవహారభేదముగఁ గలుగుచున్నదో యటులనే దేహభేదములనుబట్టి నీవు, నేను, వీఁడు, వాఁడని వ్యవహరించుటమాత్రముచేత నాత్మలకు భేదముండవలసిన యావశ్యకత లేదని గ్రహింపవలెను.

ఆత్మకు భేదమే లేనపు డొక్కఁడు దుఃఖముఁబొందుచున్న దంత[illegible] దుఃఖమును బొందవలసివచ్చుననియును నొక్కఁడు సుఖమును బొందుచున్న [illegible] యును సుఖముఁ బొందవలసి వచ్చుననియును చెప్పిన పలుకు నొప్పఁదగినదిగాదు. ఎందుకనన: ఒక్క దేహమునందే పూర్వజన్మమునందలి పుణ్యపాప కర్మానుసారముగ నొకయవయవమునకు దుఃఖమును మఱియొక యవయవమునకు సుఖమును నొక్క

కాలమునందే గలుగుచున్న విధముగఁ బూర్వజన్మమునందలి పుణ్య పాపానుసార
ముగఁ బ్రతిశరీరమునందును వేఱువేఱుగుచుండును. అటులయినను నొకదేహ
మునందే యవయవావయవములకు నాత్మలు భిన్నములని తెలియవలెనుగదా! అది
యెవరికి వాదమును గాదు. కావున నీ వాదమునందు నాత్మలు భేదమనుటకురాదు.
దేవాది సర్వదేహములందును నుండునట్టి యాత్మ యొక్కఁడయ్యెనేని నందఱును
సర్వజ్ఞులు కావలెనుగదా? యని చెప్పిన మాటగూడ సరికాదని యెఱుంగవలయును.
ఎట్లనిన:-ఆత్మయే సర్వదేహములందును సర్వకాలములందును తెలిసికొనుచు
న్నాఁడు. ఏ మూలకమున? ఆయా దేహములందలి యన్యోన్యబుద్ధుల నవలంబించి తాను
తెలిసికొనుచున్నాఁడు. బుద్ధుల నవలంబింపక కాదు. దేహభేదములవలెనే బుద్ధుల
లోను భేదములున్నవి. ప్రతిదేహమందును బుద్ధివృత్తియనఁగా జ్ఞానము వేఱువేఱు
గానున్నదనియును, తన యెదుటనుండు వస్తువులను తెలిసికొనునంతటి శక్తిగల
నేత్రమునకు సకలపదార్థములఁ దెలిసికొనునట్టి శక్తిచాలని విధమున బుద్ధివృత్తికి
నైతము సర్వమును తెలిసికొనునంతటి సర్వజ్ఞత్వశక్తి కలగదని గ్రహింపవలెను.
బుద్ధివృత్తికి సకలపదార్థ సంబంధములు గలుగదు. అటుకలిగెనేని సర్వజ్ఞత్వము రాన
గును. ఆత్మ సర్వవ్యాపకమైనప్పటికిని నెక్కడ బుద్ధివృత్తికిఁ బదార్థముయొక్క సం
బంధము కలుగుచున్నదియో యక్కడనే జ్ఞానము కలుగుచున్నదనియును, బుద్ధి
వృత్తు లనేకములయి సర్వవ్యాపకములు కానందున నందఱు సర్వజ్ఞులు కానేరరని
యును తెలియవలెను.

విధినిషేధవాక్యములు వ్యర్థములయిపోవుననునది పై యాక్షేపణములలో
నొకటిగనున్నది. కించిత్ జ్ఞులను సత్కార్యములందుఁ బ్రవేశపెట్టుటకును దుష్కార్య
ములనుండి మఱలించుటకును శాస్త్రములు చెప్పఁబడినవగుటచేత నవి సార్థకము
లగునుగాని వ్యర్థములుగావు. సకలప్రాణులకును సర్వజ్ఞత్వము లేక పోవుటవలన,
వేదాంతవాక్యములు వినవలయుననియును, నటు వినుటచేఁగలిగిన జ్ఞానమువలన
శ్రుతిప్రమాణానుసారముగ నెవ్వఁడు పరమాత్మకును జీవాత్మకును భేదములేదని
తెలిసికొనుచున్నాఁడో యట్టివానికే ముక్తికలుగుననియును నితరులకుఁ గలుగదని
యును తెలియవలెను.

మఱియు నాత్మ లనేకులనియును, పరిపూర్ణులనియును, చెప్పినవారి
మతమునందే పైనఁ జెప్పఁబడిన దోషములన్నియును సంప్రాప్తము లగుచున్నవి.

అది యెట్లనిన:- ఆత్మలనేకులనియును, పరిపూర్ణులనియును, నంగీకరించినయెడల బుద్ధి మొదలగునవి యనేకములగుటవలన నాత్మలకుఁ బరస్పరమును బుద్ధి మొదలగు వానితో సంబంధము గలుగవచ్చును. అనఁగా దేవదత్తుని యాత్మకు యజ్ఞదత్తుని బుద్ధితోడను, యజ్ఞదత్తునియాత్మకు దేవదత్తుని బుద్ధితోడను, సంబంధము కలుగవలసివచ్చును. అట్లయ్యెనేని సుఖదుఃఖములకును బంధమోక్షములకును సాంకర్యము నలుగును గదా? ఈ యవ్యవస్థ యొక్కటియుగాక యాత్మలకుఁ బరిపూర్ణత్వముఁ గూడ సిద్ధింపదు. అది యెట్లనిన నేవస్తువు తనకంటె నితరవస్తువులు గలదియగునో యావస్తువు పరిపూర్ణమైనది కాదను న్యాయానుసారముగ నాత్మలనేకులగుటచేత నొకయాత్మకంటె మఱియొకయాత్మ వేఱని చెప్పవలసివచ్చును. అటులయైనయెడల నాత్మలకు పరిపూర్ణత్వము సంభవింపదు. పరిపూర్ణత్వము ననేకత్వమును పరస్పర విరుద్ధములగుటచేత నవి రెండును గలవని సాధించుట యసాధ్యము. కావున నాత్మయొక్కఁడేయని యంగీకరింపవలెను. మఱియును నాత్మ నిష్కళంకుఁడును, సర్వప్రకాశకుఁడును, సర్వసాక్షియును, నన్నిస్థలములందుండువాఁడును, నేనను తలంపునకర్థమైనవాఁడును నగుటవలన, పరిపూర్ణమగు నాకాశము సకలఘటములందును వ్యాపించినవిధముగ నున్నాఁడని యుక్తులచేత గ్రహింపనగును.

ఈ రీతిగ యుక్తివాదములు బలమయి మతములు హెచ్చయి వైషమ్యములు పెరుఁగుటకుఁ గారణంబులయ్యెను. ఇపుడు మనకుఁగావలసినది యాత్మయొక్కఁడా పలువురాయను విషయముగాదు. ఆత్మనిత్యుఁడని భగవంతుఁ డుపదేశించిన విషయము అప్పనికిఁబూనెద.

"నాత్మాశ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః" యని శ్రుతియున్నది. అనగా:- ఆత్మా-జీవుఁడు, న-పుట్టఁడు. ఎందువలన "అశ్రుతత్వాత్" ఉత్పత్తిప్రకరణమున జీవునకుత్పత్తి చెప్పఁబడలేదు. మఱియు నజుఁడనియును నిత్యుఁడనియును, బ్రహ్మమనియును, శ్రుతులు పలుకుచున్నవి. గనుక యాత్మయొక్క నిత్యజ్ఞానముగలిగి ధ్యానించినయెడల భీష్మాదులకు నీవు శోకింపవని పలికి మఱియు భగవంతుఁడా యాత్మయొక్క నిత్యత్వమునే పెక్కువిధముగఁ బలుకుచున్నాఁడు.

ఈ శ్లోకమునందు "జనాధిపాః" యనునది బహువచనపదముగా నుండుట కారణంబున విశిష్టాద్వైతులును ద్వైతులును ఆత్మకు బహుత్వమారోపించి

యద్వైత వాదముతో భిన్నించుచున్నారు. " జనాధిపాః " యనునది రాజత్వము వహించిన దేహములందున్న " ఆత్మ " యని శ్రీ శంకరాచార్యులవారి సిద్ధాంతము. దేహములనుగుఱించి బహువచన ముపయోగించినపుడది యాత్మకుఁగూడ నన్వయించునసుట సమంజసముగాదు. వ్యావహారిక భాషలో " నేను, నీవు, వీరు, మనము " యనినమాత్రమున వారిలోనుండు నాత్మలు వేత్వేరని నిర్ధరించుట న్యాయలోపంబని నాకుఁదోచుచున్నది.

ఆత్మకుఁ బరిపూర్ణత్వము విశిష్టాద్వైతులును ద్వైతులు నొప్పరు. ఆత్మలనేకములనియు, యవి యణుస్వరూపములనియు, వారిమతము.

" దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
" తథా దేహాంతర ప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి.

బాల్యయౌవన వృద్ధత్వములుగల స్థూలదేహమాత్మకు నుపాధిగ నెటులున్నదియో యటులనే స్థూలదేహము పడిపోయినపిదప, నాత్మ మఱియొక నూతన స్థూలదేహ ముపాధిగఁజేరును. కావున పండితుఁడు దేహనాశనమునకు దుఃఖింపఁడని తాత్పర్యము. ... బాల్య, కౌమార, యౌవన, జరాద్యవస్థలయందు నాత్మ నిత్యత్వ మగపడుచుండును. అవస్థలు మాఱినను నాత్మమారదు. అటులనే జరావస్థ మారినపిదప నాత్మ మఱియొక నూతనదేహ ముపాధిగఁ జేసికొనునుకాని మరణ మునొందదు. జాగ్రత్స్వప్న దేహములకు, సుషుప్తియందు నాశముగలిగినపుడు ఆత్మ యునికి తెలియరాదు. అరీతిగ నుండినను నిద్రించి లేచినవాఁడు తానెవ్వఁడనీ ప్రత్యభిజ్ఞచేననఁగా పూర్వస్మరణచేఁ దెలిసికొని యెటుల నాత్మనిత్యత్వము నమ్మెచున్నాఁడో యదేరీతిగ నీదేహము నశించినపిదపఁగూడ నాత్మ యున్నాఁడనియును నిత్యుఁడనియును దెలిసి విద్వాంసుఁడు త్వం పదార్థమగు నాత్మయందు మోహ మందఁడని స్థాపింపఁబడినది. భ్రమయనఁగా నాత్మ యదార్థజ్ఞానముఁగల విద్వాంసుఁడు మోహమందఁడు. గీత రచింపకముస్నే యాత్మ యొక్క నిత్యానిత్య వాదములు ప్రబలియుండెను, అందున వైశేషిక మతమువారు, ఆత్మ యొక్క యేకత్వ మొప్పుచుండలేదు. " ఆత్మలు, బుద్ధి, సుఖదుఃఖములు, ఇచ్ఛాద్వేషములు, ప్రయత్నము, ధర్మము, అధర్మము, భావన " యను తొమ్మిది విశేషగుణములు కలదనియును, ప్రతి దేహమునందును నాత్మలు భిన్నులేయనియును వాదించుచుండిరి. ఈ వాదమును తార్కికులును మీమాంసకాదులు విశేషభాగ మంగీకరించి

గయుంచిరి. సాంఖ్యులుమాత్ర మాత్మకు గుణములు నిరాకరించినను ధర్మిత్వమునకు సమ్మతించిరి. కావున శీతోష్ణ సుఖదుఃఖములనిత్యములనిన్ని యవి యాత్మగుణములు కావనిన్ని యాత్మ యొక్కఁడేయనిన్ని భగవంతుఁ డర్జునునకు నుపదేశించుచున్నవాఁడు. ఎటులనిన, దేహమును క్షేత్రమున నాత్మయను క్షేత్రజ్ఞుఁడొకండుం డును. ఆ దేహిక్షేత్రము బాల్య కౌమార జరాద్యవస్థలఁబొంది మార్పులంది జీర్ణమై నశించును. ఈ మార్పులు క్షేత్రమునకుఁ బ్రాప్తిల్లునుగాని క్షేత్రజ్ఞునకు సంభవింపవు. అతఁడొక్కరీతిగనేయుండును. ఎటుల క్షేత్రాభివృద్ధి నాశనములందు క్షేత్రజ్ఞుఁడా యా యవస్థలందు జేరి తానుమారకయుండునో యటులనే క్షేత్రనాశనానంతరము తనకుఁదగిన నూతనక్షేత్రము పూర్వజన్మ సంస్కారానుగుణ్యంబుగ వెదకికొనును. మనవారు పునర్జన్మమనునది యిదియేను. ఆత్మ నిత్యుఁడనియును, నాత్మకుఁ బునర్జననముకలదనియును, భగవంతుఁడు బోధించుచుఁ దానికిఁదగిన కారణంబులు దెలుపుచున్నాఁడు. అటు జీవి యెటు బంధయుక్తుఁడయి పునర్జన్మమందునదిన్ని యెటు బంధవిముక్తుఁడగునదిన్ని యచట నచట భగవంతుఁడు సూచించుచున్నాడు.

పై శ్లోకాభిప్రాయమునుఁబట్టి యాత్మనిత్యత్వమునుగురించి కొన్ని యాక్షేపణలు గలిగెనవి. అవి యెవ్వియనః—

ఆక్షేపణః— ఆత్మ యీ దేహమువదలి మఱియొక దేహమును బొందునని చెప్పిన యెడల నాత్మకు రాకపోకలుగలవని చెప్పినట్లగును. రాకపోకలు వికారములేగదా? అటులయ్యెనేని యాత్మకు వికారముగలదని యొప్పికొనవలసివచ్చును. ఆత్మకువికారము గలదనియొప్పికొనిన యెడల వికారముగల దేహమునకు జననమరణము లెట్లో యట్లే యాత్మకుఁగూడ జనన మరణములు గలవని చెప్పవలయును. అట్లుచెప్పినయెడల నాత్మ నిత్యుఁడను మాటయసత్యమై పోవును. ఆత్మనిత్యుఁడుకాని యెడల నాత్మకునాశము కలుగునవ్వాడు దుఃఖము పొందవలసినదేకదా? గనుక వ్యసనముఁబొందదనుమాటయుచితముగలేదు

సమాధానముః— ఆత్మకు నవస్థాభేదములున్నట్లు కనఁబడినను వాస్తవముగలేవు కావున నాత్మకు వికారములేదు. ఆత్మనిత్యుఁడనియును, దేహమునకంటె భిన్నుఁడనియును శ్రుతులు బలుకుచున్నవి. బాల్య

మునకును, ముసలి తనమునకును మహాభేదమున్నను, బాల్య
మునందలి సంగతులు ముసలితనమున జ్ఞప్తికివచ్చినట్లును, పూర్వ
యులవారు చేతనే స్తన్యపానాది ప్రవృత్తిసము కలిగెనను యు
క్తి చేతను, గూడ నాత్మ నిత్యుఁడని తోఁచుచున్నది.
మఱియును. ప్రతిమనుష్యునకును దేహమునందుఁ బరస్పర విరు
ద్ధములగు బాల్యకౌమార వృద్ధత్వంబులు వచ్చుచున్నవిగదా?
ఈమూఁడవస్థలు నొకటిపోయినఁగాని మఱియొకటిరాదు.
అట్టిమూఁడవస్థలలోఁ బ్రతియవస్థయందును శరీరము మాఱిపో
వుచున్నది. శరీరముమాఱిపోయినను నాత్మమాఱకయున్నాఁడు
కావుననే బాల్యమునందలి సంగతులను ముసలితనమునందుస్మ
రించుచున్నాఁడు, ఈవిధముగ నాత్మమఱియొక దేహమునం
దుఁ బ్రవేశించునపుడుగూడ వికారములేనివాఁడయి యున్నాఁడ
నుటకు సందేహములేదు వికారములేక పోవుటచేత నిత్యత్వము
గూడలభించుచున్నది. కావుననాత్మనశించుననను దుఃఖమును
బొందకుండుమని బోధించినది సమంజసము.

ఆక్షేపణ:— పైనఁజెప్పినదివాస్తవమైనచో దేహమువేఱనియును, దేహమునకంటె
నాత్మవేఱనియును జెప్పినట్లగును. అట్లుచెప్పుటసరికాదు. ఎట్లనిన
చైతన్యముతోఁగూడిన దేహముమాత్రమేయాత్మ. దేహవ్యతిరిక్తమైన
యాత్మవేఱొకఁడులేఁడు. “నేనుమిగులబలసియున్నాఁడను నేనెట్టివాఁడ
ను. నేను బోవుచున్నాఁడను” అని ప్రతిమానవుఁడును శరీరమును
బట్టియే చెప్పుచున్నాఁడు. అనుభవము గూడనదేవిధముగనున్నది.
ఆత్మవేఱుగనున్నయెడల శరీరవ్యవహారము లేకయే తానువ్యవహరింప
వలసి వచ్చును. ఒకవేళనాత్మవ్యతిరిక్తుఁడని యంగీకరించి నను జనన
మరణములు లేని వాఁడెట్లగును? ఆత్మదేహము కంటెను భిన్నుఁడయి
నను దేహముపుట్టినపుడు పుట్టును. చచ్చినపుడు చచ్చును. కావున
నాత్మకుఁగూడ జననమరణములు సంభవించుచున్నవనవలసివచ్చును!
జననమరణములు కలుగుట చేత సంతోషదుఃఖము లవశ్యముగా వచ్చు
చున్నవి. కావున బంధువులను జంపవలసినేయని యర్జునుఁడు దుఃఖించి
నది యుచితమేయని యాక్షేపణమువచ్చెను.

సమాధానము:— పై యాక్షేపణము సరికాదు. దేహమే యాత్మయనఁగూడదు. బాల్యమునందలి దేహమునకును ముసలితనమునందలి దేహమునకును, మహాభేదము కలిగియున్నను నాత్మకుమాత్ర మీయవస్థలందు భేదములేదు. కావుననే బాల్యమునందు దేవదత్తునకుఁ బుత్రుఁడనగు నే నిప్పుడు యజ్ఞదత్తునకుఁ దాతనైతినని దృఢమగు ప్రత్యభిజ్ఞ కలవాఁడగుచున్నాఁడు. ఇది యోగులకు విశదముగఁ దెలియును. ఒకవేళ దేహమే యాత్మయైనయెడల దేహమునకు మార్పుకలిగినట్లనే, యాత్మకుఁగూడ మార్పుగలుగవలయును గదా? అట్లు కలుగుటలేదని యిదివఱకే పలుకఁబడినది. కావున దేహముకంటె నాత్మభిన్నుఁడు. దేహమే యాత్మయైనయెడల స్వప్నమునందలి దేహము చైతన్య విశిష్టమైన యీదేహముకాదు గదా? ఆ దేహమందును చైతన్యమున్నదికదా? ఆ చైతన్యమున్ను నీ చైతన్యమున్ను నొకటిగాని యెడల నొకఁడనుభవించినది మఱియొకనికి జ్ఞప్తికిరానట్లు కలలోనిసంగతి జ్ఞప్తికి రాఁగూడదు. అయితే వచ్చుచుండును. అక్కారణముచేత నాత్మ దేహముకాదనియును, దేహమునకంటె భిన్నుఁడనియును నిశ్చయమగుచున్నది. చైతన్య విశిష్టమైన దేహమే యాత్మయయ్యెనేని యోగసిద్ధులు పరకాయప్రవేశము నెట్లుచేయుదురు? ఈ కారణముచేతఁగూడ నాత్మ దేహమునకంటె భిన్నుఁడని తెలియవచ్చుచున్నది. కావున నేను బలసినాను నే నెఱ్ఱనివాఁడనన్నట్టి ప్రతీతు లెండమావులం దుదకభ్రాంతి కలుగునట్లు భ్రమచేఁ గలుగుచున్నవని యెఱుఁగవలెను. కావున నాత్మకు వికారములేదనియును నిర్వికారుఁడైన యాత్మకు దేహమునందలి యౌవనవృద్ధత్వమువలె దేహాంతరముఁగూడ వచ్చుననియును, దేహమే యాత్మయైనయెడల పుణ్యపాపములు లేక పోవలసివచ్చుననియును మఱియు ననేకానర్థములు కలుగునని విచారించి యాత్మ నిత్యుఁడని తెలిసికొనిన బుద్ధిమంతుఁడు జననమరణముల విషయ

...మోక్షోపాయమును తెలిపిన శాస్త్రము.

ఈ శ్లోకమునకు భాష్యకారులు తెలిపిన కారణములే, వివాదమును దెచ్చినవి.

(ఏ) ఆత్మ యొక్కటియనియును, సంపూర్ణత్వముగలది యనియును, అద్వైతుల వాదము,

(బి) ఆత్మ లనేకములనియు, అణువులనియు, వానికిసంపూర్ణత్వము లేదనియు, ద్వైతుల వాదము. ఈ వాదములనుండి మతములు భిన్నించెను.

14. "మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖ దుఃఖ దాః,
"ఆగమాపాయినో౽నిత్యాస్తాం స్తితిక్షస్వ భారత.

15. "యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ,
"సమ దుఃఖ సుఖం ధీరం సో౽మృతత్వాయ కల్పతే.

శ్రోత్రాదీంద్రియములకు శబ్దాదివిషయగముచే శీతోష్ణ సుఖ దుఃఖాది ద్వంద్వములువచ్చును. వానికి రాకపోకలున్నవి. నిత్యములు కావు. ధీరుఁడు వానిని సహింపవలెను. వానిని సమానముగఁ జూడవలెను. అట్టివాఁడు ముక్తినందును. ముముక్షువునకు తితిక్షుత్వము సాధనము. తితిక్షుత్వమునకు శమదమాదులు సాధనములు. అతితిక్షుత్వ మెటులుండవలెననిన:—

"వృక్షయివతిష్ఠా సేత్స్యమానో నకుప్యేత, నకంపేత; ఉపలయివతిష్ఠా ఛిద్యమానో నకుప్యేత నకంపేత" యను శ్రుత్యర్థ మనుసరించి యుండవలెను. చెట్టువలె నుండవలెను. ఛేదింపఁబడుచున్నను కోపింపఁగూడదు, చలింపఁగూడదు, ఱాయివలె నుండవలెను. ఛేదింపఁబడుచున్నను కోపింపఁగూడదు చలింపఁగూడదు. "సమదుఃఖ సుఖంధీరం" యను వాక్యములో నీ యర్థమున్నది. "ధీరం" యను శబ్దమునకు "ధియంరాతీతి" యని విగ్రహము కొందఱుచేసినారు. అనఁగా బుద్ధి నెటులను బోనటుల నిగ్రహించువాఁడని యర్థమగును. "ధియం ఈరయతి" యని మఱికొందఱు విగ్రహముచేసినారు. బుద్ధినిఁ బ్రేరించువాఁడని యర్థమగును. శబ్దార్థ మెటులయిన నుండనిండు, సుఖ దుఃఖములు సమముగఁజూచు శక్తిగలవాఁడుగ నుండవలెనని భావము. అట్టివాఁడు ఆధ్యాత్మికాది త్రివిధదుఃఖములు సహించుచుండును. వానికి బ్రహ్మైక్య సంధానమార్గము దొరకును,

దేహాంతరము ప్రాప్తించినను దేహమునంటియే యుండును. శీతోష్ణ ములు తాకుటచే సుఖదుఃఖముల బాధలు దేహమునకుఁ దవిలి దేహమునందున్న జీవుఁడునైత నాబాధలకు గురియగును. అయితే శీతోష్ణములు సుఖదుఃఖములు శాశ్వతములుకావని మనమెఱుంగుదుము. అవివచ్చును, పోవును, మార్పులందును వానికి లక్ష్యభూతమయిన శరీరమునైత మారీతిన శాశ్వతమైనదియేను. కావున నిత్యములుకాని శీతోష్ణములకును సుఖదుఃఖములకును ధీరుఁడు చలింపఁడు. చలిం పని వానికిని మృతత్వముగలుగును. ఈరీతిగఁ గృష్ణులు బోధించిరి. ఇచట మఱి యొకవిషయ మాలోచింపఁదగినదిగనున్నది. ఇంతకును భగవంతుఁడేమిబోధిం చెను? మనకుగఁ దేహమునకు మృతత్వమున్నదనియు మనయందుఁగల యాత్మ నిత్యుఁడుకావున నమృతత్వస్వభావుఁడనియు పలికెను. ఇపుడు శీతోష్ణ సుఖదుఃఖా దులకుఁ జిక్కక వానిని సమముగఁ జూచువానియందలి యాత్మ యమృతత్వమందు నని పలుకుచున్నాడు. ఈ విరుద్ధమేమనిన నిందు విరుద్ధమెద్దియును లేదు. ఆత్మ స్వాభావికముగ నమృతత్వముకలది. కర్మవశమున ననిత్యమగు శరీరములో, నివ సించుటచే సంగసాంబంధిక దోషమున శీతోష్ణ సుఖదుఃఖములు పాధిమూలకముగ నాత్మనంటును. ఆత్మవిచారపరుఁడగువాఁడు శీతోష్ణ సుఖదుఃఖములు లక్ష్యపెట్టక తనవిధ్యుక్త ధర్మకర్మము లొనరించుచుండినచో నట్టివాని యాత్మ యేబాధకుఁ జిక్కక తన నైజప్రకాశమున వెలుగుచు నమృతత్వమంది యేబంధమును లేక యుం డును. కావున అర్జునా! యుద్ధకారణమునఁ గలుగఁబోవు సుఖదుఃఖ వికారములకు నీవు జిక్కకను వానిని లక్ష్యపెట్టకను నుండినచో నీవు బంధవిముక్తుఁడ వయ్యెద వని బోధించెను. అదియే యుద్ధసమయమునందు శ్రీకృష్ణుల ముఖ్యాభిప్రాయము.

ఈ శ్లోకమునకు శ్రీ మధ్వాచార్యులవా రొనరించిన వ్యాఖ్యానము నిక్కఁగనున్నది. విషయములున్నవి. విషయేంద్రియములున్నవి. ఇంతమాత్రము తోనే శీతోష్ణ సుఖదుఃఖములు వచ్చుటకుఁ గారణములేదు. వానిని గూర్చునది యభిమానతత్వము. దానిని నీవు జయింపుమని బోధింపఁబడినదని వారియభిప్రా యము. అద్వైతులంతయును మాయాకార్యమనువారు కావున వారికేవిధముగ నీవాదము బాధింపదు.

16 ॥ నాసతో విద్యతే భావో, నాభావో విద్యతే సతః,
॥ ఉభయోరపి దృష్టోంతః స్త్వనయో స్తత్త్వదర్శిభిః ॥

లేనిదానికి సునికిలేదు, కలదానికి లేమిలేదు. ఈ రెంటినిశ్చయమును బ్రహ్మవేత్తలే చూడఁగలరు.

సుఖదుఃఖములను శీతోష్ణములను సహింపఁగల తితిక్షుత్వము బ్రహ్మవేత్తకునెటు సంభవించుననఁగా, శీతోష్ణాది ద్వంద్వము లనిత్యములని బ్రహ్మవేత్త తెలియును కావున దానిని సహింప నలవియగును. లేనివగు శీతోష్ణాదులు సహించుటకష్టము కాదు.

ఆక్షేపణ:—లేనివానికి సున్నదియను ప్రసక్తియేయుండదు. ఇఁక సహించుటకు వీలగునని చెప్పుటచే " అప్రసక్తప్రతిషేధ " మను దోషమురాదా?

సమాధానము:—లేని దానికి సునికిలేదని చెప్పఁబడిన వచనమునకుఁ గుందేటికొమ్మువలె లేదనియర్థముకాదు. వ్యవహారదశలోని ప్రత్యక్షప్రమాణము మొదలగు ప్రమాణముల చేతసున్నట్లు గనఁబడుచుండినను త్రాడునందు భ్రాంతిచేఁ గలిగిన పామువంటివని తెలియవలెను. వ్యావహారికదశయందుఁ గనఁబడు పదార్థములయొక్క తాత్త్వికయదార్థస్థితినిఁ దెలుపఁజాలని ప్రమాణములు ప్రమాణములుకావు.

" వాచారంభణం వికారోనామధేయం " నామరూపములు వాగాలంబన మాత్రమని తెలియవలెను. కావున ప్రపంచమంతయు మిథ్యయని పండితుఁడెఱుంగును. కుండయంతయును మన్నేయని విమర్శవలన మనమెటు లెఱుంగఁగలమో, యట్టులనే తత్త్వవేత్త ప్రపంచమంతయును బ్రహ్మమేయని యెఱుంగును. అట్టివానికిఁ బ్రపంచమంతయును మిథ్యయగును. మిథ్యయనఁగా లేనిదనికాదు. సత్యము నిత్యము కానిదనియర్థము. స్వాప్నిక ప్రపంచమువలెను, గారడివానిపనివలెను, నాద్యంతము లందులేక నడుమంత్రమున నున్నట్లగపడుచుండునుగాని నిజమగునదికాదు. కావుననే మిథ్య కార్యకారణ విభాగములేని బ్రహ్మమేసత్యము. బ్రహ్మమే ప్రపంచము. బ్రహ్మమేసర్వము. అయితే సద్రూపమగు బ్రహ్మముండియును, లేనిదానివలెఁ గనఁబడక పోవుటకును, నసద్రూపమగు ప్రపంచము మిథ్యయయినను నున్నదానివలెఁ గనఁబడుటకును గారణమేమన బ్రహ్మముయొక్క యాథార్థ్యమును దెలిసికొనుటకుఁదగిన జ్ఞానము లేకపోవుటయేయని యెఱుంగవలయును, తత్త్వవేత్తలు సత్తుసత్తేయనియును, అసత్తు అసత్తేయనియును దెలి

యుదురు. అర్జునా! నీవును తత్త్వవేత్తలయొక్క మార్గము ననుసరించి నీవు నజ్ఞాన
మువలనఁ గలిగిన శోకమోహాదులనువదలి, కార్యమగు ప్రపంచమంతయును నెండ
మావులయందలి యుదకమువంటిదని తలంచి నియతకాలియతములగు శీతోష్ణాది
ద్వంద్వములను సహింపుము. ఇతరమార్గముల నవలంబించినచో సుఖమిగమ్యము.

ఈ శ్లోకమునందలి " అసత్ " శబ్దమునకు మిథ్యాప్రపంచమని యద్వై
తులబుద్ధి మూలప్రకృతియని ద్వైతులయర్థము. దేహమని విశిష్టాద్వైతులయర్థము.

17. అవినాశి తు తద్విద్ధి, యేన సర్వ మిదం తతమ్।
వినాశ మవ్యయస్యాస్య న కశ్చిత్ కర్తు మర్హతి।

ఏదిచేతఁ బడియున్న ప్రపంచమంతయును, నే పరబ్రహ్మముచేత వ్యాపింపఁ
బడినదియో యా బ్రహ్మమును నాశనము లేనిదానిఁగా తెలిసికొనుము. ఎట్టివాఁడును
నాశములేని యీ బ్రహ్మమునకు నాశమును గలిగింప నెవ్వఁడును నేరఁడు.

ఎండమావులందుదక భ్రాంతికలిగినట్లు పరబ్రహ్మమునందు జగద్భ్రాంతి
కలుగుచున్నది గాని నిజముగ జగత్తులేదు. సర్వమును బరబ్రహ్మమేయని భావము.
పూర్వశ్లోకమునఁ జెప్పఁబడిన సత్తు ఎట్టిదని యీ శ్లోకమున వివరింపఁబడును.

సత్తనునది సామాన్యమా? విశేషమా? యని ప్రశ్నింపఁబడినది. సామాన్య
మని చెప్పిన యెడల నది యెప్పటికిని విశేషరహితమైనది కాదు. విశేషము నపేక్షించు
నది మహాప్రళయమునందు విశేషములన్నియును నశించిపోవును గనుక సామాన్య
మునుగూడ నశించిపోవును. సత్తు ప్రళయమయిన పిదప నైనను యుండునది కావున నది
సామాన్యమనఁ జెల్లదు. విశేషములు కార్యములని సర్వులంగీకరించిన విషయము.
తార్కికులు పలికిన రీతిగ నవి ప్రళయానంతరముండుననునది యొప్పఁదగదు కావు
నవియుఁ ప్రళయమున నశించును. సత్తు ప్రళయమందును నాశము లేనిది కావుననది
విశేషము కాదు కావున, సత్తు సామాన్యమున్ను గాదు విశేషమున్ను గాదు. అది
మాత్రమేమనిన నఖండమైనదిన్ని యేకమైనదిన్ని వికారములు లేనిదిన్ని యగు పర
బ్రహ్మమని తెలియవలెను. స్వరూపనాశము లేనట్టిన్ని గుణనాశమువలన గలుగు
నట్టి నాశము లేనిదిన్ని వస్తువు సత్తని తెలియుము. అది సంబంధనాశమువల్ల గాని
నాశముండదు. ఆత్మస్వరూపమగు బ్రహ్మము స్వజాతీయ, విజాతీయ, స్వగత భేద
శూన్యమైన సత్తని తెలియుము. అద్వైతసాధనకునిది యాధారమగు. [illegible]

మని మహాసూత్రాది భాష్యకారులు వ్రాసించినారు. దీనిని ద్వైతులు నిరాకరించి వ్యాఖ్యానము వ్రాసినారు.

" సద్రూపమగునాత్మ యాకాశమువలెఁ బరిపూర్ణమగుట వలన నిత్యమని యను మానప్రమాణముచేఁ దెలియును.

సకలపదార్థములున్ను సర్వస్థలములందుఁ గనఁబడుచుండుటచేత, సూర్యునివలెసర్వప్రకాశకమగు నాత్మయున్నదనియును, సర్వప్రకాశకమగు దేహము తోఁ గూడ నశించినయెడల పదార్థములు కనఁబడకపోవలసి వచ్చుననియు నర్థాపత్తి ప్రమాణముచేతఁగూడ నాత్మనిత్యమగు నుండునదని తెలియవలెను.

ఆత్మకునాశము కలుగుననిన నానాశమెట్టిది. స్వరూప నాశమా! ఇత రుని వలన నాశమా! తనచేతనే కలుగునా? ఆధారమునశించుటవలనఁ గలుగునా? సంబంధమునశించుట వలనఁ గలుగునా? కారణము నశించుటవలనఁ గలుగునా? మఱిదేనివలనఁ గలుగును?

ఆత్మనిరవయము కావునవయవములుగల దేహమువలెనశింపదు. కావు రణంబున స్వరూపనాశంబుగలుగదు. ఆత్మకంటెను వేఱొకపదార్థమేదియును లేక పోవుట వలనను, సర్వమునుదానేయగుటవలనను, తానేకర్తయును కర్మమును నగుటకు వీలులేదు గనుకను, నితరునివల్లనేగాని తనవల్లనేగాని యాత్మకునాశ ము కలుగదు. "స్వేమహిమ్ని" యను "శ్రుతిప్రమాణాను సారముగ" నాత్మ తన మహిమ యందేయున్నది. అన్యమగునాధారములేదు. కావునఆధారనాశము నుండి యాత్మకు నాశముకలుగుచున్నదని వలుకుటకురాదు.

మఱియు నాత్మయవయవములు లేని కారణంబున ద్రవ్యగుణక్రియాదుల తోనేసంబంధముగలుగుటకున్ను వీలులేదు. కావునసంబంధమునశించుట వలన నాత్మకునాశము కాఁజాలదు.

ఆత్మకుఁగారణముదేవ్వఁడు లేదను శ్రుత్యర్థప్రమాణమునుబట్టి కారణ మునశించుటవలన నాత్మనాశముకలుగుటకున్ను వీలులేదు.

కావున సద్రూపమగు నాత్మకేవిధమగు నాశము లేదని [illegible] సత్యాత్మంగనగును. [illegible] చెప్పఁగావలసివచ్చును.

18 అంతవంత ఇమే దేహా, నిత్యస్యోక్తాః శరీరిణః॥
అనాశినోఽప్రమేయస్య, తస్మాద్యుధ్యస్వ భారత.

ఎప్పటికిని నుండునట్టిదియును, నాశములేనిదియును, ప్రత్యక్షప్రమాణాది ప్రమాణములలోనే ప్రమాణముచేతను దెలియశక్యము గానిదియును, నగు దేహికి నీశరీరములు నాశముగలవియని యాత్మవేత్తలు చెప్పుచున్నారు. కాబట్టి యట్టినా దేహంనాశమచింత్యము కావున నీవు విచారమును బొందకయుద్ధమును చేయుమని యభిప్రాయము.

అసత్తునుగురించి యిపుడువిమర్శింపబడుచున్నది. దేహాదిప్రపంచము లేనిదని యిదివఱలో జెప్పఁబడియుండినను లేనిదానియునికి తెలుపుమని యదు గుటసమంజసముగ నుండదని పలుకుటకు రాదు. ఏలయనిన, ప్రపంచము లేనిదని చెప్పుటచేనది కుందేటికొమ్మువలె లేనిదని యర్థము కావని నేనిదివఱకేవ్రాసినాను. దేహము మొదలగు పదార్థములన్నియు నసత్పదార్థములేయని భావింపవలెను. ఆత్మ యెప్పటికి నుండునట్టిది యనుటచేతనాత్మకొక్కదానికే స్వాతంత్ర్యము కలదని యును నితరములగు దేహాదులకు స్వాతంత్ర్యము లేదనియును తెలియవలెను. ఆత్మ, దేహియని చెప్పుటచేత నాకాశాదులకంటె వేఱని యెఱుంగవలెను, నాశ ములేదనుటచే జగదాకారముగఁ బరిణమించునట్టి మాయవలెఁ గాలములోఁ గూడ నశించునట్టిది కావని తెలియవలెను. ప్రత్యక్షప్రమాణాదులచేఁ దెలియ శక్యము కానిదనుటచే పృథివ్యాదులవలెఁగనఁబడునట్టిది కాదని యర్థము. యుద్ధము ను జేయుమనుటచే దేహాదు, లసద్వస్తువులనియును, స్వధర్మమునాచరించునపుడు హింసాది దోషవిచారణను జేయనక్కఱలేదనియును తెలియవలెను.

ఎండమావులందు ననువర్తించుకొని వచ్చుచున్న సద్బుద్ధి యెటు నాశము గలుగుచున్నదియో స్వప్నమందలి దేహాదులవలెను, గారడివాని మాయచేతఁ గల్పింపఁబడిన దేహాదులవలెను, నీ దేహమునందలి సద్బుద్ధి చక్కఁగవిచారించు నప్పుడు నాశమగును. భ్రాంతివస్తువులందలి సద్బుద్ధి శాశ్వతమైనదికాదు. జ్ఞానము గలిగినతోడనె భ్రాంతివదలిపోవును. భ్రాంతినుండి కలిగిన దేహమునందలి సద్బుద్ధి నైతము వదలిపోవును, ఆత్మకు వాస్తవముగ శరీరసంబంధము లేదనియును, నాత్మా నికసంబంధముచేతనసఁగా భ్రాంతిచేత శరీరములున్నట్లు కల్పబడుచున్నవనియును.

తత్త్వ[illegible] ప్రతిపాదించినట్టి [illegible] శరీరములున్నంతవరకు [illegible]

[illegible]ను. [illegible] శాస్త్రము ప్రమేయమునియున్నది. ఏలయన; ప్రత్యక్షాది ప్రమాణముల నాత్మపదార్థములను తెలుపవుగాని యాత్మను తెలుపవు. అయితే వేదాంతవేద్యుండని యున్నదికదా? ఆ వాక్యము తప్పాయనినచో, తప్పుకాదని పలుకవలెను. ఏలయన; వేదాంతమాత్మయొక్క యనాత్మధర్మముల యారోపణము మాత్రము పోగొట్టజాలును గాని కేవలాత్మను తెలుప ప్రమాణము కాదు. అనంగా; ఆత్మధర్మములు కాని కర్తృత్వము భోక్తృత్వము మొదలగునవి యాత్మయందున్నట్లు కనంబడుచుండినను నవి యనాత్మధర్మములు కావనుటకు వేదము ప్రమాణమగును గాని కేవలాత్మకుఁ బ్రమాణము గాదు. ఆత్మయు ప్రమేయమేను, ఆత్మ శబ్దరహితుఁడు స్పర్శరహితుఁడు కావునఁ బ్రత్యక్షప్రమాణమునఁ దెలియఁబడఁడు, ఆత్మకు లింగము ( చిహ్నం ) లేదు కావున ననుమానప్రమాణముచేఁ దెలియఁబడఁడు, హేతువు సాదృశ్యము లేనివాఁడగుటచే నుపమానప్రమాణముచేతఁ దెలియఁబడఁడు. అగోచరుఁడును నగ్రాహ్యుఁడుగను, నగోత్రుఁడును నగుటచే నామరూప జాత్యాదులు లేనందున శబ్దప్రమాణముచేతఁ దెలియఁబడఁడు. ఒకటి కుదరకపోవుటచేత వేఱొకటియున్నదన్నట్లు, ఆత్మవిషయమై యట్టిదేదియును లేకపోవుటవలన అర్థాపత్తిప్రమాణముచేతఁ దెలియఁబడఁడు. సత్పదార్థమగుటచేత “ అనుపలబ్ధి ” ప్రమాణముచేతను దెలియఁబడఁడు. వాక్కుచేతఁ దెలియ శక్యము కానివాఁడగుటచేత “ ఐతిహ్య ” ప్రమాణముచేఁ దెలియఁబడఁడు. ఏ బ్రహ్మము స్వాపేక్షలేకయే జ్ఞానాత్మకమై యున్నదియో, యే బ్రహ్మము సర్వవస్తుసారమగుటవలన నన్నిటిలో నుండునో, యా బ్రహ్మము ప్రమాణాపేక్షలేకయే ప్రకాశించుచున్నదని తెలియవలెను.

పైన వ్రాయఁబడిన మూఁడు శ్లోకములచేత భగవంతుఁడు బోధించిన యంశముల సంక్షిప్తార్థమేమన:—

“ త్వం ” పదవాచ్యార్థమయిన శరీరము జన్మాదులు కలదగుటచే ననిత్యము [illegible] దుఃఖించఁదగినది కాదు.

“ త్వం ” పదలక్ష్యార్థమైన యాత్మయో జన్మము లేదగుటచే నిత్యుఁడు, కావున దుఃఖింపఁదగినవాఁడు కాదు.

వేఱువేఱు కారణములవైన దేహముగాని, దేహిగాని దుఃఖింపఁదగిన విషయ భూతులు కారు.

" సంకరో నరకాయైవ కులఘ్నానాం " అనియును

" కథంభీష్మ మహంసంఖ్యే " యనియును,

నీవు పలికితివి. పాపక్రియకును తత్ఫలానుభవమునకును దత్కర్తృత్వము నకును నాత్మ కారణంబని నీవు తలంచి మాటలాడితివి. ఆత్మతత్త్వము నీకుఁ దెలిసి యుండినచో నీవిటు మాటలాడుచుండ లేదు.

పదునాఱవశ్లోకంబున " ఉండునదియున్నది. లేనిది లేదు " అను బాలురాడఁదగినమాట మహానుభావుండగు భగవంతుఁ డాడియుండునాయని కొంద ఱుపలికెదరు కాఁబోలు. నిజమగునర్థమది కాదు. దేహికిని దేహమునకునుగల భేద ము బోధించువాక్యమిది. దేహమెప్పుడైనను నశించునది కావున నది యిప్పుడగపడు చుండినను లేనిదనియేయని అర్థమనిన్ని, ఆత్మ నిత్యవస్తువుకావున నది యగపడ కయున్నను నుండునదియేయనిన్ని యర్థము. పదునేడవశ్లోకమున " ప్రపంచమం తయు నాత్మనిండియున్నదనియు నది నాశమొనరింప నలవికాదనియును బలుకఁబడి నది. ప్రపంచము నశించునదని పలుకఁబడినదికదా? ప్రపంచమునందుఁగల యేవస్తువ యినను లేకపోవునట్టిస్థితి యెప్పుడైనను గలిగియుండినదియా? ఉండునా? ఉండఁబోవునా? ఎద్దియైనా యొక రూపమునందునుగాని, యదిలేమి కలుగదుగదా? వస్తువుయొక్క రూపము నశించినను నా వస్తుసాంబంధిక పర్మాణువులు వేఱు రూపములనుండును గదా! అవి యెప్పటికిఁబోవును? నశించునను పదమునకు పూర్తిగ లేకపోవునని యర్థము చేయుట సమంజసముగాదు, కావున " ఆత్మ " ప్రపంచమంతయును వ్యా పించియున్నదని భగవంతుఁడు పలికినదినిజము. ఆత్మకు విశేషణము లుపయోగించు నప్పుడు " అవినాశి " " అవ్యయ " యని యేకవచనంబునఁ బలుకఁబడినది కావున " నాత్మ " యొకటియని యద్వైతులు వాదించుచున్నారు. ఆ శబ్దములు జాత్యైకవచనములుగఁ గొనవలెనని యద్వైతులు కానివారు వాదించుచున్నారు. ఈ వాదములతోఁ బ్రస్తుతము మనకు నేప్రయోజనమున్నులేదు. మనకు వలయు నది యాత్మ చరాచర ప్రపంచమంతయును నిండియున్నదను నంశమొకటియే.

"ఆత్మయనఁనెట్టి?" చైతన్యమా? జ్ఞానమా? దేహమా? ఈ ప్రశ్నలకు సమాధా నములు వేదాంతగ్రంథములలో ననేకములున్నవి. వానిని వ్రాయఁబూనినచో నుపన్యాసంబు గొప్పదియయి ముఖ్యాంశము లందులో మునిఁగిపోవును కావున మనమిపుడు దెలుపవలసినదేమన "ఆత్మ, యుపాధిభేదములచే ననేకనామములు గొనినదని చెప్పఁజాలును. ఆత్మకు సర్వవ్యాపకత్వ మారోపించినపుడు ప్రాణము లేకపడిన స్థాణువులయందు నైన నాత్మయుండునా? అట్లుండిన నవియు మనవ లెనే సజీవ వస్తువులయి యుండవలెనుగదా! అని ప్రశ్నింపవచ్చును. స్థాణువులు నైతము సజీవవస్తువులేను. అయితే వానికి మనవలె జ్ఞానేంద్రియ మనోబుద్ధ్య హంకారములు లేనందున నవి స్థాణువులుగఁ బడినవి. ఇంతకుమున్దు మనలో నొకరు జీవాత్మనుగురించి యుపన్యసించుటలోఁ బాశ్చాత్యగ్రంథము లనేకములు పరిశోధించి చెట్లకునైతము ప్రాణమున్నదని బహుప్రమాణములతో నిర్ధరించినారు. ఆవిషయము మరల నిచట వ్రాయనేలయని వదలితిని. ఆత్మకుఁ గర్తృత్వముగాని భోక్తృత్వముగాని లేదని ముందుశ్లోకమున భగవంతుఁడు పలుకుచున్నాఁడు. ఈ శ్లోకములను జదివి చక్కఁగ విమర్శించినచో నిరీశ్వర పరిణామవాదములిందు ఖం డింపఁబడినవని తెలియఁబడును.

[ఏ] సర్వతః వ్యాపించినది పరబ్రహ్మమని ద్వైతార్థము.

[బి] ఆత్మలేక పరబ్రహ్మమనియద్వైతార్థము.

[ఏ] పరబ్రహ్మము తెలియఁదగినవాఁడని ద్వైతార్థము.

[బి]. తెలియనశక్యుఁడని యద్వైతార్థమనఁగా

వ్యతిరేక గుణములచేఁ దెలియఁదగినవాఁడుగాని స్వగుణములచేఁ దెలి యఁదగినవాఁడుకాఁడని తెలియవలెను.

2. 19. "య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్:
ఉభౌ తౌ న విజానీతో, నాయం హన్తి న హన్యతే".

ఈ యాత్మచంపునని తలఁచువాఁడును, చంపఁబడునని తలఁచువాఁడును తెలిసినవారుగారు. ఆత్మ చంపునట్టిదియును గాదు. చంపఁబడునదియుఁగాదు.

ఈ శ్లోకార్థమిదేరీతిగ కఠోపనిషత్తులోఁ బలుకఁబడినది. "నతదశ్నా తికించన?" "నతదశ్నాతికశ్చన" ఈ యాత్మ దేనినిఁదినదు. ఈ యాత్మ నెవఁడు

ను నపహరింపఁడు. ఆత్మ, యవయవములు లేనిది, క్రియాహీనమైనది, శాంతమైనది, ఆత్మ సకలప్రాణకర్మములను జూచును. చిత్స్వరూపమనఁబడును, దృశ్యము లేనిది, గుణము లేనిది. వృక్షము చలించినను దానిలోపలనుండునట్టి యాకాశమవయవములు లేనిదగుటచేఁ జలింపక యుండునటుల, దేహేంద్రియాదులు చలించినను వానిలోపలనుండునట్టి యాత్మ చలింపదు. ఆత్మకుఁ గర్తృత్వముగలదని తార్కికులును, నాత్మ నశించునను చార్వాకులునుఁ దెలియని వారనియిందుఁ జెప్పఁబడినది.

[ఎ] ఆత్మ నిష్క్రియుఁడని యద్వైతార్థము.

[బి] పరమాత్మ నిష్క్రియుఁడగును గాని యాత్మ క్రియాశక్తి కలవాఁడని ద్వైతార్థము.

2. 20. "న జాయతే మ్రియతే వా కదాచి న్నాయం భూత్వా భవితా వా న భూయః॥
అజో నిత్యః శాశ్వతోయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే"

అర్జునా! ఈ యాత్మ యెప్పటికినిఁ బుట్టువాఁడును, మరణమును బొందువాఁడును గాఁడు. మఱియును గొంతకాలముండి పిమ్మట లేకపోవువాఁడును గాఁడు. కొంతకాలము లేక పిమ్మట నుండు వాఁడును గాఁడు. కావునఁ బుట్టువు లేనివాఁడని యును నాశము లేనివాఁడనియును సర్వకాలములయందును నొక్కవిధముగానే యుండువాఁడనియును; ననాదిసిద్ధమైన వాఁడనియును తెలియుము. కావుననే యాత్మ యాత్మశరీరము మాఱిపోవుచున్నప్పటికిని మాఱిపోవువాఁడు కాఁడని తాత్పర్యము.

ఈ శ్లోకార్థమున్ను కఠోపనిషత్తులోనిది. ఆత్మకు వికారములు లేవు. వికారములనఁగా "పుట్టుట, ఉండుట, వృద్ధినిఁబొందుట, మాఱురూపమందుట, కృశించుట, నశించుట, ఇవి యేషడ్భావ వికారములని సాంఖ్యులు మొదలగువారు చెప్పినవి. ఈ శరీరము ఖడ్గాదులచేతఁ గొట్టఁబడుచుండినను; కుండను బగులఁగొట్టినపుడు కుండలోని యాకాశము గొట్టఁబడనట్లు దేహమునందలి దేహమునందలి యాత్మ గొట్టఁబడదు. మరణమునందదు.

(ఎ) సంపూర్ణముగా శాశ్వతుఁడైనవాఁడు పరబ్రహ్మయనిన్ని జీవుఁడతనికి లోఁబడినవాఁడనిన్ని ద్వైతులు.

(బి) ఉభయులొక్కరేయనిన్ని "ఆత్మ" యుపాధి యున్నాఁడనిన్ని యద్వైతులు.

**2. 21** " వే దావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయం ।
" కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కం ॥

అర్జునా! అంతటను సత్తారూపముగనుండునట్టి యీ యాత్మ షడ్భావ వికారము లేనివాఁడయి పదార్థాల నేకవిధముగ నుండువాఁడని యాత్మస్వరూపము నెవ్వఁడెఱుంగునో వానికి శాస్త్రకం చెప్ప వేఱు పదార్థ మేదియునులేదు అర్జునా! నీవు యుద్ధమందెవరినిఁ జంపినను జంపించినను నీవు చంపువాఁడవును, జంపించువాఁడవును, గానేరవు గనుక సంకోచింపక యుద్ధమొనర్పుము.

దేహము వికారములందుచుండినను దేహిమాత్రము కూటస్థుఁడై యే వికారమునందకయుండునని తాత్పర్యము. అది యెటులనిన:-కూటమనఁగాఁ గాఁచిన బంగారమును గొట్టుటకుఁ జోటయినదియును పైన నలుచదరముగ నేర్పరుపఁబడి నదియునైన యినుపముద్ద. దీనిని దాగరలేక అట్టడయని పిలుతురు. ఆకూటమందు సాగగొట్టఁబడి పెక్కునగలై పెక్కువికారములను బంగారమందునుగాని యాకూటముమాత్రమే వికారమునుబొందక యెప్పటికి నొక్కరీతిగానేయుండును. ఆవిధముగానే యాత్మ, యధిష్ఠానమైన తనయందుఁ బ్రపంచ మనేక వికారములను బొందినను తానుమాత్రమే వికారమును బొందనివాఁడై యున్నాఁడు. దీని నెఱిఁగిన విద్వాంసుఁ డవిక్రియుఁ డగును. లోకమందు చైతన్యమనఁగా జ్ఞానరూపమైన బ్రహ్మమంతటను నిండియున్నది. ఆ చైతన్యము మనుష్యాదులందు మాత్రము ఇంద్రియాదులనెడి తగినసాధనము లుండుటవలన వస్తుజ్ఞానముఁ గలిగించుచున్నది. ఘటాది జడవస్తువులందు నా చైతన్యముండినప్పటికిన్ని ఇంద్రియాదులనెడి తగిన వస్తువులు లేకుండుటచేత వస్తుజ్ఞానము కలిగింపకున్నది. వస్తుజ్ఞానమెటు కలుగు ననఁగాః- అంతఃకరణము దీపకాంతివలె విషయములను బొందినపుడు బుద్ధివృత్తియని పిలువఁబడును. ఆ బుద్ధివృత్తియే విషయములను దెలియఁబఱచునట్టిది. ఆ బుద్ధివృత్తియం దజ్ఞానమనఁగా అవిద్య చేరియుండును. కావున విషయజ్ఞానమందు సైత మజ్ఞానము చేరి, వ్యవహరింపఁబడుచున్నది. అట్టి వ్యవహారము చేత నుపలబ్ధియయిన యాత్మ, యవిద్యాప్రయుక్త మిథ్యాసంబంధ కారణంబునఁ గల్పింపఁబడుచున్నది. అవిద్యాప్రయుక్త మిథ్యాసంబంధము వదలినతోడనె " అహంబ్రహ్మాస్మి " యను నిజమగు జ్ఞానము సిద్ధించును; అట్టి జ్ఞానమందిన విద్వాంసుఁడే, ఆత్మగా వ్యవహరింపఁబడుచున్నాడు, అజ్ఞానప్రయుక్త మిథ్యాసంబంధ జ్ఞానమెంతవఱకు నుండునో

యుంతవఱకు బుద్ధివృత్తియుండును. అవిద్యోపాధి నశించినపిదప నుండదు. అసత్య మైన యవిద్యోపాధిచేతఁ గలిగినది యసత్యమేయగును. ఆత్మస్వరూపుఁడగు విద్వాంసుఁ డవికారమునందఁడు.

పై శ్లోకమునం దాత్మను దెలిసినవిద్వాంసుఁ డాత్మయే యగుననియును నట్టివాఁ డెవరిని జంపును? ఎవరినిఁ జంపించునని యర్థమిచ్చుచుండును.

**ఆక్షేపణ ప్రశ్న:—** పైశ్లోకమునం దెవ్వఁడీ యాత్మను షడ్భావ వికారములు లేనిదని తెలిసికొనునో వాఁడు కర్తయునుగాఁడు కారకుఁడునుగాఁడని చెప్పబడినదికదా? దీనిని నేను దెలిసికొను చున్నానని ప్రతిమానవుఁడును బ్రతివిషయమందును జెప్పుచున్నాఁడుగదా? తెలిసికొనువట్టిది యెద్ది? దేహమా? ప్రాణమా? ఇంద్రియములా? మనస్సా? అహంకారమా? విశ్వుఁడా (జాగ్రదవస్థాభిమానియా?) తైజసుఁడా (స్వప్నావస్థాభిమానియా?) ప్రాజ్ఞుఁడా (నిద్రావస్థాభిమానియా?) దేహమేయైనయెడల స్వప్నకాలమునందలి దేహమా? జాగ్రదవస్థయందలి దేహమా? రెండుదేహములునా? వీనన్నిటికం టెను వేఱైనవాఁడా?

**సమాధానము:—** తెలిసికొనుచున్నవాఁడు పైవానివ్వరునుగారు. దేహాదులకం టెను వేఱగు నాత్మయె తెలిసికొనువాఁడని తెలియుము. అది యెటులనిన:- నేనను శబ్దమున కర్థమైనది స్వప్నావస్థయందలి దేహమయ్యెనేని, నది, జాగ్రదవస్థయందు లేకపోవుటవలనను, జాగ్రదవస్థయందుఁగూడ నేనను వ్యవహారముండుటవల్లనున్ను, స్వప్నావస్థలోఁగూడ నేనను వ్యవహారము నశింపకయుండుట వల్లను, నేనను శబ్దమునకు నర్థమైన జ్ఞాత స్వప్నావస్థయందలి దేహముకాదని యెఱుంగవలెను. ఇటులనే జాగ్రదవస్థయందలి దేహము నేనను శబ్దమున కర్థమైనయెడల స్వప్నావస్థయందు దేహము లేకపోవుటవలనను, ఆ స్వప్నావస్థయందు నేనను వ్యవహారముండుటవలనను, జాగ్రదవస్థయందలి దేహముకూడ కాదని యెఱుంగవలయును.

అయితే నేను బోవుచున్నానని చెప్పినతోడనే పోవుచున్నది దేహము గనుక నేనను శబ్దమున కర్థమైనది జాగ్రద్దేహమేయని యనఁగూడదు. నేను దేవతలచేఁ బ్రీతిగలుగునట్లు యాగాది పుణ్యకర్మములొనరించి స్వర్గమునకుఁ బోవుదునని చెప్పినపిమ్మట స్వప్నమునకుఁ బోవునట్టిది యీదేహము కాకపోవుటవల్లనున్ను మరణమునందిన దేహమునందు నేనను వ్యవహారము లేకపోవుటవల్లనున్ను జాగ్రద్దేహమునకు నేనను వ్యవహారము సంభవించుటకు వీలులేదు. మఱియు నొకటియుండునపుడు వేఱొకటియుండుట సంభవింపదుగనుక జాగ్రద్దేహ స్వప్నదేహములు రెండును నేనను శబ్దమున కర్థమగుట విరుద్ధము.

ఇఁకఁ బ్రాణమంటిమా ప్రాణము జడపదార్థము. జ్ఞానములేనివస్తువు, కావున తన్నుఁగాని తనకంటె వేఱయినదానినిఁగాని తెలిసికొనుటకుఁదగిన శక్తి కలుగదుగనుక నేననునది ప్రాణముకూడఁగాదని యెఱుఁగవలెను. మఱియు సకల విషయములు గ్రహించునది యొక యింద్రియమే కాదు. ఒక్కొకవిషయము నొక్కొకయింద్రియము గ్రహించుచుండును కావున నొక్కయింద్రియము నేననుటకుఁగాని, సకలేంద్రియములు నేననుటకుఁగాని వీలులేదుగనుక నింద్రియములుగూడ నేననుటకువీలులేదు. ఇఁక నేనను శబ్దమున కర్థమైనది వికారములేనిది యగుటవల్లను, అహంకారము వికారసహితమయినదగుటవల్లను నహంకారముకూడ నేనుగాదని తెలియవలెను.

అయితే "నేఁ దెలిసికొనుచున్నాను" అని చెప్పునపుడు తెలిసికొనుచున్నది యహంకారమే కావచ్చునని యనఁగూడదు. ఎందుకన:-అహంకారము స్వయముగా జడమగుటవలన నేనని తెలియునది యహంకారముకాదని తెలియవలెను. బాల్యాది వికారనాశనమువలన నహంకారనాశమున్ను గలుగుచున్నది. అయినను బాల్యమునందనుభవించినది ముసలితనమున జ్ఞప్తికివచ్చుచున్నది ఈ యనుభవమునుబట్టి చూడఁగ వికారముఁగలదియునయ్యు వికారములతోఁగూడ నశించునదియును నైన యహంకారమునకుఁ దెలిసికొనునట్టి శక్తిగలుగుటకు వీలులేదు గనుక యహంకారము "నేను" గాదని తెలియవలెను దహనశక్తి యగ్నికి సహజమైనరీతిగఁ దెలిసికొనుశక్తి యాత్మకొక్కదానికేఁదప్ప మఱియొకదానికి లేదనుట సిద్ధాంతము. మఱియును నాకీ యహంకారము దుష్టమైనదని చెప్పునపుడు అహంకారము తెలియఁబడునదియును, తాను తెలిసికొనుచున్నవాఁడును నగుటవలనఁ

గూఢ నహంకారార్థము నేనుగాదని తెలియఁగనగును. మఱియును విశ్వ, తైజస, ప్రాజ్ఞులు మూఁడ్వురును తెలిసికొనువానికంటె భిన్నులగుటవలన నేనుగాదని తెలి యవలయును.

“ కింభూతమతిహాస్తికం ” యనియున్నది. ఆత్మ తన్నుఁదానే చంపు కొనుననుసరణియు నొకయాత్మ మఱియొకయాత్మను జంపించుననుసరణియును గేవల విరుద్ధశాస్త్రములు. ఊహించుటకుసైన నలవి కానివి, ప్రామాణికవిషయములు కావు. కొన్ని కుయాత్మలు గర్తృత్వ మారోపించుచుండెను. చార్వాకుఁడాత్మను వినాశమారోపించుచుండెను కావున “ ఉభౌతౌనవిజానీతో నాయంహన్తి నహ న్యతే ” యని సిద్ధాంత మొనర్పఁబడినది. నతదశ్నాతికించన, నతదశ్నాతికశ్చన ” ( అది దేనిని భుజింపదు. దానినెవఁడును భుజింపఁడు ) అని పలుకఁబడినది. పైన వ్రాయఁబడిన మూఁడుశ్లోకములున్న కొన్నిశబ్దములుమాత్రము మార్పి కఠోపనిష త్తులోనున్నవి. అవియెవ్వియన,

“ నజాయతే మ్రియతే వా విపశ్చిన్నాయం కుతశ్చిన్నబభూవకశ్చిత్,
“ అజోనిత్యశ్శాశ్వతోఽయం పురాణోనహన్యతే హన్యమానేశరీరే.
“ హన్తా చేన్మన్యతేహన్తుం, హతశ్చేన్మన్యతేహతం
“ ఉభౌతౌనవిజానీతో, నాయంహన్తి నహన్యతే.
“ అశరీరంశరీరేషు అనవస్థేష్వవస్థితం
“ మహాన్తంవిభుమాత్మానం మత్వాధీరోనశోచతి.

వధింపఁడు వధింపఁబడఁడను వాక్యమునకు శ్రీ మధ్వాచార్యుల వారొన రించిన కారణములెవ్వియన జీవుఁడు నిత్యుఁడగుటచే వధింపఁబడఁడు; ప్రతిబింబ మగుటవలన నతనికి స్వతంత్రముగఁ గర్తృత్వములేదు కావున వధింపఁడు.

“ తత్త్వమసి ” యనెడి యద్వైతవాక్యములోని “ అసి ” యను బ్రహ్మాత్మైక్య భావమీ శ్లోకమునం దిమిడియున్నదనిన్ని యీ యర్థమునే 18నుండి 18-వ యధ్యాయములలో విస్తరింపఁబడినదనిన్ని మధుసూదన సరస్వతిగారు తమ భాష్యములో వ్రాసినారు.

22 వాసాంసి జీర్ణానియథా విహాయ
నవాని గృహ్ణాతి నరోపరాణి,

" తథా శరీరాణి విహాయ జీర్ణా

" న్యన్యాని సంయాతి నవాని దేహీ॥

లోకమునందుఁ బురుషుఁడు చినిఁగిన వస్త్రములనువిడిచి నూతనవస్త్రములను గ్రహించునపుడు తాను నిర్వికారుఁడై యెటులుండునో యటులనే యాత్మ జీర్ణదేహములను వదలి నూతనదేహములను బొందునపుడు నిర్వికారుఁడై యుండును. అనఁగా నరుఁడు చినిగినవస్త్రములనువదలి నూతనవస్త్రములెటు ధరించునో యటులనే యాత్మ జీర్ణదేహములనువదలి సర్వోత్కృష్టమగు నూతనదేహమును బ్రవేశించును. కావున భీష్మాదులకు నీవు హెచ్చుగ నుపకార మొనర్చినవాఁడవగుదువు. ఇట్టి మేలగు కర్మమునందు ఘనకారమొనర్తు నేయని శోకించుట యనర్థము. జీవి యొక్క దేహానంతరమున పునర్జన్మమందునను వంశ మీ శ్లోకము స్థిరపఱచుచున్నది. కర్మబంధమునుండి ముక్తినందుటకై జీవి, యనేకజన్మము లెత్తుచుండునని ఫలితార్థము. చెట్టు నశించినను దానివిత్తునుండి మఱియొకచెట్టు పుట్టినట్టు శరీరము నశించినను కర్మబద్ధుఁడైన జీవి వేఱొక శరీరములో దాగియుండును. ఇదివఱకు నాత్మకు వికారములేదని పలుమార్లు పలికియుండిన నిపుడు దృష్టాంతపూర్వకముగ నావిషయము నిర్ధరించి పలుకఁబడినది. అనేకపుణ్యము లార్జించుటకు సాధనము దేహము. అట్టి పవిత్రములగు భీష్మాదుల దేహములు నశింపఁజేసినచో పాపమువచ్చునని యర్జునుఁడు భీతిల్లునేమోయని భగవంతుఁడు శంకించి యీశ్లోకార్థమును బోధించెను. అది యెటులనిన, మానవుఁడు జీర్ణమగు తనవస్త్రమును వదలి నవీనవస్త్రమెటు ధరించునో యటులనే భీష్మాదులు తపస్సుచేతను వయస్సుచేతను కృశించు తమ ఆతశరీరములను వదలి గాంధర్వాది దివ్యశరీరములంది సుఖపడుదురు. నీవు వారిదేహమునకిపుడు నాశముకలిగించుటచే వారికి శాశ్వతోపకార మొనర్చినవాఁడ వగుదువుగాని మఱియొకటికాదు. దీనికి సంతసింపవలెనుగాని వ్యసనపడుటకుఁ గారణమెద్దియు లేదని భగవంతుఁడు బోధించెను.

23. " నైనం ఛిందంతి శస్త్రాణి, నైనం దహతి పావకః ।
న చైనం క్లేదయం త్యాపో, న శోషయతి మారుతః ॥

ఆత్మను శస్త్రములు ఛేదింపలేవు. అగ్నిహోత్రుఁడీ యాత్మను గాల్పఁజాలఁడు. ఉదకములీ యాత్మను దడపి చంపఁజాలవు. వాయువీ దేహమును శోషింపఁజేసి చంపఁజాలఁడు.

లోకములో ప్రతివస్తువునకును పృథివ్యప్తేజోవాయువులను నాలుగు భూతములలో దేనిచేతనో యొకదానిచేత నాశము కలుగుచున్నది. వానివలన నాత్మకు మాత్రము నాశము కలుగదు. ఆత్మ యవయవములు లేనిదగుటచే, దాని నెవ్వియు నేమియును జేయజాలవు. పంచభూతములలో నాలుగుమాత్రము పలికి యాకాశభూతమును మాత్రము పలుకక యుండుటకు గారణం బేమనిన నాకాశమునకు నాశము కలుగజేయు శక్తిలేనందున దానిని గూర్చి పలుకబడలేదు.

24. " అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ ।
" నిత్య స్సర్వ గతస్థాణు, రచలోఽయం సనాతనః ॥
" అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే ॥

" నిత్యస్సర్వగతస్థాణు " యనునది సమస్త పదమనిన్ని నిత్యుడును సర్వగతుడును నుండు పరమాత్మయం దుండునట్టి స్థిరుండు జీవాత్మయని ద్వైతు లర్థము చేసినారు. " నిత్యః సర్వగతః స్థాణుః " అని వ్యస్తపదములుగ నద్వైతుల యర్థము.

అర్జునా! ఈ యాత్మ శస్త్రములు మొదలగు సాధనములచేత ఛేదింపదగినవాడు గాడు. అగ్నిచేత గాల్పదగినవాడు గాడు. ఉదకముచేత దడుపదగినవాడు గాడు. వాయువుచేత నెండింపదగినవాడు గాడు. ఈ యాత్మ మూడుకాలములందు నుండువాడనియును, సర్వవ్యాపకుడనియును మునుపటి యవస్థను వదలి వేఱొకయవస్థను బొందనివాడనియును, చలనాదిక్రియలులేనివాడనియును, సనాతనమైనవాడనియును నేత్రములు మొదలుగాగల యింద్రియములచేత దెలియ శక్యముగానివాడనియును, వికారములేనివాడనియును మనస్సుచేతగూడ దెలియ శక్యముకానివాడనియును జెప్పబడుచున్నాడు. కావున దేహము నశించుటచేత నాత్మ నశింపదు. కాబట్టి వ్యసన మందకుము. ఆత్మసూక్ష్మకారణ శరీరములకంటెను భిన్నుడని తెలియజేయుటకునై యవ్యక్తుడని వచింపబడినాడు.

24.25 శ్లోకములు:— ఆత్మ నేతియను వ్యతిరేక గుణములచే దెలుపదగినవాడుగాని భావార్థగుణములచే దెలుపంగజాలనివాడని తెలియవలెను.

ఏందుకన నాత్మ అవ్యక్తుఁడు అచింత్యుఁడు అవికారుఁడు. అటులుండినను వేదశాస్త్రములచే కొంతమాత్రమైనను తెలియుఁగుటకు సాధ్యుఁడని శ్రీమధ్వాచార్యుల వారి తాత్పర్యము. సనాతనశబ్దమునకు వేదములచే తెలియఁబడువాఁడనిద్వైతార్థము. అనాదిసిద్ధుఁడని మిగతవారియర్థము.

25. తస్మా దేవం విదిత్వైనం, నానుశోచితు మర్హసి॥

అందువలన నీచెప్పఁబడిన ప్రకారముగా నీయాత్మను తెలిసికొని దుఃఖించుటకొఱకుఁ దగవు.

ఈ శ్లోకములోని ప్రారంభార్ధ శ్లోక మిఱువది నాల్గవ శ్లోకమున వ్రాయఁబడినది. ఇప్పటి యర్థశ్లోకములోఁ దెలుపున దేమనఁగా: అర్జునా! నేనిదివఱకు బోధించిన యాత్మతత్వమును జక్కఁగ నెఱింగితివేని భీష్మాదులమరణమునకు శోకింపఁ గారణములేదు. పదునొకండవ శ్లోకమునుండియు నిరువది నాల్గవ శ్లోకము వఱకును నాత్మయొక్క నిత్యత్వమును గుఱించియు దేహముయొక్క యనిత్యత్వమును గుఱించియు తెలుపుచు నావిషయము నర్జునునకుఁ జక్కఁగ బోధపడులాగున ననేక కారణములు భగవంతుఁడు పలికినాఁడు. ఆకారణములనుబట్టి యాలోచించినచో వ్యసనమునకేకారణంబును లేదని యీయర్థ శ్లోకమున ముగింపఁబడినది. "తరతి శోకమాత్మవిత్" అను శ్రుతిప్రమాణాను సారముగ నాత్మను తెలిసికొనినవాఁడు దుఃఖమును తరించునని భగవంతుఁడీసాంఖ్యయోగ ముపదేశించెనని తెలియవలెను. ఈకష్టతమమగు సాంఖ్యోపదేశ మర్జునునకుఁ జక్కఁగబోధపడినదియో లేదోయని భగవంతుఁడు సందియించి కాఁబోలు సాంఖ్యబోధనమును నిలిపి, మఱియొకవిధముగ లోకానుభవము రీతిగ బోధింప నుద్యుక్తుఁడయ్యెను.

26. అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతం॥
తథాపి త్వం మహాబాహో, నైనం శోచితు మర్హసి॥

అర్జునా! ఒకవేళ నీవీయాత్మ సర్వకాలములయందును బుట్టుచుండుననియును మరణమును బొందుననియును దలఁతువేని నటులైనను మానవునకు జననమరణములు గలుగుట సహజమే గనుక నీవు వ్యసనమును బొందుటతగదు:—

[అ] ఆత్మ నిత్యుఁడైనను దేహము పుట్టినపుడు పుట్టును. మరణముతో నశించునని లౌకికులవాదము.

[2] ఆత్మ జ్ఞానస్వరూపుఁడైనను ప్రతిక్షణము నశించుచుండునని సౌగతులనఁగా బౌద్ధులవాదము.

[3] దేహమే యాత్మ, అది స్థిరమయ్యును, ప్రతిక్షణమునఁ బరిణామము గలది. జనన నాశములు పొందునని చార్వాకుల మతము.

[4] ఆత్మ దేహమునకంటె భిన్నుఁడయ్యును దేహముతోఁ బుట్టును దేహముతో నశించునని కొందఱి వాదము.

[5] ఆత్మ సృష్టియొక్క మొదటి కాలమునందే యాకాశమువలెఁ బుట్టెననియును నొక దేహము పోయినపుడు మఱియొక దేహమునందుఁ బ్రవేశించుననియును నిట్లు ప్రళయకాలముదనుక సంచరించుచుఁ బ్రళయకాలమునందు తానునుఁగూడ నశించిపోవుననియును మఱికొందఱు చెప్పుచున్నారు.

(6) ఆత్మకు నాకాశమునకువలె వాస్తవముగ జనన మరణములు లేవనియును, ఉపాధిసంబంధముచేత జనన మరణములు కలుగుచున్నవనియును, గొందఱు పలుకుచున్నారు.

అర్జునా! పైమతములలోపల నేమతము ననుసరించినను, వ్యసనము బొందుటకుఁ గారణంబులేదు. ఏలయన మానవులకు జననమరణములు సహజములు. పైనవివరించినమతమువారెవరును బరలోకమున్నదని యంగీకరింపరు. కావున సహజముగఁ గలుగు జననమరణములకుఁ జింతిపనేల?

27 జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ
తస్మా దపరి హార్యార్థే నత్వం శోచితు మర్హసి.

అర్జునా: పుట్టినదానికిఁ జావును, చచ్చినదానికిఁ బుట్టుకయును గలుగుట నిశ్చయమై యున్నది. కావున నవశ్యకముగాఁ గలుగుచున్న జనన మరణముల విషయమై నీవు వ్యసనమును బొందుట యుచితముగాదు.

ఆత్మకు జనన మరణములు దేహమునకుంబలె స్వాభావికములని నీవెంచినచో స్వభావములు మార్పనెవరితరమునుగాదు. ఏదిస్వాభావికమో యదియవశ్యకముగ నయ్యే తీరవలెనుగదా? దీనికిఁగాను వ్యసనపడనేల? ఇఁకఁ బుత్ర మిత్రాది కార్యకారణ సంఘాతరూపములైనవారి వియోగ విషయమున విషాదమొందెద వేనియా దానికిసమాధానము వినిచెద వినుము.

" అపరిహార్యములగు విషయములందు మానవుడు చేయఁగలిగినది యే

" మియును లేదు. అభిప్రాయము:—

(1) జననమరణములు ఎవరికిని తప్పునవి కావు.

(2) యుద్ధము నీవు చేయకున్నను ప్రాణులు చావక నిలువవు.

(3) నీవును నెన్నడో యొకప్పుడు చావవలసినవాఁడవు,

(4) యుద్ధములో చావు నిజము. అటులని యోధుఁడు యుద్ధము వదలఁడు. విడిచినచో పాపము వచ్చును.

(5) నీవు చంపుట కర్తృత్వము కాదు. [illegible]

28 అవ్యక్తాదీని భూతాని, వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా

ఆ పుత్రమిత్రాదు లుత్పత్తినొందుటకు మున్ను వ్యక్తములు కావు. అనఁగా కనఁబడునవి కావు, మరణము నొందినపిదపఁ గనఁబడవు. మధ్యకాలమున మాత్రము కనఁబడును. భ్రాంతిచేఁ దోఁచునట్టి యింద్రజాలరూపముల దృశ్యమయ్యెనే యని చింతింప నగునా? యథాస్వప్న ప్రపంచోఽయం, మయి మాయావిజృంభితః తథాజాగ్రత్ప్రపంచోఽయం మయిమాయావిజృంభితః. ఎట్లుస్వప్న ప్రపంచము నాయందు మాయచే విజృంభించునో యటులనే యీ జాగ్రత్ప్రపంచము గూడ నాయందు మాయచేవిజృంభించు చున్నదని తాత్పర్యము. అర్జునా: స్వప్నమునఁ బుట్టిన శోకమునకు జాగ్రత్తయే ప్రతీకారమయినటుల నజ్ఞానమునఁ గలిగిన శోకమునకు జ్ఞానమే ప్రతీకారమని తెలియుము.

ఇదేయర్థము నిచ్చునట్టిన్ని 'యించుమించుగ నివే
పదము లున్నట్టిన్ని శ్లోకము స్త్రీ పర్వములోనున్నది.

" అభావాదీని భూతాని, భావమధ్యాని భారత
" అభావనిధనాన్యేవ, తత్రకాపరిదేవనా ॥ప॥

స్థూలసూక్ష్మ భూతముయొక్క సముదాయమే స్వరూపముగల శరీరములు పుట్టకమునుపు కనఁబడవనియును పుట్టినపిదప మరణమువఱకు నగపడుచుండుననియును బలుకునది "దృష్టిసృష్టి" న్యాయ మనిపించికొనును. శక్తిని జూచుట

చేతఁ గలిగినరజతస్మృతి వ్యక్తిదోషముచేఁ గలిగినభ్రాంతి. నిజము దెలిసినపిదప రజతభ్రాంతి పోయి యిది శుక్తియే రజతముగాదని తెలిసికొనును. అవిద్యాప్రాబల్యమున దేహమే యాత్మయను భ్రాంతి కలుగును. ఆత్మతత్త్వజ్ఞానమున నవిద్యాసాంబంధికభ్రాంతి నశించిపోవుటవలన తత్త్వజ్ఞానోదయమై శోకమోహాదులు లేవని భావము. ఆత్మతత్త్వ మెఱుంగవైతివే యని నిన్నొకని దూషింపనేల? ఆత్మతత్త్వ మెఱుంగక సర్వులుభ్రాంతి నొందుచున్నారు.

29. " ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన, మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః॥
" ఆశ్చర్యవచ్చైన మన్యః శృణోతి, శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్

ఈశ్లోక మునకు మిథ్యావాదములు బలపఱచుచున్నది. ఇందుఁగల యవ్యక్త శబ్దమునకు మాయ యర్థమని కొందఱందిరి. ప్రళయకాలమున సర్వభూతములు బ్రహ్మమునందైక్యమగును కావున నవ్యక్తములు, సృష్టిసమయమున నింద్రజాలకుని మాయాసృష్టిబలె సర్వభూతములు వ్యక్తమగును. మఱల లయకాలమున బ్రహ్మములో నడఁగి సర్వభూతములువ్యక్తములగును కావుననె శ్లోకార్థ మద్వైతమును స్థాపించును.

అర్జునా: ఈయాత్మను నొకానొకఁడు మహాశ్చర్యమునఁ జూచుచున్నాఁడు. ఆరీతిగనే మఱియొకఁ డద్భుతమునందుచుఁ బలుకుచున్నాఁడు. మఱియొకఁడా ప్రకారముగనే యచ్చెరువందుచు వినుచున్నాడు. చూచియును, చెప్పియును, వినియును నీయాత్మను దెలిసికొనలేకయే యున్నాఁడని యర్థము.

ఈయాత్మ సులభముగఁ దెలియశక్యుఁడుగాఁడు. కావుననే యనేకులు దెలియలేక చీకాకుపడు చున్నవారు. నిన్నొకని దూషింపనేల? ఉపాధిసహితుఁడగునట్టినిన్ని, నే ననుతలంపునకు విషయుఁడగు నట్టినిన్ని ప్రత్యగాత్మను గష్టపడి యెవఁడయిన నొకఁడు తెలిసికొనినప్పటికిని కేవలాత్మను దెలిసికొనుట కష్టతమమని యెఱుంగుము. ఆత్మదర్శనము దుర్లభమని శ్లోకముయొక్క ప్రథమపాదముననే పలుకఁబడినది. అట్టియాత్మ విషయమును గుఱించి పలుకుటయు, వినుటయు, వినినది తెలిసికొనుటయుఁ గేవలదుర్లభములని వచింపఁబడినది. ఆకారణంబుననే యాత్మ విషయము పలుకువాఁడును వినువాఁడును నరుదని తెలియవలెను. ఒకవేళ, నెవఁడో యొకమహానుభావునకు నాత్మదర్శన మయినను, నట్టివాఁడే యొకఁడు పలి

కినను, మఱియొకఁడాశ్చర్యమువలెనే చెప్పుచుండెనను, ఇట్టివానికిని సాక్షాత్కారము కలుగుట కడుదుర్లభమని ద్వితీయపాదంబున వచింపఁబడినది.

భగవంతుఁడు తాను వచించిన సాంఖ్యోపదేశ మర్జునునకుఁ జక్కఁగ బోధపడినదో లేదోయని సందియించి యొకవేళ బోధపడనిచో « వక్తురేవహి తజ్జాడ్యం శ్రోతా యత్ర న బుధ్యతే '' యనున్యాయానుసారముగఁ దాఁ బలికినపలుకు లర్జునునకు స్పష్టముకాక యుండినయెడల బోధపడనట్టుల పలుకునది బాధించువాని తప్పితమేయని యర్జునుఁడు తన్నుదూషించు నేమోయని సందియించి యాత్మవిషయమును గూర్చి పలుకుటయుఁ దెలిసికొనుటయుఁ గడుకష్టంబని సమాధానము శ్లోకమునుబట్టి యర్థము సేయనగును.

ఈశ్లోకమునందలి «ఆశ్చర్య'' శబ్దమునకుఁ బూర్వమునఁ జూడఁబడనట్టియు నద్భుతమైనట్టియు, నకస్మాత్తుగఁ గనఁబడినట్టిదియును బలుకఁబడినట్టిదియును వినఁబడినట్టిదియు విషయమని యర్థము. ఆత్మయనునది యేదో యొకవిధముగనున్నదని స్థాపింపఁబడినదిగదా? దానిదర్శనముఁగాని, దానివిషయమునఁ బలుకుటఁగాని, దానినివినుటయుఁగాని, దాని సాక్షాత్కారముగాని యేలకష్టమగునని ప్రశ్నించినచో నది విచిత్రవిరుద్ధమహిమలచే నవిద్యాసాంబంధకదోషావరణములచే నాచ్ఛాదింపఁ బడినందున నిజమెఱుంగుట కష్టముగఁ దోఁచుచున్నది. అదియెటులనిన:—

ఆత్మ, యవిద్యవలనఁ గలిగినట్టిన్ని, నానావిధములైనట్టిన్ని, శీతోష్ణములవలెఁ బరస్పర విరుద్ధములైనట్టిన్ని ధర్మములు గలదికావున, త్రికాలములందుండియు లేనిదానిం బలెనగపడు చుండును.

(2) స్వయముగఁ బ్రకాశించునట్టి చిత్తే స్వరూపముగఁ గలదయి యుండినను జ్ఞానశూన్యమైన దానింబలెఁ గనిపించుచుండును.

(3) ఆనందమే స్వరూపముగలదయ్యును, దుఃఖముఁగల దానింబలె నగపడును.

(4) వికారములెవ్వియు నేమాత్రములేనిదయ్యును, సర్వవికారములున్నట్టి దానింబలెఁ జూపట్టుచుండును.

(5) నాశరహితమైనను నాశసహితమైనట్టగపడును.

(6) ప్రారబ్ధకర్మవశమున దేహేంద్రియములచేసిను ప్రారబ్ధము లేనివానివలెఁ గనిపించుచుండును.

(7) బ్రహ్మమునకంటె నన్యముగాని జగత్తును బ్రహ్మమునకంటె భిన్నముగఁ దోఁచుచుండును.

(8) ముక్తినొందినవాఁడయినను బంధింపఁబడినవానివలెఁ గనిపించుచుండును.

(9) తనకంటె నన్యమగు పదార్థము కించిత్తైనను లేకయున్నను, దనకు భిన్నములగు పదార్థములనేకములున్నవని తోఁచఁజేయుచుండును.

ఈరీతి విరుద్ధధర్మములు లగపడుచుండుకారణంబున నాత్మజ్ఞానిఁ గనుఁగొనుట కష్టము. ఆత్మకూటస్థుఁడని యనేకశ్రుతులు పలుకుచుండ నీరీతిని విరుద్ధధర్మములు లగపడుచు వివరములు మానసములు చీకాకుఁ జెట్టనేలయని యడుగనగును. ఆత్మకూటస్థుఁడగుట సత్యము సందేహమేమియు లేదు. అయితే యనాదిగ వచ్చిన యజ్ఞానంబునకుఁ జిక్కి జనులు మోసపోవుచుందురు. ఇది యాత్మయొక్క కార్యము గాదు. ఈరీతిగనుండునట్టి యజ్ఞానమును గాల్చువిధమెట్లనః- శాస్త్రజ్ఞానము చేతను, సద్గురూపదేశము చేతను, నవివేకమువలనఁ గలిగిన భేదముపోవుటవలనను, శుద్ధమగుబుద్ధి వృత్తియందుఁబ్రతిబింబించిన యాత్మను. సమాధి పరిపాకముచేత శమదమాది గుణసంపదగల యొకానొక మహానుభావుఁ డాయజ్ఞానమునుగాల్చి బ్రహ్మసాక్షాత్కారమును జేసికొనుచున్నాఁడు. అట్టివాఁడే యైనఁ బలికినట్టి యజ్ఞానమును గాల్చివేయ సమర్థుఁడని తెలియుము. ఈరీతి బ్రహ్మ సాక్షాత్కారమును జేసికొనినవాఁడు దుర్లభుఁ డగును. అట్టివాఁ డాత్మనుగుఱించి పలుకుటయు నాశ్చర్యకరము. అట్టివానిపలుకులు విని తెలిసికొనుటయు నాశ్చర్యకరము. ఎటులనినః— సమాధి పరిపాకమందినవాఁడు నిర్వికల్ప సమాధియోగమున నుండును. అట్టివాఁ డాత్మనుగుఱించి పలుకఁడు. కావున వినువాఁడు నుండఁడు. ప్రారబ్ధకర్మ బలము చేత నట్టివాఁడు సమాధివదలి లేచినను లేచినపిమ్మట మఱల సమాధినిష్ఠుఁడగునంతవఱకు నజ్ఞానమయునివలె సంచరించును కావున నట్టివాఁడాత్మనుగుఱించి పలుకఁ జాలఁడు. అట్టివాఁడు పామరజనులవలెనే దేహేంద్రియవ్యాపారాదులుగలవాఁడయి యుండును. గనుక యట్టివాఁడాత్మవేత్తయని తెలిసికొనుట దుర్లభము.

...ప్రస్తి నాడు ...యుండినను, దానిని లాభముగాని ప్రాప్యతనుగాని పొందవలెనని కోరికయుండదు కావున నాత్మవిషయమును బోధించుచున్నాఁడు. ఒక వేళ వరము పడయు...యు చెప్పినయెడల నట్టివాఁడు పరమేశ్వరునిబలె దున్నవాఁడే యగును.

2. 30. « దేహీనిత్య మవధ్యోయం దేహేసర్వస్య భారత ।
" తస్మాత్సర్వాణి భూతాని, నత్వం శోచితు మర్హసి ॥

అర్జునా! సమస్త ప్రాణులయొక్క దేహములు సంహరింపఁబడినప్పటికిని యా శరీరములయొక్క లోపలనుండునట్టి యాత్మ, చంపఁబడదు. కాబట్టి నీవు సమస్త ప్రాణులను... శబ్దములకు ఉత్పత్తిస్థానమైన శరీరములను గురించి దుఃఖపడవలదు. సకలశరీరములందును నుండునట్టి యాత్మ, వికారరహితుఁడగుటవలన ఘటములు నష్టమైనప్పటికిని ఘటములలోని యాకాశము నష్టముకానివిధముగ శరీరములు పోయినప్పటికిన్ని యాత్మకు నాశములేదని తెలియఁగవలయును. స్థూలదేహ మెన్ని విధములఁ గాపాడఁ బ్రయత్నించినను నిలుచునట్టిదికాదు. కావున దానినిగురించి వ్యసన పడవలదు. లింగదేహ మాత్మవలె వధింప శక్యముకానిదగుటవలన దానినిగు రించియూడ వ్యసనమందుటకుఁ గారణములేదు. స్థూలలింగదేహములకంటెను నాత్మ భిన్నుఁడుగనుకను నిత్యుఁడుగనుకను దానినిగురించి వ్యసనమందుట యనుచి తము. ఇట్టి సాంఖ్యోపదేశంబున భగవంతుఁ డర్జునుని శోకమోహాదులను బోకార్పఁ బ్రయత్నించి దానికి జంటగఁ గులధర్మ మవశ్యాచరణీయంబనియును దానిని వద లినచో సకలానర్థములకుఁ గారణంబగునని బోధింప ముందు వ్రాయఁబోవు కొన్ని శ్లోకార్థము లర్జునునకు నుపదేశించువాఁడాయెను.

11 నుండి 30-వ శ్లోకాంత్యమువఱకు నాత్మయొక్క నిత్యత్వవిచారమే యని యద్వైత విశిష్టాద్వైతుల మతము. ఆత్మ పరమాత్మల యుభయుల పరమని శ్రీ మధ్వాచార్యులవారు నిర్ధరించి యిటులర్థముచేయుటకుఁ దమపాండిత్య నైపుణ్య మును చక్కఁగఁజూపినారు. ఆత్మ లనేకములని విశిష్టాద్వైతులు, ద్వైతులతో నేకీ భవించినను, నాత్మల స్వభావానందాదులందు భేదములేదని, ద్వైతవాదముతో భిన్నించుచున్నారు. ఆత్మలనేకులైనను నందఱు సమానులని విశిష్టాద్వైతవాదము. ఆత్మలలో భేదము లున్నవని ద్వైతులవాదము. ఆత్మలనేకములుకావు. ఒక్కఁడే యని యద్వైతవాదము.

2 31. " స్వధర్మమపి చావేక్ష్య నవికంపితు మర్హసి।
" ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోన్యత్, క్షత్రియస్య న విద్యతే॥

శోక మోహములను విడుచుటకు నిదివఱకుఁ జెప్పఁబడిన కారణములే గాదు మఱియొక కారణమున్ను గలదు. తెలిపెదనని భగవంతుఁడీ శ్లోకార్థమును బోధించుచున్నాఁడు. ఏమనఁగా క్షత్రియులకు ధర్మశాస్త్రోక్తమైన యుద్ధము కంటె నితరమగు ధర్మమేదియును లేదు. మఱియును కుల ధర్మమును వదలఁ గూడదు. కాఁబట్టి క్షత్రియుఁడవగు నీవు నీ కులధర్మమిదికదాయని యాలోచించి యుద్ధమునుండి తొలఁగి పోవునని పలికెను.

క్షత్రియులకు యుద్ధము సహజమైనదనియు, వర్ణాశ్రమములకుఁ దగినదనియును, శాస్త్రములందుఁ బలుకఁబడిన ధర్మకార్యము. యజ్ఞములయందుఁ బశువధ యెటుల క్రూర కృత్యముగాదో యటులనే క్షత్రియునకు యుద్ధమునందు ప్రాణహింస క్రూరకృత్యముగాదు. కులధర్మమని క్రూరకృత్యము జేయనగునాయని తలఁపఁగూడదు. యుద్ధమువలన జయము గలుగును. జయమువలన రాజ్యము లభించును. రాజ్యమువలన ధనముగలుగును. ధనమువలన యాగాది ధర్మకార్యములొనరింప వీలగును. ప్రజాపరిపాలనమునకు ననుకూల మార్గమగును. యుద్ధమొనరించుటయందిట్టి సుగుణ సంపదలు క్షత్రియునిఁ జేరి మోక్షము లభించును. క్షత్రియుఁడు మోక్షమందుటకు యుద్ధము తప్ప నితర సాధన మెద్దియును లేదు. "క్షత్రియోహి ప్రజారక్షన్ శస్త్రపాణిః ప్రదండవాన్ । నిర్జిత్యపరసైన్యాని, క్షితింధర్మేణ పాలయేత్ " అని ధర్మశాస్త్రము. అర్జునుఁడు ధర్మ శాస్త్రజ్ఞానము లేకయో, మఱచియో బంధువాత్సల్యమునకు శోక మోహాదులందినది, జ్ఞాన విహీనతయనియే పలుకవలెను. క్షత్రియులకు యుద్ధము తప్ప నితరమగు మోక్షసాధన ధర్మములేదని చెప్పఁబడి యుండుటచే నెల్లవారు నిర్నిమిత్తముగ యుద్ధమొనర్చుచు నితరులను జంపుచుఁ దాముచచ్చుట యుచితముగాదు. ధర్మముచెడి జనుల నెమ్మదికి భంగము గలిగినపుడు ధర్మరక్షణమునకును బ్రజాపరిపాలనమునకును క్షత్రియుఁడగువాఁడు యుద్ధమొనర్పవలెనని పలుకఁబడినదిగాని స్వార్థపరాయణుఁడై ప్రాణహింసమొనర్చినచోఁ బాపముగలుగుననుట నిస్సందేహము. ఇపుడర్జునుఁ డొనరింపఁ బూనినది ధర్మయుద్ధము. అధర్మ

యుద్ధము చేయుము, కావున నీ పాపము కలుగునని యర్జునుండాడినది యనుచితము.
పలికియును:—

ఈ శ్లోకమునందు " ధర్మ్య ధర్మ్యంయని శబ్దములున్నవి " ధర్మ్యయనఁగా (1) జాతిధర్మము (2) కులధర్మము (3) దేశధర్మము (4) రాజధర్మము (5) ధర్మరాజునకిచ్చిన ప్రతిజ్ఞాధర్మము (6) అర్జునుని గాండీవము దానినిగురించి చేసిన యర్జునుని శపథధర్మము (7) అధర్మమునుండి ప్రజలను రక్షించుధర్మము (8) వేదధర్మము. ఈ యన్నిధర్మములను గురించిన్ని యాలోచింపుమని పలుకఁబడినది.

2\. 32. " యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతం॥
" సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధ మీదృశం॥

అర్జునా! కోరకయే వచ్చినదియును, తెఱవఁబడిన స్వర్గద్వారము వంటిదియును, నగునిటువంటి యుద్ధమునే రాజులు పొందుచున్నారో యా రాజులు సుఖవంతులగు చున్నారు.

అర్జునా! " అహింసాపరమోధర్మః " అనునట్టి శాస్త్రమునకు నీవు విరుద్ధ మాచరింతునేయని చింతించెదవు కాఁబోలు, అదితప్పు. ధర్మయుద్ధము క్షత్రియునకు విరుద్ధమైనచో నగ్నిష్టోమమునందలి పశువధమైనను విరుద్ధ ధర్మమగును. " యావేద విహితాహింసా, నసాహింసేతి కథ్యతే " వేదముచేఁ నంగీకరింపఁబడిన హింస, హింసకాదు. అను విశేషస్మృతి ప్రమాణమున్నది కావునసామాన్య శాస్త్ర ప్రమాణమగు " అహింసా పరమోధర్మః " యనునది కొట్టఁబడినదయ్యెను. యజ్ఞమొనర్చు వారికి స్వర్గప్రాప్తి చిరకాలమునకు నగును. ధర్మయుద్ధ మొనర్చు క్షత్రియునకు, రణమున మడిసెనేని, వెంటనే స్వర్గసుఖము సిద్ధించును. అట్టియుద్ధములో జయమందెనేని భూలోకరాజ్యమును, ప్రజాపరిపాలన మొనరించిన పుణ్యమును, నైహిక సుఖానుభవమును, ధర్మరక్షణమునుండి గలుగు స్వర్గాది సుఖములును గలుగును. ఫలాభిలాషను వదలి యీలోకమునందు రాఁదగిన ప్రయోజనము నపేక్షింపక, కులోచితమును, వేదబోధితమునునగు యుద్ధమొనర్పుమని భగవంతుఁడు పలికిన హితము సర్వశాస్త్ర సమ్మతమని తాత్పర్యము.

2\. 33. " అథ చే త్త్వం ధర్మ్య, మిమం సంగ్రామం నకరిష్యసి॥
" తత స్స్వ ధర్మం కీర్తించ హిత్వా పాప మవాప్స్యసి॥

అర్జునా! అట్లుగాక నీవు ధర్మయుక్తమైన యుద్ధమును జేయక యుపే క్షించితివేని కులధర్మమును విడిచిన వాఁడవగుదువు. నీ విదివఱలో నార్జించిన కీర్తికి భంగముకలుగును. ఇటుధర్మము కీర్తియు రెంటిను వదలికొనుటచేఁ బాపముగలుగును. కావున యుద్ధమొనర్పుము. ఈ శ్లోకము మొదలుకొని మూఁడు శ్లోకములం దర్జునుఁడు యుద్ధమొనర్ప వలెననిన్ని యందేదోషములేదనిన్ని భగవంతుఁ డు ప్రోత్సాహపరచు చున్నాఁడు. యుద్ధము వదలినచో ధర్మమును విడిచిన వాఁడగుదువనిన్ని, యనేకయుద్ధములొనరించి ఫాలాక్షుని గెలచి పాశుపతాస్త్రమును సాధించిన గొప్పకీర్తి నశించుననిన్ని యదియునుఁగాక వేదబోధితవచనములు ధిక్కరించి వేదములను వదలిన వాఁడ వగుదువనిన్ని, వేదోక్తధర్మములు వదలినవానికి స్వర్గము సిద్ధింప దనిన్ని ఈ శ్లోకముచే నుపదేశించెను.

2\. 34. " అకీర్తిం చాపి భూతాని, కథయిష్యంతి తేఽవ్యయాం।
" సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే ॥

అర్జునా! నీవు యుద్ధమును జేయకపోతివని, దేవతలు, ఋషులు, మనుష్యులు మొదలగు వారందఱును నొకరితో నొకరు మాటలాడునప్పుడు, ధర్మాత్ముఁడు శూరుఁడును గాకపోవుటచేత నర్జునుఁడు స్వధర్మత్యాగ మొనర్చెనని చిరకాలము నిన్ను నిందింతురు. నీయంతటివాఁ డింతటి యపకీర్తి బొందుట యుక్తము కాదు. మఱియును శూరుఁడనియును ధర్మాత్ముఁడనియును, ననేక సుగుణములు గలవాఁడనియును గౌరవింపఁ బడినవానికి నపకీర్తి, మరణముకంటె నధికమగు దుఃఖమును గలుగఁజేయును. కాఁబట్టి నీ వపకీర్తినిఁజెందక యుద్ధమొనర్పుము.

మరణము క్షణముమాత్రము దుఃఖము కలుగఁజేయునది. అపకీర్తి చిరకాలము దుఃఖము కలుగఁజేయును. అక్కారణంబున మాన్యులగువారికి మరణమునకంటె నపకీర్తియే మిగుల దుఃఖకారియగుటచేత సహింప శక్యముగానిదని, తెలియవలెను. ఎప్పుడో సుఖమునుఁ గలుగఁజేయునట్టి కీర్తిధర్మములు నశించిపోవుటయగాక యీ లోకమునందిప్పుడే దుఃఖమును గలుగఁ జేయునట్టి యపకీర్తికూడ వచ్చునని యీ శ్లోకమునందుఁ బలుకఁబడినది.

2\. 35. " భయా ద్రణా దుపరతం, మంస్యంతే త్వాం మహారథాః।
" యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసిలాఘవమ్ ॥

అర్జునా! ఇపుడు నీవు యుద్ధమువదలి పోయినయెడల పూర్వము దుర్యో
ధనాదులు నిన్ను శూరునిగాను గుణవంతునిగాను తలఁచిరో యీ దుర్యోధనా
దులే యిప్పుడు కర్ణాదులతో యుద్ధముచేసినయెడల చచ్చిపోదునను భయముచేత
ఫల్గునుఁడు యుద్ధమును వదలిపోయినాఁడుగాని బంధువులను జంపవలసివచ్చునేయని
దయచేత వదలిపోయినవాఁడు గాఁడని తలఁతురు. అందువలన నీకు నగౌరవము
గలుగును కావున నీవు యుద్ధమును వదలుట యుచితముగాదు.

ఇంతకుముందు పలికిన శ్లోకములో నపకీర్తివచ్చునను కారణంబుఁ దెలు
పఁబడినది. ఇపుడున్నైత మదేయర్థమునిచ్చు శ్లోకముఁ బలుకఁబడినది. అయితే యీ
రెండుశ్లోకములలో నించుక భేదమున్నది. ప్రారంభశ్లోకమునందలి యపకీర్తి యొచ
టనో యెవరో పరోక్షముగ నాడికొనుటవలనఁ గలుగు తిరస్కృతి. ఈ శ్లోకము
నందలి తిరస్కృతి యట్టిదికాదు. నీ యెదుటనే నీకుఁ గానివారు, నిన్నుఁ జూచిన
భయపడుచుండినవారు ముఖ్యముగ నీ రాజ్యమపహరించి నీ భార్య నవమాన పఱిచి
నిన్ను వనవాసమునకుఁ బంపిన దుర్యోధన కర్ణాదులు నిన్నవమాన పఱతురని పలు
కఁబడినది. ఈ రీతిగఁబలికి యుద్ధమొనర్ప నర్జునునకు రోషముద్భవింపఁ జేయఁ
బడినది.

2. 36. “ అవాచ్య వాదాంశ్చ బహూ న్వదిష్యన్తి త వాహితాః।
“ నిన్దన్త స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥

అర్జునా! నీవిపుడు యుద్ధమును జేయక యూరకుంటివేని దుర్యోధనుఁడు
మొదలగువారు నీవు సామర్థ్యము లేనివాఁడవని చెప్పుటయగాక నోటఁ బట్టఁ
గూడని తిట్లను దిట్టుదురు. కావున నీవు యుద్ధమును వదలుట యుచితముగాదు.
ప్రసిద్ధుఁడవగు నీకు నితరులు నిందించుట వలనఁ గలిగెడు దుఃఖముకంటె నధిక
దుఃఖము కలుగఁజేయునట్టిది మఱియేదికలదు?

2. 37. “ హతోవా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్।
“ తస్మా దుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృత నిశ్చయః ॥

అర్జునా! యుద్ధమునందు నీవు శత్రువులచేత జయింపఁబడితివేని స్వర్గలో
క సుఖముల ననుభవింపఁగలవు. అట్లుగాక నీవే శత్రువులను జయించిన యెడల భూ
లోకరాజ్యము ననుభవింపఁగలవు. కాబట్టి నీవు మరణము బొందినను జయించినను
నీకు లాభముగలదు కావున యుద్ధముఁ జేయుటకు నిశ్చయించుకొని లెమ్ము.

ఈ యుద్ధము వేదోక్త ధర్మమగుటచేత యుద్ధమునందలి భీష్మాదుల వధ యాగపశువధను బోలినది గనుక శిష్టులు నిందింపరు. శత్రువులను జంపుటచేత వారి నిందసైతము రాదు. నీవు మరణమందితివేని స్వర్గలోకప్రాప్తి గెలిచితివేని భూలోక రాజ్యము ప్రాప్తిల్లును. పిదప స్వర్గముసైతము లభించును. వీనినెల్ల నీవు చక్కఁగ నాలోచించితివేని జయపరాజయములలో నీకు నేది లభించినను లాభము కలదు గాని నష్టములేదు. నిందరాదు. కావున యుద్ధమొనర్చుటయే శ్రేయమని భగవంతుఁడు బోధించెను.

ఇంక నీకేమైనను పాపము వచ్చునని భీతిల్లెదవా? పాపమురాని మార్గమును జెప్పెద వినుము.

2. 38. « సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।
« తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి ॥

అర్జునా! సుఖమునందును దుఃఖమునందును సమాన బుద్ధిగలవాఁడ వగుము. ఆ సుఖదుఃఖములకుఁ గారణములైన లాభనష్టములు గలిగి నపుడుకూడ సంతోష వ్యసనములు పొందకుండుము. లాభనష్టములకుఁ గారణములైన జయాపజయములందుఁగూడ సమబుద్ధి కలవాఁడవయి యుండుము. ఈ విధముగ సర్వవిషయములందును సుఖదుఃఖములను రాగద్వేషములను వదలి యుద్ధముఁ జేయఁబూనుము. ఇట్లు సర్వమునందును సమబుద్ధి కలవాఁడవయి యుద్ధమునందుఁ బ్రవర్తించి నయెడల నీకుఁ బాపమురాదు. సుఖదుఃఖములకు మూలము రాగద్వేషములు. రాగద్వేషములు వదలినచో లాభనష్టములు జయాపజయములు సమానములగును. లాభాదులు సిద్ధించినను సిద్ధింపక పోయినను హర్షవిషాదములు వదలికొని భగవంతునియందు భక్తికలవాఁడవయి వేదోక్తకర్మముల నీశ్వరార్పణ బుద్ధితోఁ జేయవలెను. నరమేధమునందు బ్రాహ్మణుని వధింపవలెనను శ్రుతి ప్రమాణానుసారముగ బ్రాహ్మణవధవలనఁ బాపమురాని విధముగ స్వకులోచితకర్మము క్రూరకర్మమైనను పాపముఁ గలుగఁజేయదు.

ఫలితార్థము:—ఈ యధ్యాయములోఁ బదునొకండవ శ్లోకార్థము మొదలుకొని ముప్పదియవ శ్లోకాంత్యము వఱకు భగవంతుఁడు అర్జునునకు సాంఖ్య యోగమును బోధించుచు నాత్మ నిత్యత్వమును దేహ మాత్మ

లెప్పుడును జీవుండుండియు నంతమని పలికెను. మరణము దేహిని
నేవిధముగను బాధింపక యుండుటయేగాక కర్మబద్ధుండయిన జీవి, తన
కర్మబంధ విమోచనమునకుఁ గ్రొత్త క్రొత్తమార్గములు కలిగించుకొ
నుననియు, దీనికిఁగాను నరుఁడెప్పుడు దుఃఖింపఁ గారణము లేదనియు
తెలిపెను. సాంఖ్య బోధనముచే నర్జునుని మానసము నాత్మనిత్య
మునుగుఱించి స్థిరపఱచి యర్జునుని యుద్ధమునకుఁ బ్రేరేపింప
మఱియొక విధమగు లౌక్యవాదమును ముప్పదియొకటవ శ్లోకమునుండి
ముప్పదెనిమిదవ శ్లోకాంత్యమువఱకు నొనర్చెను. క్షత్రియుఁడని
పుట్టినవాఁడంతేయును ధర్మస్థాపనమునకు తనయాయువు కొఱుపెట్టు
చుండవలెను. ధర్మమును స్థాపించు విషయమునఁ బ్రాణముపైన
నైతము లక్ష్యమునిడఁ గూడదు. ధర్మవిరుద్ధ మెచటనైన జరిగినచో
దానినిఁ దొలఁచుటకు నెంతటి సాహసకర్మమునుగాని యొనర్ప
వలయును. యోధుఁడగు క్షత్రియుఁడు యుద్ధమొనర్చినచో ధర్మ
స్థాపన మొనర్చినవాఁడొకటియగాక కీర్తి నార్జించిన వాఁడగును.
యుద్ధమునఁ జచ్చినచో నట్టివీరునకు స్వర్గసుఖము సంభవిల్లును
గాని పాపము రాదని హిందూమతము. ఇఁక ధర్మాధర్మ సూక్ష్మ
ములు నిర్ధరించుట రాజుల పని యగును గాని యోధుల పని గాదు.
రాజభృత్యన్యాయమనుసరించి ప్రతియోధుఁడును యుద్ధమొనర్పక
తప్పదు. అట్టి యుద్ధమునుండి తప్పించికొనిన పంద మహాపాతక
మొనరించిన వాఁడయి రౌరవాది నరకముల పాల్పడును. అర్జునుఁ
డొనరించునది ధర్మయుద్ధము. అర్జునుని సాహస విక్రమముతో దశ
దిశలందు వ్యాపించియుండెను. అట్టి వీరుఁడు యుద్ధభీరువైనచో
దేహానంతరమున నరకప్రాప్తియును బ్రాణమున నుండునపు డపకీర్తి
కిని, పరిహాస్యమునకును లక్ష్యభూతుఁడయి జీవచ్ఛవత్వమును బొం
గలదని భగవంతుఁ డర్జునునకు నొత్తియొత్తి చెప్పెను. యుద్ధమొన
ర్చినచో స్వజనహననమునుండి తనకుఁ బాపము వచ్చునని యర్జు
నుఁడు భీతినొందెను. యుద్ధము వదలినచో మహాపాతక మొనర్చినవాఁ
డగునని భగవంతుఁడు బోధించెను. [illegible] నర్జునుని మానస

కాదు. కర్మానుష్ఠానమని యర్థము. విద్యావస్థయందు జ్ఞానోపదేశము చేయుటయును నవిద్యావస్థయందు కర్మోపదేశముం జేయుటయుం దగునని యుం దెలుపఁబడెను. జ్ఞానమునొకవేళ నుపదేశించినను బ్రహ్మవిషయమైన బుద్ధి కలుగని యెడలఁ జిత్తదోషము గలిగియున్నదని తలఁచి యా చిత్తదోషము పోవుటకొఱకును నాత్మతత్త్వ సాక్షాత్కారము కలుగుటకును కారణమగు వేదోక్తకర్మమును ఫలాభిలాషను వదలి సుఖదుఃఖములందు సమానబుద్ధి కలవాఁడవయి చేయవలసినదని బోధింపఁబడినది. దీనినిఁబట్టి నిర్మలాంతఃకరణము గలవారికి జ్ఞానోపదేశము తగినదనియు మలినాంతకరణము గలవారికి కర్మోపదేశము తగినదనియు మనమెఱుంగనగును. అయితే కర్తయను గర్మమును గరణమును సర్వము మిథ్యయని తలంచి సకలకర్మములను సన్న్యసించి యూరకయుంట సుఖముగా నుండునని యర్జునుఁడాక్షేపించునని సందియించి భగవంతుఁడు పలికినదేమనః- నిజము, కర్త, కర్మ, కరణములు సర్వములు మిథ్యలు. అది తెలియుటయే జ్ఞానము. అహంకార మమకారములతోఁ గూడిన సంసార భ్రమమును, బోఁగొట్టునది యేను. అయితే యట్టిజ్ఞాన మార్గమని అనఁగా బ్రహ్మనిష్ఠను బొందినవాని విషయమగును గాని బ్రహ్మనిష్ఠను బొందవలెనను తలంపుఁగల యారురుక్షువు విషయముగ నుండదు. ముముక్షువగువాఁడు కర్మముయొక్కయుఁ గర్మసన్న్యాసముయొక్కయు మార్గములు తెలియుట యత్యావశ్యకము. కావుననే ప్రారంభమునఁ గర్మానుష్ఠాన విధానమును బోధించుట కొఱకు భగవంతుఁడీ శ్లోకమును బలికెను.

**ఆక్షేపణము:**—ఈశ్వరుఁడే చేయువాఁడనియును, చేయించువాఁడనియును, ఫలము ననుభవించువాఁడనియును నిశ్చయముగాఁ దలంచి ప్రవర్తించిన యెడల సంసారబంధ నివర్తియగును గదా? అట్లగుచుండఁగా నాత్మజ్ఞానముచేతనే కర్మబంధము తెగునని చెప్పనేల?

**సమాధానము:**—అయ్యా! కర్మబంధము దేనివలనఁ బోవును. ఈశ్వరార్పణ బుద్ధిచేతఁ గర్మములు చేయుటవలనఁ గర్మబంధము తెగునా? లేక ఈశ్వరుఁడే చేయువాఁడనియును చేయించువాఁడనియును, కర్మములయొక్క ఫలము ననుభవించు వాఁడనియును చెప్పుటమాత్రముచేతఁ గర్మబంధములు తెగునా? అని విచారించి చూచిన యెడల నా రెంటిలో నేదియును యుక్తముగ నుండలేదు. ఏల

యనః- పరమేశ్వరుఁడు లోకములో నెవరియొక్కయు సుకృత దుష్కృతములను గ్రహింపఁడు. గనుక కర్మముల నీశ్వరార్పణముగఁ జేయుట మాత్రముచేతఁ గర్మరాహిత్యము సంభవింపదు. ఒకవేళఁ గర్మము లీశ్వరార్పణముగఁ జేయుట మాత్రముచేత నైష్కర్మ్యము సంభవించునని యంగీకరించినను ననేకకోటిబ్రహ్మకల్పములందుఁ జేయఁబడినవియును నీశ్వరార్పితములు గానివియును నగు సుకృతాదికర్మములకు నివృత్తి సంభవింపనేరదు. మఱియును, పరమేశ్వరునియందలి భక్తి యీ జన్మమునందలి సగుటవలననైనఁ బూర్వజన్మమునందలికర్మమున కర్పణము సంభవింపనేరదు.

జన్మ మెప్పుడు కలిగినదో యెఱిఁగియుండఁగాని భక్తి కలిగినదని చెప్పినచో నీల పూర్వజన్మమునందే ముక్తుఁడు కావలెనని యుండును. కావున నేవిధముగఁ జూచినను కర్మముల నీశ్వరార్పణము చేయుట మాత్రము చేతనే నైష్కర్మ్యము కలుగునని చెప్పుట యుక్తముగాదు. తనచేతఁ జేయఁబడిన కర్మము ఫలము కలుగఁ జేయక పోనేరదు. కావున నీశ్వరుఁడే చేయువాఁడనియును, జేయించువాఁడనియును, బలుకుటచేఁ గర్మబంధము నివర్తించి పోనేరదు. అయితే, యోగబుద్ధితో ననఁగా గర్మమార్గబుద్ధితోఁ గూడుకొనిన వాఁడయినయెడలఁ గర్మబంధము వదలఁగలఁడు. అనఁగా ఫలాభిలాషను వదలి కర్మమును జేసినయెడల నట్టి కర్మము బంధమును గలుగఁ జేయఁ జాలదు. కావున మోక్షమును గోరువాఁడు నిష్కాముఁడై చిత్తశుద్ధికొఱకు గర్మమునుఁ జేయవలసినది. ఎటులాలోచించినను నిర్వికార శుద్ధాత్మ జ్ఞానమువలననే కర్మబంధము నివర్తించి పోవునని తెలియవలెను. భగవంతుఁ డిదివరకు నుపదేశించిన జ్ఞానయోగమును ముగించి యాజ్ఞానయోగమునకు సాధనమైన కర్మయోగమును నీ శ్లోకముచేఁ గొనియాడుచున్నాఁడు.

2. 40. " నేహాభిక్రమ నాశోస్తి ప్రత్యవాయో న విద్యతే, ।
" స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్. ॥

అర్జునా! ఫలాభిలాషను వదలి కర్మమును జేయుటకుఁ బ్రారంభించి

యంత్రటితోఁ జాలించి కొనుట చేతనింత ఫలము గలదు. మఱియును, ప్రారంభించిన పిదప ముగియుటకుఁ బూర్వమనఁగా మధ్యకాలమునందు స్వల్పదోషము లేవియైనను గలిగినప్పటికిని దోషము లేదు. మఱియును మోక్షమార్గరూపమయిన యీ నిష్కామకర్మమును కొంచెముగాఁ జేసినను, మిగుల గొప్పదయినట్టిన్ని జనన మరణ ప్రవాహ రూపమైనట్టిన్ని సంసారము వలనఁ గలిగిన భయమునుఁ దొలఁగఁజేయును.

కామ్యకర్మము లొనరించునపుడు మంత్ర వర్ణాద్యవ యవములలో నేలోపము కలిగినను దోషము కలుగును. నిష్కామ కర్మమొనరించునపుడట్టి లోపములు కలిగినను దోషమురాదు. ఏ ఫలము నభిలషింపక చిత్తశుద్ధికొఱకు యజ్ఞాది కర్మములను నారంభించి పూర్తిగఁ జేయలేక శక్త్యానుసారముగఁ గొంచెముగఁ జేసినను నా యజ్ఞాది పుణ్యకర్మములు గొప్ప సంసార భయమునుఁ బోఁగొట్టును. నిష్కామ కర్మము లెవ్వియొనర్చినను నెంతమాత్ర మొనరించుచు వదలినను చిత్తశుద్ధి పూర్వకమగు ఫలమున్నదిగాని దోషమేమాత్రములేదని నిష్కామ కర్మయోగమును భగవంతుఁ డీశ్లోకమునఁ గొనియాడినాఁడు. కామ్యకర్మమునకును నిష్కామకర్మమునకునుగల భేదమగపఱచినాఁడు. ఇట్టి కర్మమొనరించుటచే యమునిభయము నైతముండదని యర్థమగుచున్నది.

**2. 41.** « వ్యవసా యాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన ।
« బహు శాఖా హ్యనన్తాశ్చ బుద్ధయో వ్యవసాయినామ్ ॥

అర్జునా! ఈ విధానమునందు నిశ్చయాత్మకమగు బుద్ధియొక్కటియే ముఖ్యము. నిశ్చయము లేనివారి బుద్ధులు లెక్కలేనివియును గర్మాపేక్షనుబట్టి యనేకశాఖలుగలిగినవిగాను నుండును. ప్రతిమనుజుఁడును నాత్మ నిత్యమను బుద్ధి గలిగి యుండవలెను. ఆ బుద్ధియందెట్టి చాంచల్యమును గూడదు. మఱియొక ముఖ్యమైన హితోపదేశ మేమనినఁ బ్రతిమానవుఁడును గర్మ మాచరింపవలెను. ఆ రీతిగ నాచరించుటలో నందునుండి తనకేఫలము నపేక్షింపరాదు. ఇట్టి కర్మాచరణము లభ్యసించుచు వచ్చినయెడల మానసక్షేత్రము శుద్ధిపడి యాత్మతత్వ మెఱుంగుటకుఁ గారణమగును. ఈ కర్మాచరణమునుండి మానవుఁ డేకాగ్ర చిత్తుఁడగుటకుఁ గారణమగును. ఫల మపేక్షించుచుఁ గర్మము లాచరించు చుండినచో ఫలము లనేక విధములగుటచే మనస్సు ననేకమార్గములు ద్రొక్కుచుండును, దానినుండి చిత్తస్థై

ర్యము కలుగదు. చిత్తస్థైర్యము కలుగక యాత్మతత్త్వ మెఱుఁగుట సాధ్యము కాదు.
కావున చిత్తస్థిరత్వ మభ్యాసయోగమున నార్జింపవలెను. నిష్కామ కర్మాచరణ
మున నట్టి యభ్యాసయోగము లభించును. కర్మప్రాముఖ్య మింతగనున్నది. జీవికి
బంధహేతువు కర్మమేను. బంధవిమోచన కారణముఁ గర్మమేను. ఇట్టికర్మమేమి?
ఇది యెప్పుడు వచ్చినది? యని ప్రశ్నలడుగవచ్చునుగాని సమాధాన మిచ్చుట
కష్టము. భాష్యకారులెల్లరు కర్మమునాదియని నిర్ధరించినారు. అనఁగా నాదిలేనిది.
అయితే దానికి నంత్యము కలదు. దానికి నంత్యము కలిగించుట మానవయత్నసా
ధ్యము. ఆత్మైకత్వము గలిగినపుడు కర్మమునకు నంత్యము గలుగును. అంతవఱ
కును నిష్కామ కర్మమొనర్పక తప్పదని భగవంతుఁ డుపదేశించెను. మనస్సు రెం
డువిధములుగ నుండును. శుద్ధము. అశుద్ధము,

" మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవచ ।
" అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితం ॥

కామసంకల్పమును వదలి, యీశ్వరార్పణముగ నొనర్పఁబడు వ్యవసా
యాత్మక కర్మఫలము సంసార తరణమని భగవంతుఁడు కర్మయోగమును బోధింప
నుపక్రమించుచున్నాడు.

పై శ్లోకమునందు భగవంతుఁడు సాంఖ్యబుద్ధి యనియును యోగబుద్ధి
యనియును రెండుబుద్ధులు మాత్రము వచించెనుగాని, మిగతవియగు తార్కిక,
వైయాకరణ, మీమాంసక, బౌద్ధ, నాస్తికాదిబుద్ధు లెవ్వియును నుడువఁడా
యెను. కారణమేమనిన:-జ్ఞానము గలుగుటకు సాధనమైన యోగమును, సాధ్య
మైన సాంఖ్యమును నను రెండు బుద్ధులు మాత్రమే సంసార నివర్తకములును,
మోక్షమునకు సాధనములును, వేదాదిప్రమాణ సిద్ధములును నగుటవలన నీ రెం
డుబుద్ధులుమాత్ర ముపదేశించెను. ఈ రెండుబుద్ధు లెవరికిఁ గలుగునో వారికి నిత
రములైన విపరీతబుద్ధులు కలుగవు. ఇతరములైన బుద్ధులు మోక్ష ప్రతిబంధకము
లును సంసారవృద్ధికి హేతువులు నగుచున్నవి. కావున విపరీతబుద్ధులు గలవారికి
నానావిధ మనోరథములు కలుగుచుండును. దానికిఁగాను వారు కామ్యకర్మము
లొనర్తురు. వారికి భగవదర్పణ బుద్ధియుండదు, కావున నట్టివారు సంసార సాగర
మున మునిఁగి నశింతురు.

మోక్షకారణసాధనము బుద్ధియెట్లగును? బుద్ధిజడమాయెనే జడ మునకు మోక్షము కలిగించు శక్తి యెట్లువచ్చెను. ఇంక నాత్మకార్యము మోక్ష మందు మాయాత్మనిర్గుణము నిష్క్రియాకారియని తెలుపఁబడినది. కావున నాత్మకు స్వాతంత్ర్యము లేదయ్యె. ఆత్మయు, బుద్ధియు, రెండు నస్వాతంత్ర్యశక్తులై నపుడు, క్రియాకారిత్వ మెట్లు సిద్ధించును? ఈ యాక్షేపణము స్వాభావికముగ సిద్ధించును. సమాధాన మేమనిన:- నాత్మమూలమున నిర్గుణ శుద్ధ బుద్ధ ముక్త స్వరూపమైనను కర్మవాసనా ద్యుపాధులచేఁ గట్టఁబడినపుడు దానిలో నిలువఁజాలని కారణమున్నను నాత్మకు సృష్టి కాలంబున స్వాత్మ మాగంతుక ప్రేరణ శక్తి కలుగుననిన్ని యాంబలముచే బుద్ధికి వివేకజ్ఞానము కలుగుననిన్ని దానిచే జ్ఞానముద్భవించుననిన్ని బుద్ధియాజ్ఞలను దిరస్కరించిన యింద్రియముల కార్యములవలన నజ్ఞానము సంభవించు ననిన్ని తెలుపఁబడినది. ఇదినిబట్టిచూడ సుపాధిబలమున నాత్మ కొన్ని కాలములం దుపగుణమగునని చెప్పుదును.

సంసారమెట్లు నశించును? అది నశింపచేసి మోక్షము కలుగదుకదా? అని ప్రశ్నింతువేని తెలిపెదను వినుము:-

అన్వయ వ్యతిరేకమను ప్రమాణముచేతను, పదార్థపరిశోధకమైన వేదాంతశాస్త్రముచేతను నాలోచింపఁగా ననేక జన్మములందుఁ బుణ్యకర్మములు చేయుటవలనఁ జిత్తశుద్ధి గలవారికి వివేకరూపమైన బుద్ధి గలుగుచున్నది. ఆ వివేక రూపబుద్ధిచేత నిర్మలమైన మంచిజ్ఞానము కలుగుచున్నది. ఆ నిర్మలజ్ఞానముచేత పైన వివరించిన విపరీత బుద్ధులు నశించు చున్నవి. ఆవిపరీతబుద్ధులు నశింపగా సంసారమనునది తనకు నాధారమగు నజ్ఞానము లేకపోవుటచేత నుండుటకు శక్తిలేనిదయి నశించును. అజ్ఞానముండినపుడే సంసారమున్నది. అజ్ఞానము లేకున్న సంసార ముండదు. పూర్వోక్తమైన నిర్మలజ్ఞానమునుండి మోక్షము కలుగుచున్నది. ఆ నిర్మల జ్ఞానము లేకున్న మోక్షము సంభవింపదు. ఇట్టి యన్వయ వ్యతిరేకప్రమాణముచేతఁ గలిగిన జ్ఞానము సంసారమును నశింపఁజేసి, మోక్షము కలిగించుటకు హేతువగును. వ్యవసాయాత్మిక బుద్ధి లేనివారికి విపరీతబుద్ధులు కలుగుచుండును. ఇకఁ బదార్థ పరిశోధకమైన వేదాంతశాస్త్ర మెట్టిదియన "భీష్మాదులు నశించుదురనిన చోట" భీష్మాది పదములకు వాచ్యార్థములైన శరీరములు-నశించుచున్నవనియా? లేక భీష్మాది పదములకు లక్ష్యార్థములైన యాత్మలు నశించు చున్నవియా? అని

విచారించి లక్ష్యార్థమైన యాత్మ నిత్యముగనుక నశింపనది యనియును, వాచ్యార్థములైన శరీరము లనిత్యములు గనుక నశించుచున్నవనియును యుక్తియుక్తముగ యాదార్థ్యమునుఁ దెలుపు శాస్త్రము. పై రెండు ప్రమాణములనుఁబట్టి జనించిన యాత్మ తత్త్వజ్ఞానమునందు వ్యవసాయాత్మికబుద్ధి కలిగినవానిసంసారము తొలంగును.

42. " యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః
" వేదవాదరతాః పార్థ, నాన్యదస్తీతి వాదినః

వేదమునందనేక భాగములు కర్మకాండమును జెప్పునట్టివి. స్వల్పభాగములు జ్ఞానకాండమును దెలుపునవి. అందుఁగర్మములను జెప్పునట్టిభాగము లాకర్మములందు మిగులయాసక్తి గలుగుటకు గాను క్రతువులను జేసినయెడల నఖండసుఖమును గలుగఁజేయునని ఫలస్తుతులు పలుకుచుండును. అట్టివేదవాక్యములన్నియు నర్థవాదవాక్యములు. అట్టివేదవాక్యములను స్వల్పజ్ఞానముగలవారు వేదార్థతత్త్వమునుఁ దెలిసికొనఁజాలక సమ్యక్కార్యాకార్య విచారములేక స్వర్గాదిఫలమే యుత్తమఫలమనియును దానికంటె నన్యమైనవస్తువు లేదనియును బలుకుచున్నవారు. అట్టివారికి వ్యవసాయాత్మకబుద్ధి జనింపదు.

పూచిన మోదుగచెట్టు సాధారణముగాఁ జూచుటకు రమ్యమై యుండును. అటులనే విఫలతయు నుండును. ఆయందమునకుఁ దగిన ఫలములే మాత్రమును లేవు. రుచికరములు గావు ప్రాణాపాయకరములుగ నున్నవి. అర్థవాదములుగల వేదములట్టివేను. ఆవాక్యములనిత్యఫల ప్రతిపాదకములు. అర్థవాదములందు మానసముంచి తత్ఫలాభిలాషచేఁ జేయంబడు కర్మములు బంధములై పరిణమించును. అట్టివారు వేదార్థ తాత్పర్యజ్ఞానములేని యవివేకులని తెలియవలెను. స్వర్గాదికమే పరమపురుషార్థమని తలఁచునట్టివారికి నంతఃకరణములందు యోగబుద్ధిపుట్టదని యీ శ్లోకము మొదలుకొని మూఁడుశ్లోకములందు బలుకఁబడినది. కాముకులు కష్టములను గలుగఁజేయునట్టికోర్కెలవలంబించుటకుఁగారణమును, దెలియఁజేయుటకునై ముందు శ్లోకముఁవ్రాయఁబడినది.

శ్రీ శంకరాచార్యులవారు కామ్యకర్మములను గుఱించి వేదములుపలుకు కర్మకాండననుసరింపరాదని పలికిరి. శ్రీరామానుజాచార్యుల దేరీతిగ నభిప్రాయపడిరి.

త్రైగుణ్య విషయా వేదాః ప్రొత్తము వేదములెల్ల నిశ్చయముగ స్వానార్థము బోధించునని యును వానిలోని బాహ్యార్థమును మాత్రము నవలంబించి జనులు కామ్యకర్మములాచ రించుచున్నారనియు నిన్ని యంతరార్థముఁ దెలియఁ జాలకయున్నారనియు నిన్ని యర్థము చేసిరి వేదవాదరతాః. అనగా బాహ్యార్థమని తాత్పర్యపడినారు.

43. కామాత్మాన స్స్వర్గపరా జన్మ కర్మ ఫల ప్రదామ్॥,
క్రియా విశేష బహుళాం భోగై శ్వర్య గతిం ప్రతి॥.

అవిద్వాంసులు కామాసక్తులగుటచేత మోక్షమొకటి యున్నదనియే తలఁపక స్వర్గాది సుఖమే ముఖ్యమైనప్రయోజనమని తలఁచి యేవాక్యములు, స్వర్గాది సుఖమునననుభవించుటకును పశుపుత్రకళత్రాదిసకలసమృద్ధిగలుగుటకును, సాధ నములో, యేవాక్యములచేత నుత్తమమధ్యమాధమములును కర్మఫలములును, నయి దేవజన్మము, పశ్వాదిజన్మము, మనుష్యజన్మము కలుగునో, యట్టిమాట లాడించు మూఢులై జననమరణరూపమైన సంసారమందుఁ బ్రవర్తించుచున్నారు. ఫలాభిలాష చేతనే కర్మమును జేయవలసినదని పలుకుపూర్వమీమాంసకులు చూచుటకు మా త్రము మనోహరముగా నుండునట్టి యర్థవాదములయందలి విషయములును సత్య ములని తలఁచుచున్నారు. అర్థవాదములుగ ఆ శ్రుతులు వేదాంతర్గతములు కావున నవియప్రామాణ్యములు కావు. అయితే యవిబోధించు కామ్యకర్మములు దుఃఖహేతు వులగు జన్మములను వర్ణాశ్రమాద్యభిమానమే నిమిత్తముగాఁగల కర్మములును, నశించునట్టి స్వర్గపశుపుత్రాది సంపదలను తెంపులేకుండు నటుల గలుగజేయు చుండును. అవియెప్పటికిని విశ్రాంతికలుగఁజేయఁ జాలవని తెలియవలెను.

2. 44. భోగైశ్వర్య ప్రసక్తానాం తయా పహృత చేతసామ్॥
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే.

అటువంటికామాసక్తులై స్వర్గాదిసుఖమే ప్రధానమని తలఁచిస్రక్చంద నాది విషయసుఖానుభవమును, ప్రభుత్వమునుఁగోరి వానియందే మనస్సుగలవార యి యీకర్మములను జేసిన యెడలభోగైశ్వర్యాదులు గలుగునను నట్టివేదముయందలి యర్థవాదవాక్యములను పూచినమోదుగువలె ఫలములేనివని యెఱుఁగక నమ్మి భ్ర మపడి యీ వాక్యములను పూచినమోదుగువలె ఫలములేనివని యెఱుఁగక నమ్మి భ్రమపడి యీ వాక్యమున కీతాత్పర్యమని నిశ్చయించి చెప్పఁదగిన ప్రజ్ఞలేనివారికి

నిశ్చయాత్మికమైనదియు సత్త్వగుణకార్యమును [illegible] సాధనమైనదియునగు సాంఖ్యయోగ రూపబుద్ధి వారి యంతఃకరణముల యందెంతమాత్రమును గలుగదు గావున వారాత్మస్వరూపజ్ఞానములేని వారయి మోక్షమును బొందక సంసారమందే యెల్లప్పుడు బ్రవర్తింతురని తాత్పర్యము.

పై శ్లోకమునందు "వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ నవిధీయతే" అనియున్నది. నిశ్చయమే స్వరూపముగాఁగల సాంఖ్యయోగ రూపమైన బుద్ధి, యంతఃకరణమున జనింపదని యర్థము. ఇచట సమాధిశబ్దమునకు నంతఃకరణమని యర్థము, కొందఱు చిత్తవృత్తి నిరోధమని యర్థమునిచ్చెదరు. సకల ప్రపంచమును బరమాత్మ యందుంచుటను గనుక పరమాత్మ సమాధియని కొందఱందురు. నేనే బ్రహ్మమని తలఁచికొని యుండుట సమాధియని మఱికొంద అందురు. చిత్తైకాగ్రత సమాధియని కొందఱందురు. ఏ యే సందర్భమున నే యే యర్థముఁ జెప్పవలయునో యా సందర్భోచితముగ సమాధిశబ్ద మన్వయింపవలెను. ఇచట సమాధిశబ్దమునకు నంతఃకరణమని యర్థము చేయవలెనుగాని మఱి యేయర్థమును సరిపడదు.

కామ్యకర్మములకుఁ జిత్తశుద్ధి గలిగించునంతటిశక్తియుండినను నవి ఫలాభిలాష చేతఁ జేయఁబడిన వయ్యేనేని చిత్తశుద్ధి గలిగింపఁ జాలవు. ఒకవేళఁ గలిగించునని తలఁచినను నది యాత్మజ్ఞానమునకు నుపయోగింపదు. కామాత్ములును స్వర్గపరులును నగువారు యోగబుద్ధిని, దానిఫలమునుఁ బొందఁజాలరు. "కారణాభావే కార్యాభావః" యను న్యాయానుసారముగఁ గారణమగు యోగబుద్ధిలేని వారికిఁ గార్యమగు మోక్షము కలుగనేరదు. కావున ఫలాభిలాష చేతఁ గర్మములు చేయఁగూడదనియు యట్టివారికి మోక్షము కలుగనేరదనియు తాత్పర్యము. ఈ విషయమును నర్జునునకుఁ జక్కఁగఁ దెలియఁజేయుటకుఁ బైమూడు శ్లోకములు చెప్పఁబడినవి.

అల్పజ్ఞులగువారు వేదములందుఁ జెప్పఁబడుస్వర్గాది ఫలములందాసక్తులగుటచే స్వర్గాదులకంటె నధికమయినఫలము లేదని చెప్పెదరు. కామములకు లోనగు మనస్సుకలవాడునైతేము స్వర్గమే పరమపురుషార్థమని తలంచి కోరుచుండును. స్వర్గాదిఫలముల ననుభవించినపిదప మఱల జన్మకర్మములఁ గలిగించునదియు, నానావిధ కర్మములను బ్రతిపాదించునదియు భోగైశ్వర్యములు గలిగించుటకుఁగాను ప్రవ

త్రించునదియును మోక్షరూప పరమపురుషార్థము నశింపజేసి యాపాతరమణీ యంబులునగు వేదవాక్యములను ప్రధానములుగఁ బలుకుచుందురు. అట్టివారి వాక్యములువిని జనులు జ్ఞానహీనులయి భోగైశ్వర్యములు పొందుట యందే యాసక్తులయి యుందురు. అట్టివారి మనస్సు సమాధి నొకప్పుడును ముందు చెప్పిన వ్యవసాయాత్మక బుద్ధి పుట్టదు. భారత వ్యాఖ్యాతలలోనే యాస్తికులలో రెండు వాదములున్నను. కొందఱు వేదకర్మము లైశ్వర్యప్రాప్తులనిన్ని యవి చేసే మనుజునకు సర్వసుఖములు సమకూర్చునవి యనిన్ని వానిని విడచి, యే సుఖ మును మనుజుఁడు పొందింప మార్గములేదనిన్ని వాదించుచున్నారు. మఱికొందఱు వేద కర్మ మార్గములు సరికావనిన్ని వేదాంత మార్గమే సర్వోత్తమ సుఖములకంటె శ్రే ష్ఠమగు మోక్షానందము కలిగించునట్టిదనిన్ని వాదించుచున్నారు. భగవంతుఁడు గీత బోధనలో వేదవాదులు చెప్పురీతి వేఱుమార్గములేదనుట తప్పనిన్ని. వేదాంతు లు వాదించునదియే సరియయిన మార్గమనిన్ని, వేదకర్మములు మానసశుద్ధికిగాను నిష్కామ ప్రవర్తకులై యొనరింపవలె ననియును, కామ సంకలిత చిత్తమునఁ గర్మ ములొనరించినచోఁ జిత్తశుద్ధి కలుగదనిన్ని, చిత్తశుద్ధిలేనివానికి మోక్షము లేద నిన్ని మోక్షముకలుగునపుడు "పునరపి జననం పునరపిమరణం" మనురీతిగ జనన మరణాది దుఃఖములు గలుగుచుండుననిన్ని బోధించెను. ఈ విషయమునే భగవంతుఁడు మఱలఁ బలుకుచున్నాఁడు.

ఈ శ్లోకముల్లోని "సమాధి" శబ్దమునకు నద్వైత విశిష్టాద్వైతులు మానసమని యర్థముచేసిరి. ద్వైతులు దైవమునందు నిజమగు విశ్వాసమని యర్థము చేసినారు.

2\. 45. త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।

నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥

అర్జునా! వేదములు సత్త్వ రజస్తమములతోఁ గూడినవారికిఁ దత్తదను రూపఫలములను బ్రతిపాదించుచున్నవి. కాబట్టి త్రిగుణాతీతుఁడవయి శీతోష్ణాది ద్వంద్వములను విడిచి యెప్పుడును సత్త్వగుణ ప్రధానుఁడవయి యోగక్షేమముల నపేక్షింపక యుండుము. ఇటులుండిన వారికే యాత్మవిషయకజ్ఞానముకలుగును. పై శ్లోకమునందుఁ బరస్పర విరోధార్థములిచ్చు రెండువాక్యములున్నవి.

అవి యెవ్వియనిన:—

(1). త్రైగుణ్య విషయా వేదా, నిస్త్రైగుణ్యో భవార్జున

(2). నిత్యసత్త్వస్థ.........భవ

సాత్విక రాజస తమోగుణ సహితమగు సంసారాభివృద్ధినిఁ దెలుపునవి వేదములు కావున నీవు త్రైగుణ్యములగు సాత్విక రాజస తామస గుణములనుండి నిర్గతుఁడవయి సదా సాత్వికగుణము నాశ్రయింపుమని యున్నది.

సాత్విక రాజస తామస గుణములను వదలి సదా సాత్వికగుణము నాశ్రయింపు మనుట విరుద్ధము. సమాధానమేమన; సాత్విక రాజస సాత్విక గుణముల సమాహారము త్రైగుణ్యము. అనఁగా సంసారము వేదము సంసారాభివృద్ధి నొనరించు కర్మకాండము బోధించును. కావున నీవామార్గము నాశ్రయింపక నిస్త్రైగుణ్యుఁడవై నిత్యసత్త్వస్థుఁడగుటకు నపేక్షింపుము. అనఁగా సదాకాల ముండు నట్టి సత్త్వగుణ మెవనికిఁగలదో యట్టిబ్రహ్మము యొక్క స్థితినందుటకుఁ బ్రయత్నింపుము. భాష్యకారులు మఱికొన్ని యర్థములు చేసినారు. అన్నిటిలోను పైయర్థమే సమంజసముగ నున్నది. ఇందు మఱియొక సంశయము కలుగుచున్నది. వేదములెల్లను సంసారాభివృద్ధికరములగు సుఖములిచ్చు కర్మముల బోధించునవియేనా? మోక్షమార్జించువిధమును దెలుపవా? దీనికిసమాధానమేమనిన; "వేదములు త్రైగుణ్యవిషయ" ములన త్రిగుణమిశ్రితమగు సంసార విషయము విశేషముగ బోధించునని యర్థమగును గాని సదా సాత్వికగుణము బోధింపవని యర్థముకాదు. అటులనినచో వేదములకు నిందవచ్చును. వాస్తవముగ వేదములలో ననేక ఋక్కులు జ్ఞానవిషయమును బోధించును. వానినిఁబట్టి కదా యుపనిషదాది వేదాంత గ్రంథములు పుట్టినవి.

పై శ్లోకమునందు యోగక్షేమములను రెండు శబ్దములున్నవి. యోగమనఁగాఁ దనకు లేనిదానిని సంపాదించుకొనుట. క్షేమమనఁగా నుండిన దానిని రక్షించుకొనుట.

పై శ్లోకమునందుఁ ద్రిగుణములవిషయము గొప్పఁజేసి పలుకఁబడినది.

ఈ త్రిగుణములెవ్వి? ఇవి పుట్టుట యెట్లు? వీని లక్షణములేమి? యను విషయము నించుక తెలియుట యవశ్యకము. కపిలముని సాంఖ్యము రీతిగ ననాదిగ ప్రకృతి యను వస్తు వుండును. దానినుండియే యీ ప్రపంచము. దానినుండియే దేహతత్వములెల్ల నుద్భవించినవి. ఆ ప్రకృతి త్రిగుణాత్మకమైనది. తామస రాజస సాత్వికములే త్రిగుణ ములు. తామసగుణ లక్షణమేమన: చలన రాహిత్యము నిద్రాసక్తత-పనులలో నప్ప నసమర్థత, జ్ఞానహీనత. రాజసగుణలక్షణ మేమన: సదా కాలము సాహసపు బను లొనరింప యత్నించుచుండుట. సదాకాలము సుఖమనుభవింప గోరుచుండుట. ఆటపాటలపై విశేషాభిలాష కలిగియుండుట.

సాత్విక లక్షణ మేమనిన:- జ్ఞాన సంపాదన నిచ్ఛయించుచుండుట. శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వములకు లోబడక యుండుట. మితాహారతత్వము.

ప్రకృతియందు పై గుణములెల్ల మిశ్రములైయుండి యొక్కొకరి యందు నొక్కొకగుణము పూర్వజన్మ కర్మానుసారముగ ప్రాధాన్యత గను చుండును. కావుననే మనుజు లిన్ని విధముల గుణ, వర్ణ, బుద్ధి భేదములచే నున్న వారు. ఎల్లకాలము సాత్వికగుణ ప్రాధాన్యముగల మనుజుడు జ్ఞానవంతుడగును.

పై విషయమునే మఱల నించుక పెంచి వ్రాయ యత్నించెద. సత్వరజ స్తమోగుణములు మూడును మిశ్రమయి యుండునది త్రిగుణము. ఇదియే జగ త్కారణమైన యవ్యాకృతమనిన్ని మాయా తత్వమనిన్ని పిలువంబడును. ఇట్టి మాయా తత్వమున బుట్టిన జగత్తు త్రైగుణ్య మనబడును. అట్టి జగత్తును ప్రతి పాదించి చెప్పునట్టివి వేదములు. కావుననే వేదములు త్రైగుణ్య విషయములని పలుకంబడినవి. వేదములన్నియును సాధ్యసాధన సాధకఫలస్వరూపముగాగల లోకమును ప్రకాశింపజేయునని యర్థము. కావున వేదములను త్రిగుణాత్మకమగు లోకమును వదలి యాత్మను బొందను గోరవలెనను శ్రుతి ప్రమాణాను సారముగ "నిస్త్రైగుణ్యోభవ" యని బోధింపబడినది. అనగా వేదములను వేదకర్మ ములను నా కర్మఫలములను వదలినవాడవగుమని యర్జునునకు భగవంతుడు బోధించినాడు. అయినను బహిర్ముఖుడయిన వానికి ననగా నీవు నేనను భేదజ్ఞాన ముగలవానికి బ్రహ్మనిష్ఠయును మోక్షమును గలుగదు గనుక "నిర్ద్వంద్వోభవ" నామరూపములను గ్రహింపనివాడవగుమని తెలుపబడినది. నిద్రను బొందువాడ

డుకూడ నామరూపములు వదలును. అట్టివానికిఁ గూడ మోక్షము గలుగునాయని
ప్రశ్నింపనగును. కావుననే “ నిత్యసత్త్వస్థోభవ ” సర్వకాలములందును బ్రహ్మ
నిష్ఠుఁడవుగమ్మని యుపదేశింపఁబడినది. బ్రహ్మవేత్త యగువాఁడు బ్రహ్మదృష్టిచేతనే
శరీరయాత్రను జేయవలసినదని తెలుపుటకయి “ నిర్యోగక్షేమవాన్ భవ ” యని
పలుకఁబడినది. ఈ రీతిగ భగవంతుఁడు శిష్యునకు నుపదేశించి తన యుపదేశ తత్త్వ
మును దెలియఁజాలక యర్జునుఁడు వేదము లప్రామాణ్యములని తలఁచునేమో
యని సందియించి ముందు వ్రాయఁబూనిన శ్లోకాభిప్రాయమును దెలిపెను. ఈ
శ్లోకమునందలి విషయశబ్దమునకు “ విషయము సంగతి ” యని యద్వైతవాదము.
బాహ్యార్థమని ద్వైతులు వాదించిరి.

ఈ శ్లోకార్థము, చిక్కులలో మునిఁగినదని భాష్యకారు లనేకులు తమ
కుఁ దోఁచినలాగు శబ్దార్థములను బట్టి యీడ్చినారు. పాండిత్యలక్షణమది. నాకొక
యర్థము దోఁచినది. అది యెట్టిదనఁగా “ త్రైగుణ్య విషయావేదాః ” వేదములు
త్రిగుణ మిశ్రిత ఫలములిచ్చునవి. నీవు జ్ఞాన మపేక్షింతువేని “ నిస్త్రైగుణ్యోభవ ”
ఆ త్రిగుణ మిశ్రితఫలము నపేక్షింపకు. ఏమి చేయవలెననిన.

“ నిర్ద్వంద్వో నిర్యోగక్షేమ ” రాజస తామస గుణద్వంద్వమును వద
లుము. దానినుండి ఐహిక సంబంధాపేక్షలు తద్రక్షణలను సాంగత్యదోషములు
మానుదువు. తామస రాజస గుణములు పోయినచో సత్త్వగుణ మొకటి నిలు
చును. “ నిత్యసత్త్వస్థ ” సాత్త్విక ప్రాధాన్యగుణమే నిత్యముగఁ గలిగియుండువు.
అటులుండినచో “ ఆత్మవాన్ ” యగుదు వనఁగా మానసము నధీనమందుంచి
కొనిన వాఁడగుదువు. ఈ యర్థమునందుఁ జిక్కులేమియు నుండవని నాకుఁ దోఁచి
నది.

2. 46. “ యావానర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే ।
“ తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥

అంతట నిండియున్న జలాశయమునం దెంత జలము కావలసియుం
డునో యంతజలము నే గ్రహించునటుల జ్ఞానియగు బ్రాహ్మణునకు సమస్తవేదము
లందు నంతే ప్రయోజనముండవలెను. దప్పిగొనినవాఁడు నిండు తటాకమునుండి
తన దప్పికిఁ దగినంత జలమును గ్రహించినరీతిగ నానా విషయములు ప్రతిపాదించు

వేదమునుండి ముముక్షువగువాఁడు తనకు సుపయుక్తమగు మోక్షసాధన సార మెంతకలదో యంతమాత్రము గ్రహించి మిగతది వదలవలెను. రమ్యమగు నీరు నలుదిక్కుల నిండియుండ బావినీ రెవరు గోరుదురని కొందరర్థము చేసినారు. బావినుండిగాని నిండు తటాకమునుండిగాని దప్పిగొనిన వాఁడెంత నీరు తనదప్పిసార్పను కావలయునో యంతజలమే త్రాగునటుల తెలిసినవాఁడు వేదములనుండి తన జ్ఞాన సాధనమున కెంత కావలయునో యంతమట్టుకు గ్రహించునని ఫలితార్థము. ఈ శ్లోకమునకు ననేకార్థములు వ్రాయఁబడినవి. అవి నాకు సమంజసములుగ లేవు. పై బోధనలు విని యర్జునుఁ డాత్మవిచారాయుక్తచిత్తుండయి కర్మానుష్ఠానము బొత్తిగ వదలు సేమోయని శంకించి యీ రీతిగ మరలఁ బలికెను.

2. 47. " కర్మణ్యేవా ధికా రస్తే మా ఫలేషు కదాచన !

" మా కర్మ ఫలహేతు ర్భూర్మా తే సంగో ౽స్త్వ కర్మణి॥

అర్జునా! నీకుఁ గర్మములందే యధికారముండవలెను. గాని యెప్పుడయినను నా కర్మఫల మందధికారముండరాదు. నీవు కర్మఫలమునకుఁ గారణుఁడవు కావలదు. కర్మములను మాత్రము విడవకుము. కర్మములు సేయుము. ఫలము వదలుము. కర్మలు వదలకు. ఫలముఁగోరకు. ఈ శ్లోకార్థమే భగవద్గీతలోని కర్మయోగమునకెల్ల బీజమంత్రముగ నున్నది.

అర్జునా! నీ విప్పుడు గురు భీష్మాది వధనుఁగూర్చి వ్యసనము నొందుచున్నావు. గనుక పామరుఁడవై యున్నావు. అక్కారణంబున నిప్పుడు నీవు వేదోక్త కర్మములను జేయుటకే యధికారివిగాని జ్ఞాననిష్ఠ కధికారివి కావు. ఆ కర్మముల నెల్లప్పుడు ఫలమునుగోరక భగవదర్పణముగానే చేయవలెను. ఫలములనుగోరి చేసినయెడల కర్మఫలమైన జన్మమునీకు సంభవింపక తప్పదు. అట్లని కర్మములను జేయకుండుటయందుఁ బ్రీతిఁగలవాఁడవుగాక ఫలమునుగోరక యక్కరతో వేదోక్త కర్మములను జేయవలెను. కావునః బ్రకృతమందు యుద్ధకర్మము నీకుఁ జేయఁదగినదయి యున్నది. జ్ఞాననిష్ఠ యందర్జునునకు నధికారములేదనిన, దానియందుత్తమాధికారు లెవరు? గౌణాధికారు లెవరు? అను ప్రశ్నరాగా, భగవంతుఁడీరీతిఁ బలికెను. ఎవఁడు పరిశుద్ధమైన యంతఃకరణముగల బ్రాహ్మణుఁడో, వానికి జ్ఞానమందు ముఖ్యాధికారమనియును, నితరునికి గౌణాధికార మనియును దెలిపెను. బ్రహ్మవేత్తలలో నుత్తముఁడగు వానికే సర్వకర్మ సన్న్యాసమునం దధికారముగాని

యితరులకా యధికారంబులేదు. శోక మోహములుగల నీయందు బ్రహ్మనిష్ఠునియం దుండఁదగిన గుణములులేవు. అందువలన నీకుఁ గర్మము నందే యధికారముగాని జ్ఞాననిష్ఠలయందుఁగాని సన్న్యాసమునందుఁగాని నధికారములేదు. బీజముండినవు డంకురముకలుగు విధమునఁ గర్మఫలము గోరినయెడల దుఃఖములకుఁ గారణము లగు జన్మాదులు కలుగును.

శ్రీ శంకరాచార్యులు సర్వులను గర్మాచరణముఁబువదలి సన్న్యాసమవలంబిం పుమని బోధించినటుల జనులాడుదురు. అదితప్పు. స్థితప్రజ్ఞత్వము ముదిరినపుడే కర్మ సన్న్యాసమునకు వారనుజ్ఞ యిచ్చినారు. శ్రీ మధ్వాచార్యులవారు నిచేతాత్పర్య పమిగాఁగాని సన్న్యాసులు సైత మన్నములగు కర్మము లొనర్పఁదగునని వాక్రు చ్చిరి. అన్నములగు ( సన్న్యాసులకు ) కర్మములు వదలునాయని శంకరాచార్యుల వారు పలుకిరు. అపరిహార్యములైన కర్మలు త్యజించుట సాధ్యమా? అట్టివి యెవ్వరై నను బోధింతురా?

2. 48. " యోగస్థః కురు కర్మాణి, సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ ।
" సిద్ధ్య సిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥

అర్జునా! నీవు యోగనిష్ఠుఁడవై నేనుజేయు కర్మమువలన నీశ్వరుఁడు సంతోషింప వలయునను కోరికనుగూడ వదలి చిత్తశుద్ధివలన జనించు జ్ఞానముకలు గుటయందును కలుగకపోవుట యందును సముఁడవై స్వకులోచితములైన సత్కర్మ ములను జేయుము. జ్ఞానము లభించినను లభింపక పోయినను సమబుద్ధితో నుండుట యోగమనఁబడును.

ఈ శ్లోకమునందు " తత్త్వమసి " యను వాక్యములోని " త్వ "యను నాత్మ విచారమును బోధింపఁ బడినదని మధుసూదన సరస్వతుల భాష్యము.

2. 49. " దూరేణ హ్యవరం కర్మ బుద్ధి యోగా ద్ధనంజయ ।
" బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥

అర్జునా! సమత్వబుద్ధితోఁ గూడికొనిన నిష్కామ కర్మముకంటె కామ్య కర్మము మిగుల తక్కువ యైయునది. కావున ఫలాభిలాషను వదలి కర్మమును జేయు ము. అట్లు చేయునప్పుడు పరమార్థ జ్ఞానముతప్ప మఱేయొద్దియు సంసారబంధమునుఁ బోఁగొట్టఁజాలదని తలఁచి పరమార్థజ్ఞానమునే కోరుము. స్వర్గాదిఫలములను

గోరువాఁడసే ఫలితమునకై నీవు ఫలములను గోరకుము. కార్యమొనరించువాని యుద్దేశ్యమెట్టిది? కార్యమెట్టిది? యను రెండు విషయము లాలోచించునపుడు జనులు కర్తము లొనరించువాని యుద్దేశ్యమునుబట్టి చేయఁబడు కర్మము యొక్క గుణావగుణములను నెంతురు. ఉద్దేశ్యము మంచిదిగనుండి కార్యమించుక దోషయుక్తముగ నుండినను కర్తను దూషింపరు. అట్లుగాక యుద్దేశ్యము చెడ్డదయినపుడు కార్యము మంచిదైనను చెడ్డయుద్దేశ్యముతోఁ బనియొనర్చెనని దూషింతురు. కావున కర్మము నికృష్టమునిన్ని యుద్దేశ్యము ముఖ్యమనిన్ని యిందుల భావము.

పై రెండుశ్లోకములందును యోగశబ్దార్థమునకు సుఖదుఃఖములందును లాభాలాభములందును సమబుద్ధియని యర్థము.

2. 50. “ బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే ।
“ తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలం ॥

అర్జునా! కర్మములను చేయునపుడు ఫలము సిద్ధించినను సిద్ధింపకపోయినను సంతోష వ్యసనములు లేక సమబుద్ధితో నుండువాఁడు, సుఖదుఃఖములకుఁ గారణములగు పుణ్యపాపముల నీ లోకమునందే వదలుచున్నాఁడు. కాఁబట్టి నీవు కూడ ఫలముకలిగినను, కలుగకపోయినను, సంతోషవ్యసనములు పొందక సమబుద్ధి కలవాఁడవయి స్వకులోచిత కర్మమును జేయుటకుఁ బ్రవర్తింపుము. కర్మములను జేయునపుడు సమబుద్ధి కలిగియుండునట్టి యోగము మిగుల సామర్థ్యము కలది. సమత్వబుద్ధితో నీశ్వరార్పణముగఁ గర్మములు చేసినయెడలఁ జిత్తశుద్ధి కలుగుననియును, చిత్తశుద్ధిద్వారా పరమార్థజ్ఞానము కలుగుననియును, పరమార్థజ్ఞానముచేతఁ బుణ్యపాపములు రెండును పోవుననియును, దెలియుము. పుణ్యపాపములను బోఁగొట్టు శక్తి జ్ఞానమునకుఁ గలదుగాని మఱి దేనికిని లేదు. కావున జ్ఞాననిష్ఠ నవలంబింపుమనిన్ని యాజ్ఞాననిష్ఠ నదురుటకు సమత్వబుద్ధితో నీశ్వరార్పణముగఁ గులోచిత కర్మము లొనరింపుమనిన్ని బోధింపఁబడినది.

ఈ శ్లోకమునందలి “ సుకృతజహాతి ” యను విషయమున ద్వైతాద్వైతులకు భేద వాదములనేకములు పుట్టినవి. సుకృత దుష్కృతములు రెండును వదలినపుడే బ్రహ్మైక్యమని యద్వైతులమతము. ద్వైతులకు మోక్షమునందైక్యత లేనందున సుకృత ఫలానుభవము తేరతమముగ నుండునని వాదము. ఇది యాక్షేపకాంశము.

2. 51. " కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః ।
" జన్మ బంధ వినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్॥

సమత్వబుద్ధితోఁ గూడికొనిన పండితులు కర్మములవలనఁ బుట్టిన ఫలమును వదలి జన్మమనియెడు బంధములేనివారై సర్వోపద్రవ రహితమయిన యానంద పదవి యనఁగా మోక్షమును బొందుదురు.

పాపములను వదలించికొనుట మాత్రమును సహజమగునుగాని పుణ్యములను వదలించికొనుటకుఁ గారణమేమనిన:- పుణ్యములవలనఁ గలుగునట్టి స్వర్గాది భోగము తుచ్ఛమైనది గనుక యదియును నభిలషింపఁ దగినది కాదనియును, రెంటిని విడుచుటచేత బరమ పురుషార్థము కలుగుననియును దెలుపఁబడినది. ఫలాభిలాషను వదలి, కర్మములను జేయునట్టి విద్వాంసులు బుద్ధియుక్తులై యనఁగా జ్ఞానము, గలవారై జన్మమనియెడు బంధమును వదలికొని నిరామయమగు మోక్షమును బొందుదురు. సమత్వబుద్ధిలేక యొనరింపఁబడు కర్మఫలము, వాసనారూపముగ జీవి నంటును. దీనినే సంస్కారఫలమని మనవారు వాడుచుందురు.

ఇది సుకృత మనియును దుష్కృత మనియును రెండు విధములు. సుకృత ఫలము స్వర్గానుభవము. అనంతరము పునర్జన్మము. దుష్కృత ఫలము నరకానుభవము. అనంతరము పునర్జననము. జీవి యీరీతి సుకృత దుష్కృతఫలవాసనా బద్ధుఁడయి జనన మరణాదిక్లేశములకుఁ జిక్కును. అయితే సమత్వ బుద్ధియోగమునఁ గర్మమాచరించినచో జీవి తనకర్మవాసనలను వదలి బంధవిముక్తుఁడయి నైజప్రకాశ రూపమున ముక్తి నందునని భావము.

2. 52. " యదా తే మోహకలిలం, బుద్ధిర్వ్యతి తరిష్యతి
" తదాగంతాసి నిర్వేదం, శ్రోతవ్యస్యశ్రుతస్యచ॥

ఎప్పుడవివేక రూపమైన కాలుష్యమును దాఁటి నీచిత్తము శుద్ధమగునో యప్పుడు నీవు వినినట్టిదియు, వినవలసినట్టిదియు నయిన విషయములెల్ల నిష్ఫలములయి యనాత్మవిచారము మానుదువు. అనఁగా నన్ని విషయములందు నలంబుద్ధి కలుగును, ప్రజ్ఞాస్థైర్యరూపంబైన యోగముసిద్ధించును. మోహకాలుష్యమునుఁ గాల్చిన వానికి శ్రోతవ్యమును శ్రుతమును, ద్రష్టవ్యమును దృష్టమును, జ్ఞాతవ్యమును జ్ఞాతమును, గ్రాహ్యమును గృహీతమును సర్వము మిథ్యయని తెలిసి వైరాగ్యముకుదురును.

నిర్వేదమనఁగా వైరాగ్యమని యద్వైతుల యర్థము. సంప్రాప్తఫలమని ద్వైతార్థము.

2. ౫౩. " శ్రుతి విప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
" సమాధా వచలా బుద్ధి, స్తదా యోగ మవాప్స్యసి॥

ముముక్షువునకు జ్ఞానయోగము సిద్ధించుటకు సర్వోత్తమకారణము వైరాగ్యము. అజ్ఞానమెట్లు సిద్ధించునను నదిన్ని యిందుఁ జెప్పఁబడును. చతుర్వేదముల యందునుఁ గొన్నిచోట్ల గర్మములను, నాకర్మ ఫలములును, నాకర్మముయొక్క గొప్పఁదనములును, నాకర్మోపాసనలును, నందులఫలమును, నందులమాహాత్మ్యమును, బ్రకటింపఁ బడుచున్నవి. కొన్నిచోట్ల సగుణబ్రహ్మమును, నాసగుణ బ్రహ్మముయొక్క మాహాత్మ్యమును నాసగుణబ్రహ్మమును సేవింపఁగలుగు ఫలాధిక్యమును బ్రకటింపఁ బడుచుండును. కొన్నిచోట్ల నిర్గుణబ్రహ్మమును, నానిర్గుణబ్రహ్మ జ్ఞానమును నానిర్గుణబ్రహ్మ జ్ఞానము వలనఁగలుగు ఫలాధిక్యమును బ్రకటింపఁ బడుచుండును. ఇవియన్నియును ముఖ్యములా? సగుణము మాత్రము ముఖ్యమా? నిర్గుణము ముఖ్యమా? ఇందులో నేవో రెండు మాత్రము ముఖ్యములా? అనిసందేహము కలుగును. కావుననట్టి సమయమునందుఁ బ్రజ్ఞచేత శాస్త్రములెల్లఁ జక్కఁగ నాలోచించి శ్రుతిస్మృతులయుక్తులచేతను, సద్గురూపదేశముచేతను, సకలవేదములు నద్వితీయ బ్రహ్మమునే చెప్పుచున్నవని తెలిసికొని సకల సంశయములను వదలుకొని యెప్పుడును బరబ్రహ్మమునందుఁ బ్రవేశపెట్టఁబడిన బుద్ధికలవాఁడగునో, అనఁగా, చలనమునకుఁ గారణములైన బాహ్యవాసనలు నశించుపోవుటచేత బుద్ధియనునది బ్రహ్మాకారమునుబొంది విక్షేపములు లేనిదయి యుండునో యప్పుడు ప్రజ్ఞయనునది స్థిరముగానుండును. అట్టిస్థిరప్రజ్ఞయ లక్షణముగాఁగల జ్ఞానము స్థితప్రజ్ఞ యనఁ బడును.

కర్మయోగముయొక్క పరిణామఫలము బుద్ధిస్థైర్యము. అట్టిబుద్ధియొక్క స్థిరత్వమే స్థితప్రజ్ఞత్వమని పిలువఁబడును. భగవంతుఁ డనికొనినరీతిగ నర్జునుని యుద్ధకర్మమునకుఁ బ్రోత్సాహపఱచుటకు నింతమాత్రము చాలుగనుండెను. అయితే యర్జునునకు పిదప మనుజునకుఁగలుగుస్థితి యేమనిన్ని, యట్టి స్థితిలక్షణమేమనిన్ని తెలిసికొను బుద్ధిపుట్టెను. కావున నావిషయమును గుఱించి ప్రశ్నించుచున్నాఁడు.

ఇట్టిస్థితప్రజ్ఞుని లక్షణములెల్లఁ దెలియ నర్జునుఁడు భగవంతునిఁ గూర్చి యీరీతిగఁ బలుకుచున్నాఁడు.

54. స్థిత ప్రజ్ఞస్య కా భాషా, సమాధి స్థస్య కేశవ.
స్థిత ధీః కిం ప్రభాషేత, కి మాసీత వ్రజేత కిమ్॥

కృష్ణా! ఇదివఱకును జెప్పఁబడిన సమాధియం దున్నవాఁడును, నేను బ్రహ్మనైతినను నట్టి నిశ్చయజ్ఞానము గలవాఁడును, నగు పురుషుని లక్షణమెద్ది? అట్టివాఁడు లోకులచేత నేమని పిలువఁబడును? అట్టివాఁ డేరీతిగ మాటలాడును? ఎట్లు కూర్చుండును? ఏ విధముగఁ బ్రవర్తించును?

పై రీతిగఁ బ్రశ్నింపఁబడి భగవంతుఁడు ముందు శ్లోకమునుండి యధ్యాయాంతము వఱకుఁగల శ్లోకములచే స్థితప్రజ్ఞుని లక్షణములున్ను ముముక్షువు మోక్షమును బొందుటకుఁ దగిన సాధనములున్ను బోధించుచున్నాఁడు.

2. 55. " ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనో గతాన్ ।
ఆత్మ న్యేవాత్మనా తుష్టః స్థిత ప్రజ్ఞ స్తదో చ్యతే ॥

అర్జునా! ఎప్పుడు మనస్సునందలి కోర్కెల నన్నింటిని వదలికొని యాత్మ యాత్మయందే సంతోషించుచు నాత్మా రాముఁడగు చున్నాఁడో యప్పుడు నిశ్చలమైన యాత్మ జ్ఞానలక్షణముఁగల స్థితప్రజ్ఞుఁడని పలుకఁబడు చున్నవాఁడు.

ఈ శ్లోకమునందలి " మనోగతాన్ కామాన్ " అని మనసునందలి కోర్కెలని పలికిన కారణమేమనిన:- కామము లాత్మధర్మములని కొందఱు వాదించిరి. ఆత్మధర్మములుకావు, మనోధర్మములని తెలుపుటకునై మనసునందలి కోర్కెలని వ్రాయఁబడినది. అంతఃకరణమునం దేవిధమయిన వృత్తియు లేనివాఁడయి యెవడుండునో యట్టివానిని సమాధియందున్న స్థిత ప్రజ్ఞుఁడని తెలియవలెను. వాసనారాహిత్యము స్థితప్రజ్ఞుని ముఖ్య లక్షణమని తెలియుము. మనోగతములగు పాపపుణ్య కర్మాపేక్షలు వదలుట సరికాదనిన్ని, పుణ్య కర్మాపేక్షలు ముక్తియందునైతె నుండవలెనన్ని ద్వైతులవాదము. ఈ శ్లోకమునందట్టి భేదముచేయలేదు. అట్టి స్థిత ప్రజ్ఞత్వముగల వాఁడు మఱల నెట్టులుండు ననిన ముందు వ్రాయఁబడిన మూఁడు శ్లోకార్థములచే బోధింపఁబడినది.

2. 56. " దుఃఖే ష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగత స్పృహః ।
" వీత రాగ భయ క్రోధః స్థిత ధీ ర్మని రుచ్యతే ॥

2. 57. " య స్సర్వత్రా నభి స్నేహ స్తత్తత్ప్రాప్య శుభా శుభమ్ ।
" నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

2. 58. " యదా సంహరతే చాయం కూర్మోఙ్గా నీవ సర్వశః ।
" ఇన్ద్రియా ణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

అర్జునా! ఎప్పుడు ప్రత్యగాత్మ యందే; తనచేతఁ దా నానందించుచు, మనమును బొందియుండు కోరికలను విడుచునో యపుడు స్థితప్రజ్ఞుఁడగును. దుఃఖములు కలిగినపుడు దిగులు చెందని వాఁడును, సుఖములు గలిగినపుడు కోరికలు లేని వాఁడును, రాగము, భయము, క్రోధము, మొదలగునవి పోయిన వాఁడును, మనన శీలుఁడును స్థితప్రజ్ఞుఁడగును. ఎవఁ డన్నింటి యందును కోరిక లేనివాఁడయి, శుభా శుభములను బొందినపుడు సంతోషమునుగాని దుఃఖమునుగాని పొందక యుండునో వానిబుద్ధి స్థిరమయినది. ఎవఁ డింద్రియ గోచరములగు వస్తువులనుండి, తాబేలు తన యవయవములను లోనికి ముడిచికొని నటుల, నింద్రియములను లోన ముడిచికొనునో యట్టివాఁడు స్థితప్రజ్ఞుఁడగును. అని పై శ్లోకముల తాత్పర్యము. అనఁగా స్వాత్మానంద రసానుభవముచేతనే సంతోషముఁ బొందినవాఁడయి యమృత రసపానముఁ జేసినవాఁడు లవణోదకము నిచ్ఛయింపనిలాగున విషయ సుఖముల నపేక్షింపఁడని భావము. విషయములు కామోదయమునకుఁ గారణములగును. కామము సంకల్పమువలనఁ గలుగుచున్నది. సంకల్పము వాసనాబలమున గలుగును. వాసనయనునది భోగసుఖములయలవాటున నుద్భవించును. కావున విషయ సుఖము లన్ని యనర్థదాయకంబు లగును. వానిని వదలినచో స్థితప్రజ్ఞత్వము కలుగునని భగవంతుఁ డర్జునునకుఁ దెలుపుచు విషయేంద్రియము లెట్టివి. కామమెట్టిది. రాగద్వేషాదు లెట్టివి. వానినశింపఁజేయు విధమెద్ది. స్థితప్రజ్ఞత్వమార్జించు సాధనము లెవ్వియను విషయములర్జునునకు భోధింపనిచ్ఛయించి యీక్రిందవివరించినవిధముగఁ బలికినాఁడు.

2. 59. " విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః॥
" రస వర్జం రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే.

2 60. " యతతో హ్యపి కౌన్తేయ, పురుషస్య విపశ్చితః
" ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥

2. 61. " తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః॥
" వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

61-వ శ్లోకమునందు " తత్త్వమసి " యనువాక్యములోని తత్పదార్థ వివేచన మిమిడింపఁ బడినదనియు, యీ విషయమే 7-12 అధ్యాయములలో విస్తరింపఁ బడినదనియు మధుసూదన సరస్వతుల వారియాశయము.

విశేషము కష్టపడి యతిప్రయత్నముచే విషయమునుండి యింద్రియములను మరలించువానికి విషయ నివృత్తి కలిగినను నావిషయమందలి రాగనివృత్తి కలుగదు. ఆత్మస్వరూపమును దెలిసిన వానికి నావిషయమందలి రాగముఁగూడ, నివర్తిలును. ప్రజ్ఞావంతుఁడెంత యత్నించినను ప్రబలమగు నింద్రియములు వ్యాకులము లోఁజిక్కి వివేక మానసమును గాఁడబలాత్కారముగ నాకర్షించును. అక్కారణంబుననే యింద్రియములను మొదట వశపఱచికొనవలెను. ఇంద్రియములను వశమున నుంచికొని సర్వప్రత్యగాత్మయగు బ్రహ్మము నేనను భావమున సమాధి నవలంబించు చుండిన యభ్యాసబలమున నెవ్వనికి వాని ప్రజ్ఞ స్థిరంబగునని భావము. అట్టివాఁడే స్థితప్రజ్ఞుఁడనఁబడును. అట్టివానికే విదేహముక్తి కలుగును. శబ్దాదివిషయములజయింపకున్న,

2. 62. " ధ్యాయతో విషయాన్పుంసః సఙ్గస్తేషూపజాయతే॥
" సఙ్గాత్సంజాయతే కామః కామాత్క్రోధోభిజాయతే.

2. 63. " క్రోధాద్భవతి సంమోహః సంమోహాత్స్మృతి విభ్రమః।
" స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధి నాశాత్ప్రణశ్యతి.

2. 64. " రాగ ద్వేషవియుక్తైస్తు, విషయా నిన్ద్రియైశ్చరన్.
" ఆత్మ వశ్యైర్విధేయాత్మా ప్రసాద మధి గచ్ఛతి.

2. 65. " ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే.
ప్రసన్న చేతసోహ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి.

పురుషుఁడు విషయములను తలఁచిన మాత్రాన వాని యందతనికిఁ బ్రీతి పుట్టును. ప్రీతిపుట్టినమాత్రనె, కామముజనించును. ఆకామమునకు నెద్దియేని భంగము కలిగినచోఁ గ్రోధము బుట్టును. క్రోధముచే యుక్తాయుక్తజ్ఞానము చెడును. అట్టియవివేకముఁ గలన శాస్త్రోపదిష్టమయిన స్మృతికి హానికలుగును. స్మృతిహానిచే

బుద్ధిసామర్థ్యంబు నాశమగును. కావున మోక్షాపేక్ష కలవాఁడు మనస్సును స్వాధీనపఱచుకొని, రాగద్వేషములను వదలి శారీర యాత్రకు దగినంత మాత్రమన్న పానాదులఁ గొనుచు చిత్తప్రసాద మొందవలెను. ఈరీతిగఁ జిత్తప్రసాదత్వము కలిగినయెడ సర్వదుఃఖములు నశించును. ఆత్మాకారమై బుద్ధి స్థిరముగ నిలుచును. కావున నూన ఫుఁడన్ని విధములఁ జిత్త ప్రసాదత్వ మార్జింపవలెను. " అగ్నిసంగాద్యథాలోహ, మగ్నిత్వముపగచ్ఛతి. ఆత్మసంగాత్తథా గచ్ఛత్యాత్మతా మింద్రియాదికం. అగ్నిసంగమువలన లోహ మెటులయగ్నిభావమందునో, యటులనే యాత్మసంగము వలన నింద్రియములాత్మత్వమును బొందునని యభిప్రాయము పైరీతిగఁ జిత్తస్థైర్యమును లేని వానికి,

2. 66. " నాస్తి బుద్ధి రయుక్తస్య నచాయుక్తస్యభావనా॥
" న చా భావయతశ్శాంతి రశాంతస్య కుత స్సుఖమ్॥

చిత్తస్థైర్యము లేనివానికి నాత్మస్వరూప జ్ఞానము కలుగదు. వీలయన వానికి నాత్మస్వరూపచింతనమే పుట్టదు. ఆత్మస్వరూపచింతనము లేనివానికి ననర్థ నివృత్తి సంభవింపదు. అనర్థనివృత్తి కానిచే సుఖము కలుగదని తాత్పర్యము. ముముక్షువులయి యుండు యతులకునైనను సమ్యక్ జ్ఞానములేక ముక్తి సిద్ధింపదనిన్ని, సమ్యక్ జ్ఞానము సమాధియోగములేక సిద్ధింపదనిన్ని, సమాధియోగ మింద్రియనిగ్రహములేక చేకూరదనిన్ని, యింద్రియ నిగ్రహము రాగాది త్యాగము లేక సంభవింపదనిన్ని, కావున ముముక్షువు ప్రారంభమున రాగాదులను వదలి యింద్రియ నిగ్రహమొనర్చి సమాధి యోగమును సాధించి, సమ్యక్ జ్ఞాన మంద వలెనన్ని. విదేహ ముక్తికి నిదియ ముఖ్యసాధనమనిన్ని, పైశ్లోకముల ఫలితార్థము. ఇఁక నింద్రియములనుండి కలుగు ననర్థము లేవనిన:—

2. 67. " ఇంద్రియాణాం హి చరతాం యన్మనోను విధీయతే ।
" త దస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మివాం భసి ॥

2. 68. " తస్మా ద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః ।
" ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

ఉపరతేంద్రియుఁడుకాని వానికి సుఖములేదు. ఎందుకనఁగా ఇంద్రియములు విషయములందు వర్తించునపుడు వానిని వెంబడించి మానసము బోనిచ్చి

నయెడల, నామనస్సు జలమునందుఁ బోవు నోడను పెద్దగాలి యెదిరించి హరించునట్లు, బుద్ధిని హరించి విషయాధీనతఁ జెన్దును. కావున విషయ ధ్యానాదులు విడిచి విషయము లింద్రియములందుఁ బ్రవేశింపనటులఁజూచి నిగ్రహించి యాత్మ విషయ బుద్ధిస్థిరముగ నిలుపవలెను.

2. 69. « యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।
« యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥

అర్జునా! ఏవిషయము భూతకోటికిఁ గనరాని రాత్రిగనుండునో యా విషయము, సంయమికిఁ బగలుంబలె గనపడుచుండును. ఏవిషయము భూతకోటికిఁ బగలుంబోలె నగపడుచుండునో యా విషయము సంయమికి రాత్రింబోలె నగపడదు.

అనఁగా భూతకోటికి బ్రహ్మ మగపడదు. సంయమికి విషయము లగపడవు. సంయమి శబ్దమునకు సన్యాసియని యద్వైతుల యర్థము. ఇంద్రియ నిగ్రహమొనర్చిన కర్మయోగియని ద్వైతార్థము.

2. 70. « ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం సముద్ర మాపః ప్రవిశంతియద్వత్ ।
« తద్వత్కామాయం ప్రవిశంతి సర్వే సశాంతి మాప్నోతి నకామకామీ ॥

అనేకములైన నదులలోని యుదకములచేత సంపూర్ణముగ నిండింపఁబడినదైనప్పటికిని, హద్దుమీఱనట్టిన్ని స్థిరమైనట్టిన్ని, యునికిగల సముద్రమునందు వర్షోదకము లేవిధముగఁ బ్రవేశించి లీనమగునో యటులనే, సకలకోర్కెల చేతను, నిండినవాఁడును సుఖదుఃఖములువచ్చినను సంతోష వ్యసనములు పొందక సర్వకాలములందును సమభావము పొందియున్నవాఁడును నయిన బ్రహ్మనిష్ఠ సమస్తములగు కోర్కెలు లీనమగుచున్నవో అట్టి బ్రహ్మనిష్ఠుఁడు చిత్తశాంతి రూపమైనముక్తినిఁ బొందుచున్నాఁడు కాని విషయాభిలాష కలవాఁడు చిత్తశాంతి రూపమైన ముక్తినిఁ బొందఁడు. విదేహముక్తుఁడు బ్రహ్మములో నైక్యమగుస్థితి నీశ్లోకమునఁజూపబడినది. ఈ శ్లోకమద్వైతులు బ్రహ్మైకత్వము స్థాపించుచున్నదని కొందఱు భాష్యకారులు పలికినారు.

2. 71. « విహాయ కామాన్ యస్సర్వాన్, పుమాంశ్చరతినిస్స్పృహః ।
« నిర్మమో నిరహంకార, స్స శాన్తి మధిగచ్ఛతి॥

లోకములో నేమానవుఁడు సకల విషయములను వదలి, విషయము లు కావలెనని యెడు తలంపులేనివాఁడును నేనన్తునందును నాదియనియెడు నభిప్రాయములేనివాఁడును, గర్వములేనివాఁడును, నయియుండునో యట్టివాఁడు సకలదుఃఖనివృత్తిరూపమైన మోక్షమును బొందుననిని యభిప్రాయము.

ఈ శ్లోకములోను తత్త్వమసియను వాక్యములోని " త్వం " పదార్థ విషయము బోధింపఁ బడినదని మధుసూదన సరస్వతులవారి యాశయము.

2. 72. " ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి ।
" స్థిత్వాస్యామన్తకాలేపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి ॥

బ్రహ్మ నిర్వాణార్థము బ్రహ్మములో నైక్యమని యద్వైతుల వాదము. ద్వైతులా శబ్దము బ్రహ్మమునకు విశేషణమనియు, జీవి నిశ్చల రూపమైన బ్రహ్మస్థలముసు జేరుననియు యర్థము చేయుచున్నారు. నిర్వాణ శబ్దము నన్వయించుటలో ద్వైతులు విశేషకష్టపడినారుగాని తృప్తికరముగ లేదు. నిర్వాణమనఁగ . నాకారము లేనట్టి యని యర్థము చేసినారు. మీ మతమురీతిగఁ బరమాత్మకు నంగాంగములు గల రూపమున్నదియే యని ప్రశ్నించినచో నారూపము విరించి బ్రహ్మ మొదలగు వారికిఁ గల రూపము కాదని వాదించినారు. ఈ విషయమున శ్రీ మధ్వాచార్యుల వారు తాత్పర్యనిర్ణయములో విశేషముగ వ్రాసినారఁట. దానినిఁ జూడక యే యభిప్రాయ మిచ్చుటకును రాదు.

అర్జునా! నేనిదివఱకుఁ జెప్పఁబడిన నిష్ఠయంతయును బ్రహ్మవిషయమైనది. ఇట్టి బ్రహ్మనిష్ఠను బొందినవాఁడు మోహమునుఁ జెందఁడు. ఈ బ్రహ్మనిష్ఠను ముసలితనమునం దవలంబించి నప్పటికిని దప్పక మోక్షము గలుగును. బ్రహ్మనిష్ఠయనఁగా సర్వ కర్మములు సన్న్యసించి బ్రహ్మరూపుఁడై యుండుటయని యర్థము. సర్వ కర్మములను సన్న్యసించిన సన్న్యాసీ మోహమందఁడు. గృహస్థుఁడగువాఁడు ధనము మొదలగునవి నశించిపోవుటవలన తఱుచుగా మోహమును బొందును. అన్ని విషయములలోను జిత్త విక్షేపము కలవాఁడయి పరమార్థ వివేకము లేనివాఁడగును. ముక్తియన జీవ బ్రహ్మైక్య జ్ఞానమునందుట. ఈ యుపేయమగు జ్ఞాననిష్ఠను బొందుటకు నుపాయము కర్మనిష్ఠ. పై రెండుసాధనములీ యధ్యాయమున బోధింపఁ బడినవి.

పై శ్లోకమున " అర్జునా! ఇదియే బ్రాహ్మీస్థితి " యని పలుకఁ బడినది.

ఈ బ్రాహ్మీస్థితి యెట్టిదనునది తెలిసికొనుటకు, నలుబది యెనిమిదవ శ్లోకమునుండి డెబ్బది యొకటవ శ్లోకము వఱకును గల యిరువది నాలుగు శ్లోకార్థములు చక్కఁగఁ బఠించి మననము చేసినచోఁ దెలియనగును. స్వాధీనేంద్రియుఁడయి మనో నైర్మల్యము నంది సమత్వబుద్ధి యోగము కుదిరి, యంతర్ముఖియయి, యాత్మావలోకనానంద మున నుండువాఁడు బ్రాహ్మీస్థితి యుండిన వాఁడని యర్థమగుచున్నది. ఇట్టి దశ నందు ప్రయత్నము మానవుఁడు తన యంత్యకాల సమీపముననైనను బ్రయత్నింపనగును. స్థితప్రజ్ఞావస్థలోఁగాని బ్రాహ్మీస్థితిలోఁగాని సంఘమువదలి సన్న్యాసియై యడవిఁ జేరవలెనని యీ యధ్యాయములో నెచటను భగవంతుఁ డుపదేశించినట్లగపడ లేదు. ఆహారాదులు వదలి ధవిసి విషయాదులను గ్రహింపఁజేయవలెనని సైతము పలుకబడ లేదు. దేహమును నారోగ్యముగ నుంచికొని, స్వార్థైకపరుఁడవుగాక, నీతి ప్రవర్తకుఁడవయి, సంఘాభివృద్ధికిఁగాను నిష్కామ ధర్మ కర్మాచరణుండవయి బ్రాహ్మీస్థితినందఁ బ్రయత్నింపుమని భగవంతుఁడు బోధించెను. భగవంతుని గీతోపదేశ ముఖ్యవిషయము కర్మాచరణమువల్లనే జ్ఞానమార్జించి మోక్షమందవలెనని యుండు నుగాని ప్రపంచ సాంఘిక కర్మములు వదలవలెనని యుండదు. భగవంతుని యుద్దేశ్య మట్టిదయి యుండినచో యుద్ధమొనర్చి శాత్రవ సంహారమునకు నుపక్రమింపుమని బోధించుచుండలేదు.

సభ్యులారా! అర్జునుఁడు స్వజన హింస యొనర్పఁజాలక, వ్యామోహ చిత్తుఁడయి శోకించి యుద్ధమువలదని మానికొనెను. భగవంతుఁడదికని, తానొన ర్పఁబూనిన ధర్మసంస్థాపనకర్మమునకు నర్జునుఁడు సాధనముగ నుండవలెనని యెంచెను. కావున నర్జుననకుఁ బ్రారంభమున సాంఖ్య యోగమును దెలుపుచు నాత్మకు నిత్యత్వము నమృతత్వము, నచలత్వమును నిరూపించి దేహమునకు నాత్మకునుగల భేద మెఱుకపఱిచెను. ఇటు సాంఖ్య బోధనచే నర్జునుని శోకమును మాన్పి ప్రతిమానవుఁడును మోక్ష మందనుగలసాధనల క్రమ మీయధ్యాయమున సంగ్రహముగఁ దెలుపుచు నట్టి సాధనలవివరము ముందొక్కొక్క విషయ మొకయధ్యాయముగఁ బలికినాడు. అది యెటులయినది ముందు మన మెఱుంగఁగలము.

శ్రీ

# తృతీయాధ్యాయము.

# కర్మయోగము.

ఇది

బళ్ళారిలో వకీలుగానుండిన

కీ. శే. బ్రహ్మశ్రీ॥ కోలాచలము శ్రీనివాసరావుగారిచే

రచియింపఁబడినది.

వారి జ్యేష్ఠపుత్రులగు కె. శత్రుఘ్నరావుచేఁ

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు.

బళ్ళారి.

ఆంధ్రముద్రాక్షరశాలయందు

ముద్రితము.

**1925.**



వెల రు. 0—8—0



# తృతీయాధ్యాయము:

# కర్మయోగము

ఈ యధ్యాయమునకుఁ గర్మయోగమని నామము. కర్మమననేమి? కర్మయోగమననేమి? యను విచారమించుక తెలుపుటకిది యోగ్యమగు స్థలముగనున్నది. ఈ కర్మము సృష్ట్యాదినే మాయతోఁగూడ నగపడినది. కావుననే కర్మకు మాయ యనునామము సైతమున్నది. ఈ కర్మవిషయ మనాదిగనుండు ఋగ్యజుస్సామములను త్రయీ వేదములలోను దెలుపఁబడినది. ఆ వేదకర్మాచరణ విధాన వివరములు విస్తారముగఁ బ్రాహ్మణములలోఁ దెలుపఁబడినవి. అందుఁ దెలుపఁబడిన విషయములు త్రయీధర్మములని ప్రసిద్ధికెక్కినవి. ఈ ధర్మాచరణము లెల్లఁ బుత్ర, పౌత్ర, పశు, రథాశ్వ ధన, ధాన్యాది సంపత్తిని గోరుచు నింద్రాగ్ని వరుణ రుద్ర పర్జన్యాదులను బ్రార్థించుచు జ్యోతిష్టోమ యజ్ఞయాగాదులు సలుపు కర్మములతో నిండినవి. వీనికి శ్రౌతకర్మములని పేరు. వీని యాచరణ విధానములలోఁ గొన్ని బ్రాహ్మణములందు భిన్నసాంప్రదాయము లేర్పడినందున వానినెల్లఁ గ్రోడీకరించి యేకీకరణ మొనరించి జైమిని ఋషి మీమాంసయను పేర విధులొనరించెను. దీనికే కర్మకాండమని పేరుసైత మున్నది. ఈ కర్మకాండ విచారములెల్లఁ గామ్యకర్మ విచారములైనను దదాచరణములవలన నైహిక స్వార్గిక సుఖప్రాప్తియే గాక మోక్షముసైతము లభించునని జైమిని పలికెను. కొంతకాలమునకు నీ శ్రౌతకర్మములు హింసాకర్మములతో నిండినందునను నాచరణ విధానము కష్టమయమైయుండు కారణంబునను, మరియు ననేక కారణములవలనను, విశేషజనులు వదలిరి. పిదపఁ బంచయజ్ఞాది స్మార్త కర్మములు స్మృతి సంబంధములైనవి వర్ణాశ్రమ ధర్మ కర్మములు, నైతిక సామాజ కర్మములు. వేయేల మనుజులచేఁ జేయఁబడు పాపరహితములైన సర్వ శుభాశుభ కర్మములున్న యజ్ఞనామమున లోకములోఁ బ్రబలి రూఢికివచ్చెను. క్షత్రియార్హమగు యుద్ధముసైతము యజ్ఞముగ భావింపఁబడెను. శ్రౌత సాంబంధిక వైదిక కర్మములకుఁ జేరికగఁ బైనఁ బలుకఁబడిన స్మార్త నైతిక గృహ్య సామాజిక ధర్మములన్ని

మును గర్మకాండలో వచ్చెను. ఈ రీతిగ దేవ, ఋషి పితృలను గురించి చేయఁబడు సర్వ కామ్య కర్మములున్ను మోక్షదాయకములని కర్మపరులు కొందఱు నిర్ధరించి యుండిరి.

బ్రాహ్మణముల కాలానంతరమునఁ ద్రయీవేదులగు ఋషులనేకు లర ణ్యములం జేరి జ్ఞానమార్జింపఁ బలుమార్గములు గని పెట్టి యా సాధనములనెల్ల సార ణ్యకముల రూపములుగను ఉపనిషద్రూపములుగను సిద్ధాంతము లొనర్చిరి. ఈ సిద్ధాంతములలోను భిన్నమార్గము లనేకములేర్పడి పరస్పర విరుద్ధములుగ నుండి నందున బాదరాయణాచార్యులవారావిరుద్ధములను సవరించి యా జ్ఞానసార మెల్ల సూత్రములుగ నేర్పఱచిరి. ఆ సూత్రములకే బ్రహ్మసూత్రములనిన్ని శారీర కసూత్రములనిన్ని పేరువచ్చెను. వీనికి వేదాంత సూత్రములనిన్ని జ్ఞానకాండ యనిన్ని నామము కలిగెను. జైమిని సూత్రములకున్ను బాదరాయణాచార్యుల సూత్రములకును మీమాంసయను పేరుండినందున దానిని గుర్తింప గర్మకాండ పూర్వ మీమాంసయనిన్ని, జ్ఞానకాండ యుత్తర మీమాంసయనిన్ని జనులు పిలువసాగినందున నిప్పటికిన్ని యవేనామములు రూఢిలోనున్నవి. జ్ఞానమొక్క టియే మోక్షసాధనమని వేదాంతులు నిర్ధరించిరి.

కర్మజ్ఞాన సాధనము లీరీతిగ భిన్నాభిప్రాయములు గలవై పెనఁగులాడు చుండ గీతోపదేశము భగవంతుఁడు గీతాశ్లోకమున నర్జునుని నెపమున లోక మునకు బోధించెను. భగవంతుఁడు జ్ఞానమే మోక్షమునకు ముఖ్యసాధనమనిన్ని యా జ్ఞాన మార్జింపఁ గర్మాచరణమే ముఖ్యమనిన్ని తెలిపెను. అయితే మనుజుఁ డొనరించు కర్మములు కర్మకాండ ఫలస్తుతులలోఁ బల్కినరీతిగ ఫలాపేక్షచే నొన రింపఁ గూడదనిన్ని ఫలాపేక్షచే నొనరింపఁబడు కర్మము లాత్మను వాసనారూప ముగ నాచ్ఛాదించి బంధించుననిన్ని కావున మోక్షముక్తి కలుగదనిన్ని ఫలాపేక్షలేక నిష్కామకర్మము లొనరించినచో యాత్మను బంధింపఁ జేయఁజాలని కారణంబున నాత్మకు ముక్తి కలుగుననిన్ని బోధించెను. ఇట్టి నిష్కామ కర్మాచరణంబునకుఁ గర్మ యోగమని నామము కలిగెను.

(౨) అకర్మమున కంటెను ( *Inactivity or inaction* ) కర్మ మొనరించుట మేలని 8-వ శ్లోకము బోధించెను.

(బి) ఈశ్వరార్పణము కాక యింద్రాగ్ని వరుణాదులకు ఫలాపేక్షతోఁ జేయు కర్మములు బంధహేతువులని 9-వ శ్లోకము పలికెను.

(సి) శ్రౌత స్మార్త కర్మములు ప్రజలతోఁ గూడఁ బ్రజాపతి సృష్టించెను. గావున నవి ఫలప్రదాయకములైనను వానిని వదలక యోగముక్తులై చేయుఁడని యర్థమిచ్చులాగునఁ బదియవ శ్లోకమునఁ బలుకఁబడినది.

(డి) దేవతలనుగురించి జేయు యజ్ఞములచే దేవతలు తృప్తినంది ప్రజలను తృప్తినందింతురనిన్ని యీ రీతిగఁ బరస్పర సాహాయ్యకారులుగ నుండవలెననిన్ని దేవతలిచ్చిన వస్తువులు గ్రహించి వారికి మరల నియ్యని వారు దొంగలనిన్ని అన్నమువలన భూతకోటి పుట్టుననిన్ని పర్జన్యునిచే నన్నము పుట్టుననిన్ని యజ్ఞమువలనఁ బర్జన్యుఁడు పుట్టుననిన్ని కర్మమున యజ్ఞము పుట్టుననిన్ని సర్వగతమగు వేదము యజ్ఞమునందుంపఁ బడినదనిన్ని 10-11-12-13-14-15-వ శ్లోకములు కామ్యకర్మములు ఫలదాయకములని పలుకబడినవి. సృష్ట్యాదినుండి యీ కర్మచక్రము తిరుగుచున్నదనిన్ని, యీ చక్రము ననుసరించి ప్రతిమనుజుఁడు నడచికొనవలెననిన్ని పలుకఁబడినది. (గీ 16) అయితే పై విధములగు పలు కర్మములు బంధహేతువులని యెన్ని యాత్మయే ముఖ్యవిషయముగఁగొని ఫలాసక్తత వదలి కర్మము లొనర్పవలెననిన్ని, కామసంకల్పవర్జితములైనచో పై కర్మములన్నియును జ్ఞానదాయకములై తద్వారా మోక్షమునిచ్చుననిన్ని యీరీతిగ ఫలాసక్తత లేనివాని లక్షణము లెవ్వి యనునదిన్ని 19-20-21-22-23 శ్లోకములలో వివరించి పై ప్రకారము జ్ఞానమార్జించిన మనుజుఁడు హోమసాధనము లైన స్రుక్స్రువాదులయందును హోమద్రవ్యాదులయందును యజమానియగు తనయందును నగ్నియందును బ్రహ్మమును జూచుచున్నాఁడని 24-వ శ్లోకమునందు కర్మయోగముయొక్క పరిణామస్థితిని సూక్ష్మముగ వర్ణించి దానిమహిమ యుపదేశింపఁ బడినది.

గీతయందుండు పరమరహస్యమే కర్మయోగరహస్యమని బ్రహ్మశ్రీ బాల గంగాధర తిలక్కుగారు తమ గీతారహస్య గ్రంథములో విశేషముగ వ్రాసినారు.

## తృతీయాధ్యాయము.

ఈ యధ్యాయమున సాధనభూతమైన కర్మనిష్ఠను ప్రాముఖ్యముగఁ జర్చించుచు సాధ్యభూతమైన జ్ఞాననిష్ఠ నప్రధానంబుగఁ బ్రతిపాదింపఁబడినది. ఇందుఁ గర్మవిషయము విశేషముగఁ బలుకఁబడినది కావున నిది కర్మయోగమను నామంబును బూనికె నెక్కెను. ఇది బ్రహ్మార్పణయోగమని సైతము కొందఱు దీనినిఁ బిలుచుచున్నారు.

పరమార్థతత్త్వ విషయనిష్ఠను బోధించుసాంఖ్యమును శ్రేయోఽభిలాషి యగు భక్తునకు బోధించి తన్నట్టివాఁడు కానివానింబలె, దానికి విపరీతమగు కర్మమునందు భగవంతుఁడేటుల తన్ను నియోగించెనని యర్జునుఁడు చిత్తంబునఁదత్తరపాటందెను. బుద్ధిశుద్ధిద్వారంబునసైనను వర్తమానజన్మమునందే ఫలముగలుగు ననునియమము లేనికర్మమునందు నన్ను నియోగించెనే భగవంతుఁడని యర్జునుఁడు మనమున వనటఁజెందెను. కృష్ణునిఁజూచి,

1. " జ్యాయసీ చేత్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన,
   " తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ.
2. " వ్యామిశ్రేణైవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే.
   " త దేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్.

కృష్ణా! ఆత్మావలోకనమునకు జ్ఞాననిష్ఠయే సాధనమని చెప్పితివి, కావునఁ గర్మనిష్ఠకన్న జ్ఞాననిష్ఠయే యధికమని తెలియవచ్చును. సకలేంద్రియోపరతిచే జ్ఞాననిష్ఠసాధ్యమని నీవే పలికితివి. అటుపలికియు నింద్రియవ్యాపారరూపంబున నాత్మావలోకన విరోధియును భయంకరంబునునగు కర్మమునందు నన్ను నియోగింపనేల? నీవచనంబులు పూర్వాపరవిరుద్ధమగుటవలన వ్యామిశ్రములయి నాబుద్ధి కివి మోహముఁగలిగించెను. కావున మిశ్రముగానటులనేకవాక్యముగ నే నేమియనుష్ఠింపవలెనో నాకు నెద్ది శ్రేయస్కరియో దానిని, నిశ్చయించి చెప్పుమని భగవంతునిఁ బ్రార్థించెను. కర్మార్థమిచట కామ్యకర్మమా? నిష్కామకర్మమా! యనువిషయమున గొప్పవాదము జరిగి నిష్కామకర్మమేయని యద్వైతవిశిష్టా ద్వైతులు నిర్ధరించినారు. రెంటికిని సామాన్యమగు వైకల్పికకర్మమని ద్వైతులు నిర్ధరించినారు.

...న్యాసముకన్నను కర్మముకంటెను జ్ఞానము హెచ్చని మొదటివారు నిర్ధరించినారు. రెండును సమానమని రెండవవారు నిర్ధరించినారు.

(2) కృష్ణుని బోధనలోనే సందేహార్థము నిచ్చు వాక్యములున్నవని యద్వైతులవాదము. సర్వోత్తముండగు కృష్ణునివాక్కులలో నేసందేహముండదు. అర్జునుని బుద్ధిలోనే మాలిన్యముకలిగెనని ద్వైతులవాదము. ఇట్టివాదములు నిర్ధరించుటకు శబ్దములను బట్టియాడ్చి శ్రమపెట్టినారు. ఇచటబుద్ధియనఁగా సమత్వబుద్ధి. అట్టి సమత్వబుద్ధినే నార్జించెద. కర్మమేలచేయనలెనని యర్జునుఁడు ప్రశ్నింపఁ గర్మయోగమే సమత్వబుద్ధి నార్జింప సాధనమని భగవంతుఁడు బోధింపఁ బోవుచున్నాడు.

3. "లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ,
జ్ఞాన యోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్.

ఈ శ్లోకములో "పురా" యనుశబ్దమునకు కల్పాదియని శ్రీశంకరాచార్యులవారర్థముచేసిరి. ద్వితీయాధ్యాయములోనని శ్రీమధ్వాచార్యుల వారర్థముఁ జేసిరి. అర్జునుఁడజ్ఞానియైనందున కర్మయోగము బోధింపఁబడినదని శంకరాచార్యులనిరి. అర్జునుఁడు దేవాంశసంభూతుఁడై నందున యజ్ఞానికాదని శ్రీమధ్వాచార్యులవాదము. నిష్ఠశబ్దమునకు స్థితియని యద్వైతుల వాదము. మోక్షమని ద్వైత వాదము అపుడు భగవంతుఁడర్జునుని యభిప్రాయంబు గుర్తెఱింగి అర్జునా!

పూర్వము సృష్ట్యాది యందు నేను ప్రజలసృష్టించి వారభ్యుదయనిశ్శ్రేయసంబులు పొందుటకయి రెండువిధములగు నిష్ఠలేర్పఱచితిని. సాంఖ్యులకు జ్ఞాననిష్ఠయనిన్ని, యోగులకుఁ గర్మనిష్ఠయనిన్ని, విధించితినని పలికెను. అనఁగా, బ్రహ్మచర్యాశ్రమము నుండియే, యాత్మవిషయవివేకజ్ఞానముఁగలవారుగనుండి సన్న్యసించినవారయి వేదాంత విజ్ఞానసునిశ్చితార్థులయిన పరమహంస పరివ్రాజకులకు సాంఖ్యనిష్ఠచెప్పఁబడినదనిన్ని, యటుకానివారికిఁ గర్మనిష్ఠచెప్పబడినదనిన్ని యర్థము. అర్జునా! నేబలికినపలుకులలోఁ బరస్పరవిరోధమున్నదనుటకు నీ బుద్ధిదోషము "విద్య, బుద్ధి, శక్తి, అవస్థ," యీవిషయముల నేఁజక్కఁగనాలోచించి నీకుఁగర్మమునందె యధికారముగాని సన్న్యసమునందు లేదనిపలికితిని. జ్ఞానసిద్ధినార్జించుటకుఁ జిత్తశుద్ధి యవశ్యకమనిన్ని చిత్తశుద్ధికలుగుటకుఁ గర్మమాచరింపవలెననిన్ని పలికితిని. కర్మములను విడిచిబుద్ధినాశ్రయింపుమని నేఁ బలుకలేదు. రెంటినిఁజేయుమని నైతము నేఁ బలుక

లేదు. జ్ఞానకర్మనిష్ఠలు భిన్నపురుష కర్తృకంబులని తెలియుము. కర్మఠులగు గృహ
స్థులకు కర్మయోగము. కర్మరహితులగు సన్న్యాసులకు సాంఖ్యయోగమని నా య
భిప్రాయమని భగవంతుఁడు నిశ్చయించి పలికెను. అశుద్ధచిత్తుఁడగువాఁడు చిత్త
శుద్ధిగలుగు పర్యంతము కర్మ మనుష్ఠింపవలెనని ముఖ్యాభిప్రాయము వెల్లడించెను.
ఈ శ్లోకమునకు భాష్యమొనర్చుటలో శ్రీమధ్వాచార్యులవారధికారినిరూ
పణమొనర్చి సనకజనకాదులను దృష్టాంతములుగఁగొని, యర్జునుఁడధికారికుఁడని
జ్ఞానకర్మనిష్ఠలు రెండును ననుష్ఠింపవలెనని యర్జునునకు బోధించినటుల తాత్పర్యపడినా
రు. శ్రీరామానుజార్యులధికారినిరూపణము చేయక యవస్థ నిరూపణము చేసినారు.
అనఁగా నెట్టివాఁడయినను ప్రారంభమునఁ గర్మములొనర్చుచుఁ జిత్తశుద్ధిఁగలిగించు
కొనినవాఁడే చిత్తశుద్ధికలిగినపిదప సాంఖ్యబుద్ధి నార్జింపనగునని వారితాత్పర్యము.
సాంఖ్యనిష్ఠకుదిరియుండినను జనకాదులవలె స్వాధికారికులయి కర్మములాచరింపనగు
నని లోకసంగ్రహార్థము శ్రీమధ్వాచార్యులవారు పలికిరి. శ్రీ శంకరాచార్యుల
వారు బ్రాహ్మణునకు మాత్రము వర్ణాశ్రమ ధర్మములు నాలుగు శాస్త్రసమ్మతములు.
గావున సాంఖ్యయోగమగు సన్న్యాస్యాశ్రమము బ్రాహ్మణునకుఁ జెల్లుననిన్ని మిగత
వారికిఁ జెల్లదనిన్ని క్షత్రియునకు మూఁడే యాశ్రమములనిన్ని నాల్గవయాశ్రమము
లేదనిన్ని వైశ్యునకు బ్రహ్మచర్య గృహస్థాశ్రమములు గాని వానప్రస్థసన్న్యా
స్యాశ్రమములు లేదనిన్ని శూద్రునకు గృహస్థాశ్రమ మొక్కటియేయనిన్ని యధి
కారనిరూపణము చేసియున్నారు. జ్ఞాననిష్ఠ సన్న్యాసులకు స్వధర్మమని భగవంతుఁడు
పలికినాఁడు.

4. " న కర్మణా మనారమ్భా న్నైష్కర్మ్యం పురుషోశ్నుతే।
" న చ సన్న్యసనా దేవ సిద్ధిం సమధి గచ్ఛతి.

కర్మములననుష్ఠించినఁ గాని నైష్కర్మ్యం బనంబడు జ్ఞానయోగనిష్ఠ సి
ద్ధింపదు. జ్ఞానము లేక, కర్మపరిత్యాగంబు చేసి సన్న్యసించితినని చో నైష్కర్మ్యము
లభింపదని శ్లోకార్థము. జ్ఞాననిష్ఠయందు సన్న్యాసులకే యధికారమని భగవంతుని
యభిప్రాయము.

దేనియందుఁ గర్మము లేదో యది నిష్కర్మము. దాని భావమే నైష్కర్మ్యము
ఇదియే సన్న్యాసలక్షణము. కర్మములను చేయక పురుషుఁడు [illegible]
కామ్యకర్మములు, విడిచినమాత్రాన నైతఁడు నైష్కర్మ్యమందఁడు. [illegible]

స్థానముచే నంతఃకరణశుద్ధిగలిగి దానివలన జ్ఞానముసిద్ధించినచో సాజ్ఞాన మువలన మోక్షముకలుగగలెను. అజ్ఞానులు కర్మబద్ధులని నైష్కర్మ్య మన మోక్షమని ద్వైతవాదము. జ్ఞానయోగమని యద్వైతవాదము.

ఏకర్మమును ప్రారంభింపకయున్నచో బంధముండదుగదాయనిన నటు కర్మమువదలియుంట గొప్పపాపము. పైగానకలకర్మములు వదలి యుంట స్వభావ విరుద్ధము. అసాధ్యము. జ్ఞానయోగులు కర్మములు వదలుట సాధ్యముకదా యనిన నట్టివారునిష్కామకర్మమొనరించి చిత్తశుద్ధిద్వారా జ్ఞానమార్జించి తద్వారాపర బ్రహ్మమునే జ్ఞానచక్షువుచేఁ జూచుచు పరబ్రహ్మమునందైక్యమందుదురు. అట్టిజ్ఞాన దశయందువారికిబాహ్యప్రపంచము మిథ్యయగును. కావున ప్రాపంచికకర్మములే మిథ్యయగును.

3. ౫. " న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్.
" కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః.

జ్ఞానరహితమయినకర్మ సన్న్యాసమున నైష్కర్మ్యసిద్ధి పురుషుఁడు పొంద నేరఁడు. ఏలయన, అజ్ఞాని ప్రకృతిజన్యంబులగు, సత్త్వరజస్తమోగుణములచేఁ బర వశుఁడయికర్మ మొనరింపబలవంతపెట్టఁబడును. అనఁగా! నూరకయుంట బ్రహ్మని ష్ఠునికిఁ దక్కమఱియెవ్వఱికిని ఘటిల్లదు. సుషుప్తియందుఁదక్క జాగ్రత్స్వప్న ములందెల్లపుడు కాయముచేఁగాని, మనస్సుచేఁగాని, వాక్కుచేఁగాని, చక్షురాదు లచేఁగాని యేదోయొక కర్మమొనర్చుచునే యుండును. సత్త్వరజస్తమోగు ణాత్మకమగు మూలప్రకృతివలనఁ బుట్టినద్రవ్యవాసన, గుణవాసన, కర్మవాసన, జాతివాసన, రాగద్వేషాదులు వీనివలన ప్రేరింపఁబడినవాఁడయి పరవశతనెద్దియో యొకకర్మమొనర్చుచుండును. కావునఁ జిత్తశుద్ధిరహితునకు సర్వకర్మసన్న్యా సంబుఁ గుదురదు. సన్న్యాసముచేఁ గలుగుజ్ఞానమును లభింపదు. కావుననంతఃకరణ శుద్ధిలేనివాఁడు జ్ఞానమును సాధింతుననినట్టివాఁడు మిథ్యాచారుఁడనిన్ని డాంభి కుఁడనిన్ని పిలువఁబడును.

ఈ శ్లోకమునందలి "అవశః" శబ్దమునకు భగవంతునివశుఁడయి యని ద్వైతులర్థముచేసినారు.

3. 6. " కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
" ఇన్ద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే ॥

కర్మేంద్రియములను నిగ్రహించి భగవద్ధ్యానవ్యాజంబున నుండియు విషయములు మానసంబున జలింపఁజేయఁబడు చుండువాఁడసదాచారుఁడు. డాంభికుఁడాత్మవంచకుఁ డగును. కావున మానసేంద్రియముల విషయములపైఁ బో నటుల నిగ్రహింప వలెనని భావము.

3. 7. " యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేర్జున।
" కర్మేన్ద్రియైః కర్మయోగ మసక్త స్స విశిష్యతే ॥

ఎవఁడు జ్ఞానేంద్రియములను నిగ్రహించి ఫలాభిలాష లేనివాఁడయి కర్మేంద్రియములచేఁ గర్మయోగము ననుష్ఠించుచుండునో వాఁడు యధికుఁడని యర్థము. అనఁగా ననాత్మజ్ఞుఁడగువాఁడు కర్మ సన్న్యాసం బొనర్చుటకన్న గర్మ యోగం బనుష్ఠించుట శ్రేష్ఠమని భావము. మోక్షాపేక్షఁ గలిగినంత మాత్రమున సర్వకర్మములను సన్న్యసింపఁ గూడదని సారాంశము.

3. 8. " నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।
" శరీర యాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః ॥

ఏ కర్మము నీకు శాస్త్రముచే విహితమై యున్నదియో, యా కర్మము ఫలాపేక్షనువదలి నీవనుష్ఠింపుము. కర్మత్యాగము కంటెను కర్మానుష్ఠానము శ్రేష్ఠము. కర్మము చేయనేని నీకు దేహయాత్రయైనను సిద్ధింపదు. గుహయందుఁగాని కందర మందుఁగాని యూరకయుండువానికి శరీరయాత్ర యెటుసిద్ధించును? కావున దేహ యాత్రకునైనను కర్మమాచరింపవలెను. విహితకర్మము లాచరించుచు శరీరము రక్షింపవలెను. ఆత్మకు మోక్షార్థమే కర్మమొనరింపవలెను. అన్యార్థముకాదు. జ్ఞాన కర్మనిష్ఠలు రెంటిని వదలుట మూర్ఖలక్షణము. ప్రకృతి సంసర్గము గలవానికిఁ గర్మము తప్పదు. కర్మయోగము సులభము. ప్రమాదము లేదు. జ్ఞానయోగము కర్మయోగమునందంతర్భూతమైనది. శరీరధారణము కొనవఱకు నవశ్యకము. జ్ఞాన యోగమున శరీరధారణము కష్టము. కావున యర్జునా! నీవవశ్యము కర్మయోగ మనుష్ఠింపవలెను. ఏ కర్మమును నాచరింపక సోమరిపోతునిబలె స్తబ్ధుడుగ నుంట కంటెను గర్మమాచరించుచుంట శ్రేష్ఠము. అట్టి కర్మమాచరించుటలోఁ గామ్యకర్మము

కంటెను నిష్కామ కర్మమొనర్చుట శ్రేయస్కరము. ప్రకృతిగుణాధీనుఁడగు వాఁడే కర్మమొనర్పక యుండుట సాధ్యముగాదు. కర్మేంద్రియములనెల్ల నిర్బంధించినచో జ్ఞానేంద్రియము లాకర్మములను జూచుచుండును. మానస మా విషయములనే తలంచుచు సుఖదుఃఖాదు లనుభవించుచుండును. కావునఁ గర్మమొనర్పక స్తబ్ధుఁడుగనుంట సాధ్యముకాదు. ఏ కర్మమొనర్పక స్తబ్ధుఁడుగనుండి మానసము నంతరాత్మ విచారము సేయుచు మోక్షమంద నగునుకదా యని యాక్షేపింపనగును, మాటలతో వాదింప నట్టి విషయము సాధ్యమగునుగాని యాచరణలో నట్టి మార్గము సాధ్యముకాదు. మానసనైర్మల్యము గానక బుద్ధిస్థైర్య మార్జింపక, విషయాదుల జయింపక యట్టి మహానీయస్థితి రావలయుననినఁ బూర్వజన్మ భూరిసుకృత పరిపాక ఫలముండవలెను. అట్టివారిలోకమున నరుదు. మఱియొక యంశము. ప్రపంచమంతయు నిట్టి బ్రాహ్మీస్థితి నందుట సాధ్యమా? కోటికొకఁ డట్టివాఁడుండును. మిగతవారందఱును గర్మములు వదలి నిస్సంగులై యేకాంగులుగ నుండఁగలరా? అటులుండినచోఁ బ్రపంచమే యున్నదని మానవకోటికి దెలియుట సాధ్యమా? పైయంశము లెల్లను జక్కఁగ నాలోచించినచోఁ బ్రతియొకఁడు విధ్యుక్త కర్మాచరణములు గీతలోఁబలికిన విధమున నాచరించుచు సంసారములోనుండియును నుండనటుల నడచి కర్మఫలవాసనాబద్ధుఁడుగాక జీవిని బంధవిముక్తునిఁజేయఁ బ్రయత్నింపవలెనని భగవంతుఁడు బోధించెనట్లగపడెడు. జీవిని బద్ధునిఁ జేయుటకును, బద్ధుఁడగు జీవిని ముక్తునిఁ జేయుటకును గర్మమునకు శక్తికలదు. ఫలమాశించినచో బద్ధునిఁ జేయును. ఫలమాశింపనిచో బంధవిముక్తునిఁ జేయును. ఈ రెండును మానసకాలుష్య నైర్మల్యములపై నాధారపడి యుండును. ఇంద్రియములను జయించుట మానసనైర్మల్యమునకును, నింద్రియములకు లొంగుట మానసకాలుష్యమునకును గారణములు. ప్రతిమనుజుఁడుగాని ప్రతిసంఘముగాని యేకార్యమును జేయకయుండునని మనయనుభవమునందు లేదు. ఎద్దియో యొక కర్మమాచరించుచుండును, అదియెటుల నాచరించుటలో గీతలోఁ బలికినరీతి నిష్కామ కర్మమొనరింప వలెనని భగవంతుని బోధన.

(2) శ్రీరామానుజులవారు "అకర్మణః" యనుశబ్దమునకు జ్ఞానయోగమని యర్థము చేసినారు. మిగత భాష్యకారులు పనిచేయక యుండుటయని యర్థము చేసినారు.

2. 9. " యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మ బన్ధనః॥
" తదర్థం కర్మ కౌన్తేయ ముక్త సఙ్గ స్సమాచర॥

ఫలాపేక్షతోఁ జేయుకర్మమే కర్తృకుబంధ జనకంబగునుగాని ఫలాపేక్ష వదలి యీశ్వరార్పణ బుద్ధితోఁజేయునట్టి నిత్యనైమిత్తికకర్మము బంధజనకంబుఁగా నేరదు. కామ్యకర్మమే బంధకంబగునుగాని యీశ్వరార్పణబుద్ధిచేఁజేయు కర్మమట్టిదికాదని యభిప్రాయము. సాంఖ్యులు సర్వకర్మములు బంధకంబులని పలుకుచుందురు దానిని నిరాకరింప నీశ్లోకము పలుకఁబడినది. " కర్మణా బధ్యతే జంతుః " యనుస్మృత్యర్థమునీ రీతిగసమర్థింపఁ బడినది.

3. 10. " సహ యజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురో వాచ ప్రజాపతిః।
" అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్ట కామ ధుక్ ॥

" యజ్ఞార్థం " అనగా వేదకర్మకుగానని విశిష్టాద్వైతవాదము.
విష్ణుప్రీతికిఁగానని మిగతవారియర్థము.

శ్రీ రామానుజాచార్యులు " సహయజ్ఞై " యనుపాఠమును గ్రహించినారు.

10-లా-13 శ్లోకములవఱకు ప్రజాపతి యజ్ఞవిషయమునఁ బల్కిన వచనములు.

సృష్ట్యాదిని మున్ను ప్రజాపతి ప్రజల యజ్ఞములతోఁగూడ సృజియించి వారి ననుష్టించి మీరు వృద్ధిబొంది కోరిన ఫలము లందుఁడని పలికెను.

3. 11. " దేవా న్భావయతానేన తే దేవా భావయన్తు వః ।
" పరస్పరం భావయన్త శ్శ్రేయః పరమవాప్స్యథ ॥

జనులారా! యజ్ఞమనుష్టించి యింద్రాదిదేవతలను హవిర్దానములచేఁ దృప్తినొందింపుఁడు. ఆ యింద్రాదులు వర్షాదులచే నన్నాదులను గలిగించి మిమ్ముఁ దృప్తినొందింతురు. ఈరీతి వారిని మీరున్ను మిమ్ము వారున్ను దృప్తిపఱచుచుండుటవలన మీకు జ్ఞానప్రాప్తికారణంబున మోక్షము సిద్ధించును. స్వర్గమైనను లభించును.

3. 12. " ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞ భావితాః ।
" తై ర్దత్తాన ప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః॥

మీరు యజ్ఞములచే దేవతల సంతోషింపఁ జేయుదురేని వారు మీకు నిష్టార్థములిత్తురు. ఆ రీతిగ దేవతలొసంగిన వానిని వారికి నర్పింపకయే యెవ్వఁడు భుజించునో వాఁడు దొంగయని తాత్పర్యము. కర్మమొనర్పనిచో గలుగు దోషమీ శ్లోకమునఁ దెలుపఁబడినది. కర్మమొనర్పనివాఁడు పరమపురుషార్థమున కనర్హుఁడగుటయగాక నరకప్రాప్తియగునని భావము.

3. 13. " యజ్ఞ శిష్టా శిన స్సన్తో ముచ్య న్తే సర్వ కిల్బిషైః ।
" భుఞ్జతే తే త్వ ఘం పాపా యే పచ న్త్యాత్మ కారణాత్ ॥

ఈ శ్లోకములలో ననఁగా 11-నుండి-13-వ శ్లోకములవఱకు నీతిబోధనల విషయము మానవు డుపకారికిఁ బ్రత్యుపకారము చేయుచుండవలెనన్ని సర్వ భూత ప్రీతిగఁ కర్మము లొనర్చుచుండవలె ననిన్ని అటు చేయనివాఁడు దొంగ యొక్క యగాక పాపాత్ముఁ డగుననిన్ని తెలుపఁబడినది.

దేవయజ్ఞాదులు నెఱవేర్చి యందు మిగిలినయన్నము నెవ్వరు భుజింతురో వారలు పంచసూనాదుల వలనఁ గలుగు పాపములచేతను ప్రమాదకృత హింసాది జన్యములగు నితరపాపములచేతను విముక్తులగుదురు. ఎవ్వరు తమ శరీరము నిమిత్తము మాత్రము పాకము చేయుదురో వారు తాము పాపులగుటయగాక పాపమునే భుజించు చున్నారని యభిప్రాయము. యజ్ఞశిష్టాశినులన, దేవయజ్ఞాదులను నిర్వర్తించి దానన్మిగిలినదానిని భుజించువారు యజ్ఞశిష్టాశులు; వీరు పంచసూనాదులవలనఁ గలుగు పాపమును నాశన మొనర్తురు. పంచసూనలనఁగా, చుల్లి, పేషణి, మార్జని, కండని, కుంభము. కండనిన రోలు: పేషణి యనఁగ సన్నెకల్లు; చుల్లియనఁ బొయ్యి; కుంభమనఁగ నీటికుండ; మార్జని, చీపురుకట్ట; ఈ యయిదు సూనలు మనుజుఁడు తెలియక చేయుచుండును. ఇవిప్రమాద కృతహింసా జన్యములగు పాపములు. ఈ ప్రమాదకృతహింసా జన్యపాప పంచకమునుఁ దొలఁచునవి దేవ, పితృ, భూత, మనుష్య, బ్రహ్మయజ్ఞములు; ఈపంచయజ్ఞకర్మములు నిత్యకర్మములుగ నొనర్చుచు, పైపాపములను నశింపఁ జేయవలెనని యభిప్రాయము.

11-12-13-14 శ్లోకములందుఁ గర్మములచే దేవతలను దృప్తినందింపుఁడి యని తెలుపఁబడినదిగాని ఫలమునాశించి యజ్ఞమొనర్పుడియని బోధింపఁబడలేదు. కావున ఫలము నపేక్షింపక బ్రహ్మార్పణముగ యజ్ఞమొనర్చినచో మేలగునని బోధింపఁబడినది.

3. 14. " అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్న సంభవః ।
" యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః ॥

భుక్తమై శుక్రశోణిత రూపమునఁ బరిణమించిన యన్నమువలనఁ బ్రజలు పుట్టుచున్నారు. అట్టియన్నము వర్షమువలనఁ బుట్టుచున్నది. వర్షము యజ్ఞమువలనఁ గలుగుచున్నది. యజ్ఞము ఋత్విగ్యజమానాది వ్యాపారరూపమయిన కర్మమువలన సంభవించుచున్నదియని తాత్పర్యము. " అగ్నౌ ప్రాస్తాహుతిస్సమ్యగాదిత్యముపతిష్ఠతే '' ఆదిత్యాజ్జాయతే వృష్టిర్వృష్టే రన్నంతతః ప్రజాః ॥ యను స్మృత్యర్థమీ శ్లోకమునఁ జక్కఁగఁ దెలుపఁబడినది.

3. 15. కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్ ।
తస్మాత్సర్వ గతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥

కర్మము వేదముచే బోధితమగుచున్నది. ఆవేదము పరమాత్మవలన పురుషనిశ్వాసమువలె నావిర్భవించినది. ఇట్లు సర్వకారణమయిన పరమాత్మవలనఁ బురుష నిశ్వాస రూపంబున లోకోపకారార్థము వేదము ప్రవర్తించినది. ఆ వేదము యజ్ఞకర్మములందు ముఖ్యముగఁ బ్రతిష్ఠింపఁ బడినది కావున యజ్ఞకర్మము లవశ్యకముగ ననుష్ఠింపవలెనని యభిప్రాయము.

బ్రహ్మశబ్దము వేదమునిన్ని అక్షరశబ్దము పరబ్రహ్మ మనిన్ని శంకరాచార్యుల యర్థము. బ్రహ్మశబ్దము పరమాత్మ యనిన్ని అక్షరశబ్దము వేదమునిన్ని శ్రీ మధ్వాచార్యుల యర్థము

బ్రహ్మయనగా శరీరమనిన్ని అక్షరమనఁగా ఆత్మ యనిన్ని విశిష్టాద్వైతుల యర్థము.

11- 15. వఱకుఁగల శ్లోకార్థములు ప్రజాపతిచే బలుకఁబడినవి.

3. 16. " ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ॥
" అఘాయు రింద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥

వేదములను యజ్ఞములను ప్రవర్తింపఁజేసి పరమేశ్వరుఁ డేర్పఱచిన జగచ్చక్రము నెవ్వఁడీ లోకమున ననువర్తించి జరిగింపఁడో యతఁ డింద్రియవశుఁ డగుటంజేసి యతనిజీవనము పాపిష్ఠము వ్యర్థము నగును. కావున నాత్మజ్ఞాననిష్ఠా యోగ్యత సిద్ధించుటకును తదర్థమై కర్మయోగానుష్ఠానము చేయవలెనని యభిప్రాయము.

3. 17. " యస్త్వాత్మ రతి రేవ స్యా దాత్మ తృప్తశ్చ మానవః ।
" ఆత్మన్యేవ చ సన్తుష్ట స్తస్య కార్యం న విద్యతే ॥

ఆత్మవిదుఁడగు నే సన్న్యాసి యాత్మయందే రతిగలిగి యాత్మచేతనే తృప్తిఁ బొందువాఁడై యాత్మచేతనే సంతోషించువాఁడయి సర్వవిషయములందును నత్యంత విరక్తుఁడై యుండునో యట్టివానికి మాత్రము చేయవలసిన దేమియును లేదని తాత్పర్యము.

బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానాగ్నిచే నిర్మూలంబగు ద్వైతభ్రమగలవాఁడు సర్వమును బ్రహ్మగానే చూచుచుండును. జీవన్ముక్తదశ వానికిఁ గలుగును. అట్టివానికిఁ గర్మానుష్ఠానమునఁ బ్రయోజనంబు లేదని యభిప్రాయము. అట్టిస్థితి కలుగునంతవఱకును, గర్మమును జేయుచుండవలెనని భావము. అట్టి కర్మములొనర్చుటలో భగవంతునిఁ గూర్చి నియతకర్మములొనరించుట శ్రేష్ఠమని తొమ్మిదవ శ్లోకమునుండి పదునేడవ శ్లోకమువఱకును దెలుపఁబడినది. నియతకర్మములనఁగా నిత్యనైమిత్తికములు యజ్ఞాదులు, ఇవి ప్రారంభమునఁ బ్రపంచమును నుద్భవించిన కారణములు నాచే వ్రాయఁబడిన ఋగ్వేదోపన్యాసములోఁ గడపటిదియగు "మతవిషయమున స్వాభిప్రాయ" మనైదియుపన్యాసలో హెచ్చుగ వ్రాసినాను మఱలదానిని నిచ్చట వ్రాయనేలయని వదలినాను. భగవంతుని ముఖ్యోద్దేశము మానవుఁడు కార్యమొనరించినను తత్ఫలమీశ్వరార్పణముగు గాత మనుబుద్ధితో నొనర్పవలెనుగాని యాత్మలాభైకపరుఁడయి యొనర్పఁ గూడదనియును గర్మమొనర్పక యుండఁగూడదనియును తెలుపుట. ఈశ్వరార్పణమనఁగాఁ బ్రపంచార్థమని యభిప్రాయము. ఒకఁడొనరించిన కర్మఫలము సకలురకు నుపయుక్తముగ నుండవలెను. యజ్ఞాదులలోఁ దనకు స్వర్గసుఖము రావలయునని కర్మము లొనరించినను బహుజనులకు దానినుండి ద్రవ్యాన్నాది లాభములు కలుగుచున్నవి. కర్త స్వార్థత్యాగమొనరించును. భూత ప్రీత్యర్థము బలులిచ్చును. తత్కాలమంతయు వఱకుఁ దనమానసము చలింపనటుల నేకాగ్రచిత్తుఁడయి యుండును. కామ్యార్థము ప్రారంభించినను మనోదార్ఢ్యమునఁ బరిణమించి కర్తకుఁ జిత్తనైర్మల్యము గలుగుటకుఁ గారణమగును. స్వలాభమునకునై యొనరింపఁబడు ననేకకర్మముల భ్యాసవశమున సర్వజన ప్రయోజకమై సహజముగఁ బరిణమించునని శాస్త్రజ్ఞుల సిద్ధాంతము. "***All truisam is Evolved from Egoism***"

అని పాశ్చాత్యులలో వాడుక. పంచయజ్ఞములఫలము భూతతృప్తికిఁగాను బలులివ్వడ
మేకదా. హిందుమతాచారములలోఁ గర్తకునేకకోరికయున్నను సర్వజనోపయుక్త
మగు స్వార్థత్యాగగుణముహెచ్చుగనుండును గావున నట్టికర్మములు మాత్రము
జీవిని బంధింపవని బోధింపఁబడినది. ప్రతియొకమనుజునిజన్మము సంఘాభి
వృద్ధికిఁ గారణమయియుండవలెనని భగవంతునిముఖ్యోద్దేశము. అటులొనరింపని
వానిజననము వ్యర్థమని " ఏవంప్రవర్తితంచక్రం " అనుపదునాఱవ శ్లోకమునఁ
బరిష్కారముగఁబలుకఁబడినది. మఱియొకటి, దైవమను గ్రహించి యిచ్చిన ధన
ధాన్యాదిభోగములు దేవతారాధనకు నుపయోగింపనివారు కృతఘ్నులు దొంగ
లని పంద్రెండవశ్లోకముననున్నది. పై శ్లోకములలోని యజ్ఞశబ్దము మనవారొనరించు
యాగ జ్యోతిష్టోమాది యజ్ఞములకే యన్వయించునని యర్థము చేయరాదు. భూత
కోటిప్రీత్యర్థమున్ను, సమస్తదైవతా ప్రీత్యర్థమున్ను జేయంబడు సమస్త కర్మములకు
నన్వయించును. భారత యుద్ధము నైతము దేవతాప్రీత్యర్థమున్ను ధర్మరక్షణాభి
వృద్ధ్యర్థమున్ను చేయఁబడుయజ్ఞమనిన్ని భావింపవలెను. కావేని భగవంతుఁడర్జు
నునకు బోధించుకర్మయోగము విషయములోని కేవలవైదిక కర్మ విషయమును
జేర్చుచుండలేదు. ఈ యజ్ఞవిషయవిచారము జైమిని పూర్వమీమాంసమునుండి
యెత్తఁబడినదని నేను నమ్మినాను.

18. " నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన
" నచాస్య సర్వభూతేషు కశ్చి దర్థ వ్యపాశ్రయః॥

ఆత్మరతియగు బ్రహ్మవిదునకుఁ గర్మముఁ జేయుటచేఁ బ్రయోజనమేమియు
ను లేదు. చేయకుండుటచే ననర్థముగూడ నేదియును సంభవింపదు. మఱియునతనికి
బ్రహ్మాదిస్థావరాంతములవఱకుఁ గల భూతములలో దేనినిఁగాని యాశ్రయించి
సాధింపవలసిన ప్రయోజనమేమియును లేదు. కావున నాతనికిఁ గర్మము సంభవిం
పదు. అట్టి వానికి నిరంతర బ్రహ్మానంద రసానుభవము విచ్ఛిన్న మగుటవలనను
గర్మజన్య సుఖ మనిత్య మగుటవలనను బ్రహ్మవిదుండు దాని నపేక్షింపఁడు. నిత్య
నిరంతర బ్రహ్మనిష్ఠచే భవిష్యద్దేహమును గలిగించు నజ్ఞానమును దత్కార్యమగు
సంచితాది సమస్తకర్మ సమూహంబునుగూడ నిర్మూలించి తాను దేహసంబంధము
లేనివాఁడుగానే యెల్లప్పుడు నుండువాఁడగుటవలన బ్రహ్మవిదునకు నిచటనే
ముక్తి కలుగును. కావున బ్రహ్మవిదుఁడగు ముక్తునకు నెప్పుడు నెట్టియు గర్మము

చేయవలసినది లేదని తాత్పర్యము. కర్మముఁ జేయవలసి యుండునేని నతఁడు బ్రహ్మవిదుఁడేకాఁడు. జ్ఞానామృతేన తృప్తస్య, కృతకృత్యస్య యోగినః । నైవాస్తి కించిత్కర్తవ్య, మస్తిచేన్నస తత్వవిత్ ॥ యని స్మృతి ప్రమాణము.

17. 18. శ్లోకములలోవర్ణింపఁబడినని నిర్వికల్పక సమాధియందుండు స్థితప్రజ్ఞునకు నన్వయించును. ఈవిషయమున భాష్యకారులు తమలోఁ దాము భిన్నవాదము లాడుచు వచ్చినారు. " సర్వభూతేషు " యనుశబ్దమునకుఁ బంచభూతములనివిశిష్టాద్వైతులర్థము చేసిరి. దేవాదులనియద్వైతులర్థము చేసిరి.

పరమనఁగా ఆత్మయని విశిష్టాద్వైతార్థము. పరమాత్మయని ద్వైతార్థము. అద్వైతులకు నాత్మయు బరమాత్మయు నొక్కటి కావున రెండర్థము లొక్కటియేయని సమాధానము.

ఈ శ్లోకమున " తస్మాత్ " యను పదముండు కారణంబున 16-17-18 శ్లోకములోని జ్ఞానినైతము కర్మయోగ మాచరింప వలసినదేయని తిలకుగారర్థము చేసినారు.

3. 19. " తస్మా దస క్త స్సతతం కార్యం కర్మ సమాచర॥
అసక్తో హ్యా చరన్కర్మ పరమాప్నోతి పూరుషః॥

అర్జునా! పైనఁబలుకఁ బడినట్టి సమ్యగ్దర్శనుఁడవు నీవుకావు. కావున నీవు నిత్యనైమిత్తికకర్మములను ఫలాభిసంధిలేక యవశ్యము చేయవలెను. అటులొనరించినచోఁ జిత్తశుద్ధినొంది తద్ద్వారమున మోక్షము నొందుచున్నావు. యోగారూఢుఁడును ముక్తుఁడును, నాత్మారాముఁడును నగుయతిమాత్రమె కర్మము చేయవలసినదిలేదు. ఆరురుక్షుఁడవు ముముక్షువు నగునీవో కర్మము చేయవలసిన వాఁడవేను. ఎందు కనఁగా ధర్మకర్మానుష్ఠానమువలనఁ బాపక్షయ మగుననిన్ని పాపక్షయమువలనఁ జిత్తశుద్ధి కలిగి, జ్ఞానము కుదురుననిన్ని జ్ఞానమువలన మోక్షము గలుగుననిన్ని శ్రుతిస్మృతు లున్నవి.

3. 20. " కర్మణైవ హి సంసిద్ధి, మాస్థితా జనకా దయః॥
" లోక సఙ్గ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి॥

అర్జునా! కర్మము లాచరించు చుండియేకదా జనకాదులగు పూర్వక్షత్రియులు మోక్షమునందరి. అందువలన నీవును గర్మము చేయవలెను. లోకసంగ్రహ

ము గొఱ్ఱెకైనను నీవు కర్మ మనుష్ఠింప వలెనని, శ్లోకార్థము. ఆత్మతత్త్వము తెలి
యని ముముక్షువు కర్మమును జేయవలెనని తెలియఁజేయుచు దృష్టాంతములుగ
జనకాశ్వపతిభగీరథాదులను జెప్పెనినాఁడు. జనకాదులు జ్ఞాననిష్ఠచే ముక్తుల
యినను లోకసంగ్రహార్థము కర్మములాచరించు చుండిరని భావింపుము. గీతలోని పదు
నేడవ శ్లోకము నుండి యిరువదియవ శ్లోకమువరకు నుండుశ్లోకముల తాత్పర్యమేమ
నిన; బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానముఁ గలవాఁడు కర్మమాచరింప నగత్యమేమియును లేదు.
అలయన వాఁడు బ్రహ్మ విదుఁడు కావున బంధవిముక్తుఁడు; కర్మములాచరించుట
బంధవిముక్తికేగాను. కావున బంధవిముక్తి యయినవాఁడు కర్మములాచరింప నక్క
రలేదు. నీవట్టి వాఁడవు కావు గావునకర్మ లొనర్పుమని యర్జునునకు బోధించెను. ఎం
తవఱకు నీకర్మాచరణ మొనర్పవలయు ననిన బ్రహ్మవిదుఁడగు నంతవఱకునని పలుక
నగును. అప్పటికిని లోకసంగ్రహార్థముసైతము కర్మమొనర్ప వలెనని కృష్ణుఁడు
బోధించుచు జనకాదుల దృష్టాంత మొక్కటియ యిచ్చుటయుగాక, తనదృష్టాంతము
సైతము దెలిపెను. అర్జునా! కర్మములొనర్పక యున్న మోక్షము సిద్ధింపదు. లోకసం
గ్రహార్థమయినను గర్మములాచరింపవలెను. లోకసంగ్రహ మనఁగాఁ బామరజను
లకు సత్కర్మమార్గముఁ జూపి తరింపఁ జేయడము. దుర్మార్గమునుండి నివారించ
డము. జీవికిఁగల బంధమెటు తప్పింప సాధ్యమని ప్రశ్నింపఁ గర్మాచరణమను మథ
నకర్మముచేఁ జిద్వస్తువును వెలికిఁ దీయనగునని సమాధానము. ఎటులన " సర్పిరస్తి
పయసీక్షు " గోరసస్సైనల మస్తితిల మధ్యపవతత్ " లభ్యతేమథన యంత్రకర్మణో
కర్మణోహృదిగతా తథైవచిత్. క్షీరమునందు నేయికలదు, చెఱకునందు రసముగ
లదు. నువ్వులయందు నూనెకలదు. వీనినిఁ బొందవలెననిన మథనకర్మ మెటులవశ్య
కమో యటులనే హృదయ గతమగు చిద్వస్తువు నందఁగర్మాచరణమావశ్యకమని
తెలియవలెను. మిథిలాధిపుఁడగు జనకుఁడు బ్రహ్మజ్ఞాని. బ్రహ్మజ్ఞానులలో నగ్రగ
ణ్యుఁడని పలుకనగును. సకలవైభవముల నున్నతికెక్కిన దేశాధిపతి, రాజ్యభా
రము దుర్వహమని సకలురెఱింగిన విషయమేను. బ్రహ్మవిదుల నేకులుండినను వారు
సర్వసంగ పరిత్యాగులయి, సర్వ కర్మములుమాని మానస దార్ఢ్యమునకునై చాం
చల్యము కలుగనటుల యుండుట విశేషము కాదు. నుతింపఁదగిన విషయమంతగ
నుండదు. రాజాధిరాజుగ నుండియు, సకలైశ్వర్య సమేతుఁడయ్యును, సకలభోగ్య
వస్తువులుండియు, రాగద్వేషాదుల నుజ్జగించి, యహంకారమమకారములు మాని,

నిష్కామకర్ముఁడగు సంసారములో నుండియు నుండనటుల జీవయాత్రజరిపి మోక్షమందెను. ఈజనకమహారాజునిఁజూచి తద్రాష్ట్రీయు లెల్లరును జ్ఞానులైరి. ఈజనకరాజును గుఱించిన గాథలనేకము లున్నవి. ఈజనకుని దృష్టాంతము వలన మన కెఱుఁగఁ దగినది యేమనఁగా మానవజన్మము, పశుజన్మాదులవలె నాహార విహారములతో సంతుష్టి నందియుండఁ గూడదనిన్ని యాత్మవిదుఁడయి మోక్షమార్గావఁ బ్రయత్నింప వలెననిన్ని తనమోక్ష మొక్కటికే యత్నించువాఁడు స్వార్థపరుఁడగును గావున తనకుఁగల జ్ఞానముచేతను, తన నైతిక ప్రవర్తనచేతను నితరులను నైతము బ్రహ్మవిదులను జేయవలెననిన్ని యట్టి బ్రహ్మవిదునకే మోక్షము కరతలామలకంబుగ నుండుననిన్ని స్పష్టమగుచున్నది. ఇదే యర్థము నే ముందు శ్లోకములు దెలుపుచున్నవి.

3. 21. " యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః।
" స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే॥

ఉత్తముఁడగు వాఁ డేయేకర్మము ననుసరించునో, దానినే యితరులు గూడ ననుష్ఠింతురు. మఱియు వాఁడు దేనినిఁ బ్రమాణముగ గ్రహించునో యితర జనులు దానినే ప్రమాణముగ గ్రహింతురు.

ప్రపంచంబునఁగల జనులు తమలోఁ శ్రేష్ఠుఁడగువాఁడేయేకర్మంబు లాచరించునో యా కర్మంబులే యుత్తమకర్మంబులని నమ్మి వానిమార్గమునే యను సరించు చుందురు. ఇది మనయనుభవములో నున్న విషయము. ఇటు లుండుటకుఁ గారణంబు లనేకములున్నవి. 1. బుద్ధిమాంద్యము 2. బుద్ధినుపయోగించు శక్తి లేమి 3. బుద్ధి నుపయోగింప నిష్టములేమి 4. పెద్దలమార్గ మనుసరించుట యందుఁ గష్టమేమియును లేదను నమ్మకము 5. మహనీయులయారాధనము నందలి భక్తి; ఇట్టి కారణములచే జనులుత్తములని తాము నమ్మినవారి మార్గములనే యనుస రించి నడచు చుందురు. ఉత్తములగు వారు తమయుత్తమ గుణములచే నితరులకు మార్గదర్శకులయి యుండవలెను. మహనీయులగు వారు సకల కర్మములను వదలు టచే జనులకుఁ గేవల మపకార మొనర్చినవారగుదురు. దానిచే వారిమోక్ష మున కించుక యంతరాయము కలుగును. ఈ మార్గములెల్ల నాలోచించి బ్రహ్మ విదుఁడు నైతము గర్మములు లోకసంగ్రహార మొనర్చు చుండవలెనని భగవం

తుఁడు బోధించెను. బ్రహ్మవిదులయి లోకసంగ్రహార్థము కర్మ మొనరించినవారి విష యము మనపురాణములలోఁ బలుకఁబడినది. గౌతమబుద్ధుఁ డిట్టివాఁడేను' తన సామ్రాజ్యమంతయును వదలి బ్రహ్మవిదుఁడయి లోకులజ్ఞానవారిధిలోఁ బడి మునిఁగిపోవుచున్నారని తెలిసి, దేశ దేశములును దిరుగుచు జనులకు పారమార్థిక విషయములు బోధింపసాగెను. బ్రహ్మవిదులగు మన స్వాములవారున్నైతే యిట్టి పారమార్థిక విషయములు పామరులకు బోధించుచుండవలెనని భగవంతుని యుప దేశము. ఈ రీతిగ బోధించి భగవంతుఁడు తనవిషయము నైత మించుక తెలిపి నాడు.

3. 22. " నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన "
" నా నవా ప్త మవా ప్తవ్యం వర్త ఏవచ కర్మణి "

పార్థా! నాకు మూడు లోకములందును జేయవలసిన దేమియును లేదు. పొందనివస్తువును బొందవలసియున్నంగదా చేయవలసినది యుండును. అవాప్త సర్వకాముఁడ నగుటచే నేఁ గోరఁదగినది యేమియును లేదు. ఈ రీతిగ నున్న వాఁడయినను నేను గర్మము ననుష్ఠించుచు నున్నాను. లోకసంగ్రహార్థ మటుల చేయుచున్నాను గాని నాకుఁ గాను కాదు.

ఉత్తములగు వారు గర్మముల ననుష్ఠింపవలె ననుటకుఁ గారణములు పైనఁ బలికియుండినను భగవంతుఁడు మఱలఁ దనదృష్టాంతము చెప్పుటకుఁ గారణ మేమని యడుగనగును. జనకాదులు జననమంతోనే కర్మబద్ధులయి పుట్టినవారు కావున బంధవిముక్తికేఁగాను గర్మము లాచరించుట యవశ్యకముగ నుండెను. భగవంతుని విషయ మట్టిదికాదు. అతని జన్మము మానవజన్మముకాదు. స్థూల సూక్ష్మ దేహములు మానవులబలె నతనికి జన్మముతోనే పుట్టలేదు. జ్ఞానేంద్రియ కర్మేంద్రియాది దేహతత్వము లతనికి సహజములుగ నుండునవికావు. తత్కారణ మునఁనే యతనికి శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వములు బాధలులేవు. జీవినిఁ గర్మ బంధములనుండి తప్పింపవలెననెడి యావశ్యకత నతనికి నుండదు. తన మాయా బలమున మానవవేషంబు ధరించి మానవునిఁబలె నటించువాఁడతఁడు. ఇటుల నటిం చుటకుఁగల కారణంబులు ముందు తెలుపఁ బడును.

3. 23. " యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్య తన్ద్రితః
" మమవర్త్మాను వర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః

3. 24. " ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్

" సఙ్కరస్య చ కర్తా స్యా ముప హన్యా మిమాః ప్రజాః

అర్జునా! నే నొకా నొకప్పుడు నలసట లేనివాఁడ నగుచుఁ గర్మములను జేయకుండ నుండు వాఁడ నైతినేని మనుష్యు లందఱు నన్నివిధముల నా మార్గమునే యవలంబింతురు. నేనే కర్మములను జేయకుండ నుండువాఁడ నైతినేని యీ లోకు లందఱును జెడిపోదురు. సంకరమును జేసినవాఁడ నగుదును. అందువల్ల జనులనందఱిని పాడుచేసినవాఁడ నగుదును.

అర్జునా! నేను సత్యసంకల్పుఁడను. పూర్ణకాముఁడను. కావున జనులలో నే నుత్తమోత్తముఁడని యనికొని యెల్లవారును నా మార్గమునే యన్నివిధముల ననుసరింప యత్నించు చున్నారు. నాకుఁ గర్మబంధములేదు కావున దాని విమోచనార్థము కర్మ మొనరించుటకు నేను బద్ధుఁడను కాను. అయినను నేను గర్మములు వదలినచోఁ బామరులు తాము గర్మములు మానవనగునని యందఱును విధ్యుక్త కర్మములు మాని బ్రహ్మవిదులు కాకనే సన్న్యాసులగుదురు. దీని నుండి ప్రపంచాభివృద్ధిలేక లోకక్షయమునకుఁ గారణమగును. పెద్దవారినిఁజూచి పిల్లవారు వారిమార్గ మనుసరించుట లోకసహజము.

" గతానుగతికో లోకః నలోకః పారమార్థికః ।

" గంగాసైకత లింగానాం నష్టం మే తామ్ర భాజనం ॥

మను గాథయున్నది కదా; యతి యొకఁడు తన రాగిచెంబును భద్రపఱచుటకయి గంగానది యిసుకలోఁ బూడ్చి గుర్తుకుఁగాను దానిపై నొక లింగమును జేసియుంచెను. అతఁ డిసుకతో లింగమొనర్చినది దూరమునసున్న జనులుఁజూచి తామును నటులొనర్చుటయే ధర్మమేమోయని తలంచి యా జనులు ప్రతివారు నొక్కొక్క లింగమొనర్చి యుంచిరి. తుదకు యతి తానొనర్చియుంచిన లింగమే తాను గనలేక పైశ్లోకము వచించెను. కావున పామరజనులు పెద్దవారి మార్గము, మేకదాటువలె, ననుసరింతురుగాని యుక్తాయుక్తము నైతము విచారింపరు, కావున నుత్తములగువారు సన్మార్గప్రవర్తకులయి ధర్మకర్మము లాచరించుచు పామరుల ప్రవర్తనలకుఁ బురోగాములయి యుండవలెనని భగవంతుని యభిప్రాయము.

3. 25. " సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత ।

" కుర్యాద్విద్వాంస్తథాఽసక్తశ్చికీర్షుర్లోకసఙ్గ్రహమ్ ॥

అర్జునా! మూఢులు కర్మఫలము నందాసక్తులై కర్మముల నెట్లు చేయు చుందురో యట్లు విద్వాంసులు కర్మ ఫలాపేక్ష లేనివారయి లోక సంగ్రహార్థము కర్మమును జేయవలెను.

ఇచట విద్వాంసులన నాత్మవిచార మెఱింగిన వారనియు నవిద్వాంసులన నాత్మవిచారము తెలియనివారనిన్ని యర్థముగాని శాస్త్రములు చదివినవారని గాని శాస్త్రములు చదువనివారని గాని యర్థముగాదు. చదివినవార నేకులు మలిన చిత్తులయి యరిషడ్వర్గములకుఁ జిక్కి విషయాదులచే సొక్కి స్వార్థైకపరులై పర శ్రేయోలాభముల నోర్వక కర్మబంధములు హెచ్చించుచు నైహికమున సుఖానుభవులని తోఁచుచున్నను పారమార్థికమున సుఖదూరులగు వారున్నవారు. వారి విషయ మిచటఁ బలుకఁ బడలేదు. శాస్త్రజ్ఞానములేక స్వాభావికముగఁ బార మార్థిక విషయమునఁ బాటుపడు పామరులు కొందఱున్నవారు. అట్టివారి విషయము నైత మిందుఁ జర్చింపఁ బడలేదు. నిజమగు విద్వాంసులును, పారమార్థిక బుద్ధిలేని పామరుల విషయము నిందుఁ జర్చింపఁ బడినది. అట్టి పామరులు కేవల తామస రాజస గుణాధీనులయి స్వలాభమునకును సోదర పోషణార్థమునకును సాహసించుచుందురు. మాథ్యూ ఆర్నాల్డుగారు వ్రాసిన రగ్బీ ఛాపల్ యను పద్య గ్రంథములోఁ బలుకబడిన మొదటి రెండవతరగతుల మనుజుని బోలిన వారే యిందుఁ బామరులని పలుకఁబడినది.

3. 26. " న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మ సంగినామ్ ।
" జోషయే త్సర్వ కర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్ ॥

కర్మఫలముల యందాసక్తిగల మూఢులబుద్ధిని యాత్మజ్ఞానము కలవాఁడు చలింపఁ జేయరాదు. విద్వాంసుఁడు తాను మాత్రము హెచ్చరికతోఁ గర్మములొనర్చుచుఁ బామరులకుఁ దృష్టి గలిగించు చుండవలెను. పై శ్లోకములో వచింపఁబడిన పామరులకు నెటు సత్ప్రవర్తనము బోధింపవలెనను విషయ మీ శ్లోకంబున సూక్ష్మముగ సూత్రప్రాయంబుగఁ దెలుపఁబడినది. పరోపకార బుద్ధిగల ప్రతి విద్వాంసుఁడును పామరజనుల నీతిప్రవర్తనమును గుఱించిన్ని, బుద్ధికౌశల్యమును గుఱించిన్ని, యైహిక పారమార్థిక విషయములను గుఱించిన్ని, వారెటు లభివృద్ధిఁ జెందవలెననునదిన్ని మనమున నాలోచించుచుండును. అటు లాలోచించి పలు

ప్రుచ విద్వాంసులు పలుతెఱంగు లాలోచించిరి. అవి యెవ్వియన: (1) విద్వాంసుఁడు తన మార్గమునే యనుసరింపుఁడని యల్పబుద్ధులగు వారిని బలవంతపెట్టుట, (2) విద్వాంసుఁడగు వాఁడు తనయధికార సుఖాదులనెల్లఁ బరిత్యజించి నిస్సంగుఁడయి సర్వకర్మములను వదలియుండుట. ఇట్టి తన్నుఁజూచి పామరులు సైత మా మార్గమునే యవలంబింప వలెనని కోరుట. (3) విద్వాంసుఁడగు వాఁడు పామరుల నీతిప్రవర్తనమును బుద్ధిబలమును గనిపెట్టి యెటుబోధించినచో వారి యభివృద్ధికి మార్గమగునో దాని నాలోచించి యట్టి మార్గమునే యవలంబించుట. (4) విద్వాంసుఁడగువాఁడు పామర సంఘములోఁ జేరి సంఘములో నొకఁడయి వారి మైత్రినంది వారిలో గౌరవమార్జించి పిదప క్రమముగ వారికి మెల్ల మెల్లఁగ హితములు బోధించుచు వారిని నుద్ధరించుట. ఇట్టి మార్గము లనేకములున్నవి. పై మార్గములలో మొదటి మార్గము బలవంతము. ఈ మార్గమును తురుష్కులును బదునెనిమిదవ శతాబ్ద మధ్యమునందును పాశ్చాత్యులు నవలంబించి యుండిరి. ఉపయోగ రహితమాయెను. పైనఁ బలికిన రెండవమార్గము హిందువులలో సన్న్యసము. శ్రవణ మనననిదిధ్యాసముల చేతను యోగాభ్యాసము చేతను చిత్తశుద్ధిఁగాంచి యంతర్ముఖుఁడై నిస్సంగుఁడయి కూర్చుండడము. ఈ మార్గమునే పామరజను లవలంబించినచో హానియున్నది. ప్రారంభమునఁ బామరజను లాలోచింపక సన్న్యాసము సుఖమనియును సంసార కష్టపరిహారకమనియు దలంచి సన్న్యాసులగుదురు. పిదప నా యాశ్రమ ధర్మముల నోర్వలేక కష్టపడుదురు. మఱలఁ దమ పూర్వాశ్రమమునకు రాను మార్గములేనందునఁ బతితులయి బాధపడుదురు. హిందువులలో సన్న్యాసాశ్రమమును బోలినది బౌద్ధులలో భిక్షుల యాశ్రమము. వీరిరువురికి భేదమేమన భిక్షులు తమ యాశ్రమధర్మము ననుసరింపఁ గష్టమని తలఁచిరేని మఱలఁ దమ పూర్వాశ్రమమునకు రానగును. హిందువుల సన్న్యాసాశ్రమ మట్టిది కాదు. హిందూ విద్వాంసుఁడు విషయ విముఖుఁడయి యరిషడ్వర్గములను జయించి మనోనైర్మల్యమును సంపూర్ణముగఁ గనిన పిదప సన్న్యాసి కావలయునుగాని యట్టి దృఢమానసము లేనివారు సన్న్యాసత్వముఁ బొందఁగూడదను నిబంధనలున్నవి. విద్వాంసుఁడు పై రీతిగఁ దాను సన్న్యాసియై మిగతవారు తనమార్గ మవలంబింపఁ జేయుట యందపాయము లనేకములున్నవి. కావున నిట్టి మార్గమును భగవంతుఁడు బోధింపఁడు. ఇఁక మూడవ మార్గ మేమన విద్వాంసుఁడుపన్యాసముల మూలకమున నీతివిధులను నాత్మ

విచార మార్గములను బోధించడము. అట్టి బోధన ఫలమేమనఁ గొంతవఱకు జ్ఞానమున్నవారు చక్కఁబడుదురు. మిగతవారి మానసము లందనేకములుగ సందేహాము లుద్భవించి యంతకుమున్ను తమకు నుండిన దృఢతాత్పర్యమునకుఁ జాంచల్యముఁ గలిగి నూతన బోధన సంపూర్ణముఁగఁ బట్టుపడక రెంటికిసిఁ జెడుట. ఈ మార్గమున మేలును గీడును రెండును గలవు కావున భగవంతుఁడు బోధించిన మార్గమేమన; బ్రహ్మవిదుఁడగు విద్వాంసుఁడు పామరసంఘములోఁ జేరి వారిలోఁ దానొకఁడయి వారి మనోదార్ఢ్యము బుద్ధిబలము, మతవిషయమునందలి పట్టుదల నైతికవిషయము యీ మొదలగు విషయములనుఁ జక్కఁగ నెఱింగి సమయము తటస్థించినపు డంతయును వారికిఁ గొంచగొంచముగను వారికిఁ దృప్తికరముగను బోధించుచుఁదాను స్వార్థైక పరుఁడుగాక నిష్కళంకవృత్తిని ధర్మకర్మము లాచరించుచుండినచోఁ దనతోఁ జేరిన పామరసంఘ మన్నివిధముల నభివృద్ధిఁ జెందును. దానినుండి లోకోపకార మగునని భగవంతుఁడీ శ్లోకార్థమును పలికెను. విద్వాంసుఁడు స్వార్థైకపరుఁడుగాఁ గూడదనుటకుఁ గల కారణము లెవ్వియన:—

3. 27. ప్రకృతేః క్రియామాణాని గుణైః కర్మాణి సర్వశః॥
" అహఙ్కార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే. "

3. 28. " తత్వవిత్తు మహా బాహో; గుణకర్మ విభాగయోః
" గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వానసజ్జతే.

27. 29 శ్లోకములలోని ప్రకృతిశబ్దమునకు [1] ప్రకృతి [2] ఆత్మ [3] పరమాత్మయని ద్వైతుల యర్థము. పరమాత్మ యొక్క ప్రేరేపణమున ప్రకృతి తనసాత్విక రాజస,తామస గుణములచే మానవులను నాయాగుణార్హములగు పనులను చేయించుచుండును. ప్రకృతిగుణముల కేపనులు చేయించు శక్తి లేదనివారివాదము.

" గుణాగుణేషువర్తన్తే" యనువాక్యమునకు నింద్రియములు విషయములలో బ్రవర్తించుచుండునని యర్థముచేసిరి. " ప్రకృతి " అచేతన పదార్థము కావునపరివర్తించుశక్తి దానికి లేదనిన్ని ఆత్మకు నాస్వాతంత్ర్యమున్న దనిన్ని వారివాదము. విశిష్టాద్వైతులు గుణమునకు సాత్వికరాజస తామస గుణములని యర్థముచేసి మిగతవిషయమద్వైతులతో నేకీభవించుచున్నారు

3. 29. “ ప్రకృతే ర్గుణ సమ్మూఢా స్సజ్జన్తే గుణ కర్మసు.
తా నకృత్స్న విదో మన్దా న్ కృత్స్నవిన్నవిచాలయేత్. ”

మనుజుఁడు ప్రకృతియొక్క గుణములచేతఁజేయఁ బడుకర్మముల నహంకారయుక్తుఁడయి నేనే చేయుచున్నానని తలఁచుచుండును. అయితే, గుణవిభాగములును కర్మభేదములును తెలిసికొనిన తత్త్వవిదుఁడు పంచేంద్రియములు విషయరూపములగు గుణములందుఁ బ్రవర్తించుచున్నవిగాని యాత్మప్రవర్తించుట లేదనితలంచి దానియందు సక్తుఁడుకాఁడు. ప్రకృతిగుణములు తెలియనిమూఢులు గుణాధీనకర్మ వశులయి కర్మఫలములనపేక్షించుచుందురు. ఆత్మవిదుఁడట్టిమంద మతులకు బుద్ధిభేదమును గలిగింపఁగూడదు.

సత్త్వరజస్తమో గుణములసామ్యావస్థయగు ప్రకృతియొక్క కార్యకరణరూపవికారములచేతనే సమస్తకర్మములు సర్వప్రకారములఁజేయఁ బడుచున్నవి. అవిద్వాంసుఁడీ కార్యకరణ సంఘాతమునందు నాత్మబుద్ధినుంచినవాఁడు కావునవివేకము లేనివాఁడయి, కార్యకరణంబుల నాత్మగాను, తద్ధర్మములాత్మధర్మములుగాను, తలంచి యాకర్మములు తానొనరించితినని పలుకుచున్నాడు. విద్వాంసునకును, నవిద్వాంసునకును గర్మానుష్ఠానము సమమైనను, నవిద్యావంతునకుఁగర్తృత్వాభిమానముమాత్రము హెచ్చుగనుండునని చూపుటకు పైరెండు శ్లోకార్థములు దెలుపుచున్నవి. విద్వాంసుఁడగువాఁడు తాననేక కర్మములొనర్చుచుండినను నట్టికర్మములందుఁగర్తృత్వాభిమానము వదలి, కరణములే స్వవిషయములందుఁ బ్రవర్తించి సమస్తకర్మములు చేయుచున్నవని తెలియును, “ ధూలిధూమాంబుదైర్యద్వన్మలినంక్రియతేనభః । పరామృష్టస్తథైవాత్మావిశుద్ధః ప్రాకృతైర్గుణైః ॥.

దుమ్ము, పొగ, మేఘము, వీనిచే నెట్లాకాశము మలినముగాఁజేయఁబడునో యటులనే ప్రాకృతగుణములచే విశుద్ధాత్మకూడ కప్పఁబడియున్నాడు. వాస్తవమున నాకాశము దుమ్ము మొదలగు వానితో సంబంధమేమియు లేకయయుండునటుల, యాత్మయును గుణములతోనంటకయ యున్నాడనిన్ని విద్వాంసుఁడుమాత్రముదీని నెఱుంగునని భావము.

సత్వరజస్తమో గుణములు ప్రకృతికి సహజలక్షణములని నేనింతకు మున్ను వ్రాసినాను. ఆగుణముల ప్రేరేపణములే మన మొనరించుకర్మములకు మూల కారణములు. ఆకర్మములకును నాత్మకును నేలాటిసంబంధమును లేదు. కావున "నేఁజేయుచున్నాను, నేఁజేసితిని" యనిమూఢమతులాడుదురుగాని తత్వవిదులాడరు. అర్జునా! రణమునయోధులను నేను సంహరించెదనేయను వ్యాకులమునీకు వలదని భగవంతుఁడు బోధించెను. భగవంతుఁడు ప్రారంభమున బోధించినదేమన

(ఎ) కర్మమునకంటెను జిత్తశుద్ధి శ్రేయస్కరము

(బి) చిత్తశుద్ధి శ్రేయస్కరమని కర్మములను వదలఁ గూడదు కర్మాచరణమే చిత్తశుద్ధికిఁ గారణమని బోధించెను.

(సి) కర్మాచరణము ప్రకృతగుణ ప్రేరితమగును గానియాత్మకు సంబంధపడదు.

(డి) ప్రకృతిని సాత్వికగుణ ప్రాధాన్యముగ నుండునటుల యొనరించినచో మానసము ధర్మకర్మా చరణమునందే ప్రవేశించు చుండును.

(ఇ) ధర్మకర్మాచరణత్వ మొనరించునపుడు కర్మాతత్వ సాధుత్వము లెన్నఁబడఁ గూడదు.

(యఫ్) ధర్మకర్మా చరణములలోఁగుల ధర్మకర్మ మొనరించుట విధి.

(జి) కర్మఫల మీశ్వరా ర్పణముగ నన(గలోకోపకారముగ నుండవలెను గాని స్వలాభమునకై యుండఁ గూడదు.

భగవంతుఁ డీత్రుతీయాంధ్యాయములో నొనర్చిన హితోపదేశ మిది యేను అర్జునునిమానస కాలుష్యమునైన పలుకఁబడిన కార్యకారణ న్యాయవాదమునుండి తొలఁగి పోవదోయని సందియించి భగవంతుఁడు మఱియొక విధమగు, కారణముఁ జూపుచు నర్జునుని యుద్ధమునకుఁ బ్రేరేచుచున్నాడు.

3. 30. "మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యా ధ్యాత్మ చేతసా॥
"నిరాశీ ర్నిర్మమో భూత్వా, యుధ్యస్వ విగత జ్వరః॥

పరమాత్మయొక్క ప్రేరేపణములేక ప్రకృతిగాని సాత్విక రాజస తామసగుణములుగాని జ్ఞానేంద్రియ కర్మేంద్రియములుగాని మఱిదేమిగాని యేకార్యమును జేయుటకు స్వాతంత్ర్యము లేదనినన్ను తెలిసిన తత్వవేత్తయని 28-వ శ్లోక

మునను నర్థము చేయవలెనని ద్వైతులవాదము. కర్తృత్వ భోక్తృత్వముల ద్వైతులు పరమాత్మయం దారోపింపరు కావున వారి వాదమునకుఁ బైవారి వాదము విరుద్ధము.

అర్జునా! నీ చిత్త మాత్మయందుంచి స్థితప్రజ్ఞుఁడవై కర్మఫలములు నాకు సమర్పింపుము. ఆశలన్నియును వదలి, యహంకార మమకారములు మాని, యే సంశయములందక యుద్ధమొనర్పుము.

చిత్త మాత్మయందు నిలుపునట్టి శక్తికలవాఁడు స్థితప్రజ్ఞుఁడగును. అట్టి వానికి నహంకార మమకారములు బొత్తిగనుండవు. అయితే విధ్యుక్త కర్మములు వాఁడవశ్య మాచరింపవలెను. తత్ఫలము లేమి సేయవలెననిన దైవమగు నాయందు సమర్పింపుమని భగవంతుఁడు పలికెను.

“ విగతజ్వరా! ” జయాపజయము నందుల ఫలాఫలములను నాలోచింపక సకలబాధ్యత నాయందుంచి యుద్ధమొనర్పుమని బోధింపఁబడినది. కర్మముల ఫలములు నాయందు నర్పించి యధ్యాత్మ చేతసుఁడవయి యుద్ధమొనర్పుమని భగవంతుని స్పష్టమగు బోధనను సావధానముగ గమనించినచో భగవద్గీత కర్మయోగమే బోధించుననియు్ని యది జ్ఞానమూలకముగ నుండవలెననియు్ని విశదమగుచున్నది. కర్మయోగ పరిపక్వమగుటకు స్థితప్రజ్ఞత్వమున్ను భక్తిసాధనములు.

రెండవయధ్యాయములో నలువదియొకట శ్లోకమున శ్రీ కృష్ణుఁడు తానే దైవమని యొకతూరి పలికినాడు. ప్రపంచము నందెల్లెడల మనుజునందు దైవ తత్త్వమొకటి వాని పుట్టుకతోడనే జనించియుండునని “ మతవిషయమున స్వాభిప్రాయ ” మనెడి యుపన్యాసములో నేను విస్తరించి వ్రాసినాను. సర్వమునకును దైవమే మూలమని సకలమతస్థుల యభిప్రాయము. ఈ యభిప్రాయము కార్యకారణములుచూపు బుద్ధివాదమునకు లోఁబడదు. యుక్తివాదమునకు లోఁబడినను బుద్ధికిఁ దృప్తికరముగ నుండదు. ఇది కేవల విశ్వాసమునందే యుద్భవించి యచటనే దృఢముగ నిలిచియుండును. ప్రతిమనుజుఁడు “ దైవమీపని నాచేఁ జేయించుచున్నాడు. ఈ సర్వస్వము దైవమునకుఁ జేరినది ” యని పలుకుచుండును. ఇటు పలుకుచుండుటచే మానవుఁ డహంకార మమకారములు మాని కర్తృత్వ భోక్తృత్వాభిమానములఁ బరిత్యజించి, కర్తృత్వ భోక్తృత్వములకు దైవమే స్వతంత్రుఁ

డని నమ్మును. ఇటు నమ్ముటచే తాఁజేయు ప్రతికర్మమున్ను దైవకర్మమని హెచ్చ రికగ నేలోపమునులేక యొనర్చును. కార్యకర్తృత్వము దైవమునందిడును. భగవంతుని యుపదేశమిదియేను. ప్రకృతిలక్షణములగు సాత్విక రాజస తామస గుణములు మనుజుఁడొనరించు కర్మములకుఁ గర్తలని యింతకు మున్నుపదేశించెను. ఇపుడు దైవమగు తాను సర్వ కర్మములకుఁ గర్తయని పలికెను. ఈ పరస్పర విరుద్ధమునకు సమాధాన మెద్దియన:- "దైవమే ముఖ్యకారణమనిన్ని, ప్రకృతిసాధనమనిన్ని గుణములు ప్రకృతి లక్షణములనిన్ని" సమాధానము. ఇందుకు దృష్టాంతమేమనిన నొకచెట్టు నొకమనిషి గొడ్డలిచె నఱుకుచున్నాడు. నఱుకునది గొడ్డలి నఱుకువాఁడు మనిషి నఱకఁబడునది చెట్టు "నన్ను నేనే నఱుకుకొంటిననిన్ని నాయంతకు నేనే పడితిననిన్ని" చెట్టు పలుకుటకురాదు, నేనే నఱికి కెడిపితినని గొడ్డలి యహంకరించుటకురాదు. అటులనే ప్రకృతి గుణములు కర్మముల నొనర్చుచుండినను దైవము దానికిఁ గర్తగ నుండునని భావము. భృత్యుఁడు స్వామిని, ధిఃకరించి కార్యములొనర్చురీతిని నొకానొక సమయమునందు ప్రకృతి దైవమును ధిఃకరించి కార్యము లొనర్చును. అట్టికార్యములు స్వలాభకరమగు నట్టివియును, నీతిరహితములగు నట్టివియును పాతక హేతుకములగు నట్టివియునుగ నుండును.

3. 31. "యేమేమత మిదం నిత్య మను తిష్ఠన్తి మానవాః ।
"శ్రద్ధా వ న్తోనసూయంతో ముచ్యన్తేతేపి కర్మభిః ॥

పైనఁ బలికిన నా మతమును శ్రద్ధతోను బరోత్కర్షా సహిష్ణుతతోను ననుసరింతురో వారు సైతము కర్మబంధములనుండి తొలఁగుదురు.

సాంఖ్యజ్ఞానము గలిగి భగవంతునిచే నిదివరలో బోధింపఁబడిన రీతిగఁ గర్మానుష్ఠానము లొనర్చినచోఁ గర్మబంధము లంటవని యొకమార్గమును బోధించి, యిపుడు సకలకర్మములకు దైవమె కర్తయని శ్రద్ధాభక్తులతో నమ్మి యసూయారహితులగువారు సైతము కర్మబంధమునకు లోఁబడరని యీ శ్లోకమున బోధింపఁ బడినది. శాస్త్రజన్య జ్ఞానమున్ను బుద్ధికౌశలమున్ను మానవుని సత్ప్రవర్తనమునకు సదాకాలము నిర్వివాదమగు సత్యమార్గముగ నుండవని తలంచి కాఁబోలు పురాతన కాలమునుండి జనులు దైవమతమని యొకటి నిర్ధరించి సర్వకార్యములందును దైవమునకే కర్తృత్వ భోక్తృత్వము లారోపించుచు వచ్చిరి. ఇది నమ్మకమున్పైఁ బ్రతిమానవుని హృదయపీఠమున నిలిచినది. ఆ మతమునే భగవం

తుఁడిపుడు పై శ్లోకమున సూక్ష్మముగ బోధించి తాను ముందు బోధింపఁబోవు భక్తిమార్గమునకుఁ బీఠికగ సూచించినాడు.

ఈ శ్లోకమునకు విశిష్టాద్వైతుల యర్థమేమనఁగా. (1) భగవంతుని మతమునందు నిష్ఠయుంచినవారు బంధవిముక్తులగుదురు (2) శ్రద్ధలగువారు ముక్తులగుదురు. (8) అనసూయాపరులు ముక్తులగుదురు.

(ఎ) పై గుణసంఘు గలవారు ముక్తులగుదురని యితరులమతము.

(బి) మానవా! యనఁగా శూద్రులు రారని విశిష్టాద్వైతులు అన్నివర్ణముల వారును వత్తురని యితరమతమువారు.

3. 32. యే త్వేత ద భ్యసూయన్తో నా నుతిష్ఠన్తి మే మతమ్ ।
సర్వ జ్ఞాన విమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః ॥

" సర్వజ్ఞాన విమూఢాత్మా " యను వాక్యమునందలి సర్వశబ్దమునకు నైవమని యర్థముచేసి భగవంతుని జ్ఞానవిషయముతో విమూఢులై యని మధుసూదన సరస్వతులవారర్థముచేసినారు.

ఎవరు నేనుజెప్పిన యీ మతము ననసూయాపరులై నిందించి యనుష్ఠింపరో వారు జ్ఞానములోను మూఢులై చెడిపోవుచున్నారు. భగవంతునిచేఁ బై శ్లోకమునఁ బలుకఁబడిన యసూయాపరులు నాస్తికులొక్కరు నా మతమే శ్రేష్ఠమనిన్ని నా మతమునే సర్వులు నవలంబింపవలెననిన్ని వాదించువారు రెండవవారు. నాస్తికులకు దైవమే లేదుగనుక వారి సత్ప్రవర్తనమునకు మార్గములేదు. రెండవవారికి సర్వసమబుద్ధి యుండదు. భిన్నమతము ననసూయతతోను ననసహ్యతతోను జూచుచుందురు గనుక యట్టివారును జెడుదురని పలుకఁబడినది.

3. 88. సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవా నపి ।
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కింకరిష్యతి ॥

ఎంత జ్ఞానము గలవాఁడయినను తన జన్మాంతర కర్మవాసనకుఁ దగి నటుల చేయుచుండును. ఇఁక మూఢులమాట చెప్పనేల? తమతమ ప్రకృతినిఁబట్టి నడుచుచుండు భూతములను, నిగ్రహమేమి సేయును.

పైనఁ బలికినరీతిగ భగవంతుని మతము ననుసరించుటచే సర్వపుణ్యములు

లభించుచుండ జనులు పాపములేల చేయుచున్నారని ప్రశ్నించిన యర్జునుని ప్రశ్నకు భగవంతుఁడీక్రింద వివరించిన విధముగఁ గారణములు పలుకుచున్నాఁడు.

అర్జునా! మానవజన్మము పూర్వజన్మ కర్మవాసనలతో నిండినది. ప్రకృతి సహజగుణములు తమకు స్వాభావికములైన మార్గములు మొండితనమున ననుసరించునుగాని యెంత నిగ్రహించినను సరియయిన మార్గమునకు రావు. జను లాయా గుణకర్మములకు దాసులగుదురు. రాజస తామసగుణములకు దాసులగువారు వివేకదూరులగుదురు. అట్టివారిని దారికిఁ దెచ్చుట కష్టసాధ్యము. ఆ గుణములు ప్రాధాన్యముగ నుండునపుడు జ్ఞానినైనతఁడు తప్పుదారిఁ ద్రొక్కును దైవమునైనతము ప్రకృతిని లొంగింపఁజాలఁడని శ్రీ శంకరాచార్యులవారు పలికిరి. అనఁగా ప్రకృతి సైజగుణ ప్రాబల్య మంతటిదియని యుత్కర్షించిరి. దైవమునకు నసాధ్యమని కాదు. దానిశక్తి నడఁచుటకు దైవమునకు నిష్టములేదని ద్వైతులవాదము. ప్రకృతి యెటుల యే తనసాధనముల సాహాయ్యమున నిగ్రహమునకు నసాధ్యమై యుండు ననిన:—

84. " ఇన్ద్రియస్యేన్ద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవ స్థితౌ
" తయోర్న వశ మాగచ్ఛేత్తౌహ్యస్య పరిపన్థినౌ "

ప్రతియింద్రియమున్ను తనకువలయు విషయములను గుఱించి రాగద్వేషములు పెంచుచుండును. అవిమనుజుని వివేకము పాలిటి శత్రువులు. వానికి మానవుఁడు లొంగనటుల యత్నింపవలెను. ప్రకృతియీడ్చిన మార్గముననే మనుజుఁడు పోవనారంభించు వానికి శాస్త్రజన్య జ్ఞానమునుండియే యవశ్యకతయు లేదు. వానికిశ్రేయఃపథము నవశ్యకముగ నుండదు. సామాన్యముగ మనుజునందు సాత్వికసంబంధమగు వివేకమొకటి యుండును. సద్బోధనలచేతను శాస్త్ర విచారములచేతను నా వివేకబుద్ధినిఁ బ్రసరింపఁజేయవలెను. అపుడు మనుజుఁడా రాగద్వేషములకు లొంగఁడు. కేవలరాజసగుణ ప్రాధాన్యతచేఁ బ్రేరేపింపఁబడినవానియందు వివేకమేమియుఁ జేరదు కావునవట్టివాఁడు ప్రకృతియెటు లీడ్చిన నటులఁబోవలసినదేను. అట్టివానిని నిగ్రహమేమియుఁ జేయఁజాలదు. అట్టివానికిని కేవలతామసస్వభావముగల వానికిని ప్రకృతినిగ్రహముసాధ్యము కాదని నేనెన్నెద.

మఱియునింద్రియ విషయములగు శబ్దాదులం ద్రొక్కొక్కదాని

యందు నిష్టమగువానియందు రాగము బుట్టుటయు ననిష్టమైనవానియందు ద్వేషము బుట్టుటయు సహజము. ఈ రాగద్వేషములు గలిగించి వీనిమూలముననే పూర్వజన్మవాసనారూపమయిన ప్రకృతి, స్వవిషయమునందుఁ బురుషునిఁ బ్రవర్తింపఁ జేయును. ఈ రాగద్వేషములను నిగ్రహించినచోఁ బురుషుఁడు ప్రకృతివశుఁడు కాఁడు. రాగద్వేషములు పురుషుని శ్రేయోమార్గమునందు దొంగలవలె శత్రువులయి యున్నవి కావునఁ బురుషుఁడు వీనివశమునఁజిక్కక వివేకజ్ఞానముచే వీనినినిగ్ర హింపవలెనని భావము.

రాగద్వేషములను నిగ్రహింపవలెను. అయితే వివేకజ్ఞానమునని గ్రహింపవలెను, గాని యవివేకముచే నిగ్రహింపఁగూడదు. అనఁగాఁ దామసగుణమును దినక్రమముగ వదలుచు రాజసగుణమును మెల్లమెల్లఁగఁ దగ్గించుచు సాత్త్వికగుణము నభివృద్ధిఁ జెందింపఁ బ్రయత్నింపవలెనుగాని బలవంతముగఁ బ్రకృతిని నెదిరించుట సాధ్యము కాదు. కొందఱవివేకు లాహారవిహారాదులవల్లను దారపుత్రాది సంగమము వల్లను రాగద్వేషాదులు కలుగుచున్నవనియు, వానిని వదలినచో రాగద్వేషాదులు వదలిపోవుననియు నమ్మి యాహారవిహారాదులు వదలి సన్న్యాస వృత్తినిగహన వాసముఁ జేయుదురు. అట్టివారియందుఁ గర్మసంబంధము బాహ్యమున లేనట్లుగ బడునుగాని యంతరంగమును హెచ్చుగ బాధించుచుండును. పూర్వకర్మసంస్కారశక్తి యంతటి సులభమార్గమునఁ బోఁగొట్ట సాధ్యము కాదు. ప్రకృతిననుసరించి నడుచుచు దినక్రమేణ దానియుల్లంఘనమున్ఁజేయవలెనుగాని బలాత్కారమునకు వశమగునది కాదది. భూతకోటియంతయును ప్రకృతికి లోఁగినదిగాని దానిని మీఱినది కాదు. దాని మార్గమునకు నవివేకముగ నంతరాయము కలిగించినవారు చెడుదురు గాని బాగుపడరు. వివేకమున దాని యనుగ్రహమునార్జింప యత్నింపవలెను ప్రకృతిననుసరించి కార్యము లొనర్చుచు నా కార్యఫలములు మననమాశించకయుండుటయే వివేకమార్గమని తెలియవలెను. అది యెటులనునది ముందున్న శ్లోకములు తెలుపును.

3. 35. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః

చక్కఁగనాచరింపఁబడిన పరధర్మమునకంటెను, గుణహీనమయినను స్వధర్మమాచరించుటయే శ్రేష్ఠము. భయముతోఁబర ధర్మమనుష్ఠించుటకంటెను స్వధర్మ మనుసరించి చచ్చుటమేలని పలుకఁబడినది. ఈ శ్లోకమున "స్వధర్మ" "పరధర్మ" మను

రెండుశబ్దములున్నవి. స్వధర్మమునందుఁ జెడుగుండినను దానినిఁ జేయుట శ్రేయస్కరమనిన్ని పరధర్మమున మేలుండినను దాని నొనరించుట చెడుగనిన్ని పలుకఁబడినది. ఇటు తెలుపుటకుఁ గారణమేమని ప్రశ్నింపనగును. ప్రకృతి సాత్త్విక రాజస తామస గుణోపేతమైనది. ప్రపంచంబున నుద్భవించిన ప్రతి మనుజుఁడును త్రైగుణములలో నొక్కగుణమునకు నధీనుఁడై పుట్టును. అటుపుట్టినవారి కర్మము లాయా గుణముల ననుసరించియే యుండును ఒక్క గుణప్రాధాన్యమునఁ బుట్టినవాఁడితర గుణప్రాధాన్యమునఁ బుట్టినవా రాచరించు కార్యము లాచరింప సమర్థుఁడు కాఁడు. గుణానుసారముగ నొనరింపఁబడు కర్మములను బట్టియే యతిపురాతన కాలములోనే వర్ణాశ్రమధర్మము లేర్పడెను. ఒక్క గుణముననుసరించి కర్మము లొనరించువాఁడన్య గుణాధీనకర్మము లొనరింపఁ జాలఁడు. ఇటు కులక్రమాగత ధర్మమేర్పడి మనుజులరక్తమునం దాయా గుణసారము ప్రవహించుచుండును. స్వధర్మముననుసరించుట యందుఁ గల సౌకర్యము పరధర్మమాచరించుట యందుండదు. బ్రాహ్మణునకు వేదాంతము నేర్చియుపదేశించుట యందుగలశక్తి యుద్ధమాచరించుట యందుండదు. వేదాంతోపదేశము సాత్త్వికలక్షణము. యుద్ధమొనరించుట రాజస లక్షణము.

రాజసగుణము నణఁచి సాత్త్వికగుణ మార్జింపనగునుగాని యది బహుకాలాభ్యాస ప్రయాససాధ్యము. అభ్యాస ప్రయత్నంబున నంతరాయములు మెండుగ నుండును. ఆ ప్రయత్నములోఁ జెడినచో రెంటికినిఁ జెడిన రేవఁడగును. ఇంతకును నటు లొనరించుటచేఁ జిరకాల స్థాపిత ధర్మము చెడునుగాని ఫలమెద్దియును లేదు. మోక్షమందనుగదా సకలురు బ్రయత్నించుచుందురు. గీతలో నుపదేశించిన రీతిగ స్వధర్మాచరణమువల్లనే ముక్తి కలుగుచుండ బలాత్కారముననైన పరధర్మాచరణంబుఁ గోరనేల? ప్రయాసపడనేల? విఫలమనోరథులు కానేల? పై కారణములచే, అర్జునా! నీవు స్వధర్మమగు యుద్ధమునుమాని సన్న్యాసిధర్మమగు భైక్ష్యవృత్తి నాశించితి వేలయని భగవంతుఁడు బోధించెను.

ఈ శ్లోకమునందలి "పరధర్మ" శబ్దమునకు విశిష్టాద్వైతులు జ్ఞానమార్గమని యర్థముచేసి "పరధర్మో భయావహః" యనఁగా జ్ఞానమార్గమునందు కష్టము లనేకము లున్నవనిన్ని కర్మమార్గమునందు గష్టములు లేవనిన్ని జ్ఞానమార్గమునకంటెను కర్మమార్గము శ్రేయస్కరమనిన్ని కర్మయోగములోనే జ్ఞానయోగము చేరినదనిన్ని సిద్ధాంతము చేసినారు. ఈ సిద్ధాంతమును ద్వైతాద్వైతు లెదిరించినారు.

రాజసగుణమునుండి సాత్త్వికగుణమార్గము బడసగునుగాని యది బహుకాలాభ్యాస ప్రయాస సాధ్యము. అభ్యాస ప్రయత్నంబున నంతరాయములు మెండుగ నుండును. ఆ ప్రయత్నములోఁ జెడినచో రెంటికిని జెడిన రేవఁడగును. ఇంతేకాను నటులొనరించుటచేఁ జిరకాలస్థాపితధర్మము చెడునుగాని ఫలమెద్దియును లేదు. మోక్షమొందనుగదా సకలురు ప్రయత్నించు చుందురు. గీతలోనుపదేశించిన రీతిగ స్వధర్మాచరణమువల్లనే ముక్తికలుగుచుండ బలాత్కారమునైనను పరధర్మాచరణంబుఁ గోరనేల? ప్రయాసపడనేల? విఫలమనోరథులు కానేల? పై కారణములచేఁ అర్జునా! నీవు స్వధర్మమగు యుద్ధముమాని సన్న్యాసిధర్మమగు భైక్ష్యవృత్తి నాశించితి వేల యని భగవంతుఁడు బోధించెను.

ఈ శ్లోకమునందలి "పరధర్మ" శబ్దమునకు విశిష్టాద్వైతులు జ్ఞానమార్గమని యర్థముచేసి "పరధర్మో భయావహః" యనఁగా జ్ఞానమార్గము నందు కష్టములనేకములున్నవనిన్ని కర్మమార్గమునందు గష్టములు లేవనిన్ని జ్ఞానమార్గమునకంటెను కర్మమార్గము శ్రేయస్కర మనిన్ని కర్మయోగములోనే జ్ఞానయోగము చేరినదనిన్ని సిద్ధాంతము చేసినారు. ఈ సిద్ధాంతమును ద్వైతాద్వైతులెదిరించినారు.

3. 36. "అథ కేన ప్రయుక్తోయం పాపం చరతి పూరుషః ।
"అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥

కృష్ణా! పురుషుఁడు దేనిచేతఁ బ్రేరితుఁడై తనకునిష్టము లేకున్నను బలాత్కారముగ నియోగింపఁబడినవానివలెఁ బాపకార్యము లొనరించు చున్నాడు. భగవంతుఁ డిదివరకే ప్రకృతిలక్షణములగు గుణములు మనుజుల సర్వకర్మములకును మూలకారణము లనిన్ని ప్రకృతి మార్గముల నిరోధించుట సాధ్యముకాదనిన్ని దాని నిగ్రహము కూడదనిన్ని పలికెను గదా? దానినుండి పాపకర్మమొనరించుట నైతము ప్రకృతిగుణప్రేరితమని యే యర్జునుఁడు తెలియవలసినదిగ నుండెను. మఱల నీప్రశ్న వేయుట యనవశ్యకమనిన్ని భాష్యకారులు తాత్పర్యమిడినారు కాని యీశ్లోకార్థమును వేఱొకవిధముగ నన్వయించి యాత్మేషణమునకు [illegible]

వ్రాయుచున్నారు. మనుజుల సర్వకర్మములకుఁ బ్రకృతియే కారణమయి మనుజుని యత్న మేమియులేక యున్నయెడల వాఁడొనరించు పాపములన్నియును బ్రకృతియే యొనరించి నట్టయ్యెనుగదా? అటులైనవీఁడు పాపమొనరించెనని పురుషుని నిందింప నేల? పురుషునకుఁ బాపభీతికలు గుటకుఁ గారణమే లేదుకదా యనెడి నాక్షేపణ లు పెక్కులు గలుగును. ఈప్రశ్నలకు సమాధాన మిచ్చుట కష్టమని తోచినను జక్కఁగ నాలోచించి వెనుకపలుకఁబడిన యుపదేశ సారమును గ్రహించినచోఁ బై యాక్షేపణములకు సమాధానము సులభముగఁ దోచును. భగవంతుఁడుపదేశించిన విషయమేమనిన:— సర్వకర్మములును బ్రకృతిగుణము లొనర్పఁ జేయుననియు వానిని నిగ్రహింపఁ గూడదనియు పలికినాఁడు. ప్రకృతి తనభటులగు సాత్వికరాజస తామసగుణము లొనరింపఁదగిన కర్మముల క్రమమునిర్ధరించినది. ఆక్రమముమీరుటకు సాధ్యముకాదు. అటులొనరించుటయుండదే భటుఁడయినను తిరుగుటొనబారించెనేని వాఁడుచెడును. వాఁడు చక్కఁబడఁడు. ఈగుణములు ప్రకృతి శాసనము మీఱనటులఁ జూచుటకు వివేకజ్ఞానమొకటి మానవుని యంతరంగమున నుంచినది. ఇంతేఁగఁ గట్టుదిట్టములకు గుణములను లొంగఁజేసి యున్నను రాజసగుణము కొన్నిసమయములందుఁ బ్రకృతి యొక్క విధులను మీఱినడచు చుండును. ఈ రాజసగుణసంబంధములే కామక్రోధాద్యరిషడ్వర్గములు. కామ క్రోధాదులు మానసమునుఁ జెఱచి బుద్ధినిఁ గలఁచి ప్రకృతి సహజముకాని కార్యము లొనర్చుటచే పాపముసంఘటిల్లును. వివేక జ్ఞానముచేతను దైవభక్తి చేతను మనుజుఁడట్టి కర్మాచరణమును నిగ్రహింపని యెడలఁ బాపబద్ధుఁడగును. అరిషడ్వర్గములకు రాజు కామము. ఆకామము రాజసగుణము. కామము నణచునది వివేకజ్ఞానము. వివేకము మానవాధీనము. మానవుఁడు వివేకముమాని కామగుణముఁ బూనినచో పాపమునకు మానవుఁడు బద్ధుఁడగును. ముక్తికిదూరుఁడగును. కామము విచ్చలవిడిగ సంచరింప వదలునది యవివేకము. ఈ యర్థమునే భగవంతుఁడు ముందున్న శ్లోకమునఁబలుకుచున్నాఁడు.

అర్జునుఁడచటఁ బ్రశ్నవేసిన కారణమేమన “ మనుజునిఁ బాపకర్మ ” ములకుదించు ప్రకృతి గుణములలో నెద్దిముఖ్యమగు గుణమని ప్రశ్నించెనని శ్రీమ

ఖ్యాచార్యులవారు సమాధాన మిచ్చినారు.

౩. ౩౭. " కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ॥

" మహాశనో మహాపాప్మా, విద్ధ్యేన మిహ వైరిణమ్

రజోగుణమువలనఁ బుట్టిన యీ కామము క్రోధముగఁ బరిణమించును. కామమునకు తృప్తి లేదు, కావున నది మహాపాపస్వరూపమైనది. ఈ కామమే మనుజుని శత్రువు.

కామము ప్రకృతిని మీఱినడచునది. ఆకలయినపు డించుక యన్నాహారమునఁ బ్రకృతి తృప్తిపడును. కామము తృప్తిపడదు. భక్ష్యభోజ్యములు కోరును. దాహమయినపుడు నీటిద్రావుటచేఁ బ్రకృతి తృప్తిపడును. సువాసనలు గలిగినపానకాదులను కామముగోరును; కులకాంత సంగమంబునఁ బ్రకృతి తృప్తిపడును. అనేక కాంతాసంగమంబునఁగాని కామము తృప్తిపడదు. కామమింతటి చెడ్డది కావుననే మానవుని శత్రువు కామమని పలుకఁబడినది. ఈ కామము బహువిషయకంబగుటచే మహాశనమనఁబడినది. సర్వపాపములకు నిమిత్తమగుటచే మహాపాప్మనఁబడినది. " అకామస్య క్రియా కాచిద్దృశ్యతే నేహ కర్హిచిత్; యద్యద్ధి కురుతే జంతు స్తత్తత్కామస్య చేష్టితం ". కామము లేని వానికి నే కార్యము నెచటను గనపడదు. ప్రాణి యేదేది చేయుచున్నాడో యది కామము యొక్క చేష్టయగదా? " ప్రజ్ఞాం తు సాత్త్వికీం ప్రాహు స్తామసీం తు విచిత్తితాం " క్రియాం తు రాజసీం ప్రాహు, ర్గుణతత్త్వవిదో బుధాః " సాత్త్వికగుణము ప్రజ్ఞ. తామసగుణము విచిత్తతయనఁగా నే వ్యాపారము లేకయుండుట. రాజసగుణము క్రియ, యనఁగా నెట్టి వ్యాపారమైనను జేయుచుండుట. ఇవి గుణతత్త్వములు కామక్రోధములు రాజసగుణములు. సత్త్వగుణోద్రిక్తుఁడగు పురుషుఁడు జ్ఞానయోగ ప్రవర్తకుఁడగును. రజోగుణ సంబంధము కామము; అది ప్రబలమయినచోఁ బ్రాచీనవాసనానుసారముగ శబ్దాది విషయములకు నవివేకిని నాకర్షించి విషయలోలునిఁ జేయుచున్నది కావుననే కామము పురుషుని శత్రువు. కామమెటు పురుషునందుండుననః—

3. 38. " ధూమేనా వ్రియతే వహ్ని ర్యథాదర్శో మలేన చ॥

" యథోల్బేనావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్॥

3. 39. " ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్య వైరిణా॥
" కామరూపేణ కౌన్తేయ, దుష్పూరే ణానలేనచ॥

ఎట్లుధూమముచే వహ్ని కప్పఁబడియుండునో, యెట్లుమురికిచే నద్దము కప్పఁబడి యుండునో, యెట్లుమావిచే గర్భముకప్పఁబడి యుండునో యటులనే కామముచే జ్ఞానము కప్పఁబడియుండును. ఈ కామమునకు స్థానమెద్దియనఁగా:— నేత్రశ్రోత్రాది జ్ఞానేంద్రియ గణమును సంకల్పాత్మకమైన మనస్సును నిశ్చయాత్మకమైన బుద్ధిన్ని యీమూఁడును కామస్థానములు. ఈకామమే తృప్తిలేనిదియు నెంతయయినను చాలనిదిగను జ్ఞానికినిత్య శత్రువయి యెంతనిందించినను దృష్టినందక, వివేకమునుగూల్చుచుండును.

38-వ, శ్లోకమున మూఁడుదృష్టాంతము లిచ్చినందున మూఁడవస్థలకు నన్వయించుననిన్ని మూఁడుజాతులకు నన్వయించుననిన్ని యిష్టానుసారము తమతమ పాండిత్యము కొలఁది భాష్యకారులర్థముచేసినారు. శ్లోకముస్పష్టముగ నున్నది. కామమాదిని ధూమమువలెఁ బైనఁ బైననావరించి ధూళివలెఁగప్పి మాయవలెఁ జుట్టి బంధించునని యర్థము.

3. 40, ఇన్ద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే
ఏతైర్విమోహయత్యేష జ్ఞాన మావృత్య దేహినమ్.

జ్ఞానేంద్రియమనోబుద్ధులందుఁజేరికొని కామము జ్ఞానమునావరించి యింద్రియాదుల మూలకముననే పురుషుని విశేషముగ మోహింపఁ జేయుచుండును బాహ్యేంద్రియములు నంతరింద్రియము, బుద్ధి యీమూఁడును గూడిన గుణతత్వము కామము. ఇదియే వివేకమును జెఱచునది. వివేకము బుద్ధిలోనంతర్గతమగు భాగము వివేకశక్తితప్పినచో యుక్తాయుక్తజ్ఞానముతప్పును.

3. 41. తస్మాత్త్వ మిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనమ్॥

జ్ఞానవిజ్ఞానములు. జ్ఞానమన ఆత్మజ్ఞానము. విజ్ఞానమన, శిల్పశాస్త్రముల జ్ఞానము. ఈస్పష్టార్థమును మాని భాష్యకారులిష్టానుసారమర్థముచేసినారు.

కాఁబట్టి యర్జునా, నీవు ప్రారంభమున నింద్రియములను గ్రహించి

జ్ఞానవిజ్ఞానముల నశింపఁజేయు కామమును నశింపఁజేయుము.

3, 42. ఇన్ద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః

42. 43. శ్లోకములలోని " బుద్ధిపరశబ్దములు కామమునకు నర్థమని శ్రీరామానుజాచార్యులర్థముచేసినారు. ద్వైతవాదమునకునిది విరుద్ధము.

దేహముకంటె నింద్రియములు నింద్రియములకంటె మనస్సును మనస్సుకంటె బుద్ధియు బుద్ధికంటెనాత్మయు నొకదానికంటె నొకటి యెక్కువయని పండితులుపలుకుదురు. మనస్సు ప్రకాశకత్వమును, నరితరత్వమును సూక్ష్మత్వమును, వ్యాపకత్వమును, కారణత్వమును ప్రవర్తకత్వమునుగలిగిన దగుటచేనాధర్మములులేని యింద్రియావృతశరీరమునకన్న నుత్కృష్టమని తెలియుము. అంతకంటెను ప్రకాశకత్వాది ధర్మములచే హెచ్చయి బుద్ధియుండును, కావునమనస్సుకంటెను బుద్ధియుత్కృష్టమని యెఱుంగుము. ఎవఁడంతటను వ్యాపించి బుద్ధ్యాది స్థూలపర్యంతమైన కార్యకరణ సంఘాతమును స్వసన్నిధానమాత్రమునఁ బ్రవర్తింపఁ జేయుచు, తత్కర్మములను, తత్కర్మఫలములను, తద్గుణములను, తద్వికారముల నన్నిటిని, అవికారరూపుఁడయి ప్రత్యక్షమున నెఱుంగుచున్నాఁడో, ప్రత్యక్షముగ బ్రకాశింపఁ జేయుచున్నాఁడో యీయాత్మయే బుద్ధికంటెను నుత్కృష్టుఁడనినమ్ముము " పురుషాన్నపరంకించిత్సాను " శ్రుతివచనము నెఱుంగుము. అటుచేసినచో కామమును జయించు మార్గము నీకుదొరకును. నలుబదియవ శ్లోకమున శత్రువగు కామము నివసించు స్థానములు తెలిపెను. కారణంబేమన శత్రుస్థాన మెఱింగినచో వానినెదిరింప సుకరంబుగ నుండునని యభిప్రాయము. బాహ్యేంద్రియ శక్తులు, విషయాదులనుగ్రహించి, యంతరింద్రియమగు మనస్సునకుఁ దెలుపును. మనస్సుబుద్ధిచేఁ బ్రేరితమై యావిషయ సుఖము లనుభవింపఁ గోరుచుండును. కావున విషయములనునింద్రియములు గ్రహింపకుండ నియమింపవలెను. దానికి మార్గమేమనిన మనస్సును నంతర్ముఖగ నొనర్చవలెను. అనఁగా నింద్రియముల దిక్కుఁజూడనటు

లఁ జేయవలెను. అటు చేసినచో నింద్రియములు విషయములఁ జూచుచుండి
నను ననుభవశక్తి లేకయుండును. కావుననవి తనంతటఁదానే శక్తిహీనములై
పోవును. పిదప మనస్సు మఱల బాహ్యాముఖము కానటుల నిగ్రహింపవలెను.
ఎటులన. "మనస్తు పూర్వమాపద్యాత్క మీనమివ మత్స్యహా" జాలరి, మీనమును
బట్టి యెటుల గట్టుపువేసి మఱల నదినీటిలోఁబడనటులఁ జేయునో యటులనే జ్ఞాని
యగువాఁడు మానసమునుఁబట్టి మరలనది విషయాధీనమయి కామవిమోహజల ధి
లో మునుఁగనటులఁ జేయును. ఇట్లొనరించుటచే నంతర్ముఖత్వమందిన మనస్సు
నాత్మయందే లీనమగును. బుద్ధియు నంతర్ముఖమైయుండి మనంబులో గూడిపోవును.
అపుడు కామము నైనను నిలుచను స్థానములేక నశించిపోవును. కామమును జయిం
చు మార్గమిదియేయని యర్జునునకు భగవంతుడు బోధించెను. మనస్సుయొక్క
సాహాయ్యము లేక యింద్రియములు విషయములను గనలేవు. దానినుండి కలుగు
సుఖదుఃఖము లనుభవింపఁజాలవు.

3. 43. "ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా ॥
"జహి శత్రుం మహాబాహో, కామరూపం దురాసదమ్॥"

బుద్ధికంటెనాత్మ నెక్కువఁగాఁ దెలిసికొని యాత్మజ్ఞానదార్ఢ్యము నుం
డియే యాత్మను స్థిరపఱచి కామరూపకుఁడై యభేద్యుఁడని తెలిసికొనిన శత్రువు
ను జయింపుము.

ఆత్మజ్ఞాన దార్ఢ్యమున నాత్మను స్థిరఃపఱచుమనిన. "ఆత్మ లేదను వారి
వాదమును." నాత్మనిత్యము కాదను వారివాదమునువిని మానసచాంచల్య మం
దకుమని యర్థము.

సభ్యులారా! భగవంతుఁ డొనర్చిన సాంఖ్యోపదేశములో నాత్మనిత్యుఁ
డనిన్ని. యనాదిగనుండి వచ్చినకర్మ సంస్కారమను వాసనచేనాత్మ బంధింపఁబడిన
దనిన్ని మనుజుఁడా యాత్మను బంధమునుండి తప్పింపసర్వ ప్రయత్నములు సేయవ
లెననిన్ని బోధించెను. ఆత్మనుగర్మ బంధమునుండి తప్పింపనైష్కర్మ్య వృత్తి మార్గ
మునుఁ బలికి యది యెటులొనరింపఁ దగినదిన్ని వివరించెను. కర్మముబంధకారణ

ము కావున నైష్కర్మ్యము అనగా నేకర్మమునాచరింపక యుంటశ్రేయమని జనులర్థ ముచేసి కొందరు శ్రేష్ఠమాయనిసంచియించి, కర్మములందు మనమునుఁ దవిలించి తత్కర్మ ఫలానుభవమును గోరినచో బంధకారణమగును గాని మనస్సు నేవిధముగ ఫలమ పేక్షింప నటు లాచరించి కర్మమొనర్ప వలెనని నిష్కామకర్మాచరణము బంధకార ణము కాదనియు బోధించెను. మనుజుఁడే వ్యాపారమును జేయక యుండుట సాధ్యముకాదు కావున వ్యాపారాంగముల నిర్బంధించి నైష్కర్మ్య వృత్తిని నుండవలెననిన నంతరేంద్రియమగుమానసమునకు సహజమగు విధమునఁ గర్మము లాచరించుచుండును. కావున నటులుండుటకును సాధ్యము కాదు. కర్మము లాచరించుచున్నలాభ మేవిధమునఁగోరక కర్మఫలము నీశ్వరార్పణ మొనర్పవలె నని భగవంతుఁడొనరించిన బోధన యీయధ్యాయమునఁ బలుకఁబడినది. ఈయ ధ్యాయముయొక్క ఫలితార్థ మేమనిన:—

(1) ప్రపంచంబున దైవమొకఁడున్న వాఁడని ప్రతిమనుజుఁడు నమ్మవలెను

(2) మనుజుఁడొనరించు ప్రతికర్మము యొక్క ఫలము లోకోపకారమునకై నుండవలెను. స్వప్రయోజనార్థముండఁగూడదు.